# బతుకమ్మ పండుగ పాటలు

( సంస్కృతీ సంప్రదాయాలు )



కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగు విభాగం నుండి
1990 లో ఎం. ఫిల్. పట్టం పొందిన పరిశోధనా వ్యాసం

తాటికొండ విష్ణుమూర్తి

BATUKAMMA PANDUGA PATALU
(SAMSKRUTHI SAMPRADAYALU)
by Tatikonda Vishnumurthy

Copies : 1000



Cover Design : Seela Veerraju

First Edition : 1994

Price : Rs. 70/-

For Copies :

Visalandhra Publishing House
4-1-435, Vigyana Bhavan, Bank Street,
Hyderabad-500 001.

Smt. T. Balalaxmi
C/o. T.V. Narayana,
Post. Akunoor,
Mandal Cherial,
Dist. Warangal-506 223. A P.

Published with the financial Assistance of
Telugu University, Hyderabad.

Printed at :

Padmavathi Art Printers
1-1-517/B/1, New Bakaram,
Gandhinagar, Hyderabad 380.
Phones : 611413, 600547.

ఈ కృతి

మా అమ్మ

శ్రీమతి జయలక్ష్మి

నాన్న

శ్రీ టి. వి. నారాయణ

గారలకు

సమర్పితం

ఆచార్య పేర్వారం జగన్నాథం M.A., Ph.D.
ఉపాధ్యక్షులు
తెలుగు విశ్వ విద్యాలయం

లలిత కళా క్షేత్రం
పబ్లిక్ గార్డెన్స్,
హైదరాబాదు-500 004.
తేది : 18-7-1994.

# అభినందన

చిరంజీవి విష్ణుమూర్తి కాకతీయ విశ్వవిద్యాలయం, తెలుగు శాఖలో మా విద్యార్థిగా ఉన్నవాడు. ఈయన "బతుకమ్మ పండుగ పాటలు - సంస్కృతీ సంప్రదాయాలు" అనే అంశంపై పరిశోధన చేసి యం. ఫిల్. డిగ్రీని పొందినాడు. తెలంగాణంలో బతుకమ్మ పండుగకు ఒక ప్రత్యేక స్థానం ఉన్నది. ప్రజలందరు కలసి అన్ని తెగలు, అన్ని వర్గాలకు సంబంధించిన స్త్రీలంతా తొమ్మిది రోజులు ఈ పండుగను అత్యంత వైభవంగా జరుపుకుంటారు. ఇది సనాతనంగా ఈ ప్రాంతంలో ఆచారంగా వస్తుంది. ఈ ఉత్సవాన్ని పురస్కరించుకొని ఎన్నో పాటలు వ్యాప్తిలో ఉన్నాయి. స్త్రీలు బతుకమ్మల చుట్టు పాటలు పాడుతూ ఆడుకుంటున్నప్పుడు, అది ఒక వలయాకారంలో జరుపబడే నృత్య విశేషంగా భాసిస్తుంది. తంగేడు, గునుగు, బంతి, ఉద్రాక్ష మొదలైన పూవులతో బతుకమ్మలను అలంకరించి తమ తమ కళా నైపుణ్యాలతో స్త్రీలు వాటిని తీర్చి దిద్దుతారు. మళ్ళీ తెలంగాణంలో ఒక్కొక్క జిల్లాలో ఒక్కొక్క రకమైన పాటలు వ్యవహారంలో ఉన్నాయి. ఇది విజయదశమికి ముందు జరుపుకునే పండుగ....ముఖ్యంగా కన్నె పిల్లలు అత్యంత ఆనందంతో ఈ పండుగలో పాల్గొంటారు.

చి॥ విష్ణుమూర్తి తెలంగాణంలోని పల్లె పల్లెకూ తిరిగి బతుకమ్మ పండుగ పాటలను సేకరించి, శాస్త్రీయంగా వాటిని విశ్లేషించి, పరిశోధన గావించాడు. ఈ పాటల వెనుక ఉన్న సామాజిక వైలక్షణ్యం, స్త్రీల మనోగత భావాలు, ఆచారాలు, నేపథ్య చరిత్ర-ఇవన్నింటిని కూలంకషంగా పరిశీలించి వ్యాఖ్యానించాడు. దీనిలో తన స్వయంప్రతిభను ప్రకటించి న్యాయం చేకూర్చాడు. ఈ పుస్తకాన్ని వెలువరిస్తున్న సందర్భంలో చి॥ విష్ణుమూర్తిని అభినందిస్తూ, ఆశీర్వదిస్తున్నాను. భగవంతుడు ఈయనకు విజయపరంపరలు చేకూర్చాలని కోరుకుంటున్నాను.

డా॥ పి. జ్యోతి
M.A., M. Phil., Ph.D.,
రీడర్
తెలుగు విభాగం
కాకతీయ విశ్వ విద్యాలయం
విద్యారణ్యపురి
వరంగల్లు.

2/1010/B.8.6
శ్రీనివాస నగర్
హన్మకొండ - 506001
ఫోన్ : 70069
ది : 7-7-1994

# అభినందన

తెలంగాణా ప్రాంతంలో స్త్రీలు భక్తి శ్రద్ధలతో జరుపుకునే ప్రత్యేకమైన పండుగ బతుకమ్మ పండుగ. సహజంగా పండుగలు పౌరాణిక గాథల ఆధారంగా ఆవిర్భవిస్తాయి. బతుకమ్మ పండుగ పుట్టుకకు అట్లాంటి కారణాలేవి కనిపించవు. ప్రకృతిని ప్రేమించిన జానపదులు ప్రకృతిలో లభించే అన్ని రకాల పుష్పాలతో "బతుకమ్మ"ను ఆరాధిస్తారు. తమ బ్రతుకులు చల్లగా ఉండాలనే ఉద్దేశ్యంతో జానపదులు ఈ దేవతను సృష్టించుకున్నారు. ఈ విషయాన్నే Way land D. Hand ఇలా అంటాడు: "Folk belief is oten a matter or attitude and a matter of Faith." జానపదుల నమ్మకాలే, వారి పరిమిత పరిజ్ఞానమే ఇటువంటి పండుగల పుట్టుకకు ప్రధాన కారణాలు.

చి॥ విష్ణుమూర్తి బతుకమ్మ పండుగ పాటలను సేకరించి పరిశీలించడంలో ఉత్తమ దీక్షను, కృషిని కనబరచినాడు. పాటలలో కనిపించే సంస్కృతీ సంప్రదాయాలను, ఇంకా అనేకానేక విషయాలను సామాజిక దృక్పథంతో ఇతడు చక్కగా పరిశీలించాడు. ముఖ్యంగా జానపద జీవితంతో తాదాత్మ్యం పొందే అతని మనస్తత్వానికి అనుకూలంగా పరిశోధన జరిగింది. స్పష్టత, ఋజుత్వం పరిశోధనకు ప్రాణప్రతిష్ఠ చేస్తాయంటారు. ఈ మేలి గుణాలు ఈ గ్రంథంలో మనం చూడవచ్చు. ఇది మంచి కృషి.

# కృతజ్ఞతలు

తెలంగాణా ప్రాంతంలో ప్రత్యేకంగా జరుపుకునే పండుగ బతుకమ్మ పండుగ. మా గ్రామంలో ఈ పండుగను ఎంతో వైభవంగా జరుపుకుంటున్నప్పుడు, జానపద స్త్రీలు పాడుకున్న రకరకాల పాటలు నాకెంతగానో నచ్చాయి. అప్పుడే నాకు ఈ పండుగ గురించి, పాటల గురించి క్షుణ్ణంగా అధ్యయనం చేయాలనే తలంపు కలిగింది. అదృష్టవశాత్తు కాకతీయ విశ్వవిద్యాలయంలో నాకు ఈ పండుగ పాటల గురించే పరిశోధన చేసే అవకాశం లభించింది. ఈ అవకాశాన్ని కలిగించిన అప్పటి తెలుగు శాఖాధ్యక్షులు, నేటి తెలుగు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు ఆచార్య పేర్వారం జగన్నాథంగారికి నా నమస్సుమాంజలులు. అంతేగాక, నేను కోరగానే, ఎంతో ఆత్మీయతతో ఈ గ్రంథానికి ముందు మాట వ్రాసి ఇచ్చారు. వారి సహృదయత ఇంతింతని చెప్పలేము.

నా ఈ పరిశోధనా రంగంలో నన్నెంతో ప్రోత్సహించి, సందేహాలను, సమస్యలను సముచితంగా పరిష్కరించి, మార్గ దర్శకత్వం చేసిన సహనం, సౌమ్యం మూర్తీభవించిన డా॥ పి. జ్యోతి గారికి నా హృదయ పూర్వక నమస్సులు.

యం. ఫిల్. కోర్సులో పరిశోధనావకాశం కల్పించిన అప్పటి ఆర్ట్స్ విభాగం డీన్ ఆచార్య మాదిరాజు రంగారావు గారికి కృతజ్ఞతాభివందనాలు.

కాకతీయ విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య కె. జయశంకర్ గారికి, రిజిస్ట్రార్ ఆచార్య శంకరయ్య గారికి నా కృతజ్ఞతాభివందనాలు.

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ప్రప్రథమంగా తెలుగు జానపద గేయ సాహిత్యాన్ని పరిశోధించి, గ్రంథస్థం చేసి, నాలాంటి జానపద సాహితీ ప్రియులెందరికో, పరిశోధనా మార్గాన్ని చూపిన "జానపద కవిబ్రహ్మ" ఆచార్య బిరుదురాజు రామరాజు గారికి నమస్కృతులు.

ఈ గ్రంథ ప్రచురణకు రు. 4000/- ఆర్థిక సహాయం అందజేసిన తెలుగు విశ్వవిద్యాలయ అధికారులకు కృతజ్ఞతలు.

ఈ గ్రంథానికి ఎంతో ఆకర్షణీయంగా ముఖచిత్రం వేసిన కళాకారులు, సాహితీవేత్త శ్రీ శీలా వీర్రాజు గారికి కృతజ్ఞతలు.

పాటల సేకరణలో ఎంతగానో తోడ్పడిన సహృదయులు డా॥ అందె వెంకట్ రాజం గారికి (తెలుగు లెక్చరర్, కోరుట్ల), శ్రీ మురళీమనోహరాచార్య గారికి(మెట్‌పల్లి), సుద్దాల అశోక్ (టీచర్, మేడిపల్లి) గార్లకు నా ధన్యవాదాలు.

ముఖ్యంగా అడుగగానే తమ విలువైన సమయాన్ని వెచ్చించి ఈ బతు. కమ్మ పండుగనాడు పాడుకునే రకరకాల పాటలను వినిపింపజేసిన జానపద స్త్రీల ఋణం తీర్చుకోలేనిది. వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

గ్రంథాన్ని అందంగా ముద్రించిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ అధినేత శ్రీ పి. శ్రీనివాస్ గారికి కృతజ్ఞతలు.

పరిశోధనలో సహకరించిన ఆత్మీయులు ఇంకెందరో ఉన్నారు. అందరికీ వందనాలు.

# విషయసూచిక

# 1. జానపద సాహిత్యం – స్త్రీల పాటలు

ఆదిమ కాలంనుండి ఆధునిక కాలంవరకు మానవుని జీవన విధానాన్ని, క్రమ వికాసాన్ని ప్రతిబింబించేది జానపద సాహిత్యం. ప్రకృతి ఒడిలో పుట్టి పెరిగిన జానపదుల మాటలు, పాటలు వారి స్వచ్ఛమైన మానసిక స్వభావాన్ని, నిర్మలత్వాన్ని, హృదయ భావుకతను తెలియజేస్తాయి. తమకు సంతోషం కలిగినప్పుడో, తమ దుఃఖనివారణకో, పనిలో అలసటను మరచిపోవడానికో జానపదులు పాటలు పాడుకుంటారు.

చెట్లను నరుకడం, రాళ్లు కొట్టడం, బరువులు ఎత్తడం, మోట కొట్టడం, వరికోతలు కోయడం, పడవ లాగడం, వడ్లు దంచడం, పిండి విసురడం మొదలైన పనులు చేస్తున్నప్పుడు, ఒక రకమయిన లయతో కూడిన శబ్దం వస్తుంది. ఆ లయకనుగుణంగా జానపదులు అప్రయత్నంగా కూనిరాగాలు తీయడంతో లయబద్ధమైన పాటలు ఏర్పడినాయి. ఈ రకంగా పనులు చేస్తున్నప్పుడు పాటలు పాడడం వల్ల పనికి పాటకు దగ్గరి సంబంధం ఏర్పడింది. "ఆదిమ మానవుడు సుఖమో, దుఃఖమో యనుభవించినప్పుడాతని యుద్విగ్న హృదయము నుండి లయాన్వితమగు గేయమో, గేయపాదమో వెడలుననియు, అదియే ఇతరుల నోటబడి, తిరిగి పెరిగి, స్వయంభువుగా యుండునని యనుకొన వచ్చును."1

ఇంకా పండుగలలో, వేడుకలలో, ఉత్సవాలలో, జాతరలలో, జనజీవనం లోని ప్రతి ఒక దశలోను జానపదులు రకరకాల పాటలు పాడుకుంటారు. ఈ పాటలన్నీ జానపద సాహిత్యంలో చోటు చేసుకుంటాయి. మానవుని నాగరికతకు, సంస్కృతికి దర్పణం పడుతున్న ఈ జానపద సాహిత్యాన్ని పలువురు సాహితీవేత్తలు పలురకాలుగా నిర్వచించారు.

"జనపదమనగా పల్లెటూరు. జనపదముయందుండువారు జానపదులు. వారు పాడుకొనెడి పాటలు జానపదగేయము లనబడును" అని డా॥ బిరుదురాజు రామరాజుగారు తెలియజేశారు.2

జానపద సాహిత్యానికి ఆ పేరు ఏర్పడక ముందు, శ్రీ ఖండవల్లి లక్ష్మి రంజనంగారు "ప్రజావాఙ్మయం" అన్నారు. శ్రీ తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి, శ్రీ అడిదము రామారావు ప్రభృతులు "పదవాఙ్మయం" అని పేర్కొన్నారు. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు "అనాదృత వాఙ్మయం" అన్నారు. శ్రీ వావిలాల సోమయాజులుగారు "గేయరచన" లని, శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు "మధుర కవిత"లని పిలిచారు. శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు "దేశిసారస్వత" మన్నారు. శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి శ్రీ ఉన్నవ లక్ష్మినారాయణ, శ్రీ చేకుమళ్ళ కామేశ్వరరావు, శ్రీ హరి ఆదిశేషువు, శ్రీ తూమాటి దొణప్ప, శ్రీ నేదునూరి గంగాధరం ప్రభృతులు మాత్రం జానపద శబ్దాన్నే వాడారు.[3]

హిందీ విద్వాంసులలో డా॥ పద్మచంద్ర కాశ్యప్, డా॥ శకుంతలావర్మ, డా॥ కృష్ణదేవ ఉపాధ్యాయ మొదలైనవారు 'లోక్ సాహిత్య' అని, డా॥ చింతామణి ఉపాధ్యాయగారు 'లోకాయన్' అని, రామ్‌నరేశ్ త్రిపాఠిగారు 'గ్రామ సాహిత్య' అని, దేవేంద్ర సత్యార్థి, డా॥ విద్యాచౌహాన్, డా॥ జవహర్‌లాల్ హండు, డా॥ కుల్‌దీప్ ప్రభృతులు 'లోక్‌గీత్' అని పేర్కొన్నారు.[4]

అంతేగాకుండా ప్రసిద్ధ జానపద విద్వాంసుడైన అలన్ డండెస్ ప్రకారం "జానపదులంటే ఏదైనా ఒక్క విషయంలోనైనా భావస్వామ్యం కలిగిన జన సముదాయం. వీరు ఒక ప్రదేశంలో నివసిస్తున్నవారు కావచ్చు లేదా ఒక జాతికి, వృత్తికి, మతానికి సంబంధించినవారు కావచ్చు."[5] అయితే కొట్టవచ్చినట్లు ఒక ప్రత్యేకమైన, సాధారణమైన, సామూహికమైన గుర్తింపు పొందే లక్షణం వారు కలిగి ఉండాలి. అదే జానపదత్వ లక్షణం (**Folkishness**) అనబడుతుంది. అది కలిగి ఉన్న పట్టణవాసులు కూడ జానపదులే అవుతారు. ఈ జానపదులకు సంబంధించిన విజ్ఞానమే జానపద విజ్ఞానం (**Folklore**) అంటారు. జానపద విజ్ఞానంలో ముఖ్యంగా శాబ్దిక జానపద విజ్ఞానం (**Verbal folklore**), శాబ్దికేతర జానపద విజ్ఞానం (**Non-verbal folklore**) అని రెండు విభాగాలు ఉంటాయి. మౌఖికంగా శబ్ద రూపంలో వెలువడేది శాబ్దిక జానపద విజ్ఞానం అని, తదితరమైన నమ్మకాలు, ఆచారాలు, దుస్తులు, అలంకారాలు, ప్రదర్శన కళలు మొదలైనవి శాబ్దికేతర జానపద విజ్ఞానమని అంటారు.

రిచర్డ్ ఎం. డార్సన్ (**Richard M. Dorson**) అనే పరిశోధకుడు జానపద విజ్ఞానాన్ని స్థూలంగా నాలుగు భాగాలుగా విభజించాడు.

**1. మౌఖిక జానపద విజ్ఞానం** (Oral folklore) : ఇవి సాహిత్యం, భాష అనే భాగాలుగా ఉంది. సాహిత్య భాగంలో జానపద గేయాలు, కథా గేయాలు, పురాణ గాథలు, ఐతిహ్యాలు, కథలు, సామెతలు, పొడుపుకథలు మొదలైనవి ఉండగా భాషా విభాగంలో మాండలికాలు, నుడికారాలు, తిట్లు, ఒట్లు మొదలైనవి ఉన్నాయి.

**2. సాంఘిక జానపద ఆచారాలు** : (**Social Folk customs**) : జనన మరణాలకు సంబంధించిన ఆచారాలు, వివాహ సంబంధ బాంధవ్యాలు, పండుగలు, వినోదాలు, క్రీడలు, వైద్యం, మతం, విశ్వాసాలు మొదలైనవి ఈ విభాగానికి చెందుతాయి.

**3. జానపద వస్తు సంస్కృతి** : (Folk Material Culture) : భౌతిక జీవనానికి సంబంధించిన సమస్త వస్తుజాలం, వాద్యాలు, కళలు, వృత్తుల పరికరాలు, వాస్తు శిల్పం, దుస్తులు, ఆభరణాలు, పూజాసామగ్రి మొదలైనవి ఈ విభాగంలో చేరుతాయి.

**4. జానపద కళలు** (Folk Arts) : ఈ విభాగంలో చేరేవి సంగీతం, నృత్యం, అభినయం గల సమస్త జానపద కళలు. ఇవిగాక సంగీతం, వాద్య సంగీతం, వీధి భాగవతాలు, తోలుబొమ్మలాటలు మొదలైనవి.

ఈ విధంగా చేసిన డార్సన్ విభాగం స్థూలంగా ఉన్నప్పటికీ, శాస్త్రీయమైనదానిగా తరువాతి పరిశోధకులందరు అంగీకరించారు. జానపద విజ్ఞానాన్ని సమగ్రంగా అధ్యయనం చేయడానికి వీలుగా ఆర్ యస్. బాగ్స్ (**R.S. Boggs**) చేసిన విభజన చాలా ఉపయోగకరంగా ఉంటుంది.

**జానపద సాహిత్యం - వివిధ శాఖలు:** జానపద విజ్ఞానంలో భాగమైన జానపద సాహిత్యాన్ని పలువురు జానపద విద్వాంసులు పలురకాలుగా వర్గీకరించారు.

"శ్రీ టేకుమళ్ళ అచ్యుతరావుగారు **1924** లో ఆంధ్ర దేశము నందలి పదములు, పాటల (**Andhra Songs and Ballods**) ను నాలుగు తరగతులుగా

విభజించిరి. అవి 1. పాలక వర్గములవారు విశ్రాంతి కొరకుగాని, ఉబుసుపుచ్చు కొనుటకుగాని పాడెడి తందానని పదములు. వీనిని పాడుచుండునపుడు నృత్యము కూడను చేయించుదురు. ఇవి సామాన్యముగా రామకథలతోను, కృష్ణలీలలతోను సంబంధించి యున్నవి. 2. మన స్త్రీలు పాడు చుండెడి పాటలు, తరచుగా రామ కృష్ణుల చరిత్రములనే యభివర్ణించుచున్నవి. కుశలవుల కథ, లంకాయాగము లక్ష్మణదేవర నవ్వు, హంసరాయబారము మున్నగు పవిత్ర కథలు సరసము గాను హృద్యముగాను జెప్పబడినవి. 3. గృహవ్యథలు, సాంఘికాచారములు మున్నగు విషయములతో సంబంధించినవి కామమ్మ కథ, లక్ష్మమ్మ కథ మొద లగునవి. 4. దేశ చరిత్ర యందలి ప్రసిద్ధ విషయము లెల్లరకును వెల్లడి యగు నట్లు మృదుమధుర శైలిని పాటల రీతిగా నేర్పరుపబడినవి. పల్నాటి వీరులకథ, మరాఠి కథ. బొబ్బిలికథ మున్నగునవీ తరగతిలో చేరును.[6]"

శ్రీ హరి ఆదిశేషువుగారు జానపద వాఙ్మయాన్ని తొమ్మిది రీతులుగా విభజించారు. అవి 1. శృంగార రసాత్మక గేయములు, 2. వీరకథ వాఙ్మయము, 3. సాహసిక కథా వాఙ్మయము, 4 కరుణ రసాత్మక కథా వాఙ్మయము, 5. అద్భుత రస ప్రధాన కథా వాఙ్మయము, 6. స్త్రీల పాటలు, 7. వేదాంత భక్తిరస ప్రధానమైన రచనలు, 8. స్త్రీల పాటలు, బాలబాలికల గేయములు, 9. ప్రకీర్ణములు.[7]

డా॥ బిరుదురాజు రామరాజుగారు జానపద గేయ సాహిత్యమంతటిని క్రింది విధంగా విభజించారు:

| | | | |
|---|---|---|---|
| 1. | పౌరాణిక గేయాలు | (ఎ) | రామాయణ సంబంధాలు |
| | | (బి) | భారత సంబంధాలు. |
| | | (సి) | భాగవత సంబంధాలు |
| 2. | చారిత్రక గేయాలు | (ఎ) | చారిత్రకములు. |
| | | (బి) | అస్పష్ట చారిత్రకములు. |
| 3. | మతసంబంధమైన గేయాలు | (ఎ) | శైవమత సంబంధాలు. |
| | | (బి) | వైష్ణవ సంబంధాలు. |
| 4. | పారమార్థిక గేయాలు | (ఎ) | భక్తిగేయాలు. |
| | | (బి) | వేదాంత సంబంధాలు. |
| | | (సి) | కర్మమార్గ సంబంధాలు. |

5. స్త్రీల పాటలు.
6. గ్రామిక గేయాలు.
7. పిల్లల పాటలు.

రసాన్ని అనుసరించి వీరు గేయాలను క్రింది విధంగా విభజించారు:

1. శృంగార గేయాలు.
2. అద్భుత రసగేయాలు.
3. కరుణరస గేయాలు.
4. హాస్యరస గేయాలు.

డా॥ తంగిరాల వెంకటసుబ్బారావుగారు జానపద సాహిత్యాన్ని ఐదు విధాలుగా విభజించారు. అవి : 1) గద్యాఖ్యానాలు, 2) జానపద గేయాలు, 3) వీర గాథలు, 4) పొడుపు కథలు, 5) సామెతలు. గద్యాఖ్యానాలను పుక్కిటి పురాణాలు (Mythes), ఐతిహ్యాలు (Legends), జానపద కథలు (Folktales) అని, వీరగాథల (Ballads)ను లఘువీరగాథలు (Ballad Lings) వీరగాథలు (Ballads) వీరగాథ చక్రాలు (Ballad Cycles) అని విభజించారు.[8]

డా॥ నాయని కృష్ణకుమారిగారు జానపద వాఙ్మయమంతటిని క్రింది విధంగా విభజించారు:

1. **గేయశాఖ :**

   ఎ. కథా విరహితం, బి. కథా సహితం.

**ఎ. కథా విరహితం :**

i. గ్రామిక గేయాలు
ii. పారమార్థిక గేయాలు
iii. కౌటుంబిక గేయాలు.

1. గ్రామిక గేయాయి : శృంగార, హాస్య, కరుణ ప్రధానములు.
2. పారమార్థిక గేయాలు : మార్మిక, తాత్విక, భక్తి గేయాలు.
3. కౌటుంబిక గేయాలు : బంధుత్వ, ఆచార ప్రదర్శక గేయాలు. (బంధుత్వ ప్రదర్శకాలలో పెద్దలకు సంబంధించి, పిల్లలకు సంబంధించినవి)

**బి. కథాసహితం :**

1. శ్రామిక గేయాలు
2. స్త్రీల పాటలు
3. కొన్ని కులాలవారు పాడేవి.

1. శ్రామిక గేయాలు : దీర్ఘ గేయాలు
2. స్త్రీల పాటలు : వ్రతకథలు, పౌరాణిక కథలు.
3. కొన్ని కులాలవారు పాడే పాటలు. : వీరగాథలు, అద్భుతగాథలు, మతగాథలు, చారిత్ర గాథలు, స్త్రీ సంబంధిత గాథలు. (మత గాథలలో పురాణగాథలు, గ్రామదేవతల గాథలు; చారిత్రక గాథలలో స్పష్ట చారిత్రక గాథలు, అస్పష్ట చారిత్రక గాథలు)

**II. వచనశాఖ :**

ఎ. కథారహితం, బి. కథాసహితం

**ఎ. కథారహితం :**

1. పొడుపు కథలు
2. సామెతలు

**బి. కథారహితం :**

1. నీతి కథలు
2. వీర కథలు
3. అద్భుత కథలు
4. పురా కథలు
5. పురాకల్పిత కథలు
6. పేదరాశిపెద్దమ్మ కథలు

**III. దృశ్యశాఖ :**

ఎ. మనుష్యులు ఆడే ప్రక్రియ, బి. మనుష్యులు ఆడించే ప్రక్రియ.

ఎ. **మనుష్యులు ఆడే ప్రక్రియ :**

1. పగటివేషాలు
2. వీథి నాటకం
3. యక్షగానం

బి. **మనుష్యులు ఆడించే ప్రక్రియ :**

1. తోలుబొమ్మలాట
2. చెక్కబొమ్మలాట[9]

పై విధంగా జానపద సాహిత్యాన్ని పలువురు సాహితీవేత్తలు వర్గీకరించారు.

జానపద కవిత్వంలో జానపద గేయాలు, జానపద కథా గేయాలు అని రెండు విభాగాలుంటాయి.

డా॥ బిరుదురాజు రామరాజుగారు చెప్పిన జానపద గేయ లక్షణాలు ఈ విధంగా ఉన్నాయి:

1. జానపద గేయానికి ఒక ప్రత్యేకమైన కవి అంటూ ఉండడు.
2. పరిణత లేక నియమిత స్వరూపం లేకపోవడం.
3. గేయరచనా కాలం ఇదమిత్థమని ఉండకపోవడం
4. ఈ గేయాలు కేవలం మౌఖిక ప్రచారంతోనే జీవించడం.
5. సహజ శైలి.
6. పాడుకోవడానికి వీలుగా ఉండడం.

పై ఆరు ప్రధాన లక్షణాలకు మళ్ళీ నాలుగు ఉప లక్షణాలు తెలిపారు:

1. ఆశు రచనం.
2. పునరావృత్తి.
3. జనసామాన్య పరిచిత వస్తువు.
4. రస ఘటిక[10].

ఈ లక్షణాలన్ని బతుకమ్మ పాటలలో కనిపిస్తాయి.

ఏమేమి పువ్వొప్పునే గౌరమ్మ
ఏమేమి కాయొప్పునే గౌరమ్మ
తంగేడు పువ్వొప్పునే గౌరమ్మ
తంగేడు కాయొప్పునే గౌరమ్మ

తంగేడు చెట్టెక్కుతే గౌరమ్మ వనమెల్లగా నొచ్చునే గౌరమ్మ
తంగేడు చెట్టుక్రింద ఆటశిల్కలాల పాటశిల్కలాల
కలికిశిల్కలాల కందమ్మగుడ్డలు మమ్మగిరి మేడలు
తంగేడు చెట్టుక్రిందా గౌరమ్మ నీ నోము చెల్లిస్తునే గౌరమ్మ

ఏమేమి పువ్వొప్పునే గౌరమ్మ
ఏమేమి కాయొప్పునే గౌరమ్మ
ఉద్రాక్ష పువ్వొప్పునే గౌరమ్మ
ఉద్రాక్ష కాయొప్పునే గౌరమ్మ

ఉద్రాక్ష చెట్టెక్కితే గౌరమ్మ వనమెల్ల గానొచ్చునే గౌరమ్మ
ఉద్రాక్ష చెట్టుక్రింద ఆటశిల్కలాల పాటశిల్కలాల
కలికి శిల్కలాల కందమ్మగుడ్డలు మమ్మగిరిమేడలు
ఉద్రాక్ష చెట్టుక్రిందా గౌరమ్మ నీ నోము చెల్లిస్తునే గౌరమ్మ

ఇదే మాదిరిగా గునుగు, గోరంట, బంతి మొదలగు పూల పేర్లను తెలుపుతూ పై పాటలోని చరణాలన్నీ పునరావృత మవుతాయి.

అదేవిధంగా మరో పాటలో—

దచ్చన్నదారీ పూలావొయ్యారి ఒక్కత్త కోడండ్లు ఏడుగురారండ్లు దచ్చన్నదారీ

| | | | |
|---|---|---|---|
| ,, | ,, | అందరికన్న చిన్నాదీ అండాలుదేవి | ,, |
| ,, | ,, | అండాలుదేవిను గర్భిణయ్యింది | ,, |
| ,, | ,, | ఒంటశాలల ఉన్న ఓ అత్తగారు | ,, |
| ,, | ,, | మాలీదముద్ద మనసాయె అత్తా | ,, |

ఇందులో దచ్చన్నదారి పూలావొయ్యారి అనే చరణం పునరావృత మయ్యింది.

ఈ పాటలకు ప్రత్యేకమైన కవి, కాలం ఉండకపోవడం, నియమిత స్వరూపం లేకపోవడం, మౌఖిక ప్రచారంలోనే జీవించడం మొదలైన జానపద గేయ లక్షణాలన్ని వర్తిస్తాయి.

ఈ గేయ లక్షణాలే గాకుండా కథాగేయ లక్షణాలైన—

1. కథాకథనం.
2. వారానువర్తనాలు.
3. ప్రాచీన మానవ మనస్తత్వ ప్రదర్శితం.
4. ప్రత్యేక సమయాలలో ప్రత్యేక వ్యక్తుల చేత గానం చేయబడడం.
5. నియమిత స్వరూపం లేకపోవడం

వంటివి కూడ బతుకమ్మ పండుగ పాటలలో కనిపిస్తాయి.

ఈ బతుకమ్మ పాటలు ఎక్కువగా రామాయణం, భారతం, భాగవతం మొదలైన పౌరాణిక కథా వస్తువులతో ఉంటాయి. ఇంకా జనసామాన్యమైన కథలను కూడ బతుకమ్మ పండుగ సందర్భంలో స్త్రీలు పాటలుగా పాడుకుంటారు.

**స్త్రీల పాటలు :** జానపద సాహిత్యంలో స్త్రీల పాటలకు ఎంతో ప్రాముఖ్యం ఉంది. స్త్రీలు లాలిపాటలు, జోలపాటలు, మంగళహారతులు, తలుపుదగ్గర పాటలు, మేలుకొలుపు పాటలు, భక్తిపాటలు, పారమార్థికపు పాటలు, పెండ్లి పాటలు, అప్పగింతల పాటలు, విసుర్రాతి పాటలు, దంపుడు పాటలు, గొబ్బి పాటలు, బతుకమ్మ పాటలు మొదలైన రకరకాల పాటలు పాడుకుంటారు. దేశంలో ఎన్నో నాగరికతలు, వివిధ మతాలు, పరిపాలనలో మార్పులు ఎన్నో వచ్చినా జానపద స్త్రీలు ఆ ప్రభావానికి లోనుగాకుండా, వారి ఆచార సంప్రదాయాలను కాపాడుకుంటున్నారు. సంస్కృతీ సంప్రదాయాలకు స్త్రీల పాటలు ఎంతగానో ఉపకరిస్తాయి. జానపద స్త్రీల మనస్తత్వాన్ని, హృదయ భావుకతను వారి పాటలు వ్యక్తం చేస్తాయి.

మానవుడు పుట్టింది మొదలు జీవితంలోని చివరి క్షణం వరకు జరిగే అన్ని కర్మాచరణలు స్త్రీల పాటల రూపంలో నిలిచి ఉన్నాయి. మానవ జీవితాన్ని ప్రతిబింబించే సాహిత్యం స్త్రీల సాహిత్యమని చెప్పడంలో అతిశయోక్తి లేదు. ఉదయాన్నే బాలభానుడు పొడసూపకముందే స్త్రీలు లేచి స్నానాదులను పూర్తి చేసుకుని-

"శ్రీ సూర్యనారాయణా మేలుకో హరిసూర్యనారాయణా మేలుకో"

అని సాక్షాత్తు సూర్యభగవానున్నే తమ మధురమైన పాటలతో మేలుకొలుపుతారు. జానపద స్త్రీ లేని గృహం, ఆమె నిలువని వాకిలి, దాటని గడప, చేయని కార్యం అన్నీ అంధకారంగానే కనిపిస్తాయి "సంసార యాత్రలో గృహలక్ష్మికి గల ప్రాధాన్యము పురుషునకు లేదు. గృహ జీవనమున, కవిత్వమునకు గూడ స్త్రీలే యధికముగా నాలంబనములు."[11]

ముఖ్యంగా జానపద స్త్రీలు పాడే పాటలలో మానవ జీవితంలోని వివిధ ఘట్టాలు వర్ణింపబడుతాయి.

బాల్య దశలో స్త్రీలు తమ బిడ్డలను రామునిగానో, కృష్ణునిగానో భావించుకొని రకరకాల లాలి పాటలు, జోల పాటలు పాడుతారు. బిడ్డ ఏడిస్తే లాలించడానికి పాడే పాటలు లాలి పాటలనీ, నిద్రబుచ్చడానికి పాడే పాటలను జోల పాటలని అంటారు.

నిద్రకు ఉపక్రమిస్తున్న తన బిడ్డను జోకొట్టుతూ-

"జో అచ్యుతానంద జోజో ముకుందా - రావే పరమానంద రామగోవిందా జో....జో...." అని పాడే పాట తెలుగు స్త్రీలందరికి పరిచయమే.

ఇంకా తన బిడ్డ ఏడుపు చూడలేని స్త్రీ ఆ బిడ్డను ఊరడిస్తూ-

"ఏడవకు ఏడవకు వెఱ్ఱినాయన్న
ఏడిస్తే నీ కండ్లు నీలాలుగారూ
నీలాలుగారితే నేచూడలేను
పాలైనగారవే బంగారుకండ్ల"[12]

అని పాడుతుంది. ఇంకా సీతమ్మ తన కుమారులకు ఉయ్యాల కొనలేని దీనస్థితికి బాధపడుతూ వారిని నిద్రబుచ్చుతూ పాడే పాట:

ఊరికి ఉయ్యాల లమ్మ వొచ్చినవో — తమ్మన్నా దారిలో
ఏంబెట్టి నేను గొందు ఎండి ఉయ్యాలో — ,,
పాలుపోసి నేనుగొందు పైడి తొట్టెల — ,,
పట్టుబట్టల్లుతీర్చి పొత్తిల్లు పరచీ — ,,
పుత్రున్ని బాలున్ని పవళింపజేతూ — ,,
ఏడవకూ బిడ్డా రామక్షొమారా — ,,
ఏడిస్తే నిన్నెవరెత్తుకునేవారు — ,,

అని పాడుతుంది తల్లి.

బాల్యం తరువాత దశ యవ్వనం. యవ్వనంలో స్త్రీకి వివాహం ప్రధాన మైన ఘట్టం. ఇది నూరేళ్ళ పంట. వివాహ సందర్భంలో స్త్రీలు వైవాహికా చారాలను, పద్ధతులను తెలుపుతూ ఎన్నో రకాల పాటలు పాడుకుంటారు. ఈ వివాహం సందర్భంలో తల్లిదండ్రులు, తమ బిడ్డకు తగిన వరున్ని అన్వే షిస్తారు. వధువు తల్లిదండ్రులు తమకు తెలిసిన బంధువులను, మిత్రులను వరుని జాడలు తెలుపుమని. అడుగుతూ——

కన్యకు ఈడుజోడైన కాంతున్ని వెదకిరండి
రూపుగలవాని కీర్తికాంతుని ఆచారవంతున్ని అరసిరండి
వరదక్షిణెంతైన ప్రీతితో ఇత్తుమని, ఒప్పుకొనిరండి
తేజాలు గజములు ఎన్ని గావలసిన కాదనక, ఇత్తుమనుడి
వస్తువాహనములు, వరసతో భూమియును, అడిగినంత అవుననండి
యివ్వగల పైడిసొమ్ముల నిత్తుమనుడి కావలెననిన కట్నములు

కలవనుడి"[13] అని అంటారు.

పై పాటలో సదాచారం, కీర్తివంతుడైన వరుడు కావాలని, కట్నకానుకలు ఎంతైనా ఇవ్వగలమని తల్లిదండ్రులు చెప్పుదురు.

వరుడు, వధువుకు సంబంధించిన ఇరుపక్షాలవారు సమ్మతించిన తరువాత వివాహం ఎంతో ఆడంబరంగా, సంప్రదాయంగా జరుగుతుంది.

రాజరంపాలుని కథలో జానపద స్త్రీలు రాజరంపాలునికి, భస్మగౌంధి కూతురు రూపవతితో వివాహం జరిపిస్తారు. ఆ వివాహ వైభవాన్ని తెలుపుతూ——

| | | | |
|---|---|---|---|
| ఆకాశమెత్తు | ఉయ్యాలో | పందిర్లు ఏసి | ఉయ్యాలో |
| భూలోకమంత | ,, | పీటలు పరచి | ,, |
| పచ్చని తోరణాలు | ,, | వారు కట్టినారు | ,, |
| ఊరూరికైతే | ,, | ఉత్తరాలు రాసి | ,, |
| లగ్గము తయారు | ,, | వారు చేసినారు | ,, |
| పచ్చని పందిట్ల | ,, | లగ్గము పోలునైతే | ,, |
| లగ్గము పోలునైతే | ,, | వాళ్ళు పోసినారు | ,, |
| వారికి లగ్గంబు | ,, | అట్లు అయినాది | ,, |
| నాగెల్లి అయితే | ,, | కావాలె అప్పుడు | ,, |

ఈ విధంగా వధూవరులకు లగ్నం చేయడం, తదనంతరం వారికి నాగవెల్లి జంపించడం వంటి వేడుకలకు సంబంధించిన పాట లనేకం స్త్రీలు పాడుతారు.

స్త్రీకి వివాహం అయిన తరువాత తరువాత తల్లిదండ్రులు ఆమెను అత్త వారింటికి సాగనంపుతారు. తన బిడ్డను అత్తవారింటికి సాగనంపుతూ, తల్లి తన బిడ్డకు ఎన్నో బుద్ధులు నేర్పుతుంది. ఈ సందర్భంగా స్త్రీలు పాడే పాటలు ఈ రకంగా ఉంటాయి :

అత్తామామ పొట్లాషాన
వొద్దిక కల్గియుండు
పుట్టినింటికి కీర్తినితెస్తే
మళ్ళీ నిన్ను తోలుకవస్తు
అష్ట కంకణాల చేయి
అదిలించి నడువాబోకు
పక్కనున్న పరిటాకొంగూ
జారవిడిచీ నడవాబోకు
పండుగ పదినాళ్ళున్నదనంగా
నాటికె తోలుకవస్తూ

మాయమ్మ లక్ష్మిదేవి పోయిరావమ్మ
మా తల్లి పార్వతిదేవి పోయిరావమ్మ
పలుమార్లు పలుదెరిచి నవ్వబోకమ్మ
అతనికాదని పూలు ముడువబోకమ్మ
మమ్ము రచ్చకు తేకు మముగన్నతల్లి
మల్లెపూలా చెండ్లు నీకు అంపెదమూ
మాయమ్మ లక్ష్మిదేవి పోయిరావమ్మ
మాతల్లి గౌరీదేవి పోయిరావమ్మ

అని తలిదండ్రులు క్రొత్తగా పెళ్ళయిన బిడ్డకు అత్తవారింట్లో ఎలా మెలగాలో చెప్పుతూ సాగనంపుతారు.

స్త్రీ మాతృత్వం కొఱకు ఎన్నో పాట్లు పడుతుంది. సంతానం కొఱకు నోములు, వ్రతాలు ఆచరిస్తుంది. ఎందరో దేవుళ్ళకు మొక్కుకుంటుంది.

సింహాద్రి అప్పన్న గుళ్ళముందార-
పట్టారు గొ్రడాళ్ళు ప్రాణాచారాలు

ఎందుకు పట్టారు ఏల పట్టారు - కొడుకుల్లు ఇయ్యమని కోరి పట్టారు,
సంతులియ్యమని చాల పట్టారు - బిడ్డల నియ్యమని పట్టు పట్టారు.[14]

ఇంకా 'బాలనాగమ్మ కథ'లో భూలక్ష్మిదేవి సంతానం కోసం అడవికి వెళ్ళి, అక్కడ శిథిలమై ఉన్న శివుని గుడిని శుభ్రం చేసి, పూజలు చేస్తుంది.

| | | | |
|---|---|---|---|
| భూలక్ష్మి దేవియు | ఉయ్యాలో | ఏమి చెయ్యవట్టె | ఉయ్యాలో |
| గుడిశుద్ధి అయితే | ,, | అపుడు చేసినాది | ,, |
| సున్నము జాజులు | ,, | అపుడు పెట్టినాది | ,, |
| అపుడు నైవేద్యము | ,, | చెయ్యబోతున్నది | ,, |
| రెండునే దిక్కుల్ల | ,, | రాళ్ళనే బెట్టింది | ,, |
| మారోక దిక్కున | ,, | మోకాలు పెట్టింది | ,, |
| అపుడు నైవేద్యము | ,, | వండనే సాగింది | ,, |
| అరగింపూ లైతే | ,, | అపుడు చేసినాది | ,, |
| అపుడు తపస్సు మీది | ,, | ఆమె కూర్చున్నది | ,, |
| ఘోరమైన తపస్సు | ,, | చేస్తనే ఉన్నది | ,,[15] |

సంతానం పొందడం కోసం శివుని గురించి కఠోరమైన తపస్సు చేస్తుంది. తరువాత భూలక్ష్మిదేవికి శివుని అనుగ్రహం వల్ల సంతానం కలుగుతుంది. ఈ రకంగా స్త్రీలు సంతానం కొరకు తపస్సు చేయడం, యజ్ఞ యాగాలు చేయడం కూడా కనిపిస్తుంది. దైవానుగ్రహం వల్ల కొన్నాళ్ళకు స్త్రీ గర్భం దాలుస్తుంది. గర్భవతులు అయిన స్త్రీలకు ఏది తినాలన్నా సహించకపోవడం, వాంతులవడం జరుగుతుంది. ఆ సమయంలో వారికి ఇష్టమైన కొన్ని పదార్థాలను మాత్రమే తింటారు. ఇటువంటి స్థితిని 'వేవిళ్ళు' అని అంటారు.

ఒకటో మాసం నెలతనగర్భిణి ఓనగాయ లడిగే చెలియా
ఓనగాయలడిగే చెలియా
రెండవమాసం నెలతనగర్భిణి - రేగుపండ్లు అడిగే చెలియా
రేగుపండ్లు అడిగే చెలియా

మూడవమాసం నెలతనగర్భిణి - ములగపండ్లు అడిగే చెలియా
ములగపండ్లు అడిగే చెలియా
నాలుగవమాసం నెలతనగర్భిణి - నానబియ్య మడిగే చెలియా
నానబియ్య మడిగే చెలియా
ఐదవమాసం నెలతనగర్భిణి - అత్తను సద్దడిగే చెలియా
అత్తను సద్దడిగే చెలియా

ఈవిధంగా గర్భవతులు ఆరవమాసంలో "అరటి పండ్లు", ఏడవ మాసంలో "ఎలగ పండ్లు", ఎనిమిదవ మాసంలో "ఎన్నముద్దలు", తొమ్మిదవ మాసంలో "తోటకూర" అడిగినట్లు, చివరికి "పదవమాసం నెలతన గర్భిణి పాపడు జన్మించే చెలియా" అని పాడుతుంది.

ఇంకా గర్భం దాల్చినప్పుడు స్త్రీలకు 'సీమంతం' జరిపిస్తారు. ఆ సమయంలో ఆమెకు పూలు, పండ్లు, కొత్తబట్టలు పెట్టి, చేతులకు గాజులు తొడిగిస్తారు. ఈ వేడుక నాలుగవ, ఐదవ, లేక ఎనిమిదవ మాసంలో జరిపిస్తారు. గర్భవతి అయిన స్త్రీకి ఉన్నటువంటి భయ సందేహాలను పోగొట్టడానికి, గర్భంలో ఉండే శిశువు ఆరోగ్యంగా పెరుగడానికి వైద్యశాస్త్రపరంగా ఇటువంటి ఆచారాలు విధించబడినాయి.

ఈ సందర్భంలో స్త్రీలు రకరకాల పాటలు పాడుతారు. జీవితంలోని ప్రతి సంఘటనను - కష్టమయినా, సుఖమయినా - జానపద స్త్రీలు పాటలుగా పాడుకుంటారు.

జనన మరణాలు మానవులకు సహజమే. పుట్టిన ప్రతి మనిషి గిట్టక మానడు. ఈ సందర్భంలో కూడ స్త్రీలు ముత్తైదువలుగానే మరణించాలని కోరుకుంటారు. భర్త మరణించిన అనంతరం స్త్రీలకు వైధవ్యం మొదలైనవి భరించరానివి.

స్త్రీలే గాకుండా స్త్రీలకోసం పురుషులు పాడిన పాటలు కూడ ఉంటాయి భార్య మరణించాక ఆమెపై అనురాగంతో ఆమె వియోగం సహించలేక భర్త ఈరకంగా పాడుతాడు:

సుద్ద బొందలకాడ నీ
సుద్ది దియ్యంగానే
సద్ది తిన్నట్టాయెనే సిలకా - సిన్నారి సిలకా
ఇంతెల్ల మెడబాసెవే సిలకా
ఎంత పాపపు దేవుడే సిలకా
సమర్తయై నీవు సాటుకు కూకుంటె
సత్తెభామవందురే సిలకా - సిన్నారి సిలకా
పసిద్దెయి నువ్వొక్క పందిట్ల గూకుంటె
పార్వతీ దేవందురే సిలకా - సిన్నారి సిలకా
ముత్తైదువై నువ్వొక మూలకు గూకుంటె
ముద్దబంతివందురే సిలకా - సిన్నారి సిలకా
ఇద్దరము తినేటి ఆ బొడ్డుగిన్నెలా
ఒక్కనికి ఒనరాయెనే సిలకా - సిన్నారి సిలకా
ఇద్దరము కప్పేటి మద్దికాయల దుప్పటి
ఒక్కనికి ఒనరాయెనే సిలకా - సిన్నారి సిలకా.[16]

ఈ గేయంలో భర్త తన భార్యను చిలకా అని, ముద్దబంతి అని, సత్యభామా అని పార్వతి అని సంబోధించటం వల్ల భార్యపై అతనికి ఉన్న ప్రేమ వ్యక్తమవుతుంది.

పై పాటలో భార్యా వియోగం, దుఃఖం దయనీయంగా వర్ణించబడింది. ఈ రకంగా సుఖంలోను, దుఃఖంలోను జానపదులు పాటలు పాడుకుంటారు.

ఇంకా జానపదులు దసరా, దీపావళి, వినాయకచవితి, సంక్రాంతి, హోళి మొదలైన పండుగలు జరుపుకుంటారు. వారు జరుపుకునే పండుగల సందర్భాలలో కూడ జానపదులు ఎన్నో రకాల పాటలు పాడుకుంటారు. అదే విధంగా తెలంగాణా ప్రాంతంలో మహిళలే ప్రత్యేకంగా జరుపుకునే పండుగ 'బతుకమ్మ పండుగ.' ఈ పండుగ సందర్భంలో స్త్రీలు పాడుకునే పాటలు ఎన్నో ఉన్నాయి.

## అథోజ్ఞాపికలు :

1. డా॥ బిరుదురాజు రామరాజు, తెలుగు జానపద గేయసాహిత్యము పుట-13
2. డా॥ బిరుదురాజు రామరాజు, తెలుగు జానపద గేయసాహిత్యము పుట-1
3. డా॥ బిరుదురాజు రామరాజు, తెలుగు జానపద గేయసాహిత్యము పుట-2
4. డా॥ చింతపల్లి వసుంధరా రెడ్డి, తెలుగు జానపదసాహిత్యము- స్త్రీల గేయములలో సంప్రదాయము పుట-13
5. ఆర్.వి.యస్. సుందరం, ఆంధ్రుల జానపద విజ్ఞానం, పుట-2
6. జి.వి.యస్. మోహన్, జానపద విజ్ఞాన వ్యాసావళి, పుట-18
7. జి వి. యస్. మోహన్, జానపద విజ్ఞాన వ్యాసావళి, పుట-19
8. తంగిరాల వెంకట సుబ్బారావు, జానపద సాహిత్యము- వీరగాథలు, పుట-13
9. డా॥ నాయనికృష్ణకుమారి, జానపదగేయాలు, పుట-13
10. డా॥ బిరుదురాజు రామరాజు, తెలుగు జానపద గేయసాహిత్యము, పుట-15
11. డా॥ బిరుదురాజు రామరాజు, తెలుగు జానపదగేయసాహిత్యము పుట-442
12. డా॥ బిరుదురాజు రామరాజు, తెలంగాణా పల్లెపాటలు, పుట-2
13. చింతపల్లి వసుంధరా రెడ్డి, తెలుగు జానపదసాహిత్యము- స్త్రీల గేయములలో సంప్రదాయము, పుట-200
14. డా॥ బిరుదురాజు రామరాజు, తెలుగు జానపద గేయసాహిత్యము, పుట-443
15. పాడినవారు - అంతమ్మ, గాగిళ్ళాపురం, వరంగల్ జిల్లా.
16. డా॥ చింతపల్లి వసుంధరారెడ్డి, తెలుగు జానపద సాహిత్యము, స్త్రీల గేయములలో సంప్రదాయం, పుట-33

# 2. బతుకమ్మ పండుగ స్వరూప స్వభావాలు

ప్రకృతి మాత ఒడిలో పుట్టి పెరిగే జానపదుల ఆచారాలు, సంప్రదాయాలు ప్రతిబింబించే పండుగ బతుకమ్మ పండుగ. ఇది వారి స్వచ్ఛమైన మానసిక వికాసాన్ని, హృదయ భావుకతను తెలియజేస్తుంది ప్రకృతిలోని అందమైన దృశ్యాలకు పులకించి జానపదులు పాడుకొనే పాటలు ఎన్నో ఉన్నాయి. ఈ పాటలు వారి నిత్యకృత్యాలు, జీవితంలోని కష్టసుఖాలను తెలిపేవిగా ఉంటాయి.

ఋతు పరివర్తనం వల్ల ప్రకృతిలోని వివిధ పరిణామాలకు అనుగుణంగా మానవ జీవితంలో మార్పులు సంభవిస్తాయి. పాడిపంటలు, జీనవదులు, ఆటవీ సంపద జానపదుల జీవితంలోని సుఖాలకు ప్రతీకలు కాగా, కరువు కాటకాలు, తుఫాను, భూకంపాలు, అతివృష్టి మొదలైనవి వారి కష్టాలకు ప్రతీకలు. అందుకే మానవుడు సుఖాలు పొందడానికి, కష్టాలు ఎదుర్కోవడానికి ప్రకృతిని ఆరాధించడం నేర్చుకున్నాడు. ఈ ప్రకృతిని స్త్రీ పరంగా పూజించే విధానమే బతుకమ్మ పండుగగా రూపుదిద్దుకున్నది.

ఇంకా జానపదులు తమ కోర్కెలు తీర్చుకోవడానికి ఇష్టదేవతల పూజలు, కులదేవతల పూజలు చేస్తారు. సాధారణంగా పండుగలన్నీ ఏదో ఒక పౌరాణిక గాథ నుండిగాని, మతగ్రంథాలనుండిగాని పుట్టుకొచ్చినవే. కాని, బతుకమ్మ పండుగ ఏ పౌరాణిక గాథ నుండి ఆవిర్భవించక పోయినప్పటికి, ఈ పండుగకు సంబంధించిన పాటలన్నీ శివపార్వతుల సంబంధాలే. ప్రకృతిలో దొరికే రకరకాల పువ్వులతో బతుకమ్మ ఆరాధించ బడుతుంది. అందుకే ఇది ప్రకృతి పూజ అని చెప్పవచ్చు. పండుగలన్నీ దాదాపు స్త్రీ పురుషులు కలసి

టరుపుకునేవే అయినా బతుకమ్మ పండుగ మాత్రం స్త్రీల పండుగ. బతుకమ్మను పండుగ అని వ్యవహరించి నప్పటికి, ఇది ఒక నోము వంటిదే. నోములు, వ్రతాలు పండుగలుగా జరుపుకుంటారు గనుక బతుకమ్మ నోమును కూడ పండుగగానే వ్యవహరిస్తారు.

కర్మభూమియైన మన భారతదేశంలో, భక్తి, కర్మ, జ్ఞాన మార్గాలు మోక్షసాధనాలుగా పేర్కొనబడినాయి. దీనిలో కర్మ మార్గానికి అధిక ప్రాధాన్య మున్నది. యజ్ఞయాగాదులు, నోములు, వ్రతాలు మొదలైనవి కర్మమార్గానికి సంబంధించినవి. కర్మకాండల ఆచరణలో స్త్రీలే ఎక్కువ ఆసక్తి చూపుతారు. వారికి అనుకూలంగా ఈ వ్రతాలు ఏర్పడినాయి. వీరశైవ మత ప్రాబల్యంనల్ల గౌరీవ్రతాలే ఎక్కువగా కనిపిస్తాయి. స్త్రీలు తమ ముత్తైదువతనాన్ని, సౌభాగ్యాన్ని ఆశించి నోములు, వ్రతాలు ఆచరిస్తారు. ఇవి జాతి సంస్కృతిని, నాగరికతను, ఆచార వ్యవహారాలను తెలియజేస్తాయి.

ఈ వ్రతాలు నోములను సూక్ష్మంగా పరిశీలిస్తే స్వల్పమైన తేడా లున్నాయి. మంత్రాలతో, నియమ నిష్టలతో కూడింది వ్రతం. ఉదా : సత్య నారాయణ వ్రతం, గౌరీదేవి వ్రతం మొదలైనవి. కాని, నోము దేశీయమైంది. దీనికి మంత్రాలు, పురోహితుడు అవసరం లేదు. ఉదా: బతుకమ్మ, బొడ్డెమ్మ, శ్రావణ మంగళవారం నోము, మూగనోము, నాగుల చవితి నోము, కందగౌరీ నోము, చిక్కుల్ల గౌరీ నోము, లక్షవత్తుల నోము మొదలైనవి. ఈ నోములను పండుగలుగా జరుపుకొంటారు. అందుకే బతుకమ్మ, బొడ్డెమ్మ వంటి నోములు పండగలైనాయి. నోములలో వాయినాలివ్వడం ప్రధానమైన విషయం. నోము నోచిన స్త్రీలు ఇతర ముత్తైదువలకు కొత్త బట్టలు, పసుపు, కుంకుమ, పండ్లు దానంగా ఇస్తారు. వాయనం ఇచ్చేవారు యిచ్చి, పుచ్చుకొనేవారు పుచ్చుకొన్న తరువాతనే ఆ నోము సమాప్తమవుతుంది. బతుకమ్మ పండుగలో గౌరమ్మను ఓలలాడించిన తరువాత పెసరపప్పు, నువ్వులు, పంచదార, బెల్లం మొదలైన ప్రసాదాలు స్వీకరిస్తారు. ప్రసాదం తాము తెచ్చింది తామే తినకుండా ఇతరులకు కూడా పంచి, ఇతరుల ప్రసాదాన్ని తాము స్వీకరిస్తారు. ప్రసాదం ఇచ్చేవారు "ఇస్తినమ్మ వాయనం" అంటే పుచ్చుకునేవాళ్ళు "పుచ్చుకొంటినమ్మ వాయనం" అంటారు. ఇలా తొమ్మిది రోజులు చేస్తారు.

బతుకమ్మ పండుగ తెలంగాణా ప్రాంతానికి పరిమితమైన పండుగ. పందొమ్మిదవ శతాబ్దం పూర్వార్ధంలోను, ఇరవైయవ శతాబ్దం ఉత్తరార్ధంలోను గొప్ప కరువు కాటకాలు, గత్తర (కలరా), అమ్మవారు (మశూచి) వంటి భయంకరమైన వ్యాధులు ప్రబలినాయి. గ్రామాలలో పిల్లలు, పెద్దలెందరో ఈ వ్యాధులకు లోనై తమ ప్రాణాలు కోల్పోయారు. ఇటువంటి కరువు, అంటురోగాలు, తుఫాను, భూకంపం మొదలైన ప్రకృతి బీభత్సాలను ఎదుర్కోవడానికి, గ్రామ ప్రజలకు దేవతలను కొలిచే అవసర మేర్పడింది. ఈ నేపథ్యంలోనే తమ బతుకులు చల్లగా సాగాలనీ, తమ బిడ్డలు వ్యాధులకు గురై మరణించకుండా, చల్లగా ఉండాలనే కోరికల నుండి, ప్రకృతి ఆరాధకులైన జానపదులు, బతుకమ్మ (బతుకు + అమ్మ) అనే ఒక దేవతను సృష్టించుకున్నారు. ఈ బతుకమ్మను ప్రాణప్రదాతగా భావిస్తు రకరకాల పూలతో బతుకమ్మను పేర్చి "ఒక్కొక్క పువ్వేసి నందమామ"అంటూ బతుకమ్మపై పూలు వేస్తూ పూజిస్తారు.

అలాగే పల్లెవాసులను పోషించే అమ్మగా పోషమ్మ దేవత అవతరించింది. అమ్మతల్లి, ఆటలమ్మ, తట్టు మొదలైన వ్యాధులు గ్రామాలలో వ్యాపించినపుడు ఈ అమ్మవారు ఆగ్రహించినదని జానపదుల నమ్మకం. అందుకే ఈ అమ్మవారికి పూజలు చేయడం, బలులను సమర్పించడం చేస్తారు. ఈ గ్రామ దేవతలను, పూజించే విధానంలో శైవమత ప్రాబల్యం ఎక్కువగా కనిపిస్తుంది. ఇంకా శివ సంతానంలో ఒకరై అయిన మైసమ్మ మహిష దేవత. తెలంగాణంలో పశువుల దేవతగా జానపదులచే ఆరాధించబడుతుంది. కట్టమీద స్థాపితమైంది కట్టమైసమ్మ అని, ఊరు మీదున్నది ఊరమైసమ్మ అని, కోట మీద స్థాపితమైంది కోట మైసమ్మ అని, వ్యవహరిస్తారు. ఈ మైసమ్మకు దున్నపోతులతు బలి ఇచ్చే ఆచారం ఉంది. ఇంకా శివపార్వతుల కుమార్తె ఐన ఎల్లమ్మ, దేవతలకే దేవత, ఈమె పల్లెలను, ప్రజలను రక్షిస్తుంది. సత్సంతానం ఇస్తుంది. చర్మవ్యాధులు, జ్వరాలు వచ్చినపుడు ఎల్లమ్మకు బోనం పెట్టి మ్రొక్కులు తీర్చుకుంటారు. పోలేరమ్మ కూడా శివుని కూతురే. ఈమెను గ్రామ దేవతగా పూజిస్తారు. గ్రామ దేవతల్లో కొందరు శివపార్వతుల కూతుళ్లుకాగా మరికొందరు మహా పతివ్రతలుగా వుండి వారి పాతివ్రత్య మహిమవల్ల మరణానంతరం, ఎన్నో మహత్తులను చూపిస్తారు. వీరి మరణాలకు కారణమైన వారిని నాశనం చేస్తారు. అత్తమామల, ఆడుబిడ్డల ఈర్ష్యాసూయలకు బలై మరణించినవారు కొందరు, భర్తలతో

సహగమనం చేసినవారు మరికొందరు, పురుషుల దౌర్జన్యానికి కామానికి బలై మరణించినవారు కొందరు ఈ విధంగా జానపదులచే పూజలందుకొంటారు. వీరు మరణించిన తరువాత వారి భౌతిక శక్తి నశించినా, వారి ఆత్మశక్తి మాత్రం వృక్షాలలో, పుష్పాలలో, ప్రకృతిలోని పంచభూతాలలో ఐక్యమైనట్టుగా జానపదులు భావించి వారిని అనేక రూపాలతో ఆరాధిస్తారు.

బతుకమ్మ పండుగ స్వరూప స్వభావాలు వివరించే ముందు, బొడ్డెమ్మ పండుగ స్వరూపం వివరించాల్సి వుంటుంది. ఎందుకంటే, ఈ రెండు తెలంగాణాకే పరిమితమైనవి. ఒకదాని వెంట ఒకటి జరుపుకొనే పండుగలు. రెండూ గౌరీ దేవికి సంబంధించినవే. ఈ రెండు పండుగల్లోను ఒకే రకమైన పాటలు పాడతారు. బతుకమ్మ ప్రధానంగా పెద్దల పండుగయితే - "బొడ్డెమ్మ" పిల్లల పండుగ.

వినాయక చవితి లేదా భాద్రపద బహుళ పంచమి మొదలుకొని మహాలయమావాస్య వరకు ఈ బొడ్డెమ్మ పండుగ జరుపుకుంటారు. మహాలయామావాస్యతో ప్రారంభమై ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి నుండి మహర్నవమివరకు తొమ్మిది రోజులు బతుకమ్మ పండుగ నిర్వహిస్తారు.



అందంగా రకరకాల పూవులతో పేర్చిన బతుకమ్మలు

తెలంగాణాలో సామాన్యంగా భాద్రపద బహుళ పంచమి వరకు మెట్ట పంటలన్నీ పండి ఇండ్లకు చేరుతాయి. ధాన్యలక్ష్మి ఇంట్లో కళకళలాడుతుంది. గ్రామాలలో పిల్లలు, స్త్రీలు, పురుషులు ఎంతో ఉత్సాహంగా ఉంటారు. స్త్రీలు ముందు రాబోయే పండుగలకు ఇల్లు వాకిలి శుభ్రంచేసి, సున్నం, జాజులతో అలికి ముగ్గులు పెట్టడంలో నమగ్నమై ఉంటారు. అందుకే పెద్దలకు బొడ్డెమ్మను అడే తీరిక ఉండదు. ఉత్సాహం ఆపుకోని పిల్లలు బొడ్డెమ్మను చేసి, వాటిపై పూలు పెట్టి చప్పట్లు కొడుతూ ఆడుకుంటారు. అందుకే ముందు బొడ్డెమ్మ, ఆ తరువాత బతుకమ్మ పండుగలను జరుపుకుంటారు జానపదులు.

## బొడ్డెమ్మ పండుగ

"ఈ బొడ్డెమ్మ అనే పేరుకు బొట్టె, బొడిప, బొటిమ, పొట్టి అనే పర్యాయ పదాలు వున్నవి. ఈ పదాలన్నింటికి "చిన్న" అనే అర్థం. 'బొడ్డెమ్మ' అంటే చిన్నది అని అర్థం."1 ఇంకా బొడ్డెమ్మ అంటే ధాన్యరాశి, ధాన్యపు కుప్ప అని కూడా భావిస్తారు. 'బొడ్డ' అనే పదానికి అత్తిచెట్టు అనే అర్థం ఉంది. దీన్నే మేడిచెట్టు అన్నీ, ఉదుంబర చెట్టు అని పిలుస్తారు. సంతానానికి, వివాహానికి ఉదుంబరాన్ని పూజిస్తారు. అందుకే ఉదుంబరపూజ, మేడిపూజ బొడ్డపూజగా ప్రచారంలోకి వచ్చింది.

బొడ్డెమ్మను చెక్కపీటపై, పుట్టమన్నుతో చతురస్రాకారంగా ఐదు దొంతరలు చేసి, వాటిని ఒకదానిపై ఒకటి త్రిభుజాకారంగా పేరుస్తారు. బొడ్డెమ్మను ఉద్రాక్ష, కాకర, కట్ల, బీర, మల్లె, జాజి పూలతో అలంకరిస్తారు. ఆ తరువాత శిఖర ప్రదేశాన బియ్యంతో నిండిన చిన్న కలశం, దానిపైన క్రొత్తరవికె బట్ట పెడుతారు. దానిపై తమలపాకు, పసుపు గౌరమ్మను ఉంచుతారు. చెక్కతో గూడ ఈ బొడ్డెమ్మను చేసి, దానిపై నాలుగు వైపుల నాలుగు మట్టి ముద్దలు పెట్టి పూలతో అలంకరిస్తారు. సాయంకాలం ఇంటి ముందు అలికి ముగ్గులు పెట్టి అక్కడ బొడ్డెమ్మను నిలుపుతారు. ఇరుగు పొరుగు బాలికలు, కన్నెపిల్లలంతా వచ్చి, చప్పట్లు కొడుతూ, చుట్టూ తిరుగుతూ పాటలుపాడుతారు.

| | | | |
|---|---|---|---|
| మాలుమర్తి మేడమీద | చందమామ | వెండియ్యా వేనగరలు | చందమామ |
| వెండియ్యా వేనగరలకు | ,, | ఇత్తడియ్యా చీరలు | ,, |
| ఇత్తడియ్యా చీరలకు | ,, | రాగియ్యా కడుపల్లు | ,, |
| రాగియ్యా కడుపలకు | ,, | ముత్యాల ముగ్గులు | ,, |
| ముత్యాల ముగ్గులకు | ,, | వజ్రాల వాకిండ్లు | ,, |
| వజ్రాలవాకిండ్లకు | ,, | పవడాల వందిళ్ళు | ,, |
| పవడాల వండిళ్ళకు | ,, | మంచినీళ్ళ బావి పుట్టే | ,, |
| మంచినీళ్ళ బావిప్రక్క | ,, | మంచిమల్లె తీగబుట్టే | ,, |
| కోసేవారెవరులేక | ,, | కొండెత్తు పెరిగిపోయె | ,, |
| కోయించు చందప్ప | ,, | పంచిపెట్టు గౌరమ్మ | ,, |

"ఈ పాట వ్యంగ్య ప్రధానమైనది. 'వేనగరలు' వెనుగట్టు శబ్దమునకు గ్రామ్య రూపం. ఈ పాటలు పాడెడువారు కన్యకలు. ఇందులోని మంచిమల్లె తీగ యవివాహిత కన్య. కోసేవారెవరు లేక యాతీగ కొండెత్తు పెరిగిపోయినదని వ్యంగ్య చిత్రణము. చక్కని భావన మిది. ఆ కన్యకు వివాహము చేయించుటకు పూనుకొనవలసినవారు చందప్ప మరియు గౌరమ్మ అట."[8]

ఇంకా ఈ క్రింది పాటను బొడ్డెమ్మ పండుగ సందర్భంలో పాడుతారు:

| | | | |
|---|---|---|---|
| బొడ్డెమ్మ బొడ్డెమ్మా | వలలో | బిడ్డా లెందారే | వలలో |
| నీబిడ్డ నిలగౌరు | ,, | నిత్యమల్లె చెట్టేసె | ,, |
| నిత్యమల్లె చెట్టుకు | ,, | నిత్యే నీళ్ళు పోసి | ,, |
| కాయల్లు పిందెల్లు | ,, | ఘనమైనా కాతా | ,, |
| కాయలన్ని దెంపి | ,, | కడవల్లా పోసి | ,, |
| పిందెలన్ని దెంపీ | ,, | బిందెల్ల నింపి | ,, |
| పండ్లన్నీ దెంపీ | ,, | బండ్లల్లా పోసి | ,, |
| పోయెనే ఆ బండి | ,, | శ్రీశైలం దాకా | ,, |
| శ్రీశైల మల్లేశా | ,, | పండ్లోయి పండ్లు | ,, |
| ఏం పండ్లోగాని | ,, | ఎంతా ఘుమఘుమ | ,, |
| చూసెటోరెగానీ | ,, | కొనెటోలేలేరు | ,, |
| అన్నించి ఆ బండీ | ,, | తిరుపాతీదాకా | ,, |

| | | | |
|---|---|---|---|
| తిరుపతి వెంకన్నా | ,, | పండ్లోయీ పండ్లు | ,, |
| ఏం పండ్లోగాని | ,, | ఎంతా ఘమ ఘమ | ,, |
| చూసెటోరేగాని | ,, | కొనెటోరే లేరు | ,, |
| అన్నించి ఆ బండి | ,, | భద్రాచలం దాకా | ,, |
| భద్రాచలం రామన్న | ,, | పండ్లోయి పండ్లు | ,, |
| ఏం పండ్లోగాని | ,, | ఎంతా ఘమఘమ | ,, |
| చూసెటోరేగాని | ,, | కొనెటోరే లేరు | ,, |
| అన్నించీ ఆ బండీ | ,, | కాశీ దాకాను | ,, |
| కాశీ విశ్వేశా | ,, | పండ్లోయి పండ్లు | ,, |
| ఏం పండ్లోగాని | ,, | ఎంతా ఘమఘమ | ,, |
| చూసెటోరేగాని | ,, | కొనెటోరే లేరు | ,, |
| అన్నించీ ఆ బండీ | ,, | వేముడాలాదాకా | ,, |
| వేముడాల రాజన్న | ,, | పండ్లోయి పండ్లు | ,, |
| ఏం పండ్లోగానీ | ,, | ఎంతా ఘమఘమ | ,, |
| చూసెటోరేగాని | ,, | కొనెటోరే లేరు | ,, |
| అన్నించి ఆ బండీ | ,, | అన్నసాగరం దాకా | ,, |
| అన్నసాగరంలోని | ,, | ఆ కాశీమాతా | ,, |
| చూసేనె పండ్లన్నీ | ,, | దింపేను బండ్లన్నీ | ,,[3] |

బొడ్డెమ్మ బిడ్డ నీలగౌరు, చెట్టు పెట్టి రోజు నీళ్ళుపోసి పెంచింది. ఆ చెట్టు పెరిగి, కాయలు పిందెలు ఘనంగా కాసింది. ఆ పండ్లన్నీ బండ్లల్లో నింపి శ్రీశైల మల్లన్నకు, తిరుపతి వేంకన్నకు, వేములవాడ రాజన్నకు, భద్రాచలం రామన్నకు, కాశీ విశ్వేశ్వరునికి పంపించగా ఎవ్వరూ కొనలేదు. కాని, చివరికి అన్నాసాగరం కాశీమాత మాత్రం ఆ పండ్లన్నీ స్వీకరించింది. నీలగౌరు పంపిన పండ్లు, గౌరి మరో రూపమైన కాశీకే చేరాయి. ఎవరు స్వీకరించాలో వారే స్వీకరించారు. సాయంత్రం నుండి చీకటి పడేదాకా పిల్లలు పాటలు పాడి, ఆటలు ఆడి, బొడ్డెమ్మను అనేక రకాలుగా పూజించి, పప్పు బెల్లంతో నైవేద్యం పెట్టి, ప్రసాదాన్ని పంచి తాము స్వీకరిస్తారు. తరువాత ఆ బొడ్డెమ్మను పూజా గృహంలో ఉంచుతారు. తొమ్మిదో రోజు బొడ్డెమ్మను నీటిలో నిమజ్జనం చేస్తారు.

బొడ్డెమ్మను ఆడేవాళ్ళకు ఆడాలనిపించినా, చూసేవాళ్ళకు చూడాలనిపించినా, బొడ్డెమ్మకు మాత్రం అలసట వచ్చి నిద్ర వస్తుంది. ఆ భావాన్ని వెలార్చే ఒక పాట:

నిద్రపో బొడ్డెమ్మ - నిద్ర పోవమ్మా
నిద్రాకు నూరేండ్లు - నీకు వెయ్యేండ్లు
పాలిచ్చె తల్లికి - బ్రహ్మ వెయ్యేండ్లు
నిను గన్న తల్లికి - నిండు నూరేండ్లు - జో - జో

రుద్రాక్ష పూవుల్లు పూసేటి వేళా - రుద్రుడు మా దొడ్లో జొచ్చేటి వేళా
బీరాయి పూవుల్లు పూసేటి వేళా - భీముడు మా దొడ్లో జొచ్చేటి వేళా
కట్లాయి పూవుల్లు పూసేటి వేళా - కాముడు మా దొడ్లో జొచ్చేటి వేళా
గుమ్మడి పూవుల్లు పూసేటి వేళా - బుద్ధుడూ మా దొడ్లో జొచ్చేటి వేళా -
జో. జో_4

ఈ విధంగా తొమ్మిదవ రోజు సాయంత్రం బొడ్డెమ్మను నిద్రబుచ్చి, నీటిలో నిమజ్జనం చేస్తారు. ఈ చివరి రోజు అంతకు ముందు బొడ్డెమ్మపై ఉంచిన కలశంలోని బియ్యంతో పరమాన్నం వండి అందరూ అరగిస్తారు. చిన్న పిల్లలు బాల్యం నుండే పెద్దల ననుకరిస్తూ, వంట చేయడం, కలసి తినడం నేర్చుకుంటారు. కలశంపై ఉంచిన రవిక బట్టను పెండ్లీడుకు వచ్చిన కన్యలు కుట్టించుకుంటారు.

ఇంకా కరీంనగర్ జిల్లాలోని మెట్‌పల్లి ప్రాంతంవారు ఈ బొడ్డెమ్మను నాలుగు రకాలుగా చేస్తారు.

1. పీట బొడ్డెమ్మ, 2. గుంట బొడ్డెమ్మ, 3. పందిరి బొడ్డెమ్మ, 4. బాయి బొడ్డెమ్మ.

'పీట బొడ్డెమ్మ'ను ఒక చెక్క పీటపైన పుట్టమన్నుతో ఐదు దొంతరలు గుండ్రంగా ఒకదానిపై ఒకటి వేస్తారు. దొంతరలు అడుగున ఉన్నది పెద్దగా, పై మిగిలినవి చిన్నగా వరుస క్రమంలో ఉంటాయి. దీని చుట్టు మళ్ళీ ఐదు

ప్రక్కల ఐదేసి చొప్పున చిన్న మట్టి ముద్దలు ఉంచుతారు. ఒక చిన్న గిన్నెలో బియ్యం పోసి, పసుపు, కుంకుమలుంచి, పసుపు గౌరమ్మను అందులో పెట్టి, ఆ గిన్నెను బొడ్డెమ్మ శిఖర భాగాన పెడతారు. ఈ విధంగా చేసిన బొడ్డెమ్మను, చివరి రోజు, పీటపై నుండి మెల్లగా తొలగిస్తూ, నీటిలో నిమజ్జనంచేస్తారు.

అదే విధంగా గుంట బొడ్డెమ్మను ఈ విధంగా తయారు చేస్తారు.'మనిషి' అడుగుపడని చోట ఒక గుంటను త్రవ్వుతారు. దానిచుట్టూ మళ్ళీ ఐదు చిన్న గుంటలు చేస్తారు. ఈ గుంటలన్నీ పూలతో అలంకరిస్తారు. ప్రతిరోజు మధ్య గుంటలోని పూలు అలాగే ఉంచి, చిన్న గుంటలలోని పూలు తీసి క్రొత్తవి వేస్తుంటారు. చివరిరోజు గుంటల్లోని పూలన్నీ తీసి ఒక పాత్రలో పెట్టి నీటిలో వేస్తారు. దీనినే 'అంపుట' అంటారు. పుట్టమన్నుతో చేసిన బొడ్డెమ్మను, ఇంటిముందు చిన్న పందిరేసి సీతాఫలం ఆకులతో కప్పుతారు. ఆ పందిరి క్రింద అలికి ముగ్గులు వేస్తారు. పందిరి మధ్య నుండి ఒక సీతాఫలం, ఒక మొక్కజొన్న కంకిని దారంతో కట్టి క్రిందికి వ్రేలాడదీస్తారు. వాటి క్రింద ముగ్గుల మధ్య బొడ్డెమ్మను అలంకరించి పెడతారు. మరొక పళ్ళెంలో పూలు వేసి, పసుపు గౌరమ్మ నుంచి బొడ్డెమ్మ ప్రక్కన అమర్చుతారు. ఈ విధంగా చేసి పందిరి బొడ్డెమ్మను పూజించి చివరినాడు నీటిలో నిమజ్జనం చేస్తారు.

ఇంకా 'బాయి బొడ్డెమ్మ'ను ఈ విధంగా తయారుచేస్తారు: మొదట బావి లాగా ఒక చిన్న గొయ్యిని త్రవ్వి మట్టిని తీసి, అదే మట్టితో ముద్దలు చేసి నాలుగు ముద్దల చొప్పున ఆ బావికి నాలుగు వైపుల పెడతారు. ఆ బావి మధ్య ఒక వెంపలి చెట్టు మొక్కను నాటి, దాని చుట్టూ ఉన్న గద్దెలపై పూవులు వేస్తూ చివరి రోజు ఆ పూవులన్నీ నీటిలో నిమజ్జనం చేస్తారు. దసరా తరువాత ద్వాదశి నాడు అదే బావి చుట్టు బతుకమ్మలను పెట్టి ఆడుతారు.

బొడ్డెమ్మ పండుగ సందర్భంగా స్త్రీలు పాడుకునే పాటలు ఎన్నో వున్నాయి. ఈ క్రింద పేర్కొనబడిన పాటలన్నీ బొడ్డెమ్మ పాటలే. జానపదుల సాంసారిక జీవితంలోని కష్టసుఖాలు, కలహాలు వారి పాటలలో ప్రతిబింబిస్తాయి. అందుకే పురాణాలలోని దేవతలను గూడా వారి మనస్తత్వాని కనుకూలంగా చిత్రించుకున్నారు.

పరమశివుని భార్యలు గంగమ్మ, గౌరమ్మలు. ఈ సవతుల మధ్యన సఖ్యత ఉండడం చాలా అరుదు అందుకే జానపదులు వీరితో 'గవ్వలాట' లాడించి కలహాలు కల్పించి కథలు పెంచారు.

| | | | |
|---|---|---|---|
| గంగమ్మ గౌరమ్మా | వలలో | గవ్వాలాడంగా | వలలో |
| గవ్వ చిట్లిపాయె | ,, | కయ్యంబే పెరిగే | ,, |
| పెద్దదానివే గౌరూ | ,, | బుద్ధి నీకూ లేదా | ,, |
| చిన్నదానివే గంగూ | ,, | సిగ్గు నీకూ లేదా | ,, |
| ఎర్రగుంట్లయి నీళ్ళు | ,, | ఏడుగడువలు దెచ్చి | ,, |
| పచ్చగుంట్లయి నీళ్ళు | ,, | పదిగడువలు దెచ్చి | ,, |
| నల్లగుంట్లయి నీళ్ళు | ,, | నాలుగ్గడవలు దెచ్చి | ,, |
| ఈ మన్ను ఆ మన్ను | ,, | కలేరాసిబోసీ | ,, |
| తొక్కేను ఆ మన్ను | ,, | తొడకదులాకుండా | ,, |
| పిసికేను ఆ మన్ను | ,, | పిక్కకదులాకుండా | ,, |
| పెట్టేను ఆ గోడ | ,, | పేడెత్తాకుండా | ,,[5] |

ఈ విధంగా గవ్వ చిట్లిపోవడంతో వారికి కయ్యం పెరిగింది. ఇద్దరూ వాదించుకున్నారు. ఇక వారు కలసి వుండలేక ఇద్దరిమధ్య గోడ పెట్టుకున్నారు. దాంతో వారి గొడవ తీరింది.

ఈ విధంగా ఎప్పుడూ తగవులాడుకునే ఇద్దరు భార్యలతో పరమేశ్వరుడు విసిగిపోయాడు. అటువంటి పరమశివుని చూసి జాలిపడ్డారు జానపదులు. అందుకే ఒకరోజు వారు శివుని తమ ఇంటికి ఆహ్వానించి ఆతిథ్యమిచ్చారు.

| | | | |
|---|---|---|---|
| రెండు గుట్టల్ నడుమా | కోల్ | జడలా శంకరుడా | కోల్ |
| స్నానంజేత్తు రావయ్యా | ,, | జడలా శంకరుడా | ,, |
| దండెంమీద పట్టుధోతి | ,, | ఆరీ ఉన్నాదీ | ,, |
| కట్టుకుందు రావయ్యా | ,, | జడలా శంకరుడా | ,, |
| దుప్పట్ల పూలన్నీ | ,, | దొర్లివున్నాయి | ,, |
| జపంజేత్తు రావయ్యా | ,, | జడలా శంకరుడా | ,, |

| | | | |
|---|---|---|---|
| ఇస్తార్ల పప్పన్నం | ,, | వడ్డించి ఉన్నాదీ | ,, |
| బోంచేత్తు రావయ్యా | ,, | జడలా శంకరుడా | ,, |
| పెట్టెలో భాగాలు | ,, | కత్తిరించి వున్నాయి | ,, |
| వేసుక్కుందు రావయ్యా | ,, | జడలా శంకరుడా | ,, |
| పట్టెమంచం పరుపూ | ,, | పరిచీ ఉన్నాదీ | ,, |
| పడుకుందు రావయ్యా | ,, | జడలా శంకరుడా | ,, |
| నాగుంబాములొత్తంగా | ,, | నడుమెట్లాపొందే | ,, |
| నీరుగట్టెలొత్తంగా | ,, | నిదురెట్లాబట్టే | ,, |
| జెరిపోతులొత్తంగా | ,, | జడలెట్లాపొందే | ,,[6] |

స్నానంచేసి దండెంమీది ధోవతి కట్టుకోవడం, భోజనం చేసి భాగాలు (వక్కలు) వేసుకోవడం, పట్టెమంచంపై పడుకోవడం సామాన్య జానపదుని దైనందిన గృహకృత్యాలు.

ఎంతైనా పరమశివుడు కాబట్టి పట్టుధోతిను ఇచ్చి పప్పన్నం బెట్టి పరుపు మీద పడుకోమన్నారు. పైగా వీరు-

| | | | |
|---|---|---|---|
| "నాగుంబాము లొత్తంగా | కోల్ | నడుమెట్లా పొందే | కోల్ |
| నీరుగట్టె లొత్తంగా | ,, | నిదురెట్లా పడుతోందో"నని | |

బాధపడ్డారు.

బొడ్డెమ్మ పండుగ జరుపుకునే కాలంలో అనుములు, పెసర్లు, మొక్కజొన్నలు మొదలైన పంటలన్నీ పండుతాయి. కనుక ఆ ధాన్యాల ప్రస్తావన మనకి క్రింది పాటలో కనిపిస్తుంది:

| | | |
|---|---|---|
| "అనుములు వండేమిమ్మిరీ | — | బండిగట్టూ రామన్నా |
| బండిక్రిందా పెద్దాదినా | — | బంగారు నోములు నోమంగా |
| తీగా చుట్టూ కిష్టమ్మా | — | తిరుమనిబొట్లూ పెట్టంగా |
| గంగున్నా వాడల్లా | — | గౌరున్నా వాడల్లా |
| శివుడున్నా వాడల్లా | — | చిత్తారీ వాడల్లా |
| అకోలలీకోలలే గౌరమ్మ | — | దేవసారీకోలలే గౌరమ్మ |

పెసర్లు పండే మిమ్మీరీ — బండిగట్టూరామన్నా
బండిక్రిందా పెద్దాదినా — బంగారు నోములు నోమంగా
తీగాచుట్టూ కిష్టమ్మా — తిరుమనిబొట్లు బెట్టంగా
గంగున్నా వాడల్లా — గౌరున్నా వాడల్లా
శివుడున్నా వాడల్లా — చిత్తారీ వాడల్లా
అకోలలీకోలలే గౌరమ్మ — దేవసారీకోలలే గౌరమ్మ.[7]

ఈ విధంగా మొదటి చరణం మాత్రమే మార్చుకుంటూ గోధుమలు, నువ్వులు, శనగలు మొదలైన ధాన్యాల పేర్లు చెపుతుంటారు. వారు చెప్పాల్సిన ధాన్యం పేరు మొదటి చరణంలో పైవిధంగా చెప్పి, మిగతా పాటంతా అదే విధంగా పాడుతుంటారు.

సౌభాగ్యవతి అయిన గౌరమ్మకు "ముత్యాలు పోసి
ఇమ్మడికుచ్చులా సొమ్ములు బెట్టి" — ఈడునా పెండ్లాడవే గౌరమ్మ
అని గౌరీదేవిని ప్రాధేయపడినారు.

"రెండేసి తప్కలా ముత్యాలు పోసి
ఇమ్మడికుచ్చులా సొమ్ములు బెట్టి
ఈడునా పెండ్లాడవే గౌరమ్మ జోడునా పెండ్లాడవే గౌరమ్మా...."

"మూడేసి తప్కలా ముత్యాలు పోసి
ఇమ్మడికుచ్చులా సొమ్ములు పెట్టి
ఈడునా పెండ్లావే గౌరమ్మ జోడునా పెండ్లాడవే గౌరమ్మా...."[8]

ఈ విధంగా పై చరణంలోని సంఖ్యను పెంచుకుంటూ పదివరకు పాడుతారు.

జానపదులు తమ ఇష్టదేవత అయిన గౌరిదేవికి గుడి కట్టించి, ఆ గుడికి వెల్ల వేయించి, శివపార్వతుల వాహనం నందిని అక్కడ నిలిపి, తమ నోము పండించుకుంటారు. ఈ భావాన్ని తెలిపే పాట.

| | | | |
|---|---|---|---|
| చిన్న చిన్న గుళ్ల | ఉయ్యాలో | చిత్తారి గుళ్లు | ఉయ్యాలో |
| చూస్తూ మా తాత | ,, | సున్న మేయించాడు | ,, |
| నవ్వుతూ మా నాన్న | ,, | నంది తెప్పించాడు | ,, |
| నందికి మా అన్న | ,, | గంట తెప్పించాడు | ,, |
| గంటకూ మా వదిన | ,, | గౌరి పూజలు చేసి | ,, |
| గౌరి పూజలు చేసి | ,, | లక్ష నోములు నోమి | ,, |
| లక్ష నోములు నోమి | ,, | లక్ష్మిదేవి మెచ్చె | ,, |
| కోటి నోములు నోమి | ,, | కొమురప్ప మెచ్చె | ,, 9 |

ఒక్కొక్కప్పుడు జానపదుల నోటి నుండి, అప్రయత్నంగా, ఆశువుగా కొన్ని పాటలు వెలువడుతాయి. ఈ పాటలలో ఒక రకమైన లయ, వేగం ఉంది, నదీ ప్రవాహంలాగా సాగిపోతాయి.

ఆశకు పరదేశమూ ఎందుకొచ్చెరకోపము
తంగేడు పూవులు పూసెనో ॥తంగేడు॥
తల్లులభ్రమలు దీరెనో ॥ఆశకు॥
తదీయ పూవులు పూసెనో ॥తదీయ॥
తండ్రుల భ్రమలు తీరెనో ॥ఆశకు॥
బంతీయ పూవులు పూసెనో ॥బంతీయ॥
బావలభ్రమలు తీరెనో
ఆశకు పరదేశము మాటలంటే రోషము
అల్లీయ పూవులు పూసెనో ॥అల్లీయ॥
అక్కల భ్రమలు తీరెనో ॥ఆశకు॥
బీరాయి పూవులు బూసెనో ॥బీరాయి॥
బిడ్డల భ్రమలు దీరెనో ॥ఆశకు॥
కుంకుమ పూవులు బూసెనో ॥కుంకుమ॥
కొడుకుల భ్రమలు దీరెనో ॥కొడుకుల॥
ఆశకు పరదేశమూ వస్తిర నీకోసము10

ఈ విధంగా బొడ్డెమ్మ తెలంగాణాలో ప్రత్యేకంగా జరుపుకునే పండుగ. బొడ్డెమ్మ, బతుకమ్మ పండుగలలో ఉండే ప్రధానోద్దేశ్యం ప్రకృతిని పూజించడమే. ఈ విధంగా బొడ్డెమ్మ, బతుకమ్మలను గౌరీదేవిగా, లక్ష్మిగా, కాళీమాతగా-ఇంకా అనేక రూపాలలో కొలుస్తారు. అందుకే రెండు పండుగలలోను ఒకేరకమైన పాటలే పాడుతారు. కాని బొడ్డెమ్మ పాటలు బతుకమ్మ పాటలంత పెద్దవిగా ఉండవు. ఈ పాటలు చందమామ, వలలో, ఉయ్యాల, కోల్, గౌరమ్మ, ఎన్నియలో మొదలైన మకుటాలతో పాడుతారు.



చెక్క-పీటపై పుట్టమన్నుతో వేసిన బొడ్డెమ్మ

## బతుకమ్మ పుట్టుక తెలిపే కథలు :

పూర్వం ఒక కాపు దంపతులకు ఆరుగురు పిల్లలు పుట్టి పురిటిలోనే మరణించారు. చివరికి ఏడవ కాన్పుకు అమ్మాయి పుట్టింది ఆమెకు బతుకమ్మ అని పేరు పెట్టారు. ఆమె పేరును సార్థకం చేసుకున్నది బతుకమ్మ తరువాత వారికి ఒక అబ్బాయి కూడ కలిగాడు. కొంత కాలానికి బతుకమ్మకు వివాహమై అత్తవారింటికి వెళ్ళిపోయింది. ఆమె సోదరునికి కూడా వివాహమయింది. ఒకమారు బతుకమ్మ తన సోదరుని చూడడానికి పుట్టింటికి వచ్చింది. అపుడు బతుకమ్మ, ఆమె మరదలు ఇద్దరూ కలసి స్నానానికి చెఱువు గట్టుకు వెళ్ళారు. తీరాన బట్టలు వుంచి, చెఱువులోకి దిగి స్నానం చేసి ఒడ్డుకు వచ్చారు. గాలికి వారి బట్టలన్నీ కలసి పోయినాయి. పొరపాటున ఒకరి చీరను మరొకరు ధరించారు. బతుకమ్మ తాను ఆడపడుచునని, తన చీరను ఎలా కట్టుకున్నావని మరదలును కోప్పడుతుంది. అపుడు ఆ మరదలు ఆవేశంతో బతుకమ్మను

గొంతు నులిమి చంపి పాతిపెట్టి ఇంటికి వెళ్ళిపోయింది. మరణించిన బతుకమ్మ అదే రాత్రి భర్తకు కలలో కనిపించి, తనను తీసుకుపొమ్మని వేడుకుంది. మరునాడు భర్త ఆమె వున్న ఊరికి బయలుదేరాడు. బతుకమ్మ స్నానమాడిన చెఱువు గట్టుకు చేరుకున్నాడు. అక్కడ అంతకు ముందు తానెపుడూ చూడని విరబూసిన తంగేడు పూవులను చూసి ఆశ్చర్యపడి తెంపబోగా ఆ చెట్టు "పాపిష్టి మరదలు నన్నిక్కడ చంపి పాతి పెట్టింది" అని జరిగిన వృత్తాంతమంతా వివరించింది. ప్రతి సంవత్సరం తంగేడు పూలతో బతుకమ్మను పేర్చి పైన గౌరమ్మను నిలిపి పూజ చేసి చెఱువు గట్టున ఆడి, నీటిలో విడిచి పెట్టాలని కోరింది. భర్త ఆమె కోర్కెలన్నింటిని ముత్తైదువల ద్వారా తీర్చాడు. తరువాత ఆమె తమ్ముని కుటుంబం నాశనమయింది. ఈ విధంగా బతుకమ్మ ఆడపడుచు ఈర్ష్యాసూయలకు బలై, పేరంటాలుగా మారింది. నాటి నుండి జానపదులు ఈమెను ఒక దేవతగా ఆరాధిస్తారు.

బతుకమ్మ గురించి మరోకథ వ్యాప్తిలో ఉంది. ఇది వరంగల్ సమీపంలోని మొగిలిచెర్ల వాస్తవ్యుడు భట్టు నరసింహ కవి చెప్పాడని డా॥ బిరుదురాజు రామరాజుగారు తమ 'తెలుగు జానపద గేయ సాహిత్యము'లో ఉదాహరించారు. ఈ పాట దాదాపు ప్రతి ఊరిలో పాడుతారు. నేను ఇదే పాటను కరీంనగర్ జిల్లాలోని మెట్‌పల్లిలో సేకరించాను.

| | | | |
|---|---|---|---|
| శ్రీ లక్ష్మి దేవియు | చందమామ | సృష్టి బ్రతుకమ్మయ్యె | చందమామ |
| పుట్టినరీతి జెప్పె | ,, | భట్టు నరసింహకవి | ,, |
| ధర చోళ దేశమున | ,, | ధర్మాంగుడనురాజు | ,, |
| ఆ రాజు భార్యయు | ,, | అతి సత్యవతి యండ్రు | ,, |
| నూరు నోములు నోమి | ,, | నూరు మందినిగాంచె | ,, |
| వారు శూరులయ్యి | ,, | వైరులచే హతమైరి | ,, |
| తల్లిదండ్రులపుడు | ,, | తరగనీ శోకమున | ,, |
| ధన రాజ్యముల బాసి | ,, | దాయాదులను బాసి | ,, |
| వనితతో నా రాజు | ,, | వనమందు నివసించె | ,, |
| కలికి లక్ష్మిని గూర్చి | ,, | ఘన తపం బొనరించె | ,, |
| ప్రత్యక్షమై లక్ష్మి | ,, | పలికి వరమడుగుమని | ,, |

| | | | |
|---|---|---|---|
| వినుతించి వేడుచు | ,, | వెలది తన గర్భమున | ,, |
| పుట్టుమని వేడగా | ,, | పూబోణి మదిమెచ్చి | ,, |
| సత్యవతి గర్భమున | ,, | జన్మించే శ్రీలక్ష్మి | ,, |
| అంతలో మునులునూ | ,, | అక్కడికి వచ్చిరి | ,, |
| కపిల గాలవులునూ | ,, | కశ్యపాంగీరసులు | ,, |
| అత్రి వసిష్ఠులు | ,, | ఆ కన్నియను జూచి | ,, |
| బ్రతుకగనే ఈ తల్లి | ,, | బ్రతుకమ్మ యనిరంత | ,, |
| పిలుతురదివరనుండి | ,, | ప్రియముగ తలిదండ్రి | ,, |
| బ్రతుకమ్మ యనుపేరు | ,, | ప్రజలంత అందురూ | ,, |
| తాను ధన్యుడంచు | ,, | తన బిడ్డతో రాజు | ,, |
| నిజపట్టణముకేగి | ,, | నేల పాలించంగ | ,, |
| శ్రీ మహావిష్ణుండు | ,, | చక్రాంకుడనుపేర | ,, |
| రాజు వేషంబునా | ,, | రాజు ఇంటికి వచ్చి | ,, |
| ఇల్లింటమని వుండి | ,, | అతివ బ్రతుకమ్మను | ,, |
| పెండ్లాండి కొడుకులా | ,, | పెక్కుమందిని గాంచె | ,, |
| ఆరువేలమంది | ,, | అతిసుందరాంగులు | ,, |
| ధర్మాంగుడను రాజు | ,, | తన భార్య సత్యవతి | ,, |
| సిరిలేని సిరులతో | ,, | సంతోష మొందిరి | ,, |
| జగతిపై బ్రతుకమ్మ | ,, | శాశ్వతంబుగ వెలిసె" | ,,11 |

ఈ విధంగా బతుకమ్మ ధర్మాంగుడు, సత్యవతులకు, లక్ష్మీదేవి అంశగా పుట్టింది. ఆమెను చూసిన మునులు ఆమెకు 'బతుకమ్మ' అని పేరు పెట్టారు. తరువాత శ్రీ మహావిష్ణువు చక్రాంకుడను పేరుతో వచ్చి బతుకమ్మను వివాహ మాడినాడు. అప్పుడు వారిద్దరు ''పెక్కుమంది కొడుకులను కని'' చాలా కాలం భువిపైన భోగభాగ్యాలతో జీవించారు. నాటినుండి జానపదులు బతుకమ్మను లక్ష్మీదేవిగా పూజిస్తారు. చాలా ప్రాంతాల్లో ఈ పాట పాడిన తరువాతే మిగతా బతుకమ్మ పాటలు పాడుతారు.

బతుకమ్మ పుట్టుక గురించిన మరో కథలో గౌరీదేవి లోక కంటకుడైన మహిషాసురుని చంపి, ఆ అలసటతో అశ్వయుజ శుద్ధ పాడ్యమినాడు మూర్ఛ పోయింది. ఆమె మూర్ఛ తీర్చడానికి స్త్రీలందరూ భక్తితో పాటలు పాడినారు. ఐదవరోజు ఆమెకు స్పృహ వచ్చింది. మూర్ఛపోయిన మహిషాసుర మర్దని తేరుకునేటందుకు, ఆమె జీవనంకోసం 'బతుకమ్మా' అంటూ అనేక రకాలుగా ఆమెను వేడినారు కనుక నాటినుండి ఆమె బతుకమ్మ అయిందని జానపదుల భావన.

ఈ సంఘటనను "తెలంగాణా గ్రామిక గేయాలు" అనే గ్రంథంలో డా॥ గోపు లింగారెడ్డిగారు పేర్కొన్నారు.

ఈ విధంగా జానపదులు బతుకమ్మను పేరంటాలుగా, శ్రీ మహాలక్ష్మిగా, మహిషాసుర మర్దనిగా, గౌరీదేవిగా భావించి పూజిస్తుంటారు.



స్త్రీలు బతుకమ్మల చుట్టు వలయాకారంగా నిలుచుని చప్పట్లు చరుస్తూ పాటలు పాడుకుంటున్న దృశ్యం

## బతుకమ్మ ఆడే విధానం :

బతుకమ్మ పండుగ వచ్చిందంటే ఇంట్లో అంతా సందడే. వేకువజామునే లేచి పూవులకొరకు స్త్రీలు, పురుషులు బయలుదేరుతారు కొందరు ఒకరోజు ముందునుండే పూవులు సేకరించే ప్రయత్నంలో ఉంటారు. బొడ్డెమ్మను నిమజ్జనం చేసే చివరి రోజే బతుకమ్మ పండుగ జరుపుకునే మొదటిరోజు. ఈ మొదటిరోజు పండుగను 'ఎంగిలి పూవు' అంటారు. ఆరోజు బొడ్డెమ్మకు గాని, బతుకమ్మకుగాని ఉపయోగించే ఉద్రాక్ష వంటి కొన్ని పూవులు ఒకరోజు ముందే త్రెంపి నీళ్ళలో వేసి, లేక నోటితో ఊది వికసింపచేసి మరునాడు వాటినే ఉపయోగిస్తారు. అపుడు అవి ఎంగిలి అవుతాయని అందుకే ఆరోజును ఎంగిలి పూవుగానే వ్యవహరిస్తారని అంటారు. మొదటిరోజు బతుకమ్మ పెద్దగానే ఉంటుంది. మిగతా రోజులలో మామూలుగా పేరుస్తారు. మళ్ళీ చివరిరోజు మాత్రం పోటీలు పడి ఇంకా పెద్దగా పేరుస్తారు. ఈరోజు వాయనంగా వక్కలు, తులసీ ఆకులు, సత్తుపిండి (పంచదార లేక బెల్లం కలిపిన మొక్కజొన్న పిండి) మొదలైనవి ఇచ్చుకుంటారు. ఇక రెండవరోజు పప్పుబెల్లం ప్రసాదంగా తయారు చేసుకుంటారు. మూడవరోజు బెల్లంవేసి ఉడికించిన శనగపప్పు, నాలుగోరోజు నానబియ్యం, అంటే బెల్లం కలిపిన పాలలో నానబెట్టిన బియ్యం, ఐదవరోజు అట్లు పోసి ప్రసాదంగా తయారుచేసుకుంటారు. ఇక ఆరవరోజు బతుకమ్మను పేర్చడంగాని, ఆడడంగాని చేయరు. ఆరోజు బతుకమ్మ అలిగిందని జానపదుల విశ్వాసం. వరుసగా తొమ్మిది రోజులు బొడ్డెమ్మను, ఐదురోజులు బతుకమ్మను ఆడి అలసిపోయిన జానపదులు ఆరోజు విశ్రాంతి కోరుకున్నారేమో ! ఏడవరోజు ప్రసాదంగా పప్పు బెల్లం, ఎనిమిదోరోజు నువ్వులు బెల్లం కలిపిన ముద్దలు ప్రసాదంగా తయారుచేసుకుంటారు. ఇన్ని రకాల ప్రసాదాలు పైన పేర్కొనబడి నట్లు అందరూ క్రమంగా చేయడం అరుదు. చాలావరకు ఎనిమిదిరోజులు ఏదో ఒకటి వారికి అందుబాటులో ఉన్న ప్రసాదం చేసుకొని తీసుకొనిపోతారు. ముఖ్యంగా పెసరపప్పు, బెల్లం తప్పనిసరి. సాధారణంగా ఈ పండుగ కాలంలో పప్పుధాన్యాలు, నువ్వులు, మొక్కజొన్నలు ఎక్కువగా లభిస్తాయి కనుక వాటినే ప్రసాదంగా తయారు చేసుకుంటారు.

ఇక చివరిరోజు అంటే తొమ్మిదోరోజు నాటి బతుకమ్మను సద్దుల బతుకమ్మ అంటారు. పండుగ ఉత్సాహం, వైభవం అంతా ఈరోజే ఎక్కువగా

కనిపిస్తుంది. ఈరోజు పువ్వులు ఎక్కువగా తెచ్చుకుని 'బతుకమ్మ'ను మొదటిరోజు కంటే పెద్దగా పేరుస్తారు. స్త్రీ పురుషులలో ఎవరికి ఎక్కువ ఆసక్తి, ఉత్సాహం, నైపుణ్యం వుంటే వారే ఈ బతుకమ్మను పేరుస్తారు. బతుకమ్మను వెదురు సిబ్బిలోగాని ఇత్తడి పళ్లెంలో గాని పేరుస్తారు. వాటిలో గుమ్మడి ఆకులను పరచి, ఆ సిబ్బి లేక పళ్లెం అంచుకంటె ఎక్కువ వున్న ఆకులు కత్తిరిస్తారు. గుమ్మడి ఆకుల మధ్య గుమ్మడి పూల రెక్కలు విడదీసి పరుస్తారు. మొదటి వరుస గుండ్రంగా తంగేడు పూలతో పేరుస్తారు. తరువాత తెల్లని గునుగు పూలతో ఒక వరుస పేరుస్తారు. మధ్యలో ఏర్పడిన ఖాళీ ప్రదేశంలో తంగేడు ఆకులు, మొగ్గలు నింపుతారు. కొందరు గునుగు పూలకే రంగులు అద్ది వరుస క్రమంలో అందంగా పేరుస్తారు. పోను పోను ఆ వరుసలను గోపురాకారంగా తీర్చుతారు. ఆ తరువాత గన్నేరు, ఉద్రాక్ష, కట్ల, బంతి, చేమంతి, బీర, కాకర మొదలైన రకరకాల పూలతో అనేక వరుసలలో పెద్దగా బతుకమ్మను పేరుస్తారు. ఈ బతుకమ్మను పేర్చడంలో పోటీలు పడి తమ కళా కౌశలాన్నంతటిని ప్రదర్శిస్తారు. ఎత్తుగా పేర్చిన బతుకమ్మ శిఖర భాగాన ఒక పెద్ద అందమైన పుష్పాన్ని (బంతి,గులాబి,తామర) ఉంచుతారు. ఏ ఇంటిలోనైనా ఒకే బతుకమ్మను పేర్చరు. ఒకటి పేరిస్తే అశుభం అని భావిస్తారు జానపదులు. కనుక పెద్ద బతుకమ్మను పేర్చిన తరువాత మరొక పళ్ళెంలో చిన్న బతుకమ్మను కూడా పేరుస్తారు. ఆ చిన్న బతుకమ్మ పై భాగాన పసుపుతో చేసిన గౌరమ్మను ఉంచుతారు.

ఈ బతుకమ్మలను పేర్చినతరువాత, వాటిని పూజాగృహంలోనైనా, లేదా ఇంటిలో ఓ మూలనైనా అలికి ముగ్గులు పెట్టి అగరు వత్తులు వెలిగించి ఒక పీటపైన అమర్చుతారు. సాయంకాలం నాలుగు గంటలు కాగానే అందరూ వారి వారి స్తోమతననుసరించి, క్రొత్తబట్టలు, నగలు పూవులు ధరించి బయలుదేరుతారు. ఒక్కొక్క వీధి వాళ్ళు కొంత వెనుకా ముందు బయలుదేరినా ఒకరి కోసం ఒకరు ఆగుతారు. అందరూ కలసి, ఛలోక్తులు విసురుకుంటూ, కబుర్లు చెప్పుకుంటూ నడుస్తారు. ఒక్కొక్కసారి కొన్ని ప్రాంతాలలో కోలాటాలు ఆడుతూ ముందుకు సాగుతారు. ఈ కోలాటంలో ఇనుము, కర్రలతో చేసిన కోలలను ఉపయోగిస్తారు. బతుకమ్మలను చెఱువు గట్టుకు తీసుకురాక పూర్వమే కొందరు తమ ఇంటిముందు కాసేపు ఆడుకొని బయలుదేరుతారు. అందరు

కలిసి చెఱువు గట్టుకు చేరుకొని ముందుగా ఒక వెంపలికొమ్మను నాటి, పసుపు కుంకుమలు చల్లి, దానిచుట్టూ బతుకమ్మలు దింపుతారు.

జానపదుల ఆరాధనలో చెట్లు అధిక ప్రాముఖ్యతను సంతరించుకున్నాయి. ప్రాచీన మానవుడు చెట్లకు కూడా ఆత్మ ఉన్నదని భావించేవాడు. తరువాత చెట్లే ఆత్మలకు నివాస స్థలాలని విశ్వసించేవాడు. దైవీభావం రూపొందిన తరువాత జానపదులు దేవతలకు చెట్ల క్రిందనే నివాస స్థానం కేటాయించారు.

ఆ విధంగా వెంపలి మొక్కచుట్టూ బతుకమ్మలను దింపుకొంటారు. ఆ తరువాత తమతో తెచ్చుకున్న విడిపూలను బతుకమ్మలపై ఒక్కొక్కటిగా వేస్తూ-

| | | | |
|---|---|---|---|
| "ఒక్కొక్క పూవేసి | చందమామ | ఒక్క జాముఆయె | చందమామ |
| శివుడింక రాడాయె | ,, | శివుని పూజాలాయె | ,, |
| రెండేసి పూలేసి | ,, | రెండు జాములాయె | ,, |
| శివుడింక రాలేదు | ,, | శివుని పూజాలాయె | ,, |
| మూడేసి పూలేసి | ,, | మూడు జాములాయె | ,, |
| శివుడింక రాలేదు | ,, | శివుని పూజాలాయె | ,, |
| నాలుగేసి పూలేసి | ,, | నాలుగు జాములాయె | ,, |
| శివుడింక రాలేదు | ,, | శివుని పూజాలాయె | ,, |
| ఐదేసి పూలేసి | ,, | ఐదు జాములాయె | ,, |
| శివుడింక రాలేదు | ,, | శివుని పూజాలాయె | ,, |
| ఆరేసి పూలేసి | ,, | ఆరు జాములాయె | ,, |
| శివుడింక రాలేదు | ,, | శివుని పూజాలాయె | ,, |
| ఏడేసి పూలేసి | ,, | ఏడు జాములాయె | ,, |
| శివుడింక రాలేదు | ,, | శివుని పూజాలాయె | ,, |
| ఎనిమిదేసి పూలేసి | ,, | ఎనిమిది జాములాయె | ,, |
| శివుడింక రాలేదు | ,, | శివుని పూజాలాయె | ,, |
| తొమ్మిదేసి పూలేసి | ,, | తొమ్మిది జాములాయె | ,, |
| శివుడింక రాలేదు | ,, | శివుని పూజలాయె | ,, |

| | | | |
|---|---|---|---|
| పాదేసి పూలేసి | చందమామ | పాది జామూలాయె | చందమామ |
| శివుడింక రాలేదు | ,, | శివుని పూజాలాయె | ,, |
| క్రింద ఇల్లుగట్టి | ,, | మీద మేడ గట్టి | ,, |
| మేడలో యున్నదే | ,, | మాయదారి శివుడు | ,, |
| రుద్రాక్ష వనములో | ,, | నిద్రాచెయ్యావాయె | ,, |
| బంతీయ వనములో | ,, | బంతూలాడవాయె | ,, |
| మల్లియ వనములో | ,, | మాటలాడవాయె | ,,[12] |

ఈ విధంగా పదిసార్లు బతుకమ్మపై ఒక్కొక్క పూవు వేసుకుంటూ శివుణ్ణి ప్రార్థిస్తారు. బతుకమ్మపై పూవులు వేయడం అయిపోయినాక కొన్ని ప్రాంతాలలో విఘ్నాలకు అధిపతి విఘ్నేశ్వరుని రకరకాల పూవులతో తాము ఇంపుగా పూజిస్తామని, కరుణించుమని వేడుకుంటారు.

| | | | |
|---|---|---|---|
| శ్రీ గణేశ్వర నిన్ను | ఉయ్యాలో | చిత్తమందున దలుతూ | ఉయ్యాలో |
| మల్లె పూలా తోడ | ,, | మాదేవ నినుగొలుతు | ,, |
| పొన్న పూలా తోడ | ,, | పొగడి పూజింతు | ,, |
| సంపెంగ పూలతో | ,, | ఇంపుగా పూజింతు | ,, |

తమ నోముకు లేదా పండుగకు ఎలాంటి ఆటంకాలు కలుగకూడదని వారి ఆకాంక్ష. తరువాత మంగళప్రదాయిని గౌరీదేవిని ఈరకంగా ప్రార్థిస్తారు:

| | | | |
|---|---|---|---|
| శ్రీగౌరి నీ పూజ | ఉయ్యాలో | చిత్తమందున దలుతు | ఉయ్యాలో |
| కాపాడి సుమ్మీలు | ,, | కైలాసరాణి | ,, |
| శాంకరీ పార్వతీ | ,, | శంభూనిరాణి | ,, |
| తల్లి నిన్నెప్పుడూ | ,, | ధ్యానింతుమమ్మ | ,, |
| కలహంసనడకలా | ,, | కలికి రావమ్మ | ,, |
| సింహపీఠంబునా | ,, | చెలియరొ కూర్చుండ | ,, |
| బంగారు బెంబుతో | ,, | గంగ ఉదకము దెచ్చి | ,, |
| కాంత నీ పాదాలు | ,, | కడిగి తూడుతునమ్మ | ,, |

అంబికా నీకిదె ఉయ్యాలో అర్ఘ్యం బిచ్చెదా ఉయ్యాలో
ఆకాశ గంగతో ,, వార్త పంపేదాను ,,
జలజాక్షి పన్నీట ,, జలకమాడుదుమమ్మ ,,
జలతారు చీరను ,, శాంభవీ నీకిస్తు ,,
అద్దాల రవికెను ,, అంబ నీ కిచ్చెదా ,,
రాగిసొమ్ములు దాల్చి ,, రంజిల్లు గౌరమ్మ ,,
అందమైన నీ మెడను ,, చందనం బూసెదా ,,
అక్షంతలు జల్లెదా ,, అంబ నీపాదంబునా ,,
పసుపు కుంకుమబెట్టి ,, పణతి నిను బూజింతు ,,
పూలు పత్రి పెట్టి ,, పూజింతు గౌరమ్మ ,,
మారేడు దళములు ,, మాతరో నీకిస్తు ,,
తుమ్మి పూవులతోటి ,, అమ్మ నిన్ను పూజింతు ,,
గన్నేరు పూవులా ,, కలికిరో నినుగొలుతు ,,
గోరంట పూవులా ,, కోరి నిను పూజింతు ,,
మంకెనా పూవులా ,, మా తల్లి నీకిత్తు ,,
బంతి పూవులతోడ ,, తల్లినీ పూజింతు ,,
సన్నజాజులతోటి ,, సన్నుతాంగిని కొలుతు ,,
తంగెడు పూవులా ,, తల్లిరో నిను గొలుపు ,,
నీలకంఠరాణి ,, నీ కంఠమందునా ,,
ప్రేమ పూలామాల ,, వేసి పూజించేదా ,,
సాంబ్రాణి ధూపంబు ,, శాంభవీ నీకిస్తు ,,
దేవి నీ సన్నిధిని ,, దీపంబు వెలిగిస్తు ,,
సారెపలుకుల పప్పు ,, నారికేళంబులు ,,
నాతిరో నీకిదే ,, నైవేద్యమిచ్చేదా ,,
పణతిరో నీకిదే ,, దక్షణా గైకొనుము ,,
దేవీ ప్రదక్షణము ,, తిరిగి వచ్చెదాము ,,
సాగి నే మొక్కెదను ,, సావిత్రిదేవి ,,
జయజయ గౌరమ్మ ,, జయశుభ గౌరమ్మ ,,
జయజయ శార్వాణి ,, జయము పంకజారాణి ,,13

అంటూ గౌరీదేవిని ఆవాహన చేసి అర్ఘ్యపాద్యాలు సమర్పిస్తారు.

పాటలు బాగా పాడనేర్చిన వారిని మిగతావారు పాడుమని వేడుకుంటారు. వారు పాడుతుంటే వీరు చప్పట్లు చరుస్తూ పాడుతారు. వారొక చరణం పాడగానే వీరు అందుకుంటారు ఆ తరువాత మరొక చరణం పాడుతారు. వీరు అందు కుంటారు ఇలా సాగిపోతుంది పాట ఈ పాటలు పాడేటప్పుడు బతుకమ్మల చుట్టు గుండ్రంగా తిరుగుతూ నృత్యం చేస్తారు. వీరు బతుకమ్మలచుట్టు తిరుగు తున్నపుడు మొదట కుడికాలు కదిలిస్తూ - కుడి నుండి ఎడమకు తిరుగుతారు. దేవాలయాలలో ప్రదక్షిణ చేసేటప్పుడు ఎడమ నుండి కుడికి తిరుగుతారు. కాని వీరు దానికి వ్యతిరేకంగా తిరుగుతూ ఆడుతారు. కొందరు ఈ రకమైన ప్రదక్షిణకు ఒక కారణం చెప్తారు

"పూర్వం తెలంగాణా ప్రాంతంలో నిజాం పరిపాలన వల్ల మహమ్మదీయుల ప్రాబల్యం ఎక్కువగా ఉండేది వారొకసారి బతుకమ్మ ఆడుతున్న స్త్రీలను చూశారు. ఎడమ నుండి కుడికి వారు తిరుగుతూ వుంటే మహమ్మదీయులకు నచ్చక దౌర్జన్యంతో వారిని కుడి నుండి ఎడమకు తిరుగుమని బలవంతం చేశారు. అప్పటి నుండి ఈ సంప్రదాయంలో మార్పు వచ్చిందంటారు."14

కాని విస్సురాయి తిప్పేటప్పుడు కూడా కుడి నుండి ఎడమకు తిప్పుతారు కనుక జానపదులు ఈ పద్ధతినే బతుకమ్మ ఆటలో పాటించారేమో అని కూడా భావించవచ్చు.

ఈ బతుకమ్మ ఆటలో ముఖ్యంగా ముత్తైదువ స్త్రీలే పాల్గొంటారు. ఈ విధంగా ఆ రోజు చీకటి పడేవరకు బతుకమ్మను ఆడుతారు. ఆ తరువాత అందరు కలసి మేళతాళాలతో, డప్పు చప్పుళ్ళతో ఒకేసారి బతుకమ్మలను తీసుకొని చెఱువు వద్దకు వెళ్ళి నీటిలో నిమజ్జనం చేస్తారు. నిమజ్జనం చేసేముందు ఎంతో బాధతో-

| | | | |
|---|---|---|---|
| తంగేడు పూవుల్ల | చందమామ | మల్లెన్న దొస్తావు | చందమామ |
| గునిగీయ పూవుల్ల | ,, | బత్కమ్మ పోతుంది | ,, |
| పోతెపోతివిగాని | ,, | మల్లెన్న దొస్తావు | ,, |
| ఏడాది కొకసారి | ,, | ఆడుకుంటు వస్తా | ,, |
| బీరాయి పూవుల్ల | ,, | బత్కమ్మ పోతుంది | ,, |
| పోతెపోతివిగాని | ,, | మల్లెన్న దొస్తావు | ,, |

అని అంటూ బతుకమ్మను సాగనంపుతారు.

గౌరి హిమవంతుని కూతురే కాదు, జానపదుల గారాబు బిడ్డ. అందుకే ఆమెను అత్తవారింటికి వైభవంగా సాగనంపుతూ పాడిన మరొక పాట.

హిమవంతూ నింట్లో బుట్టి
హిమమంతూ నింట్లో పెరిగి
విదియా నుంచి తదియానాడు
కాంతాలందరు గూడి
గన్నేరు గొమ్మలు దెచ్చి
వత్తూ పత్తూలు చేసి
ఓడి బియ్యాము పోసి
ఆ శివుని కప్పాగించి
మాయమ్మ లక్ష్మిదేవి పోయిరావమ్మా
మాతల్లి పార్వతీదేవి పోయిరావమ్మా

ఎవ్వరేమన్నను ఎదురాడబోకు
పోయి నీ అత్తింట్లో బుద్ధిగలిగుండు
ఇద్దరున్నాచోట ముచ్చటాబెట్టకు
ముగ్గురున్నాచోట నవ్వాడబోకు
అష్టకంకణాలా చేయి
అదిలించినడువా బోకు

వక్కానున్న పరిటాకాంగూ
జారవిడిచీ నడువా బోకు
చిన్నీ గజ్జెల పాదం
గిలకొట్టి నడువాబోకు
ధరణీదేవి అదురూనమ్మ
మాయమ్మ పార్వతీదేవి పోయిరావమ్మా

నేటికె దీపావళి
పండుగ పదునాళ్ళున్నదనంగా
నాటికె తోలుకవస్తు
దిగనైన - కానుకలిస్తు
కాటీక కాయాలిస్తు
కనకంచు చీరాలిస్తు
మగవారి గుణమూలన్నీ
మోటూగుణమూలుగావా
పుట్టినింటికి కీర్తిని తేస్తె
మళ్ళినిన్ను తోలుకవస్తు

మాయమ్మ గౌరీదేవి పోయిరావమ్మ
మా తల్లి పార్వతీదేవి పోయిరావమ్మ

చేతిమీదా ఎన్నా బెడితే
ఎంతాసేపు కరుగూనమ్మ
మేనత్తకొడుకూ యాని
మేనూ మరిచి తిరుగాబోకు
సన్మానముగా తిరుగావలెను
సంధ్యానిద్రా మరువావలెను.

మాయమ్మ లక్ష్మీదేవి పోయిరావమ్మా
మాతల్లి అత్తావాడ మరలీరావమ్మ[16]

ఈ పాటరూపేణా స్త్రీలు అత్తవారింటికి వెళ్లే తమ బిడ్డలకు బుద్ధులు నేర్పుతారు. కొత్తగా పెళ్లయిన స్త్రీ అత్తవారింట్లో నడుచుకునే విధానాన్ని జానపదులు ఈ పాటలో చక్కగా తెలిపారు.

తరువాత బతుకమ్మను నీటిలో ఓలలాడించుతారు. బతుకమ్మ ఏ ఆటంకం లేకుండా ముందుకు సాగాలని, చేత్తో నీటిని బతుకమ్మ వైపు మెల్లగా తోస్తారు.

ఈ సందర్భంగా ఈ పాట పాడుతూ నీటిని కదలిస్తారు:

| అంబా ఎక్కడికే | ఉయ్యాలో | జగదాంబ ఎక్కడికే | ఉయ్యాలో |
|---|---|---|---|
| కలికి చిలుకలకొలికి | ,, | పోయేది ఎక్కడికె | ,, |
| ఘనమైన పయనాలు | ,, | చేసేది ఎక్కడికె | ,, |
| సన్న చెక్కెర తిన్న | ,, | సతి ఎక్కడికె | ,, |
| పండు చెక్కెర తిన్న | ,, | పనతిగ ఎక్కడికె | ,, |
| నేను పోతానయ్య | ,, | శ్రీశైల దేవునీ | ,, |
| శ్రీశైల దేవునీ | ,, | సన్నిధిలోనికి | ,, |
| పెట్టేటి సొమ్ములూ | ,, | మరచిపోతవా | ,, |
| కట్టేటి చీరలూ | ,, | విడిచీ పోతవా | ,, |
| పెట్టేటి గాజులూ | ,, | మరచీ పోతవా | ,, |
| పసుపు కుంకుమ భరణి | ,, | మరచీ పోతవా | ,, |
| శివపూజకూ నేను | ,, | అందనే బోతనూ | ,, |
| దేవతార్చన నేను | ,, | చేసుకుంటాను | ,, |
| పూజకూ పూవులూ | ,, | కోయ నేబోతాను | ,, |
| హేమ ద్వారానికి | ,, | కావలీ యుందును | ,, |
| అడవి పక్షులవోలె | ,, | ఎగసీపోతాము | ,, |
| జోడు పక్షులవోలె | ,, | జోడిగాపోతాము | , |
| ఇద్దరం ఒక్కటై | ,, | ఎగిరిపోతాము | ,, |
| నేను పోతానయ్య | ,, | శ్రీశైల దేవునీ | ,, |
| శ్రీశైల దేవునీ | ,, | సన్నిధిలోనికి | ,, |
| పండ్లు పలహారములు | ,, | కోయ నేబోతాను | ,, |
| అదిగదిగో పూలరథము | ,, | వస్తనే ఉన్నదీ | ,, |
| వస్తనే ఉన్నదీ | ,, | పోతనే ఉన్నదీ | ,,17 |

అని గౌరమ్మ తాను శ్రీశైలదేవుని చేరబోతున్నానని, పూలరథం సిద్ధంగా ఉందనీ, తామిద్దరూ పక్షుల్లాగా ఒక్కటై ఎగిరిపోతామని చెప్పి వారి వీడ్కోలు స్వీకరించింది.

ఈ విధంగా రకరకాల పాటలు పాడి బతుకమ్మలను నిమజ్జనం చేస్తారు. అపుడు బతుకమ్మలపై పిండితో చేసిన ప్రమిదలలో నూనెపోసి జ్యోతులు వెలిగిస్తారు. ఇటీవల క్రొవ్వొత్తులను కూడ వెలిగిస్తున్నారు. నిమజ్జనం చేసేటప్పుడు చాలా జాగ్రత్తగా, బతుకమ్మ ఏమాత్రం చెదరిపోకుండా అడుగున ఉన్న పళ్ళెం నెమ్మదిగా తొలగిస్తారు. సిబ్బిలో పేర్చిన బతుకమ్మలను పూర్తిగా నీటిలోకి వదలుతారు అప్పుడు ఆ చెఱువులో బతుకమ్మ లన్నీ తేలుతూ వుంటాయి. ఆ దృశ్యం ఎంతో మనోహరంగా ఉంటుంది. తరువాత చిన్న బతుకమ్మ పైభాగాన ఉన్న పసుపు గౌరమ్మను తీసి ఒక పళ్ళెంలో వుంచి ఆబతుకమ్మను నిమజ్జనం చేస్తారు. గౌరమ్మగా చేసిన పసుపుముద్దను వాయనంగా స్వీకరిస్తారు. అలా వాయనా లిచ్చుకుంటూ-

ఉసికలో పుట్టే గౌరమ్మ - ఉసికలో పెరిగే గౌరమ్మ
ఉసికలో వసంతమాడేవా - తీగాతిరుపతిమావిండ్లు
పొన్నంగంటీ తాళ్ళు - పోకలగంటి వనమూలు
వనముల చిలుకల కొబ్బరిగట్టి
వనమంతా ఓడేగౌరు మేడంతా ఓడేగౌరు

కుంకుమల పుట్టే గౌరమ్మ - కుంకుమల పెరిగే గౌరమ్మ
కుంకుమల వసంతమాడేనా - తీగాతిరుపతి మావిండ్లు
పొన్నంగంటి తాళ్ళు - పోకలగంటి వనమూలు
వనముల చిలుకల కొబ్బరిగట్టి
వనమంతా ఓడేగౌరు - మేడంతా ఓడేగౌరు

పసుపుల పుట్టే గౌరమ్మ - పసుపుల పెరిగే గౌరమ్మ
పసుపుల వసంత మాడేవా - తీగాతిరుపతి మావిండ్లు
పొన్నంగంటి తాళ్ళు - పోకలగంటి వనమూలు
వనముల చిలుకల కొబ్బరిగట్టి
వనమంతా ఓడేగౌరు మేడంతా ఓడేగౌరు

పువ్వుల పుట్టే గౌరమ్మ - పువ్వుల పెరిగే గౌరమ్మ
పువ్వుల వసంతామాడేవా - తీగాతిరుపతి మావిండ్లు
పొన్నంగంటి తాళ్ళు - పోకలగంటి వనమూలు
వనముల చిలుకల కొబ్బరిగట్టి
వనమంతా ఓడే గౌరు - మేడంతా ఓడే గౌరు

జొన్నల పుట్టే గౌరమ్మ - జొన్నల పెరిగే గౌరమ్మ
జొన్నల వసంతామాడేవా - తీగాతిరుపతి మావిండ్లు
పొన్నంగంటి తాళ్ళు - పోకనగంటి వలమూలు
వనముల చిలుకల కొబ్బరికట్టి
వనమంతా ఓడే గౌరు - మేడంతా ఓడే గౌరు[18]

అంటూ పాటలు పాడుతారు. ఈ చివరి రోజు బతుకమ్మను 'సద్దుల (చద్దుల) బతుకమ్మ' అంటారు. అంటే బతుకమ్మకు ఈ రోజు అన్నం వండి తొమ్మిది రకాల పొడులు (నువ్వులు, దోస, పప్పులు మొదలైనవి) విడివిడిగా అన్నంలో కలిపి నైవేద్యంగా సమర్పిస్తారు. ఇవేకాక పులిహోర, దధ్యోజనం, పిండి వంటలు చేసుకుంటారు.

సాయంకాలం చెఱువు గట్టుకు తెచ్చిన ప్రసాదాలను వాయనంగా ఇచ్చుకుంటారు. ప్రసాదం ఏమాత్రం మిగిలినా ఇంటికి తెచ్చుకోకూడదు. అందరికి అక్కడే పంచాలి. తరువాత వారంతా ఇంటికి తిరిగివస్తారు. దారి వెంబడి రకరకాల పాటలు పాడుకుంటూ వస్తారు. ఈ సందర్భంగా స్త్రీలు రెండు గుంపులుగా ఏర్పడి ఈ క్రింది పాట పాడుకుంటారు:

"చిన్నీ మీరేమిట్లు
చిలుకా మీరేమిట్లు
జాజీ మీరేమిట్లు
దామెర మొగ్గా మీరేమిట్లు
కొలాటి బండ్ల కొలుకులు తీయా
రామారక్కల్లో - దసన్న మొగ్గల్లో"

అని ఒక గుంపులోని స్త్రీలు ప్రశ్నిస్తే, మరో గుంపులోని స్త్రీలు-

"చిన్ని మేం కోమట్లం
చిలుకా మేం కోమట్లం
జాజీ మేం కోమట్లం
దామెర మొగ్గా మేం కోమట్లం
కొలాటిబండ్లా కొలుకలు తీయా
రామా రక్కల్లో దసన్న మొగ్గల్లో"19

అని జవాబిస్తారు. ఇంకా వీరు ఇదేవిధంగా వారు ఏ కులమని ప్రశ్నిస్తే, తాము బ్రాహ్మణులం అనీ, రెడ్లం అనీ రకరకాల కులాలను పేర్కొంటారు. కులాల పట్టింపు జానపదులకుండదు. ఏ కులానికి చెందినవారయినా తాము ఆ కులానికి చెందినవారమని సగర్వంగా చెప్పుకుంటారు. ఎక్కువ తక్కువ లుండవు.

ఇక ఆ రాత్రి ఇంటికి తిరిగివచ్చి 'సద్దులు' ఆరగిస్తారు. ఇంకా కొన్ని ప్రాంతాలలో స్త్రీలు మళ్ళీ గుండ్రంగా నిలబడి వాకిళ్ళలో కాసేపు తృప్తి తీరా ఆడుకొని, నాటితో బతుకమ్మ పండుగను ముగిస్తారు.



బతుకమ్మను విమజ్జనం చేస్తున్న దృశ్యం

## అధోజ్ఞాపికలు :

1. డా॥ చింతపల్లి వసుంధరారెడ్డి, తెలుగు జానపద సాహిత్యము- స్త్రీల గేయములలో సంప్రదాయము. పుట. 444
2. డా॥ బిరుదురాజు రామరాజు, తెలుగు జానపద గేయ సాహిత్యము. పుట. 430
3. పాడినవారు శ్రీమతి అంతమ్మగారు, గాగిళ్ళాపురం, వరంగల్ జిల్లా.
4. ,, శ్రీమతి చంద్రమణి, అకునూరు, వరంగల్ జిల్లా.
5. ,, శ్రీమతి బాలమణి, జయ్యాల, వరంగల్ జిల్లా.
6. ,, శ్రీమతి రాధాకుమారి, మెట్‌పల్లి, కరీంనగర్ జిల్లా.
7. ,, కుమారి కృష్ణవేణి, శనిగరం, కరీంనగర్ జిల్లా.
8. ,, శ్రీమతి చంద్రకళ, ఆకునూరు, వరంగల్ జిల్లా.
9. ,, కుమారి ఉష, కేశవాపురం, వరంగల్ జిల్లా.
10. ,, కుమారి బాలమణి, గాగిళ్ళాపురం, వరంగల్ జిల్లా.
11. ,, శ్రీమతి శోభారాణి, మెట్‌పల్లి, కరీంనగర్ జిల్లా.
12. ,, శ్రీమతి కత్రోజు అంజమ్మ, ఇబ్రాహింపురం, నల్లగొండ జిల్లా.
13. ,, శ్రీమతి శ్యాంబాయి, ఆకునూరు, వరంగల్ జిల్లా.
14. ,, సత్యనారాయణ, గాగిళ్ళాపురం, వరంగల్ జిల్లా.
15. ,, శ్రీమతి ముత్యమ్మ, మేడిపల్లి, కరీంనగర్ జిల్లా.
16. ,, శ్రీమతి కత్రోజు అంజమ్మ, ఇబ్రాహింపురం, నల్లగొండ జిల్లా.
17. ,, శ్రీమతి బాలమణి, గాగిళ్ళాపురం, వరంగల్ జిల్లా.
18. ,, కుమారి స్వరాజ్యం, కేశవాపురం, వరంగల్ జిల్లా.
19. ,, కుమారి శ్రీవిద్య, నంగునూరు, మెదక్ జిల్లా.

# 3. బతుకమ్మ పండుగ పాటలు - వర్గీకరణ

ఇంతకుముందు జానపద సాహిత్యాన్ని పలువురు సాహితీవేత్తలు ఎన్ని రకాలుగా విభజించారో వివరించాను. నేను పరిశోధనా అంశంగా ఎన్నుకున్నది "బతుకమ్మ పండుగ పాటలు." ఈ బతుకమ్మ పండుగ పాటలను జానపద సాహిత్యంలోని గేయశాఖకు సంబంధించిన స్త్రీల పాటలు, నాకు లభించిన పాటల ఆధారంగా క్రింది విధంగా వర్గీకరించాను.

1. రామాయణానికి సంబంధించినవి.
2. మహాభారతానికి సంబంధించినవి.
3. భాగవతానికి సంబంధించినవి.
4. గ్రామదేవతలకు సంబంధించినవి.
5. కుటుంబానికి సంబంధించినవి.
6. స్థానిక సంఘటనలకు సంబంధించినవి.

## రామాయణానికి సంబంధించిన పాటలు

భారతీయ సంస్కృతికి మూలస్తంభాలుగా నిలిచిన గ్రంథాలు రామాయణం, మహాభారతం, భాగవతాదులు. రామాయణ గాథలపట్ల, అందులోని పాత్రల పట్ల జానపదులకు ప్రేమాభిమానాలు అధికం. జానపదుల హృదయాలలో రామలక్ష్మణుల వంటి సోదరులు, సీతవంటి సాధ్వి, హనుమంతుని వంటి భక్తుడు ఆదర్శ వ్యక్తులుగా నిలిచిపోయారు.

అందుకే రామాయణ గాథలను ఆధారం చేసుకొని బతుకమ్మ పండుగ సందర్భంలో స్త్రీలు ఎన్నో పాటలు పాడుకొంటారు. అంతేగాక, ఏ పాట ప్రారంభంలోనైనా-

"రామరాముడాను ఉయ్యాలో శ్రీరామరామ ఉయ్యాలో" అంటూ మొదట రాముణ్ణే స్మరిస్తారు. అంతేగాక-

| | | | |
|---|---|---|---|
| "జగతిపై రామయ్య | ఉయ్యాలో | జన్మించినాడు | ఉయ్యాలో |
| సత్యలోకమును | ,, | స్థాపించినాడు | ,, |
| బాగుగా రాజ్యమును | ,, | పాలించినాడు | ,, |
| సీతమహాదేవి | ,, | సృష్టిలోపలాను | ,, |
| దండములు దండములు | ,, | దశరథరామ | ,, |
| దయజూసిమమ్మేలు | ,, | దాక్షిణ్యరామ | ,, |

ఈ రకంగా సీతారాములను ప్రార్థించి మిగతా పాటలు పాడుకుంటారు.

ఈ క్రింది 'సంపూర్ణ రామాయణం' పాటను బతుకమ్మ పండుగ సందర్భంగా జానపదులు పాడుకుంటారు:

| | | | |
|---|---|---|---|
| "శ్రీకరంబైనట్టి | ఉయ్యాలో | చరితంబు వినిపింతు | ఉయ్యాలో |
| అయోధ్యనేలేటి | ,, | ఆ రాజు మహారాజు | ,, |
| దశరథ మహారాజు | ,, | ధాత్రంబున వెలసె | ,, |
| అతనికి ముగ్గురు | ,, | అతివలుండిరయ్య | ,, |
| కౌసల్య, సుమిత్ర | ,, | కైకేయి ముగ్గురు | ,, |
| భార్యలు ముగ్గురూ | ,, | బహుసుందరాంగులు | ,, |
| ఆరాణులాతోటి | ,, | ఆనందముగయుండి | ,, |
| కాలమూగడుపును | ,, | చాలా సంతోషముగ | ,, |
| సర్వమున్నదిగాని | ,, | సంతానమే లేదు | ,, |
| సంతానమునకై రాజు | ,, | సర్వేశుని వేడె | ,, |
| నలుగురు కొడుకులు | ,, | నయముగ కల్గిరి | ,, |
| భగవత్స్వరూపులై | ,, | భార్యలుండిరయ్య | ,, |
| రామలక్ష్మణులు | ,, | భరత శత్రుఘ్నులు | ,, |
| ఈ రీతిగా పేర్లు | ,, | ఇంపుగా పెట్టిరి | ,, |
| కులగురువూలైన | ,, | వాసిష్ఠమునియును | ,, |
| విలువిద్య నేర్పుచు | ,, | బలశాలులను చేసే | ,, |
| విశ్వామిత్రుడు | ,, | వీరి ధరిచేరెను | ,, |
| రాక్షసుల బాధలను | ,, | మాన్పించు మనుచు | ,, |

రామలక్ష్మణులను ఉయ్యాలో
వెంట తీసుకు వెళ్ళి ,
రాక్షసులనందరినీ ,,
ఆ ముని సంతసించి ,,
చూపించుచూ మౌని ,,
వీరాధివీరులకు ,,
మిథిలాపురమున ,,
జర్గె చోటికె ,,
శివధనుస్సు అపుడు ,,
సీత నిస్తామని ,,
రామలక్ష్మణులు అది ,,
స్వయంవరమునకైతే ,,
శివధనుస్సును వారు ,,
పూలమాలతో సీత ,,
శ్రీరాముల మెడలోన ,,
సీతారాముల పెండ్లి ,,
జరిగినదమ్మ ,,
అయోధ్యపురమునకు ,,
శ్రీరామచంద్రుని ,,
సంకల్పము కలిగి ,,
పట్టాభిషేకము ,,
శుభముహూర్తమున ,,
దేశ దేశాలకు ,,
కైకేయికి మందర ,,
ఈ విషయమంతయు ,,
ఇస్తనన్నవరము ,,
నీ కొడుకు భరతునికి ,,
సీతారాములను ,,

రాజును ఒప్పించి ఉయ్యాలో
రాక్షసుల చూపించె ,,
రాముడు హతమార్చె ,,
వనమంతా చూపించె ,,
దాపున నుండియు ,,
విద్యలను నేర్పించె ,,
సీత స్వయంవరము ,,
జనుదెంచె వేగమున ,,
విరిచినా వారికి ,,
ప్రకటనలు వ్రాసిరి ,,
పాటించి చదివిరి ,,
జనుదెంచిరి వేగమున ,,
చిటికెలో విరిచిరి ,,
పులకించుచు సీత ,,
హారమును వేసెను ,,
వైభోగముగ ,,
జయవిజయమ్ముగ ,,
ఆ రాజు బయిలెల్లి ,,
యువరాజును చేసె ,,
సభలోన తెలుప ,,
కట్టించుమనగా ,,
శుభలేఖలు వ్రాసి ,,
దశరథుడు పంపెను ,,
కనుసైగ చేసెను ,,
చెవిలోన ఊదెను ,,
ఇవ్వుమనివేడుకో ,,
పట్టమును కట్టుమని ,,
పోటిగా వనమునకు ,,

| | | | |
|---|---|---|---|
| పంపించుమని తెలిపి | ఉయ్యాలో | ఒప్పించు రాజును | ఉయ్యాలో |
| అని తెలుపుమనగానే | ,, | దశరథుని చేరె | ,, |
| నాథ నాకిచ్చిన | ,, | వరములున్నవానె | ,, |
| కోరుకొమ్మనియును | ,, | ప్రేమతో పలికెను | ,, |
| నా కొడుకు భరతుని | ,, | యువరాజును చేసి | ,, |
| సీతారాములను | ,, | వనములకు పంపించు | ,, |
| ఈ మాట వింటూనే | ,, | రాజు మూర్ఛిల్లెను | ,, |
| విధివ్రాత ఎవ్వరికి | ,, | తప్పింప తరమౌను | ,, |
| ఈ వార్త పురమందు | ,, | వ్యాపించిపోయెను | ,, |
| నా తండ్రి మాటాను | ,, | నేను నిలుపుదుననుచు | ,, |
| శ్రీరామచంద్రుడు | ,, | సీతాలక్ష్మణులు | ,, |
| వారు పన్నెండేండ్లు | ,, | వనవాసమూ చేయ | ,, |
| నిశ్చయించుకొని | ,, | నయముతో అందరికి | ,, |
| తల్లులందరికి | ,, | వందనములు చేసిరి | ,, |
| తండ్రి దరిచేరిరి | ,, | వనమునకు బయలుదేరిరి | ,, |
| అయోధ్య పురమందు | ,, | అందరూ దుఃఖించిరి | ,, |
| రామలక్ష్మణసీత | ,, | ప్రేమతో ముగ్గురు | ,, |
| అడవి మార్గము వెంట | ,, | జనుదెంచుచుండిరి | ,, |
| గుట్టలుగుహలుదాటి | ,, | చెలిమెలుదాటి | ,, |
| పంచవటి వనమందు | ,, | పర్ణశాలను గట్టి | ,, |
| చాల సంతోషముతో | ,, | కాలము గడుపుచుండిరి | ,, |
| వీరుండుచోటికి | ,, | శూర్పణఖ వచ్చెను | ,, |
| మోహించుమనుచుండ | ,, | ముక్కుచెవులుకోసె | ,, |
| రావణుని దగ్గరికి | ,, | రాక్షసి వెళ్లెను | ,, |
| అన్న ఓ రావణా | ,, | నన్ను ఈ గతిచేసె | ,, |
| విన్నవించుచుండ | ,, | ఎవ్వరాసీ పలుక | ,, |
| శ్రీరామచంద్రుడూ | ,, | సీతమ్మతోయుండ | ,, |
| రాకుమారి సీత | ,, | నీకు తగినా భార్య | ,, |
| సీతనెత్తుకొస్తే | ,, | ఖ్యాతి మనకూదక్కు | ,, |

చాల అందముగ ఉయ్యాలో
విన్నవించుచుండ ,,
మారీచులను చేరె ,,
పర్ణశాల ముందు ,,
బంగారు లేడిని ,,
చూచినంతనె లేడిని ,,
శ్రీరామచంద్రుని ,,
లేడిని ఎట్లయిన ,,
మాయమగుచు లేడి ,,
శ్రీరామబాణము ,,
హా లక్ష్మణాయని ,,
అని పలుకగా ,,
లక్ష్మణుని పంపెను ,,
వెళ్ళె లక్ష్మణుడు ,,
గీతలు గీసియు ,,
అని పలికి లక్ష్మణుడు ,,
అటువెళ్ళె లక్ష్మణుడు ,,
బిక్షంబు పెట్టుమని ,,
బిక్ష పట్టుకొని ,,
వచ్చి నిలువగానె ,,
సీతమ్మ నెత్తుకా ,,
ఆకాశంమీదుగా ,,
అది చూసీ పక్షిరాజు ,,
ఘోరయుద్ధంచేసి ,,
గరుడపక్షి రెక్కలు ,,
లంకకూ చేరెను ,,
స్త్రీతను ఉంచియు ,,
రామలక్ష్మణులు ,,
సీతజాడ లేక ,,

సీతమ్మ ఉన్నదీ ఉయ్యాలో
వెంటనే వెళ్ళెను ,,
మాయలేడిని చేసె ,,
తిరుగుచూ యుండెను ,,
కోరెను సీతమ్మ ,,
తీసుకొని రమ్మనె ,,
తోలెను సీతమ్మ ,,
పట్టుమని తోలెను ,,
మాయలో పడెను ,,
జోరుగ తలిగెను ,,
ప్రాణములు విడిచెను ,,
ఆ సీత వినెను ,,
రాములా దగ్గరికి ,,
ఏడు గీతలు గీసి ,,
దాటవద్దనెను ,,
అడవికి చేరె ,,
ఇటువచ్చె రావణుడు ,,
బిగ్గరగా అరిచె ,,
బయిలెల్లె సీత ,,
పిచ్చిరావణబ్రహ్మ ,,
రథము నెక్కించె ,,
కొనిపోవుచుండగా ,,
అతనితో ఢీకొని ,,
ఘోరారణ్యమున ,,
నరికె రావణుడు ,,
అశోక వనమందు ,,
స్త్రీలను ఉంచియు ,,
పర్ణశాలకు చేరిరి ,,
భీతిల్లుచుండిరి ,,

| | | | |
|---|---|---|---|
| ఆదవంత తీర్చుచు | ఉయ్యాలో | పడరానిశ్రమ పడె | ఉయ్యాలో |
| పక్షిరాజును చూసి | ,, | పలికేను రాముడు | ,, |
| జరిగిన సంగతి చెప్పి | ,, | ప్రాణములు విడిచెను | ,, |
| రామలక్ష్మణులు | ,, | రాత్రింబగళ్ళు | ,, |
| తిరుగుచూవారు | ,, | కిష్కింద జేరిరి | ,, |
| సుగ్రీవుని స్నేహము | ,, | వారికి లభియించె | ,, |
| వాలిని వధియించి | ,, | వానరా సైన్యము | ,, |
| సీతమ్మ జాడలకు | ,, | శీఘ్రంబుగ పంపె | ,, |
| అతిత క్షిపరుడైన | ,, | ఆంజనేయుడు వచ్చి | ,, |
| శ్రీరాముల ఆజ్ఞను | ,, | ఆత్మయందిదుకోని | ,, |
| సముద్రము నుండి | ,, | సాగి లంకకు చేరె | ,, |
| సీతమ్మను జూచి | ,, | చాలా సంతోషించె | ,, |
| ఉంగరము చూపించి | ,, | సంగతంతా చెప్పె | ,, |
| వెళ్ళివచ్చెదనమ్మ | ,, | అల్లాద పడబోకు | ,, |
| హనుమంతుని ఆటలు | ,, | వనమంతా తిరిగెను | ,, |
| అతివేగమున | ,, | హాయిగ రామునికి | ,, |
| సీతమ్మ సంగతి | ,, | చాటి వినిపించె | ,, |
| సైన్యమును సమకూర్చె | ,, | సమరమునకు బోవ | ,, |
| వారధిగట్టిరి | ,, | ఉడుత సహాయముతో | ,, |
| అందరూ లంకను | ,, | అనందముగ జేరిరి | ,, |
| రావణుడి తమ్ముడు | ,, | విభీషణుడును | ,, |
| అన్న సన్నిధిచేరి | ,, | విన్నవించుకొనగా | ,, |
| రామునితోపోరు | ,, | మనకు వలదన్నా | ,, |
| ఎంత చెప్పిన వినక | ,, | విర్రవీగుచునుండె | ,, |
| విభీషణుడు వెళ్ళి | ,, | వివరించి రామునికి | ,, |
| ఘోరయుద్ధము జరిగె | ,, | రామ రావణులకు | ,, |
| ఇంద్రజిత్తును జచ్చె | ,, | కుంభకర్ణుడు జచ్చె | ,, |
| రాక్షసులనందరిని | ,, | రాముడూ హతమార్చె | ,, |
| లంకాపురము | ,, | రక్తమయ మాయెను | ,, |

| | | | |
|---|---|---|---|
| సీతమ్మను దెచ్చి | ఉయ్యాలో | రామునీ కిచ్చిరి | ఉయ్యాలో |
| ఆనందముగ అపుడు | ,, | అయోధ్య చేరిరి | ,, |
| శ్రీరామచంద్రుడు | ,, | శీఘ్రముగ రాజాయె | ,, |
| చాకలిమాటవిని | ,, | సీతనడవికి పంపె | ,, |
| వాల్మీకి ఆశ్రమంలో | ,, | లవకుశులు పుట్టిరి | ,, |
| అశ్వయాగముచేయ | ,, | అశ్వమును విడచిరి | ,, |
| లవకుశులు ఇద్దరు | ,, | అశ్వమును పట్టిరి | ,, |
| లవకుశులు రామునికి | ,, | ఘోరయుద్ధము జరిగె | ,, |
| తండ్రికొడుకులాని | ,, | తేటపడె రామునికి | ,, |
| అందరును పాడిరి | ,, | ఆనందము తోడ | ,, |
| శ్రీవినాయక నిన్ను | ,, | చిత్తమందున నిలిపి | ,, |
| సరస్వతి దేవుని | ,, | స్మరియించుచుందుము | ,, |
| మంగళం మంగళం | ,, | జయతుజయ మంగళం | ,,[1] |

మూలంలో దశరథుడు సంతానంకొరకు పుత్రకామేష్టి యాగం చేసినట్లు ఉండగా యజ్ఞయాగాదుల గురించి ఏమీ తెలియని జానపదులు దశరథుడు పుత్రులకోసం సర్వేశ్వరుని వేడినట్లుగా చిత్రించారు.

తరువాత రామునికి అయోధ్యలో పట్టాభిషేకం జరుగుతున్నపుడు దశరథుడు ఇస్తానన్న వరాలు అడుగుమని మందర కైకేయికి కనుసైగ చేసింది. కనుసైగ చేయడం జానపదుల నవ్యకల్పన.

మాయలేడి పలుకులు విన్న సీతమ్మ తన భర్తకు ఏం ప్రమాదం జరిగిందోనని లక్ష్మణుని పంపిస్తుంది. వెళ్ళేటప్పుడు పర్ణశాల ముందు ఏడు గీతలు గీచి, వాటిని దాటవద్దని చెప్పి వెళతాడు లక్ష్మణుడు. ఇది మూలంలో లేని విషయం. అంకెలలో ఏడు అంకెపైన అభిమానం గల జానపదులు లక్ష్మణుని చేత ఏడు గీతలు గీయించారు.

తరువాత రావణుడు భిక్షకోసం సీతమ్మను పిలిచాడు. అపుడు సీతమ్మ భిక్ష తీసుకొని రాగానే "పిచ్చిరావణ బ్రహ్మ సీతమ్మ నెత్తుకా రథము నెక్కించు"కుని వెళ్ళిపోయాడట.

సీతమ్మ జాడలకోసం లంకకు చేరిన హనుమంతుడు లంకాదహనం చేసినట్లు జానపదులు పేర్కొనలేదు.

రావణునితో యుద్ధానికి బయలుదేరిన రాముడు సముద్రంపై వారధి నిర్మించాడు. వారధి నిర్మాణంతో రామునికి ఒక ఉడుత సహాయపడిందట. ఈ అద్భుతమైన కల్పనవల్లనే "ఉడుతా భక్తి" అనే సామెత వాడుకలోకి వచ్చింది.

రాముడు చాకలివాని మాటలను విని సీతమ్మను అడవిలో దించి రమ్మని చెప్పడం జానపదుల కల్పన. ఆ తరువాత లవకుశులు యాగాశ్వాన్ని పట్టి రామునితో యుద్ధం చేసినట్లు చిత్రించారు. తరువాత "తండ్రి కొడుకులాని తేట పడే శ్రీరామునికి'' అన్న చరణంతో పాట ముగించారు. సీతమ్మ అవతారం చాలించిన వృత్తాంతాన్ని జానపదులు వివరించలేదు. సీతమ్మ అవతార పరిసమాప్తితో పాటను విషాదాంతం చేయడం జానపదులకు ఇష్టంలేదు. ఏ పాటనైనా మంగళాంతానిగా పాడుకోవడం జానపదుల స్వభావం.

ఈ క్రింది పాటలో జానపదులు సీత పుట్టినప్పటి నుండి ఏ విధంగా పెరిగి పెద్దదయిందో వారి మనస్తత్వాల కనుగుణంగా చిత్రించుకున్నారు.

| | | | |
|---|---|---|---|
| జనకు జనకూ నింట్ల | ఉయ్యాలో | సత్యజనకూ నింట్ల | ఉయ్యాలో |
| పుట్టెను ఆ సీత | ,, | పుణ్యజనకూ నింట్ల | ,, |
| పుట్టుతా ఆ సీత | ,, | పురుడానికోరే | ,, |
| పెరుగుతా ఆ సీత | ,, | పెండ్లా అనికోరు | ,, |
| చిన్న చిన్న బొమ్మరిండ్లు | ,, | వెయ్యనేర్చినాది | ,, |
| చిన్నవాళ్ళాతోడ | ,, | ఆడనేర్చినాది | ,, |
| పెద్ద పెద్ద బొమ్మరిండ్లు | ,, | వెయ్యనేర్చినాది | ,, |
| పెద్దవాళ్ళాతోడ | ,, | బుద్ధినేర్చినాది | ,, |
| లక్కాయికోల్లల్ల | ,, | దంచ నేర్చినాది | ,, |
| పైడియ జల్లెండ్ల | ,, | చెరుగనేర్చినాది | ,, |
| వెండియ చాటల్లు | ,, | పట్టనేర్చినాది | ,, |

| | | | |
|---|---|---|---|
| లక్కాయి గురుగుల్లు | ఉయ్యాలో | వండ నేర్చినాది | ఉయ్యాలో |
| అంతా ఇంత సీత | ,, | పెద్దదయినాది | ,, |
| చదువులు బుద్ధులు | ,, | చాల చెప్పించెను | ,, |
| చదువులో ఘనమైన | ,, | చాతుర్యవంతురాలు | ,, |
| బుద్ధిలో ఘనమైన | ,, | బుద్ధిమంతూరాలు | ,, |

జానపదులకు గొప్ప కల్పనాచాతుర్యం, ఊహాశక్తి ఉంటాయి. అందుకే మూలంలో లేని సంఘటనలను కల్పించి ఔచిత్యాన్ని పాటిస్తారు. మహారాణి అయిన సీతను సామాన్య గృహిణిగా చిత్రించే నేర్పు, ఓర్పు జానపదులకు మాత్రమే ఉంటుంది. అందుకే రోకళ్ళతో దంచడం, చేటలతో, జల్లెండ్లతో ధాన్యం చెరుగడం, గురుగులలో అన్నం వండుకోవడం, మట్టితో చిన్న చిన్న బొమ్మరింఢ్లు వేసుకోవడం ఒక సామాన్య జానపద బాలిక చేసే పనులు. వాటినే జనకమహారాజు కూతురు సీతమ్మ చేత కూడ చేయించి జానపద స్త్రీలు తృప్తి పడ్డారు. ఎంతైనా సీతమ్మ రాచబిడ్డ కాబట్టి ఆమెకు వెండిచాటలు, బంగారు జల్లెండ్లు ఇచ్చారు. దీనివల్ల జానపదుల కల్పనలో కొంత ఔచిత్యం కనిపిస్తుంది. తరువాత సీతమ్మ పెరిగి పెద్దదై చదువులు బుద్ధులు ఘనంగా నేర్చింది. స్త్రీకి బాల్యం తరువాతి దశ యవ్వనం. ఈ దశలో వివాహ ఘట్టం చాలా ముఖ్యమైంది. అందుకే జనకమహారాజు సీతమ్మకు పెళ్ళిచేయ నిశ్చయించాడు.

| | | | |
|---|---|---|---|
| పడ్డాయి తల్లికి | ఉయ్యాలో | పదమూడు ఏండ్లు | ఉయ్యాలో |
| అంతలో తల్లిని | ,, | అడుగ వచ్చినారు | ,, |
| తూరుపురాజులు | ,, | సీతనడుగోచ్చిరీ | ,, |
| శివధనుస్సు విరిచితే | ,, | ఇత్తు సీతమ్మను | ,, |
| శివధనుస్సు విరువకా | ,, | వాళ్లోడిపోయిరి | ,, |
| పడమటి రాజులు | ,, | సీతనడుగోచ్చిరి | ,, |
| శివధనుస్సు విరిచితే | ,, | ఇత్తుసీతమ్మను | ,, |
| శివధనుస్సు విరువక | ,, | వాళ్లోడిపోయిరి | ,, |
| ఉత్తరపు రాజులు | ,, | సీతనడుగోచ్చిరి | ,, |
| శివధనుస్సు విరిచితే | ,, | ఇత్తుసీతమ్మను | ,, |
| శివధనుస్సు విరువకా | ,, | వాళ్లోడిపోయిరి | ,, |
| దక్షిణపు రాజులు | ,, | సీతనడుగోచ్చిరీ | ,, |

శివధనుస్సు విరిచితే ఉయ్యాలో ఇత్తుసీతమ్మను ఉయ్యాలో
శివధనుస్సు విరువకా ,, వాళ్లోడిపోయిరి ,,
రాముడు లక్ష్మణుడు ,, సీతనడుగోచ్చిరి ,,
శివధనుస్సు విరిచితే ,, ఇత్తు సీతమ్మను ,,
పటపట ధనుస్సు విరచె ,, పడతినీ పెండ్లాడె ,,
సీతను పెండ్లాడి ,, రఘురామూడు ,,

సీతా స్వయంవరానికి తూర్పు, పడమర, ఉత్తర, దక్షిణ రాజులందరూ వచ్చారు. ఎవరూ కూడ శివ ధనుస్సు విరువలేదు శ్రీరాముడు ఒక్కడే సీతమ్మను పెండ్లాడడానికి అర్హుడు. అందుకే రాముడు శివధనుస్సు విరిచి సీతను పెండ్లి చేసుకొన్నాడు. శ్రీరాముని గొప్పతనాన్ని తెలుపడానికే జానపదులు ఆయా దిక్కుల రాజులను పేర్కొని, వారు స్వయంవరంలో ఓడిపోయిన విధాన్ని పై పాటలో చిత్రించారు.

ఈ విధంగా సీతారాముల పెండ్లి జరిగింది. వివాహమయిన తరువాత ముత్తైదువలు సారె పంచుతారు. కాని, ఇక్కడ సీతారాములే స్వయంగా సారె పంచడానికి వెళ్ళినట్లుగా చిత్రించారు జానపదులు.

సీతారామూలు ఉయ్యాలో సారె బయిలెల్లంగా ఉయ్యాలో
పారిజాతాపూలు ,, పరిమళించేనపుడు ,,
రావయ్య రాముడా ,, తేవయ్య పూవులు ,,
మనతోట కాదమ్మ ,, మన్యవారి తోట ,,
మనకంటె ఎక్కువ ,, మన్యవారెవరయ్యా ,,
అప్పుడూ పోయెను ,, ఆ తోట లోపలికి ,,
తెంపెను ఆ పూలు ,, చేయి కదులాకుండా ,,
అల్లెను ఆ దండ ,, నిలువెల్లా దండ ,,
పెట్టెను ఆ దండ ,, కొప్పుకదులాకుంట ,,
అంతలో తోటవారు ,, రానె వచ్చినారు ,,
మా తోటలో ఉన్నది ,, ఎవరమ్మా మీరు ,,
రాజ్యాలు ఏలేటి ,, రాములా భార్యను ,,
దేశాలు ఏలేటి ,, దేవుని భార్యను ,,
భూలోక మేలేటి ,, భూదేవు భార్యను ,,[2]

వారు సారె పంచడానికి వెళ్ళుతున్నప్పుడు త్రోవ ప్రక్కన ఒక తోటలో పారిజాతపు పూవులు సీతమ్మకు కనిపించాయి. ఆ పూవులు తనకు కావాలని భర్త నడిగింది. అది మన తోట కాదని భర్త చెప్పాడు. అయినా మీరు రాజ్యాలు ఏలే రారాజులు, మీకంటే ఎక్కువ ఈ లోకంలో ఎవరూ లేరని భర్తతో పలికి, సీతమ్మ తోటలోకి వెళ్ళి పారిజాత పువ్వులు త్రెంపుకొని దండలల్లుకొని కొప్పున ధరించుకున్నది. ఇది జానపదుల మనోహరమైన కల్పనా చాతుర్యానికి నిదర్శనం. మూలంలో సీత వివాహానంతరం మాయ లేడిని మాత్రమే అడిగింది. కాని, జానపద స్త్రీలు సీతతో వారికిష్టమైన పారిజాత పుష్పాలను అడిగించారు. ఇక్కడ జానపదులు సీతమ్మను చాలా గడుసరిగా చిత్రించిన విధం గమనించదగింది.

సీతారాములు ఒకనాడు పర్ణశాలలో జూదమాడుకుంటున్నారు. అప్పుడు వారికి మాయలేడి కనిపించింది ఈ వృత్తాంతాన్ని తెలిపే మరొకపాట:

| | | | |
|---|---|---|---|
| అద్దన్న పడవిలో | ఉయ్యాలో | అది పర్ణశాల | ఉయ్యాలో |
| ఆ పర్ణశాలలో | ,, | రాముడు సీతమ్మ | ,, |
| రాముడూ సీతమ్మ | ,, | జూదంబులాడగా | ,, |
| అటుచూడురాములు | ,, | అటుచూడవయ్య | ,, |
| అటు ఏమి చూతునే | ,, | అది అడవి మృగము | ,, |
| అడవి మృగమైతే | ,, | అడుగులే చక్కనా | ,, |
| కోర జీవమ్మయితే | ,, | కొమ్ములే సక్కనా | ,, |
| దాంజంపి దాంతోలు | ,, | తేకుంటేనయ్య | ,, |
| అందనుక మనము | ,, | అన్నా చెల్లెలమయ్య | ,, |
| ముత్యాలు కుట్టిన | ,, | రైకలుండంగా | ,, |
| మురికి తోలుకు సీత | ,, | ఏల భ్రమిసెదవమ్మా | ,, |
| వజ్రాలు పొదిగినా | ,, | రైకలుండంగా | ,, |
| పట్టి తోలుకు సీత | ,, | ఏల భ్రమిసేదావు | ,, |
| పవడాలు పొదిగిన | ,, | రైకలుండంగా | ,, |
| పచ్చితోలుకు సీత | ,, | ఏల బ్రమిసెదావు | ,, |
| దాంజంపి దాంతోలు | ,, | తేకుంటేనయ్యా | ,, |
| అందనుక నువు నేను | ,, | అన్నాచెల్లెలమయ్య | ,, |

అని సీతమ్మ కట్టడి చేసింది. సీతారాములు జూదమాడడం మూలంలో లేదు. కాని ఇక్కడ జానపదుల కల్పన వేరుగా ఉంది. స్త్రీలకు ఇంట్లో ప్రొద్దు గడవక పచ్చీసు, పుంజీతం లాంటి ఆటలు ఆడుతారు గనుక సీతారాములతో ఈ ఆట ఆడించారు. వాల్మీకి రామాయణంలో సీతారాములు విహరించేటప్పుడు మాయలేడి కనిపిస్తుంది. సీత దానిని చూసి ముచ్చటపడి ఆ లేడిని తెమ్మని భర్త నడుగుతుంది. జానపదులు అందుకు భిన్నంగా ఈ పాటను కల్పించినారు. ఆ లేడిని చంపి దాని తోలుతో సీతమ్మ రవికెలు కుట్టించుకుంటానంటుంది. ముత్యాలు కుట్టిన రవికలు, పవడాలు పొదిగిన రవికలు, వజ్రాలు పొదిగిన రవికలు ఉండగా మురికి తోలుకు భ్రమలెందుకని రాముడు సీతమ్మను వారించాడు. అయినా సీతమ్మ వినదు. కేవలం నార వస్త్రాలతో అరణ్యవాసం చేస్తున్న సీతారాములు జానపదుల దృష్టిలో ఐశ్వర్యవంతులే. సీతమ్మకు అన్ని రకాల రవికలు ఉన్నట్లు చిత్రించడంలో ఔచిత్యం పాటించారు. స్త్రీలకు సహజంగా వస్త్రాలపై ఉండే వ్యామోహం కూడ ఈ పాటలో కనిపిస్తుంది.

చివరికి యాయలేడిని తేకపోతే తాను రామునితో కలసి ఉండనని "అందనుక నువు నేను - అన్న చెల్లెలమయ్య" అంటూ సీత బెదరిస్తుంది. సీతమ్మ మాటలకు ఖంగుతిన్న రాముడు ఇక తప్పదని భావించి బాణాలను తయారు చేయించుకోవడానికి వడ్రంగి వాడలకు బయలుదేరాడు.

| | | | |
|---|---|---|---|
| పోయెనే రామన్న | ఉయ్యాలో | వొడ్లోళ్ళవాడలకు | ఉయ్యాలో |
| కూర్చుండు రామన్న | ,, | కూర్చుండవయ్య | ,, |
| కూర్చుంటే పనిగాదు | ,, | ఏగిరాము పని అనె | ,, |
| కూర్చుండి చేయించె | ,, | కుర్స బాణాలు | ,, |
| నిలబడి చేయించె | ,, | నిలువు బాణాలు | ,, |
| ఇల్లెడు బాణాలు | ,, | వీపున బెట్టుకొని | ,, |
| పోయెనే రామన్న | ,, | లేడి జాడలకు | ,, |

పల్లెటూరి బాలురు వెదురు బద్దను వంచి రెండు చివరలు దారంతో కట్టి విల్లు తయారు చేసుకుంటారు. వెదురు పుల్లల బాణాలను వడ్రంగి వారితో సన్నగా చెక్కించుకుంటారు. ఇటువంటి వెదురు బాణాలతో వారు జంతువులను

పక్షులను వేటాడుతారు. శ్రీరామచంద్రుడు యువరాజే అయినా జానపద స్త్రీలకు సామాన్యమైన పల్లెటూరి బాలుడే. అందుకే రాముణ్ణి బాణాలు తయారు చేయించుకోవడానికి వడ్రంగి వాడలకు పంపించారు. అప్పుడు ఇల్లెడు బాణాలు వీపున గట్టుకొని రామన్న లేడి జాడలకు బయలుదేరాడు.

| | | | |
|---|---|---|---|
| లేడి జాడలకు | ఉయ్యాలో | రామన్న బాయె | ఉయ్యాలో |
| నీళ్ల కొరకాని | ,, | నిలిచెను లేడి | ,, |
| సంధించే బాణమ్మ | ,, | సంధించేనమ్మ | ,, |
| 'హరిహరి' యని అది | ,, | అడ్డమ్మ వాడే | ,, |
| హరి యన్న మాటలు | ,, | సీతా చెవునావడే | ,, |
| ఓ మరిది లక్ష్మణా | ,, | యింటివా నీవు | ,, |
| మీ అన్న అతిపలము | ,, | ఉడిగినాదయ్య | ,, |
| మా అన్న అతిఫలము | ,, | ఉడుగలేదొదినా | ,, |
| నీ గాజు మట్టెలు | ,, | నల్లబడలేదు | ,, |
| నీ నొష్టికుంకుమా | ,, | పేడెత్త లేదు | ,, |

అని అన్న ప్రాణానికి ఏమీ ప్రమాదం లేదని చెప్పుతాడు లక్ష్మణుడు, గాజులు,మట్టెలు నల్లబడదం, నొసలు కుంకుమ పేడెత్తడం (చెదరిపోవడం) వైధవ్యానికి సూచన అని జానపదుల విశ్వాసం.

అందుకే లక్ష్మణుడు అలా జరుగలేదని సీతమ్మతో చెప్పగా ఆమె నిష్ఠురంగా-

| | | | |
|---|---|---|---|
| అన్నసొమ్ముకు నీవు | ఉయ్యాలో | ఆశపడినావా | ఉయ్యాలో |
| అన్నసొమ్ముకు నీవు | ,, | అధ్యక్షుడవయ్య | ,, |

అని అంటుంది. ఆ మాటలు విన్న లక్ష్మణుడు ఎంతో బాధపడి, పర్ణశాల ముందు గిరిగీచి అది దాటవద్దని చెప్పి అన్న జాడలకు బయలుదేరాడు.

| | | | |
|---|---|---|---|
| గిరిగీసి సీతను | ఉయ్యాలో | గిరిలోపలుంచి | ఉయ్యాలో |
| పోయెనూ లక్ష్మణుడు | ,, | రాములా జాడలకు | ,, |
| మాయ వేషామేసి | ,, | మాయజంగామొచ్చె | ,, |
| దారెడు ముత్యాలు | ,, | దాటనా బోసుకా | ,, |
| పిలిచి బిక్షం పెడితే | ,, | బిడ్డ పుడుతదయ్యా | ,, |
| కోరి బిక్షం పెడితె | ,, | కొడుకు పుడుతదయ్యా | ,, |
| పటువయ్యా జంగమా | ,, | దారెడు ముత్యాలు | ,, |
| గిరి ఇవతల కాలు | ,, | గిరిలోపల కాలు | ,, |
| బిక్ష పేడితే నీవు | ,, | బిక్ష చెందదమ్మ | ,, |
| గిరి ఇవతలికి | ,, | వచ్చి పెట్టుమనె | ,, |
| గిరి ఇవతలికి తాను | ,, | రాగానె సీత | ,, |
| గిరి పెకిలించుక | ,, | మాయ మయినాడు | ,, |

ఇంతలో జంగమ్మ వేషంతో రావణుడు బిక్షంకోసం రాగానే "పుణ్యం కొద్ది పురుషుడు దానంకొద్ది పిల్లలు" అన్న విశ్వాసం కలిగిన జానపదులు సీతమ్మను గిరి దాటించి బిక్ష వేయించారు. గిరి ఇవతలికి వచ్చిన సీతమ్మను రావణుడు అపహరించుకునిపోయాడు.

సీతమ్మ తనను రావణుడు అపహరించుకొని పోతున్నప్పుడు పక్కనున్న 'శీతక్కల చెట్టుకు' తన బాధ రామునికి చెప్పుమని వేడుకుంది. అలాచేస్తే నీ పేరు సీతాఫలంగా మారి, నీ పండు ప్రజలంతా ఆనందంతో తింటారని చెప్పుతుంది.

| | | | |
|---|---|---|---|
| శీతక్కల చెట్టోలే | ఉయ్యాలో | నా చిన్ని తల్లి | ఉయ్యాలో |
| ఎనుకనే రాముడు | ,, | వస్తనే ఉన్నడూ | ,, |
| సీత ఎటు పోయెనో | ,, | చెప్పవే తల్లి | ,, |
| నీవు పూసినకాయ | ,, | పండు పండంగ | ,, |
| నీ పండు ప్రజలంత | ,, | ప్రీతితో తినంగ | ,,3 |

సీతమ్మ అయోధ్యలో ఉన్నప్పుడు బతుకమ్మ పండుగ వచ్చింది. అపుడు ఆమె కూడ బతుకమ్మ ఆడుకోడానికి వెళుతుంది. ఈ సందర్భంగా పాడే మరో పాట:

దశరథ మహారాజు కోల్ నగరూ ముందారా కోల్
సుమిత్ర గట్టించే ,, సుక్కల దర్వాజ ,,
కౌసల్య తోడించే ,, సక్కానిబాయి ,,
తంగేడు పూవుల్లు ,, సిబ్బిల పేరించి ,,
తరుణీతాబాయె ,, సీతాతోనాడ ,,
గుమ్మడి పూవుల్లు ,, సిబ్బిల పేరించి ,,
గుణవతితాబాయె ,, సీతాతోనాడ ,,
ఉద్రాక్ష పూవుల్లు ,, సిబ్బిల పేరించి ,,
ఉర్మిళతాబాయె ,, సీతాతోనాడ ,,
మల్లాయిపూవుల్లు ,, సిబ్బిల పేరించి ,,
మాళవితాబాయె ,, సీతాతోనాడ ,,
చేమంతి పూవుల్లు ,, సిబ్బిల పేరించి ,,
శ్రుతకీర్తితాబాయె ,, సీతాతోనాడ ,,
తివాసులేయించే ,, సీతాకొందరికి ,,
వాయనాలిప్పించే ,, వరుసాతోసీతా ,,[4]

సీతమ్మ కౌసల్య, సుమిత్రల ప్రియమైన కోడలేకాదు - జానపదుల ముద్దు బిడ్డ. బతుకమ్మ పండుగ జరుపుకోవడంలో కలిగే ఆనందం కంటే సీతమ్మ సాహచర్యమే కౌసల్య, సుమిత్ర, ఊర్మిళ, మాండవి (మాళవి), శ్రుతకీర్తి మొదలైనవారికి ఎక్కువ సంతోషం కలిగిస్తుంది. అందుకే సీతమ్మతో కలసి ఆడుకోవడానికి, తంగేడు పూవులతో సుమిత్ర, గుమ్మడి పువ్వులతో కౌసల్య, ఉద్రాక్ష పువ్వులతో ఊర్మిళ, మల్లాయి పువ్వులతో మాండవి, చేమంతి పువ్వులతో శ్రుతకీర్తి బతుకమ్మలను పేర్చుకొని బయలుదేరుతారు.

సమష్టి కుటుంబంలోని స్త్రీలంతా ఒకరికొకరు సహకరించుకుంటూ పండుగలు, వ్రతాలు జరుపుకుంటారు. సీతమ్మ కూడా బతుకమ్మ పండుగను వ్రతంగా జరుపుకొని ముత్తైదువలకు వాయనాలిచ్చింది. ఇక్కడ అత్తగారలైన కౌసల్య, సుమిత్రలను పేర్కొన్నారు కాని, కైకేయిని పేర్కొనలేదు. బహుశా సీతమ్మ కష్టాలకు కైకేయి కారణం అని భావించిన జానపదులు ఆమెను మరచి పోవడంలో ఆశ్చర్యం లేదు.

నిండు చూలాలుగా ఉన్న సీతను అడవికి పంపవద్దని శాంతమ్మ తన సోదరుడైన రాముణ్ణి వేడుకుంటుంది. అయినా, రాముడు తన పట్టు విడువడు. అంతేగాక అందుకు కారణం కూడా వివరిస్తాడు. ఆ భావాన్ని తెలిపే మరొక పాట:

| | | | |
|---|---|---|---|
| నేరము లేదుగాదా | వలలో | నెలతాభూమీజా | వలలో |
| శిక్షింపవలదాని | ,, | శరణంబు వేడా | ,, |
| ఇది ఏమి నీకు శాంత | ,, | మనకూ విలువేనా | ,, |
| పటమును గనలేదా | ,, | పలుమారు నీవు | ,, |
| అని మదికోపించి | ,, | ఆ శాంతా వెడలే | ,, |
| లక్ష్మణునటుపిలిచి | ,, | తక్షాణంబుగ | ,, |
| సీతను గొనిపోయి | ,, | శిరమును ఛేదించి | ,, |
| రమ్మనుచూ పలుకా | ,, | రామా అనుజూడు | ,, |
| వినిపించి వేసారి | ,, | విధి తప్పాదాని | ,, |
| అన్నయ్య చేయుయాజ్ఞ | ,, | విన్నపించేదా | ,, |
| సాకీతము చేరె | ,, | శోకాముచేత | ,, |
| భూతాలద్వని వీని | ,, | భీతిల్లుచుండె | ,, |
| ఏకాకి అయిచాలా | ,, | శోకించుచుండె | ,, |

ఒకసారి సీతమ్మ పడక గదిలో రావణుని పటం గనిపించిందట. అది చూసిన రాముడు సీత శీలాన్ని శంకించాడు. ఆ పటం రావణుని మాయోపాయాల చేత అక్కడ పెట్టబడిందని "కృష్ణశ్రీ"సంపాదితమైన"స్త్రీల పౌరాణిక పాటలలో" తెలుపబడింది. సీతపై అనుమానం పెంచుకున్న రాముడు లక్ష్మణుని పిలిచి సీతను అడవిలోకి తీసుకెళ్ళి శిరస్సు ఖండించి రమ్మంటాడు. రాముని చెల్లెలు శాంతమ్మ కరుణతో సీతను శిక్షింపవద్దని రాముణ్ణి శరణు వేడుతుంది. లక్ష్మణుడు కూడ దుఃఖంతో సీతమ్మను చంపకుండా అడవిలో విడిచిపెట్టి వస్తాడు. మూలంలో రాముడు సీతను అడవిలో విడిచిపెట్టి రమ్మన్నాడేకాని శిరస్సు ఖండించమని చెప్పలేదు. ఇది జానపదుల కల్పన.

మానితంబుగ నదికి వలలో స్నానమాడగ వచ్చి వలలో
వై దేహిశోకంబు ,, వాల్మీకి ముని విని ,,
చెంతచేరగపోయి ,, వింతయు పరికించి ,,
అమ్మమీరెవరమ్మ ,, అడవిలోను తల్లి ,,
దేవమీరెవరమ్మ ,, తెలువగోరెదమమ్మ ,,
దేవరా మీరెవరు ,, తెలుపగా వేడెదను ,,
వాల్మీకి అనువాడ ,, వనితా వినవమ్మ ,,
దండములు పదివేలు ,, దాసురాలను స్వామి ,,
వర్ధిల్లు ఘనముతో ,, వచియింపు నీవార్త ,,
ఎలిమితో కాపురము ,, వెలయసాకేతంబు ,,
తాపసోత్తమ నేను ,, దశరథుని కోడలును ,,
శ్రీరాముల భార్యను ,, సీతయనుదాసీ ,,
కటకటా ఇది ఏమి ,, గర్భవతివే తల్లి ,,
మాననీయులు మీరు ,, గాధ నేంబడి వస్తిరి ,,
మీకు తెలియనిదేమి ,, మేధినే జూస్తిరి ,,
అయినవెరవకు మనుచు ,, అప్పుడు వాల్మీకి ,,
శిష్యగణములకెల్లి ,, సీత దేవిని జూపె ,,
ప్రాకటంబుగ ఈమె ,, లోకమాతయని తెలిపి ,,
మౌనికన్యల కాంత ,, మానిని సేవల యుంచి ,,
దినదినంబులు చాలా ,, తేనె ఫలములు దెచ్చి ,,
ఇచ్చుచుండిరి ప్రేమ ,, ఇట్లకొన్ని దినాలు ,,
నిట్లుతొలుతాగడువా ,, నిండెను పదినెలలు ,,
ప్రసవమయ్యేను భామ ,, బాలునొక్కనిగనియె ,,
ఈ వార్త కనుగోని ,, వివరంబుగా మౌని ,,
జాతకంబులు రాసె ,, సీత సన్నిధి కేగి ,,
సూసుతానీసుతుని ,, నిడుదెమ్మి యనుచు ,,
మీతాత వచ్చిండు వలలో నీ తీరు పొడసూప వలలో
చేతులెత్తి మొక్కు ,, చేరుడూ శరణంబు ,,
రమణి నీ తనయుండు ,, రాముని పోలియును ,,
పుణ్యమున కల్గేను ,, నీ సుతుడు ధన్యుడే ,,[5]

మూలంలో సీతమ్మకు "లవకుశులు" జన్మించారు. కాని, ఈ పాటలో సీతమ్మకు ఒక్కడే బాలుడు పుట్టినట్లు, అతడు గొప్ప జాతకుడయినట్లుగా జానపదులు చిత్రించారు.

పసిబాలుడైన ఆ జానకి సుతునికి ఊగడానికి ఊయల కఱవైంది. ఒకనాడు ఊళ్ళోకి "ఉయ్యాలలు" అమ్మవచ్చినాయట. కాని కొనే స్థితేది సీతమ్మకు!

| | |
|---|---|
| ఊరికి ఉయ్యాల లమ్మ వచ్చినవో | తుమ్మన్నా దారిలో |
| ఏంబెట్టి నేంగొందు ఎండి ఉయ్యాలా | ,, |
| ఏడువాకూ బిడ్డ రాంకొమారా | ,, |
| ఏడిస్తే నిన్నేవరూ ఎత్తుకునేవాలో | ,, |
| పుటుగజ్జెలుగొందు పులిగోరుగొందూ | ,, |
| కాళ్ళ గజ్జెలుగొందు కంట్లమాలగొందు | ,, |
| మీ తాత దశరాతుడొచ్చె ఊరుకుండూ | ,, |
| మీ తండ్రి రాములు వచ్చె ఊరుకుండూ | ,, |
| మీ తల్లి సీతాదేవి వచ్చె ఊరుకుండూ | ,, |
| ఏడువాకూ బిడ్డ రాంకొమారా | ,, |
| ఏడిస్తే నిన్నెవరెత్తుకునేవారో | ,,6 |

ఇక్కడ సీతమ్మ కష్టాలను కరుణరసాత్మకంగా వర్ణించారు జానపదులు. తల్లిదండ్రులకు దూరమై, భర్తచే తిరస్కరింపబడిన సీతను వాల్మీకి ఆదరించాడు. 'తొట్టి' కొనలేని తన నిస్సహాయ స్థితికి సీతమ్మ ఎంతో బాధపడుతుంది. తల్లిని చూసి కుమారుడు కూడా ఏడుస్తున్నాడు. ఏడిస్తే ఎత్తుకునే వారెవరూ లేరని, కాళ్ళగజ్జెలు, కంట్లమాల, పులిగోరు కొనిస్తానని కొడుకును బుజ్జగిస్తుంది. సామాన్య స్త్రీ అనుభవించే కష్టాలన్నింటిని సీతమ్మ అనుభవించినట్లు ఈ పాటలో వర్ణించారు.

జానపదుల రామాయణంలో శాంతమ్మ ప్రధాన పాత్ర వహిస్తుంది. కౌసల్య ఆమెను అత్తవారింటికి సాగనంపుతూ బుద్ధులు నేర్పే మరొక పాట. సామాన్యంగా ఆడపిల్లలను అత్తవారింటికి పంపే పాటలన్నీ కరుణరసంతో నిండి ఉంటాయి.

| | | | |
|---|---|---|---|
| శ్రీరాముల తల్లియు | ఉయ్యాలో | శ్రీమతి కౌసల్య | ఉయ్యాలో |
| ప్రేమతో శాంతను | ,, | పిలిచి దగ్గర తీసి | ,, |
| చల్లని మాటలు | ,, | సతిధర్మములు కొన్ని | ,, |
| చెప్పెదా ఈ రీతి | ,, | చెవులాకు ఇంపుగా | ,, |
| నా తల్లి శాంతమ్మ | ,, | నా ముద్దులా పట్టి | ,, |
| అత్తవారింటికి | ,, | ఆనందముగ పొమ్మ | ,, |
| అత్తమామల సేవ | ,, | చిత్తమందున నిలుపు | ,, |
| భర్త దైవంబని | ,, | భావించి పూజించు | ,, |
| వారినే సేవింప | ,, | వైకుంఠమబ్బును | ,, |
| వారిపై ప్రేమ | ,, | వాసుదేవుని పూజ | ,, |
| ఇరుగు పొరుగిండ్లకు | ,, | తిరుగు బోవద్దమ్మ | ,, |
| అపకీర్తి కంటేను | ,, | అతివ చావే మేలు | ,, |
| సాదుసత్పురుషులు | ,, | సమయానికేతెంచ | ,, |
| అన్నపానాదులు | ,, | ఆచరించుము తల్లి | ,, |
| మాటమన్నన లేక | ,, | మంచి పేరు లేదు | ,, |
| మాటజారినాక | ,, | మళ్ళీ తిరిగిరాదు | ,, |
| అందుకే ముందుగా | ,, | ఆలోచనుండవలె | ,, |
| పోయిరాశాంతమ్మ | ,, | పోయిరావమ్మ | ,, |
| కొడుకులు బిడ్డలు | ,, | కొమరప్పగలుగవలే | ,, |
| నిండుము త్తైదువలె | ,, | ఉండవే నాతల్లి | ,, |
| పోయిరాశాంతమ్మ | ,, | పోయిరావమ్మ | ,,[7] |

అని జానపదులు శాంతమ్మను తమ కూతురుగా భావించి ప్రేమతో కౌసల్యచేత బుద్దులు చెప్పించి, అత్తవారింటికి సాగనంపారు. ఇంకా ఆమె కొడుకులు, బిడ్డలతో సౌభాగ్యవతిగా ఉండాలని దీవించారు. జానపదులు హృదయం ప్రేమ మయమైంది.

ఈ విధంగా రామాయణంతోని ప్రతి సంఘటనను కూడ జానపదులు తమ జీవితంతో సమన్వయించుకొని ఎన్నో పాటలు పాడుతారు. జానపద రామాయణం జానపదుల జీవితాలను ప్రతిబింబించే దర్పణం లాంటిది. ఈ విధంగా రామకథకు సంబంధించిన పాటలెన్నో బతుకమ్మ పండుగ సందర్భంలో స్త్రీలు పాడుకుంటారు.

# మహాభారతానికి సంబంధించిన పాటలు

రామాయణం తరువాత జానపదులకు ప్రీతి పాత్రమైంది మహాభారత కథ. సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక విషయాల నన్నింటిని విపులీకరించే గ్రంథం మహాభారతం. ధర్మానికి, నీతి, నియమాలకు కట్టుబడిన ఇందలి పాత్రలు జానపదుల హృదయాలలో శాశ్వతంగా నిలిచిపోయాయి. ధర్మరాజు ధార్మికత, భీమార్జునుల శౌర్యం, ద్రౌపది పౌరుషాలు జానపదుల కెంతో ఇష్టం. ఇంకా భూత-భవిష్యత్తు-వర్తమానాల నెరిగే వానిగా సహదేవునికి ఎంతో ప్రాధాన్యత ఇస్తారు. మహాభారతంలోని పాత్రలు, సంఘటనలను, జానపదులు తమ జీవితాలతో సమన్వయించుకొని, మూలానికి భిన్నంగా ఎన్నో కల్పనలు చేసి పాటలుగా పాడుకుంటారు. చివరికి 'మానవ జీవితమే ఒక మహాభారతం' అన్నట్లుగా వీరు పాడుకున్న భారతం పాటలు ఎన్నో ప్రచారం పొందాయి. బతుకమ్మ పండుగ సందర్భంలో కూడ ఇటువంటి పాటలు అనేకం పాడుకుంటారు. మహాభారత కథల ఆధారంగా జానపదులు కల్పించుకున్న ముఖ్యమైన ఘట్టం గయోపాఖ్యానం. ఈ కథ మూలంలో లేదు. దీని ఫలితంగానే శ్రీకృష్ణార్జునుల యుద్ధం సంభవిస్తుంది.

ఒకనాడు ఆకాశ మార్గంలో వెళ్లుతున్న గయుడనే గంధర్వరాజు "తమలపు తమ్మిని నేలకు విడిచాడు". ఆ సమయంలో కృష్ణుడు భాస్కరునికి అర్ఘ్యం యిస్తున్నాడు. గయుడు వేసిన తమలపు తమ్మి కృష్ణుని అంజలిలో పడింది. అందుకు ఆగ్రహించిన కృష్ణుడు అతనివృత్తాంతం ఆకాశవాణిద్వారా తెలుసుకొని గయుని సంహరిస్తానని ప్రతిజ్ఞ చేస్తాడు. కలహ భోజనుడైన నారదుడు ఈ వార్త గయునికి తెలిపి అర్జునుని శరణు వేడుకొమ్మని చెప్పాడు. శరణాగతరక్షకుడైన అర్జునుడు తన దగ్గరికి వచ్చి శరణు వేడిన గయుని ప్రాణం రక్షిస్తానని అభయం ఇచ్చాడు. నారదుడు మళ్ళీ కృష్ణుని దగ్గరికి వెళ్ళి గయుని రక్షించడం కోసం అర్జునుడు అభయమిచ్చాడని తెలియజేశాడు. తదనంతరం కృష్ణార్జునుల యుద్ధం సంభవిస్తుంది. ఈ వృత్తాంతాన్ని తెలిపే పాట:

| రామరామ రామ | ఉయ్యాలో | శ్రీరామరామ | ఉయ్యాలో |
|---|---|---|---|
| అయ్యెయ్యొ రామ | ,, | అయోధ్యరామ | ,, |
| నరనారాయణులకు | ,, | జరిగినా యుద్ధంబు | ,, |
| అనువుగా చెప్పెదా | ,, | ఆలకించుడి మీరు | ,, |
| ద్వాపర యుగములో | ,, | ధరణి శ్రీకృష్ణుండు | ,, |
| తన సతులతో గూడి | ,, | సంతోషమూ తోడ | ,, |
| యమునా నదిలో | ,, | స్నానమాచరించి | ,, |
| భాస్కరుని కర్ఘ్యంబు | ,, | పట్టె నంజలి యందు | ,, |
| ఆకాశ మార్గాన | ,, | ఆ సమయమందు | ,, |
| గంధర్వుడను రాజు | ,, | గయుడనే వీరుండు | ,, |
| పుష్పరథమందునా | ,, | తన సతితో గూడి | ,, |
| పోవుచూ తమలపు | ,, | తమ్మి నేలకు విడిచె | ,, |
| కాని ఆ తమ్మియు | ,, | కృష్ణునంజలి పడెను | ,, |
| అంతటా కృష్ణుండు | ,, | ఆగ్రహంబునా తాను | ,, |
| అంజలిని పడద్రోసి | ,, | ఆకాశవాణిని | ,, |
| తమ్మి అంజలి పడగ | ,, | నేలపై నుమిసిన | ,, |
| దుర్మార్గు డెవ్వడో | ,, | తెలుపుని యనగా | ,, |
| మణిపురం భేలేటి | ,, | గంధర్వ రాజు | ,, |
| ఆకాశవాణియు | ,, | ఆ రీతిగా తెలిపె | ,, |
| గంధర్వుడైతేమి | ,, | గర్వాంధుడైనాడు | ,, |
| నీచకార్యము నేడు | ,, | వాడు చేసినాడు | ,, |
| బ్రతికి యుండగరాదు | ,, | వాడు ఈ భువిలోన | ,, |
| వాని తల చక్రముతో | ,, | వసుధ పడగూల్తునని | ,, |
| ప్రతిజ్ఞ చేసెను | ,, | వాసుదేవుడపుడు | ,, |
| యిట్టి వృత్తాంతంబు | ,, | నారదుడు దెలిసియు | ,, |
| గంధర్వ రాజైన | ,, | గయుని దగ్గరికి చేరె | ,, |
| జరిగినా వృత్తాంత | ,, | మంతయు దెలుప | ,, |
| గయుడపుడు బాధతో | ,, | దుఃఖించుచుండగా | ,, |
| దుఃఖింప వలదని | ,, | నారదుడు అపుడు | ,, |

| | | | |
|---|---|---|---|
| చెప్పె నుపాయంబు | ఉయ్యాలో | గంధర్వ రాజునకు | ఉయ్యాలో |
| వాసుదేవుని తోడ | ,, | యుద్ధంబు చేయ | ,, |
| బ్రహ్మాది దేవతలకు | ,, | సాధ్యమ్ము గాదది | ,, |
| శౌర్యంబు యున్న | ,, | వీరుడున్నాడయ్య | ,, |
| పాండు నందనులలో | ,, | అర్జునుడనువాడు | ,, |
| ద్వైతవనమందునూ | ,, | వారు ఉన్నారని | ,, |
| పరగ నీవటకేగి | ,, | అర్జునునితోటి | ,, |
| శరణంబు వేడుము | ,, | అభయమ్ము గొనుము | ,, |
| అటుపైన విషయము | ,, | విన్నవించుమపుడు | ,, |
| అన వినిన గయుడు | ,, | శీఘ్రమే వెళ్లెను | ,, |
| పాండవులు యున్న | ,, | వన మందు చేరెను | ,, |
| శరణంబు వేడెను | ,, | అర్జునీనపుడు | ,, |
| అర్జునుని తోడను | ,, | అభయమ్ము పొందెను | ,, |
| కడుభయముతోనియు | ,, | జరిగినా విషయంబు | ,, |
| విజయునికి తెల్పగా | ,, | మిక్కిలి పరితపించె | ,, |
| ధర్మరాజు అపుడు | ,, | తన తమ్ములా తోటి | ,, |
| శరణుగోరిన వారిని | ,, | రక్షించ వలెనని | ,, |
| తెలిసి కృష్ణుని తోడ | ,, | కలహాము మనకు | ,, |
| జరుపగా మనకు | ,, | సాధ్యంబు కాదయ్య | ,, |
| మంచిమాటలు తోని | ,, | మర్యాద తోని | ,, |
| రాయబారము పంపి | ,, | గయుని రక్షింతము | ,, |
| కలహాభోజనుడైన | ,, | నారదుండపుడు | ,, |
| ద్వారకా పట్టణమున | ,, | వాసుదేవుని జేరి | ,, |
| మీ బావ అర్జునుడు | ,, | గయుని రక్షింపగా | ,, |
| అభయమ్ము నిచ్చెను | ,, | అని తెలిపె నారదుడు | ,, |
| అధికకోపంబున | ,, | ఆ కృష్ణుడపుడు | ,, |
| కనులెర్ర జేయగా | ,, | చూచి సుభద్రయు | ,, |
| తెలిసివారలు నీతో | ,, | కయ్యమునకు దిగరు | ,, |
| నేబోయి యిప్పుడే | ,, | విషయంబు తెలుసుకొని | ,, |

| | | | |
|---|---|---|---|
| చక్కగా వచ్చెదా | ఉయ్యాలో | అన్నరో శాంతించు | ఉయ్యాలో |
| సుభద్రరాకను | ,, | అర్జునుడు గమనించె | ,, |
| సఖియకు సర్వంబు | ,, | చక్కగా వివరించి | ,, |
| తెలిసీ నే అభయమ్ము | ,, | నేనీయగాలేదు | ,, |
| శరణన్న వారిని | ,, | కాపాడుట ధర్మమని | ,, |
| కావునా అతనికి | ,, | అభయమ్ము నిస్తి | ,, |
| పరులకొరకూ మీకు | ,, | వైరంబు దగదూ | ,, |
| అనిన ఆ విజయుండు | ,, | ఎంతో చింతించుచు | ,, |
| ఆయన దయవల్ల | ,, | బాధలన్నో బానీ | ,, |
| ధరణిపై మేమిట్లు | ,, | సుఖముగా యున్నాము | ,, |
| పాండవులు ఎన్నడూ | ,, | మరువరూ కృష్ణునీ | ,, |
| విధి విధానంబు | ,, | కష్టబూని నట్లు | ,, |
| అభయంబు నిచ్చియు | ,, | నేనేమి చేయుదు | ,, |
| అతని చంపగ నేను | ,, | ఊరకుండుట ఎట్లు | ,, |
| పిరికియై శరణంబు | ,, | ఎట్లు ఇచ్చేనాని | ,, |
| లోకులు నిందించ | ,, | ధర్మరక్షణ కొరకు | ,, |
| కర్మ లాచరించి | ,, | ప్రాణాలు విడచుట | ,, |
| అదియేను ధర్మంబు | ,, | అనిచెప్పె పార్థుండు | ,, |
| కావున సఖియరో | ,, | వాసుదేవునకును | ,, |
| మా వందనాలని చెప్పి | ,, | మంచిగా పల్కుము | ,, |
| గయుని, మమ్ము లగూడ | ,, | రక్షించు మనుచును | ,, |
| ప్రార్థించి వేడినా | ,, | పాటించకున్నచో | ,, |
| రణము చేయుటకైన | ,, | సిద్ధమే యనుచు | ,, |
| అపుడు సుభద్రయూ | ,, | అన్న దరిచేరి | ,, |
| విన్నవించే నపుడు | ,, | అర్జునుని ప్రార్థన | ,, |
| ఆగ్రహము తోడను | ,, | శ్రీకృష్ణు డపుడు | ,, |
| సైన్యమును గొనియు | ,, | రణమునకు పోయెను | ,, |
| కృష్ణుని రాకను | ,, | జూచిన పాండవులు | ,, |
| వందనములు చేయ | ,, | వాసుదేవునికిని | ,, |

గయుని విడువమని ఉయ్యాలో పలికినే కృష్ణుడు ఉయ్యాలో
శరణన్న వారిని ,, చంపగ జూతుమా ,,
గయుని ఇచ్చుటకన్న ,, యుద్ధరంగ మందు ,,
ప్రాణంబులైనను ,, తృణముగా విడిచెదము ,,
అంతటా కృష్ణుడు ,, సేనలను ఉసికొల్పె ,,
ఎదురించె కృష్ణుడు ,, ఎదురించె అర్జునుడు ,,
ధరణి అదురునట్లు ,, జరిగెను ఆ రణము ,,
భీకరం బైనట్టి ,, ఆ యుద్ధ రంగములో ,,
నరుడు నారాయణుడు ,, పోరు సల్పుచుండ ,,
కైలాసములోని ,, పరమేశ్వరుం డపుడు ,,
పరుగునా ఏతెంచి ,, వారలా దీవించి ,,
యుద్ధంబు ఆపించె ,, ఈ రీతి పలుకుచు ,,
ఇరువురు పుట్టిరి ,, ధర్మరక్షణకొరకు ,,
నరుడు నారాయణుడుగ ,, అవతరించిన మీరు ,,
ఈ రీతి మీరు ,, పోరు సలుపుట దగదు ,,
ముందు వెనుకా మీరు ,, ఆలోచన లేక ,,
తొందర పడినారు ,, మీరు ముువ్వురును ,,
ధరణిపై జూడకా ,, గర్వంబునా గయుడు ,,
తమలంబు విడచుట ,, తప్పుగాదా యని ,,
అది కారణంబుగా ,, అధిక కోపంబుతో ,,
గయునిచంప బూనుట ,, వాసుదేవుని తప్పు ,,
అభయమ్ము నిడునాడు ,, ముందుగా తాను ,,
విషయమ్ము తెలుసుకొని ,, అభయమ్ము నివ్వాలి ,,
కనుకముువ్వురి యందు ,, దోషంబు గలదే ,,
ముువ్వురు మీరును ,, వీరులై ఉండియు ,,
వేగిరా పడియును ,, ఇట్లు చేసితిరిగాన ,,
సఖ్యాన మెలగుడీ ,, సంతోషమనెను ,,
శివుని మాటలు విన్న ,, నర నారాయణులు ,,
కలసి పోయినారు ,, లోకులు మెచ్చగా ,,
ఈ పాట ఎవ్వరూ ,, పాడినా విన్నా ,,
విన్నవారికి కలుగు ,, ఇష్టసుఖాలు ,,
పాడినవారికి కలుగు ,, పరమాత్ముని కరుణ ,,[8]

కృష్ణుడు తాను సంహరిస్తానని ప్రతిజ్ఞబూనిన గయుని అర్జునుడు కాపాడు తానని అభయమిచ్చాడు. ఈ వార్త నారదుని ద్వారా తెలుసుకున్న కృష్ణుడు ఆగ్రహించాడు. కృష్ణుని చెల్లెలు సుభద్ర ఈ విషమ పరిస్థితికి ఎంతో బాధపడి—

| | | | |
|---|---|---|---|
| తెలిసివారలు నీతో | ఉయ్యాలో | కయ్యమునకు దిగరు | ఉయ్యాలో |
| నేబోయి యిప్పుడే | ,, | విషయము తెలుసుకొని | ,, |
| చక్కగా వచ్చెదా | ,, | అన్నరో శాంతించు | ,, |

అని శ్రీకృష్ణుని వేడుకుంటుంది. తన భర్త అర్జునుని దగ్గరికి వెళ్ళి జరిగిన విషయం తెలుసుకుంటుంది. శరణు కోరిన వానికి అభయం ఇచ్చానని, కృష్ణునితో విరోధం తనకు కూడ బాధ కలిగిస్తుందని, అందుకు చింతిస్తున్నానని కూడ చెప్పుతాడు అర్జునుడు. ఒకవైపు భర్త, మరొకవైపు అన్న - ఇద్దరినీ శాంతింప చేయాలని సుభద్ర ప్రయత్నించినా ఫలితం లేకపోయింది. కృష్ణార్జునులకు ఘోరమైన యుద్ధం జరుగుతుంది. పరమేశ్వరుడు వచ్చి వారిద్దరిని శాంతింప చేశాడు. ధరణిపై చూడకుండా ఉమ్మి వేయడం గయుని తప్పని, తొందరపడి ఆగ్రహించి గయుని చంపబూనడం వాసుదేవుని పొరపాటు అనీ, ముందు వెనుకా ఆలోచించక గయునికి అభయం యివ్వడం అర్జునుని తొందరపాటు చర్య అని శివుడు చెప్పాడు. ముగ్గురిదీ తప్పే కనుక యుద్ధం ఆపి, గయుని విడిచిపెట్టాలని చెప్పినాడు. మానవులు తొందరపాటు చర్యలను జానపదులు కృష్ణార్జునులకు, గయునికి అంటగట్టి, నరనారాయణులకే యుద్ధం సంభవింప చేయడం జానపదుల కల్పనాచాతుర్యానికి నిదర్శనం. కృష్ణార్జునుల నిద్దరినీ శాంతింపచేయడానికి సుభద్రతో రాయబారం నడిపించడంలో కూడ జానపదులు ఎంతో ఔచిత్యం కనబరిచారు. ఇటువంటి ఆసక్తికరమైన సంఘటనలు కల్పించుకొని జానపదులు బతుకమ్మ పండుగ రోజుల్లో పాటలుగా పాడుకుంటారు.

మహాభారతంలోని ముఖ్యమైన ఘట్టం 'సతీ సావిత్రి కథ.' పార్వతీదేవి వరమున అశ్వపతి మాళవి దంపతులకు జన్మించిన అమ్మాయి సావిత్రి. ఈమెకు యుక్తవయసు రాగానే తండ్రి అశ్వపతి వివాహం చేయదలచాడు. ద్యుమత్సేనుని పుత్రుడగు సత్యవంతుని తాను ప్రేమించానని, తనకు అతనితో వివాహం జరిపించుమని సావిత్రి తండ్రిని వేడుకుంటుంది. సత్యవంతుడు గుణశీలములు

గలవాడని కాని, అతని ఆయువు పెండ్లయిన పిదప ఒక సంవత్సరం మాత్రమే ఉంటుందని నారదుడు అశ్వపతికి చెప్తాడు. అందుకు తండ్రి ఎంతో బాధ పడుతూ ఆమెతో సత్యవంతునిగాక మరొకరిని వరునిగా కోరుకొమ్మంటాడు. సావిత్రి వినకుండా తనకు అతనితోనే వివాహం జరిపించుమంటుంది. చివరికి సావిత్రిని సత్యవంతుని కిచ్చి వివాహం జరిపిస్తాడు అశ్వపతి.

సావిత్రి తన భర్తకు, అంధులైన అత్తమామలకు పరిచర్యలు చేస్తూ కాలం గడుపుతూ ఉంటుంది. నారదుడు చెప్పిన ప్రకారం తన భర్త ఆయుష్కాలం అప్పటికి నాలుగు రోజులు మాత్రమే ఉంది. సావిత్రి ఉపవాసం చేస్తూ వ్రతం ఆరంభించింది. నాలుగవరోజు సత్యవంతుడు సమిధలకొరకు అడవికి బయలు దేరుతుండగా సావిత్రి తాను కూడ వస్తానని భర్తతో అరణ్యానికి బయలుదేరింది. సత్యవంతుడు చెట్టెక్కి సమిధలు విరిచి కొంత సేపటికి శిరోవేదనతో బాధపడుతూ సావిత్రి ఒడిలో పడుకున్నాడు. అతనికి మరణకాలమాసన్నం కాగా, అతని ప్రాణం తీసుకుపోవడానికి యముడు వచ్చాడు. సావిత్రి ఆయనకు నమస్కరించి తన భర్తను కాపాడుమంటుంది. తాను యమధర్మరాజునని, ఆమె పతివ్రత కాబట్టి తనను చూడగలిగిందని చెప్పి సత్యవంతుని ప్రాణం తీసుకుపోతుంటాడు. సావిత్రి యముని వెంబడించింది. ఈ పట్టుదలకు మెచ్చి యముడు, భర్త ప్రాణం తప్ప ఏదైనా వరం కోరుకొమ్మంటాడు. అంధులైన తన అత్తమామ లకు దృష్టిని ప్రసాదింపు మంటుంది. అందుకు ఒప్పుకొని బయలుదేరుతున్న యముని సావిత్రి మళ్ళీ వెంబడిస్తుంది. తరువాత యముడు మళ్ళీ వరం కోరు కొమ్మని చెప్పగా, తన అత్తమామలు పోగొట్టుకొన్న రాజ్యం తిరిగి చేకూర్చు మంటుంది. అందుకు ఒప్పుకున్న యముని మళ్ళీ వెంబడిస్తూ ఉంటే చివరికి సావిత్రి తండ్రికి పుత్రులు కలుగునట్లు కూడ వరం ఇస్తాడు. అయినా, సావిత్రి పట్టుదలతో యముని విడిచి పెట్టలేదు. తన భర్తను విడిచిపెట్టి తాను ఉండలే నని చెప్తుంది. ఆమె పతి భక్తికి మెచ్చిన యమధర్మరాజు సత్యవంతుని ప్రాణం కూడ ప్రసాదించాడు. అందుకు సంతోషించిన సావిత్రి తిరిగి భర్త వద్దకు రాగా ఆయన నిద్ర నుండి మేల్కొన్నవానిగా ఉంటాడు. భార్యాభర్తలిద్దరు కలసి సంతోషంతో ఇంటికి వెళ్ళిపోయారు.[9]

మూలంలో ఉన్న ఈ కథకు జానపదులు ఎన్నో కల్పనలు చేసి తమ కనుకూలంగా పాటలు పాడుకున్నారు. ఈ కథను తెలిపే పాట—

| | | | |
|---|---|---|---|
| మద్ర దేశపురాజు | ఉయ్యాలో | మహారాజు అశ్వపతి | ఉయ్యాలో |
| తనసతి మాళవితో | ,, | పాలించు చుండెను | ,, |
| సిరి సంపదలున్న | ,, | సంతానమే లేదు | ,, |
| సంతానము కొరకు | ,, | పరమ భక్తితోను | ,, |
| పార్వతీదేవిని | ,, | వారు కొలువంగా | ,, |
| ఆమె ప్రత్యక్షమై | ,, | మీకు సంతూకలుగు | ,, |
| ఆమెకు పెట్టుము | ,, | సావిత్రి యని పేరు | ,, |
| ఆశీర్వదించియు | ,, | అదృశ్య మయ్యెను | ,, |
| సాధ్వి మాళవిదేవి | ,, | గర్భమును దాల్చియు | ,, |
| ప్రసవించే పుత్రికను | ,, | ఆమెయే సావిత్రి | ,, |
| పదహారు ఏండ్లు | ,, | పడ్డాయి తల్లికి | ,, |
| ఒకరోజు కళలోన | ,, | కనిపించె ఆమెకు | ,, |
| సత్యవంతుడనే | ,, | అతి సుందరాంగుడు | ,, |
| అతనిని ప్రేమించి | ,, | అతని బొమ్మను వేసె | ,, |
| తల్లిదండ్రికి తెలిపె | ,, | అతన్ని పెండ్లాడుదునని | ,, |
| అంతలో అరుదెంచె | ,, | నారద మహర్షి | ,, |
| సత్యవంతుని గూర్చి | ,, | తమకు తెలుపుమాని | ,, |
| పటమును చూపించె | ,, | నారదునికి రాజు | ,, |
| సాళ్వపతి యువరాజు | ,, | వీరాధి వీరుడు | ,, |
| విధివశముచే నితడు | ,, | రాజ్యమ్ము కోల్పోయె | ,, |
| వారి తలిదండ్రులు | ,, | అంధులై యున్నారు | ,, |
| వారిని సేవిస్తు | ,, | వనములో ఉన్నాడు | ,, |
| పెండ్లయిన తరువాత | ,, | సత్యవంతునకు | ,, |
| ఏడాది ఆయువు | ,, | మాత్రమే యున్నది | ,, |
| ఈ రీతిగా తెలిపె | ,, | నారదుడు అపుడు | ,, |
| ఆ రాజ దంపతులు | ,, | మిగుల చింతించిరి | ,, |
| ఎంత చెప్పినగాని | ,, | సావిత్రి వినదాయె | ,, |
| సత్యవంతునికి | ,, | సావిత్రినిచ్చి | ,, |

పెండ్లియైన చేసె ఉయ్యాలో
అడవిలో సావిత్రి ,,
అత్తమామల సేవ ,,
పతిభక్తినైనా ,,
ఆదరించుచుండె ,,
తన మాంగల్యమును ,,
లక్ష్మి గౌరమ్మలను ,,
అంతటా ఏడాది ,,
ఆరోజు తన భర్త ,,
అత్తమామల తోటి ,,
అడవికి పోతున్న ,,
వన విహారమునకు ,,
సత్యవంతుడు "
కట్టెలు కొట్టుచు "
గొడ్డలి ధరించి "
ప్రొద్దు గ్రుంకుచుండె "
శిరోవేదన యంచు "
భయమొందుచుండెను "
యముడు పాశంబుతో "
కనిపించెనపుడు "
చేతులెత్తి మ్రొక్కె "
పతివ్రతవు కాబట్టి "
యమ ధర్మరాజునని "
నేటితో నీ భర్త "
భర్త ప్రాణమును "
పోవుచుండె యముడు "
యముని వెంటాబడి "
పతిలేని సతి బ్రతుకు "
నాయి ప్రాణంబులు "

విధి తప్పదాని ఉయ్యాలో
అతి భక్తితోడ ,,
ఉత్తమంబుగ చేయ ,,
మరువకా ఎన్నడు ,,
అతిథి సత్పురుషులను ,,
నిలుపుమని నిత్యము ,,
ప్రార్థించు చుండె ,,
గడచి పోయినాది ,,
ఆఖరి దినమాని ,,
ఆజ్ఞను పొందియు ,,
భర్తతో సావిత్రి ,,
తాను వచ్చెదననెను ,,
అడవి లోపలాను "
తెచ్చె దాననుచును "
వృక్షములు ఛేదింప "
చీకటిపడుచుండె "
సతి ఒడిలో తలవాల్చె "
సావిత్రికి అపుడు "
సావిత్రి దేవికి "
సాధ్వి ఆ తల్లికి "
ఎవరయ్య మీరు "
నన్ను చూచితివంచు "
అపుడు చెప్పుచుండె "
అయువు దీరెనని "
బంధించుకున్నాడు "
సావిత్రి చూడంగ "
పోవుచుండే దేవి "
తనకేల యనుచును "
తీసుకొని పోవయ్య "

| | | | |
|---|---|---|---|
| నీకింకా ఆయువు | ఉయ్యాలో | చాల ఉన్నదనుచు | ఉయ్యాలో |
| వెను తిరిగిపోవమ్మ | " | రాలేవు ముందుకు | " |
| యముడు అదృశ్యమై | " | పోవుచుండెనపుడు | " |
| తన ఇష్ట దైవమ్ము | " | ప్రార్థించె సావిత్రి | " |
| యముడు మహిషముపైన | " | పోవుచుండుట గాంచి | " |
| రాజ ఓరాజ | " | యమధర్మరాజ | " |
| నేనింత దూరము | " | నీవెంట వచ్చితి | " |
| నా ప్రాణనాథుని | " | వదలి పొమ్మనగా | " |
| సావిత్రి మాటలకు | " | యముడు సంతసమొంది | " |
| కోరుకో ఒక వరము | " | పతి ప్రాణములు దప్ప | " |
| నా అత్తమామలు | " | రాజ్యములను బాసి | " |
| అంధులై అడవిలో | " | తిర్గుచున్నారనిన | " |
| వారికి దృష్టియు | " | రాజ్యమ్ము గూడ | " |
| ప్రాప్తించినదని | " | ఇక వెళ్లుమనెను | " |
| అంతటా యముడు | " | అదృశ్యమైపాయె | " |
| మరల సావిత్రియు | " | ఆ దైవకృపవల్ల | " |
| యముని వెంటాడుచు | " | పోవుచుండెనపుడు | " |
| క్రూర మృగములతోని | " | ఘోర అరణ్యములోన | " |
| యమధర్మరాజును | " | అనుసరించుచు నుండె | " |
| అదిగాంచిన యముడు | " | అడుదాన వనుచు | " |
| కోరుకొమ్మనుచును | " | ఇంకొక్క వరమును | " |
| నా తల్లిదండ్రులు | " | సంతు లేనివారు | " |
| ఈ వార్త విన్నను | " | వారు తాళాలేరు | " |
| నీ తల్లిదండ్రులకు | " | సంతానమిస్తి | " |
| పోయిరా అనుచును | " | పోవుచుండె యముడు | " |
| కఠినమైన యముని | " | మనసు కరిగింతునని | " |
| తన పతి ప్రాణములు | " | కాపాడుకొందునని | " |
| మళ్ళీ వెంటాడెను | " | యముని మార్గంబున | " |
| తిరిగిచూచె యముడు | " | కనులెర్ర జేసెను | " |

| | | | |
|---|---|---|---|
| నీ మీద జాలిచే | ఉయ్యాలో | రెండు వరమూ లిస్తి | ఉయ్యాలో |
| ఆగ్రహంబున అపుడు | ,, | యముడు పలుకూచుండ | ,, |
| రెండువరములు మీరు | ,, | ఇస్త్రీరీ గాని | ,, |
| ముచ్చటగ మూడవ | ,, | కోరిక తీర్చుమనె | ,, |
| అయిన కోరుకొమ్మ | ,, | మరియొక్క వరము | ,, |
| అదియును నీ పతి | ,, | ప్రాణములు దప్ప | ,, |
| పతిలేక యున్ననూ | ,, | పుత్రుని గాంచియు | ,, |
| కాలమ్ము గడుపుదు | ,, | దయ చేయుమయ్య | ,, |
| ఎనుక ముందాడక | ,, | ఆ యముడు అపుడు | ,, |
| సంతానమూ నీకు | ,, | ఇస్తి పొమ్మనెను | ,, |
| అంతలో సావిత్రి | ,, | యముని కడ్డము తిరిగె | ,, |
| రాజ-ఓ రాజా | ,, | ఓ ధర్మరాజా | ,, |
| నువ్వన్న మాటలు | ,, | ఎట్లు వర్తించు | ,, |
| పతిలేక సతులకు | ,, | సంతు ఎట్ల కలుగు | ,, |
| ఇది ఎట్టి ధర్మంబు | ,, | వివరించు మనిన | ,, |
| ఆ మాట వినియు | ,, | ఆశ్చర్యమొందియు | ,, |
| అమ్మ నీ పతిభక్తి | ,, | మెచ్చితీ నంచును | ,, |
| నీ భర్త ప్రాణములు | ,, | ఇస్తి పొమ్మనెను | ,, |
| నీకు సంతతి కలుగు | ,, | శుభములూ చేకూరు | ,, |
| దీవించి యముడు | ,, | తనదారి పోయెను | ,, |
| వెనుకకు మరలింది | ,, | సావిత్రి దేవి | ,, |
| శీఘ్రమే అప్పుడు | ,, | భర్త సన్నిధిచేరె | ,, |
| భర్తను లేచెను | ,, | నిద్రమేల్కొన్నట్లు | ,, |
| అత్తమామల చేరె | ,, | పతిని తోలుకొని | ,, |
| వృత్తాంత మంతయు | ,, | వారికి వివరించె | ,, |
| తిరిగి రాజ్యము వారు | ,, | పొందిరీ ముదమున | ,, |
| సుఖశాంతుల తోటి | ,, | వర్ధిల్లు చుండిరీ | ,, |
| ఈ పాట ఎవ్వరూ | ,, | పాడినా విన్నా | ,, |
| ఆయురారోగ్యములు | ,, | సుఖశాంతులు గలుగు | ,,10 |

సత్యవంతుడు తనకు స్వప్నంలో కనిపించాడని, ఆమె అతని చిత్ర పటాన్ని చిత్రించి తండ్రికి చూపించడం మూలంలో లేదు. జానపదుల కల్పన. అంతేగాక, యముడు వెళ్ళే దారి దుర్భేద్యంగా ఉందని, ఘోర అరణ్యమని, క్రూర మృగాలు ఉంటాయని చెప్పడం జానపదులు కల్పించిందే. చివరికి యమునితో తనకు సంతానం ప్రాప్తించాలనీ, సావిత్రి కోరుకోవడం కూడ మూలంలో లేని జానపదుల కల్పన. పతిలేకుండా సతికి సంతానం ప్రసాదించడంలో యముని అమాయకత్వం, సావిత్రి యుక్తిగా తన భర్త ప్రాణం సాధించుకోవడంలోని గడుసుదనం పైపాటలో చిత్రితమైనాయి. ఇటువంటి కల్పనలతో పరమసాధ్వి అయిన సావిత్రి కథను బతుకమ్మ పాటగా పాడుకోవడం జానపదుల కెంతో ఇష్టం.

మహాభారతానికి సంబంధించి, మూలానికి భిన్నంగా జానపదులు కల్పించుకున్న మరో కథ - "రాజరంపాల కథ":

పాండవులలో చివరివాడైన సహాదేవుని కుమారుడు రాజరంపాలుడు.

| | | | |
|---|---|---|---|
| రామ రామ రామ | ఉయ్యాలో | శ్రీరామ రామ | ఉయ్యాలో |
| ఢిల్లి ఏలేరాజులు | ,, | పంచపాండువులు | ,, |
| పెద్దవాడు ఉండె | ,, | అన్న ధర్మరాజు | ,, |
| భీముడు అయితే | ,, | సక్కని అర్జునుడు | ,, |
| నకుల సహాదేవ | ,, | ఐదుగురు వాళ్ళు | ,, |
| ఐదుగురు వాళ్ళు | ,, | రాజ్యమేలంగా | ,, |
| ఢిల్లి ఏలుకుంటు | ,, | వాళ్ళు ఉన్నారమ్మ | ,, |
| సహదేవునిగన్న | ,, | కొడుకు ఎవరమ్మ | ,, |
| రాజ రంపాల | ,, | కొడుకు ఉన్నాడమ్మ | ,, |
| పన్నెండు ఏండ్ల | ,, | బాలుడున్నాడమ్మ | ,, |
| చక్కని పాండువాలు | ,, | ఏమి జేయవట్టిరి | ,, |
| రంపాలు కైతే | ,, | లగ్గము చేత్తనాని | ,, |
| లగ్గము చేత్తనాని | ,, | బయిలెల్లినారు | ,, |
| బస్మగాంధీని | ,, | పట్నమ్ముల అయితే | ,, |

| పట్నమ్ము అయితే | ఉయ్యాలో | చేరబోయింద్రు | ఉయ్యాలో |
|---|---|---|---|
| బస్మ గాంధీని | " | భార్య యున్నదమ్మ | " |
| వారుగన్న బిడ్డ | " | ఎవరున్నారమ్మ | " |
| సత్యంబు గల్ల | " | ఆ రూపవతి | " |
| బాలాను చూడ | " | పాండవులు బోయిరి | " |
| రాజ ఓరాజ | " | ఓ భస్మరాయ | " |
| నీ బిడ్డ నయితే | " | ఇయ్యాలే రాజ | " |
| చక్కని పాండువాలు | " | అట్లు పలికినారు | " |
| బస్మరాయుడు | " | ఏమి మాటల్లు | " |
| తప్పకా బాలను | " | ఇస్తాను తండ్రి | " |
| లగ్గంబు నేను | " | చేస్తాను తండ్రి | " |
| కలి యుగానికి | " | కర్తలు మీరు | " |
| సత్యంబు గన్న | " | పాండవులు తండ్రి | " |
| ఆడితప్పలేరు | " | పలికి బొంకలేరు | " |
| చేతులా అభయంబు | " | చేసినారు వారు | " |

పాండవులు తమ కొడుకు రంపాలునికి భస్మరాయుని కూతురు రూపవతితో పెళ్ళిచేయ నిశ్చయించినారు సామాన్యంగా పెండ్లి కన్యాదాత గృహంలో జరుగుతుంది. కాని పాండవులు వివాహం తమ గృహంలో జరిపించాలని భస్మరాయునితో_

| రాజ ఓరాజ | ఉయ్యాలో | ఓ భస్మరాయ | ఉయ్యాలో |
|---|---|---|---|
| లేక లేక మాకు | " | ఒక్క కొడుకూను | " |
| మన పట్నముల | " | మేమును లగ్గంబు | " |
| మాయింటి కాడ | " | లగ్గము చేసుకుందాము | " |
| మీ పిల్లనయితే | " | మాకు ఇయ్యాలె | " |
| మా ఇంటికి మీరు | " | రావాలె రాజా | " |
| చక్కని పాండువాలు | " | అట్లు పలికినారు | " |
| బస్మరాయుడైతే | " | ఏమని మాటల్లు | " |
| తప్పకిత్తు నాని | " | తాను పలికినాడు | " |

| | | | |
|---|---|---|---|
| బిడ్డనూ అయితే | ఉయ్యాలో | చేతిలో పెట్టిండు | ఉయ్యాలో |
| కాళ్ళు మొక్కినాడు | " | సాగ నంపినాడు | " |
| డిల్లీకి అయితే | " | రూపవాతి దేవి | " |
| పాండవుల తోటి | " | చేర వచ్చినాది | " |
| చక్కని ఢిల్లీలో | " | ఏమి తయారు | " |
| ఆకాశ మెత్తు | " | పందిర్లు ఏసి | " |
| భూలోకమంత | " | పీటలు వరచి | " |
| పచ్చని తోరణాలు | " | వారు కట్టినారు | " |
| ఊరూరు కైతే | " | ఉత్తరాలు వేసి | " |
| పల్లె పల్లేకు | " | పత్రికలు పంపి | " |
| లగ్గము తయారు | " | వారు చేసినారు | " |
| చుట్టాలు అంత | " | ఢిల్లీ కొచ్చినారు | " |
| పచ్చని పందిట్ల | " | లగ్గము పోలు నయితే | " |
| లగ్గము పోతల్లు | " | వాళ్ళు పోసినారు | " |
| వారికి లగ్గమ్మ | " | అట్ల అయ్యింది | " |

రాజరంపాలునికి రూపవతితో వివాహం జరిగింది. పెండ్లి తరువాత నాగవెళ్ళి కావాలి. పచ్చని పందిరి క్రింద నాగవెల్లి పోలు పోశారు. ఆ నాగ వెళ్ళి పోలుమీద భార్యాభర్తలు కూర్చున్నారు. ఈ వైభవాన్నంతా దేవలోకంలో ఉన్న రంభ చూసింది. రాజరంపాలుని వైభోగానికి ఈర్ష్యపడి నాగవెళ్ళి ఆపాలని రంభ భూలోకానికి వస్తుంది.

| | | | |
|---|---|---|---|
| దేవుడు ఏలేటి | ఉయ్యాలో | దేవ లోకాన | ఉయ్యాలో |
| దేవేంద్రుడు గన్న | " | బిడ్డ ఉన్నదమ్మా | " |
| ఆ దేవి రంభ | " | ఏమి చేయ వట్టె | " |
| ఎరుకలి వేషంబు | " | ఆమె కట్టుకోని | " |
| నెత్తిని బుట్ట | " | నెలమంచి కొప్పు | " |
| ఢిల్లికినైతే | " | చేర వచ్చినాది | " |
| పచ్చని పందిర్లు | " | కళ్ళ చూసినాది | " |

అబ్బబ్బ పీని ఉయ్యాలో
రూపవాతినైతే ,,
నాగెల్లి మీదికి ,,
అద్దాల కట్ట ,,
బంగారు బల్లి ,,
కొప్పుల్ల అది ,,
మాయ లోకమయితే ,,
దేవలోకాన ,,
పొద్దుందాకాను ,,
తెల్లందాకాను ,,
చక్కని రూపవాతి ,,
బ్రాహ్మణులైతే ,,
ఎక్కడా జూసినా ,,
తండ్రిరా వోతండ్రి ,,
లగ్గంబు అయితే ,,
నాగెల్లి అయితే ,,
చక్కని పాండవులు ,,
పంచపాండువలు ,,
కొడుకురా ఓకొడుక ,,
పచ్చని పందిట్ల ,,
ఎక్కడాను నీవు ,,
ఏమి నీ కష్టంబు ,,
చక్కని భీముడు ,,
గంగ తానానికి ,,
గంగ తీరానైతే ,,
అటాకు నీవు ,,
కానింబావ తోట ,,

అధికారమేమి ఉయ్యాలో
పెండ్లి ఆడినాడు ,,
చేర వచ్చినాడు ,,
మీదికెళ్ళి దింపి ,,
చేసుకున్నదమ్మ ,,
సవరించుకోని ,,
మల్లి ఎల్లిపాయె ,,
ఏమి చేయవట్టె ,,
పూలదండ జేసె ,,
మనిషిని చేసె ,,
పచ్చని పందిట్ల ,,
వచ్చి చూచిండ్రు ,,
రంపాలుడు లేడు ,,
ఓ ధర్మరాజ ,,
అయినాది తండ్రి ,,
వారికి గాలేదు ,,
అట్లు చెప్పినారు ,,
ఏమి చేయవట్రి ,,
రాజ రంపాల ,,
పసుపు బట్టల్ల ,,
పోతివారా కొడుకా ,,
నీకు వచ్చినాది ,,
ఏమి చేయబట్టె ,,
నీవు బోతివ కొడుక ,,
కలెజూసి వచ్చి ,,
పోతివార కొడుక ,,
కలెజూసివచ్చె ,,

ఎరుకలి వేషంతో రంభ వచ్చి రాజరంపాలున్ని దేవలోకానికి తీసుకుని పోయింది. నాగవెల్లి పందిట్లో అదృశ్యమైపోయిన రంపాలుడు ఎక్కడి వెళ్లాడోనని భీముడు పరిసరాలన్నీ తిరుగుతూ గంగతీరానికి, కాసింబావ తోటకు వెళ్ళి చూశాడు ఎక్కడా కనిపించలేదు. ఇక్కడ జానపదులు తమకు పరిచయమున్న 'కాసింబావ తోట'ను కూడా పై పాటలో కల్పించారు. ఈ విధంగా తమ కొడుకు అదృశ్యమయ్యాడన్న దిగులుతో, కొడుకు లేని కోడలు మన ఇంట్లో ఉండవద్దని, పాండవులంతా కలసి రూపవతిని ఒంటిస్తంభం మేడ కట్టించి అందులో ఉంచుతారు.

| కొడుకు లేని కోడలు | ఉయ్యాలో | ఉండరాదు అని | ఉయ్యాలో |
|---|---|---|---|
| ఊరు కుప్పారోళ్ళను | ,, | పిలిపించినారు | ,, |
| వారికి పనూల్లు | ,, | ఏమి చెప్పవట్రి | ,, |
| నా కొడుక రార | ,, | ఉప్పారి వాడ | ,, |
| శుక్కా రారమ్మ | ,, | చక్కన్ని ఘడియ | ,, |
| ఊరు కుత్తరాన | ,, | పాద దక్షిణాన | ,, |
| కారండ పదవి | ,, | కంచాల మర్రి | ,, |
| పిట్టపీచు మనని | ,, | అది పిరికి అడవి | ,, |
| పామన్న పారదే | ,, | అది పిరికి అడవి | ,, |
| దోమన్న పారదే | ,, | దోసకారి అడవి | ,, |
| ఆ అడవిలోన | ,, | ఏడు గడియల్లో | ,, |
| ఒంటి స్థంభంబు | ,, | మేడ గట్టవాలె | ,, |
| ఉప్పరోళ్ళు అయితే | ,, | ఏమి చెప్పినారు | ,, |
| చేద్దాము రాజ | ,, | అందుకేమి పర్వ | ,, |
| గడ్డపార లయితే | ,, | మాకు ఇయ్యి రాజ | ,, |
| జాగల్లు అయితే | ,, | చూపియ్యమాని | ,, |
| ఉప్పారి వాడ | ,, | అట్లు చెప్పినారు | ,, |
| ఏడు గడియల్లు | ,, | మాలు గట్టినారు | ,, |
| మాలు గట్టినారు | ,, | ఇంటి కొచ్చినారు | ,, |

ఆ విధంగా కట్టిన మేడలో రూపవతిని ఉంచి ఇద్దరు దాసీలను తోడు ఇచ్చారు. ఎప్పటికైన తన భర్త రంపాలుడు ఆ మేడకు వస్తాడని చెప్పా పాండవులు. మామల మాటకు ఎదురుచెప్పని రూపవతి దుఃఖంతో అక్క మాలు (మహల్) లో ప్రవేశించింది.

| | | | |
|---|---|---|---|
| వలవల తల్లి | ఉయ్యాలో | వల పోసుకుంటు | ఉయ్యా |
| మామాల కాళ్ళు | ,, | తాను మొక్కినాది | ,, |
| అత్తరో ఓ అత్త | ,, | పొన్నమా దేవి | ,, |
| పాదాలు అయితే | ,, | తాను మొక్కినాది | ,, |
| వలపోసుకుంటు | ,, | బయిలెల్లినాది | ,, |
| దాసీల నయితే | ,, | తాను తీసుకోని | ,, |
| తాను తీసుకోని | ,, | బయిలెల్లినాది | ,, |
| పోయేది దాసీల | ,, | వాళ్లు పిలుసుకోని | ,, |
| దాసి బిడ్డలారా | ,, | నా బిడ్డలారా | ,, |
| నా కొడుకూ నయితే | ,, | రాజ రంపాల | ,, |
| సచ్చిండో బతికిండో | ,, | మాకు తెలియలేదు | ,, |
| మా కోడలయితే | ,, | రూపవాతి బిడ్డ | ,, |
| ఆ బిడ్డకాద | ,, | ఉండుండ్రె బిడ్డ | ,, |
| ఉప్పు ఎయ్యంది | ,, | పప్పు పెట్టాలె | ,, |
| ఉడికి ఉడుకంది | ,, | అన్నం పెట్టవాలె | ,, |
| ఓనాడు దిన్నట్టు | ,, | ఓనాడు పన్నట్టు | ,, |
| కడుపునిండ దానికి | ,, | అన్నం పెట్టొద్దు | ,, |
| నా కొడుకూ నయితే | ,, | లేడురా ఓబిడ్డ | ,, |
| సావకుంటా దాన్ని | ,, | లేవకుంటా దాన్ని | ,, |
| అట్ల మీరు దాన్ని | ,, | సూసుకోండ్రె బిడ్డ | ,, |
| పంచ పాండువాలు | ,, | అట్లు చెప్పినారు | ,, |
| ఇద్దరూ దాసీల | ,, | ఆ రూపావాతి | ,, |
| తోలుకోని అయితే | ,, | చేరబోయినాది | ,, |
| ఆ మాలుమీద | ,, | వారు ఉన్నారమ్మా | ,, |
| వాళ్లు చెప్పినట్లు | ,, | చేసెనే దాసీలు | ,, |

| | | | |
|---|---|---|---|
| ఉప్పు ఎయ్యకుండ | ఉయ్యాలో | పప్పు ఎయ్యవట్టి | ఉయ్యాలో |
| ఉడికి ఉడుకంది | ,, | అన్నం పెట్టవట్టి | ,, |
| ఓపూట తిన్నట్టు | ,, | ఓపూట పన్నట్లు | ,, |
| రూపవాతి నయితే | ,, | అట్లు చూసుకోని | ,, |
| చక్కని రూపవాతి | ,, | మాలు మీద తల్లి | ,, |
| ఏమిచేతు నేను | ,, | ఎందుబోదు నేను | ,, |
| నాథరో ఓ నాథ | ,, | నా ప్రాణనాథ | ,, |
| ఎక్కడ బోతివి | ,, | రాజ రంపాల | ,, |
| మనకునూ లగ్గంబు | ,, | అయినాది తండ్రి | ,, |
| నాగెల్లి అయితే | ,, | మనకు కాలేదు | ,, |
| పచ్చని పందిట్ల | ,, | పసుపు బట్టల్ల | ,, |
| ఎక్కడికి నువ్వు | ,, | ఎల్లిపోతివయ్య | ,, |
| నన్ను ఇక్కాడ | ,, | ఉంచిపోతివయ్య | ,, |
| తల్లి రాయెతల్లి | ,, | నన్నుగన్నతల్లి | ,, |
| నన్నుగన్నా తల్లి | ,, | రాత రాయలేదు | ,, |
| నన్నుగన్న తండ్రి | ,, | ఓ భస్మరాయ | ,, |
| ఎక్కడున్నవయ్య | ,, | నన్ను గన్నతండ్రి | ,, |
| చెట్టుకు చెట్టుకు | ,, | ధీము ఉండెనయ్య | ,, |
| నాకునూ ఎవ్వరూ | ,, | దిక్కులేకపోయిరి | ,, |
| వలవల తల్లి | ,, | వల పోసుకుంటు | ,, |
| మాలు లోపలాను | ,, | అమె ఉన్నదమ్మా | ,, |
| అక్కడీ ముచ్చటా | ,, | అక్కడ ఉండంగ | ,, |
| ఇక్కడీ ముచ్చాట | ,, | ఇనుడి జనులారా | ,, |
| దేవ లోకాన | ,, | అది మాయ రంభ | ,, |
| పొద్దుందాక అది | ,, | పూల దండజేసె | ,, |
| తెల్లందాక అది | ,, | మనిషిని చెయ్యవట్టె | ,, |
| ఆనాడు దినమందు | ,, | అది మధ్యమందు | ,, |
| యామినీ ఏషంబు | ,, | అది గట్టినది | ,, |
| ఎరుకలీ ఏషంబు | ,, | అది గట్టినాది | ,, |

నెత్తినా బుట్టను ఉయ్యాలో
చేతులా కోలను ,,
ఢిల్లీకి అయితే ,,
పాండవుల ఇంటికి ,,
ఎరుకో రోయమ్మ ,,
ఎరుక చెప్తనాని ,,
పాండవుల దాసీలు ,,
చక్కని పాండువాలు ,,
బిడ్డ రాయెబిడ్డ ,,
మేమొక్క మాటను ,,
దాలిన్ని హారాలు ,,
మనసుల్ల మాట ,,
చక్కని పాండువాలు ,,
చెప్పవట్టె అప్పుడు ,,
ఎరుకలీ వేషమున ,,
తండ్రి రాఓతండ్రి ,,
మీరుకన్నా కొడుకు ,,
మీ కోడలుండె ,,
వారికీ లగ్గంబు ,,
నాగెల్లి అయితే ,,
పచ్చని పందిట్ల ,,
మాయ లోకంనుంచి ,,
అర్ఘాల కట్ట ,,
బంగారు బల్లిని ,,
కొప్పుల్ల అది ,,
మాయలోక మయితే ,,
పొద్దుందాక అది ,,
తెల్లందాక అది ,,
అయ్యని మాటల్లు ,,

నెలమంచి కొప్పు ఉయ్యాలో
అది పట్టుకొని ,,
చేరవచ్చినాది ,,
అది పోయినాది ,,
ఎరుక చెప్తనాని ,,
వాడవాడ తిర్గి ,,
అది విన్నరమ్మ ,,
పిలిపించిరి దాన్ని ,,
ఎరుకాలి బిడ్డ ,,
అడుగుతామె బిడ్డ ,,
ఇస్తాము గాని ,,
చెప్పుతావె బిడ్డ ,,
అట్లు అడిగినారు ,,
చక్కని ఎరుకలిది ,,
ఆ మాయరంభ ,,
ఓ ధర్మరాజ ,,
రాజ రంపాల ,,
రూపవాతీ దేవి ,,
అయినాది తండ్రి ,,
వారికి గాలేదు ,,
వసుపు బట్టల్ల ,,
మాయ రంభావచ్చి ,,
మీదికెళ్ళి దింపి ,,
చేసుకున్న దయ్యా ,,
సవరించుకొని ,,
మల్లి ఎల్లిపాయె ,,
పూల దండజేసె ,,
రాజూను జేసె ,,
అట్ల చెప్పినాది ,,

| | | | |
|---|---|---|---|
| చాలన్ని హారాలు | ఉయ్యాలో | వారు పెట్టినారు | ఉయ్యాలో |
| గంపలో హారాలు | ,, | అది పోసుకోని | ,, |
| కారండ పడవికి | ,, | చేరవచ్చినాది | ,, |
| రూపవాతి నయితే | ,, | మాలు కింద అది | ,, |
| ఎరుక చెప్తనాని | ,, | కేకల్లు పెట్టి | ,, |
| రూపవతి దాసీలు | ,, | దానిచూసినారమ్మ | ,, |
| దొరసాని రాయె | ,, | ఓ రూపవాతి | ,, |
| ఎక్కన్నుంచి వచ్చె | ,, | చక్కన్ని ఎరుకల్ది | ,, |
| మనరాజు జాడలు | ,, | అడుగుదాము మనము | ,, |
| చక్కని దాసీలు | ,, | అట్లు పల్కినారు | ,, |
| పిలువుమాని చెప్పె | ,, | ఆ రూపవాతి | ,, |
| మాలు క్రిందికయితే | ,, | అది వచ్చినాది | ,, |
| రూపవాతి నయితే | ,, | ఏమి అనవట్టె | ,, |
| తల్లిరో ఓతల్లి | ,, | ఎరుకాలి తల్లి | ,, |
| మనసులోని మాట | ,, | అడుగుతానే తల్లి | ,, |
| మాట చెప్పితే | ,, | చాలన్ని హారాలు | ,, |
| చాలన్ని హారాలు | ,, | పెట్టెదానె తల్లి | ,, |
| రూపవాతి అయితే | ,, | అట్లా పల్కినాది | ,, |
| ఎరుక చెప్తనాని | ,, | చక్కనీ ఎరుకల్ది | ,, |
| తల్లిరో ఓతల్లి | ,, | ఓ రూపవాతి | ,, |
| నీ భర్త నయితే | ,, | రాజ రంపాల | ,, |
| మీక లగ్గంబు | ,, | అయినాది తల్లి | ,, |
| నాగెల్లి అయితే | ,, | కాలేదు తల్లి | ,, |
| పచ్చనిపందిట్ల | ,, | పసుపుబట్టల్ల | ,, |
| మాయలోకం నుంచి | ,, | మాయ రంభవచ్చె | ,, |
| అర్రాల కట్టి | ,, | మీదికెల్లి దింపి | ,, |
| బంగారు బల్లి | ,, | అది చేసుకోని | ,, |
| కొప్పుల్ల అది | ,, | సవరించుకోని | ,, |
| మాయలోకమయితే | ,, | ఎల్లిపాయెతల్లి | ,, |

పొద్దుందాక అది ఉయ్యాలో
తెల్లందాక అది ,,
రాజు అవతారంబు ,,
ఇయ్యాటి దినమందు ,,
రంపాలు దయితే ,,
దర్వాజ లయితే ,,
అన్నంబు లయితే ,,
నీ భర్త అయితే ,,
చక్కని ఎరుకల్ది ,,
పోతన్ననాని ,,
దిగ్గున్న లేచి ,,
చక్కని రూపవాతి ,,
సంతోషపాడె ,,
మారాజు అయితే ,,
తడిగిడి తానాలు ,,
నీళ్ళు ఆరేదాకా ,,
నీళ్ళ ఆరినాక ,,
తీరుబొమ్మల నడుమ ,,
బారిబొమ్మల నడుమ ,,
కురుచబొమ్మల నడుమ ,,
వంటనూ తాయారు ,,
ముప్పయి ఏడుకూరలు ,,
డెబ్బయి ఏడుకూరలు ,,
అరవయి ఏడుకూరలు ,,
వంటనూ తయారు ,,
అనాడు అఘడియ ,,
దాసీలు అయితే ,,
అన్నంబు తీని ,,
చక్కని రూపవాతి ,,

పూలదండజేసే ఉయ్యాలో
మనిషిని చేసి ,,
చేస్తుంది తల్లి ,,
ఈ మధ్య మందు ,,
నీ యింటికొచ్చు ,,
వెయ్యాకె తల్లి ,,
వండి పెట్టవమ్మ ,,
నీ యింటికోచ్చు ,,
అట్లు చెప్పినాది ,,
దిగ్గున్న లేచి ,,
ఎల్లిపోయింది ,,
ఏమిచెయ్యవట్టె ,,
సంబూరపాడె ,,
మాయింటికొచ్చు ,,
తల్లి చేసినాది ,,
నీలంచు చీర ,,
పట్టంచు చీర ,,
తీరుమన్ని బొట్టు ,,
బంగారి బొట్టు ,,
కుంకుమ్మ బొట్టు ,,
తల్లి చేయబట్టె ,,
తల్లి చేయబట్టె ,,
దేవనాల పెర్గు ,,
అల్లపు పచ్చడా ,,
తల్లి చేసినాది ,,
పొద్దుగూకినాది ,,
అన్నంబు తీని ,,
పవళించినారు ,,
ఏమి చేయబట్టె ,,

| | | | |
|---|---|---|---|
| పట్టె మంచెమేసి | ఉయ్యాలో | పరుపుల్లు పరచి | ఉయ్యాలో |
| రాజు వస్తాడని | ,, | చూడానెబట్టె | ,, |
| కల్కి గాంధారి | ,, | మాంధారి యాల్ల | ,, |
| బస్మయ్య కట్టె | ,, | కోరు కొని యాల్ల | ,, |
| ఊరు వెళ్లి ఊరు | ,, | తిరుగాని యాల్ల | ,, |
| రాజ రంపాల | ,, | చేర వచ్చినాడు | ,, |
| చక్కని రూపవాతి | ,, | ఏమి చేయబట్టె | ,, |
| చెంబుతోటి నీళ్లు | ,, | చేత యిచ్చినాది | ,, |
| కాళ్లుకడిగి నీళ్లు | ,, | పైజల్లుకోని | ,, |
| ఇంటికి అయితే | ,, | రాజు వచ్చినాడు | ,, |
| వచ్చిన రాజుకు | ,, | అన్నంబు పెట్టె | ,, |
| రాజ రంపాల | ,, | అన్నంబు తీను | ,, |
| డెబ్బయి ఆరుకూరలూ | ,, | దేవనాల పెర్గు | ,, |
| అరవయి ఆరుకూరలు | ,, | అల్లపు పచ్చడా | ,, |
| ముప్పయి ఏడుకూరలు | ,, | ములకపూల చారు | ,, |
| జాలి చెంబుతోటి | ,, | నీళ్ళు పెట్టినాది | ,, |
| అప్పుడు ఆ రాజూ | ,, | అన్నంబు తీని | ,, |
| అన్నంబు తిని | ,, | ఇంత అన్నముంచె | ,, |
| ఎంగిలి అన్నంబు | ,, | పల్లెములో ఉంచి | ,, |
| చెయ్యిగడిగినాడు | ,, | మూతి గడిగినాడు | ,, |
| మూతి గడిగినాడు | ,, | లేచి వచ్చినాడు | ,, |
| ఎంగిలి అన్నంబు | ,, | తాను తిన్నాది | ,, |
| వచ్చేవార కయితే | ,, | రాజు పోయినాడు | ,, |
| గాధ నిద్రల్లు | ,, | రాజు పోయినాడు | ,, |
| మాట్లాడలేదు | ,, | ముచ్చాటలేదు | ,, |
| ఊ అన్న మాట | ,, | తల్లికి లేదు | ,, |
| వలవల తల్లి | ,, | వలపోసుకుంటు | ,, |
| నిన్నమొన్న పోయి | ,, | ఇయ్యాల వచ్చి | ,, |
| నీ నోటి మాట | ,, | ఇనబోతినయ్యా | ,, |

తినివచ్చెవారకు ఉయ్యాలో
వలబోసుకుంటు ,,
అక్కడ ముచ్చాట ,,
మాయరంభ అయితే ,,
ఇంత సేపు అయె ,,
మాలూకు అయితే ,,
బాలున్ని అయితే ,,
నోట్లె బియ్యంబు ,,
కషభీష నమిలి ,,
రూపవాతి యొక్క ,,
ఛాతిమీదనయితే ,,
రాజుమీద అది ,,
అద్దాల కట్ట ,,
బంగారు బల్లి ,,
కొప్పుల్ల అది ,,
మాయ లోకమయితే ,,
అక్కడ ముచ్చట్లు ,,
రూపవాతి నయితే ,,
దిగ్గున్న లేచి ,,
కలికి పొద్దువిడిచి ,,
దసరా పొద్దువిడిచి ,,
దిగ్గున్న లేచి ,,
నాలుగు దిక్కుల్ల ,,
ఎక్కడ జూసినా ,,
రంపాలు దయితే ,,
నాల్గు దిక్కుల్లు ,,
మాలు మీదనయితే ,,

పంటీవి అని ఉయ్యాలో
పవళించి నాది ,,
అట్లనే ఉండంగ ,,
చూడనే వచ్చె ,,
రాకపోయె రాజు ,,
చేరవచ్చినాది ,,
కండ్ల జూచినాది ,,
అది ఏసుకోని ,,
ఆమె ఛాతిమీద ,,
ఛాతిమీద నయితే ,,
పడ ఊంచినాది ,,
ఏమి చెయ్యవట్టె ,,
మీదికెళ్ళి దింపి ,,
మల్లి చేసినాది ,,
సవరించుకోని ,,
మల్ల ఎల్లిపాయె ,,
అట్లనె ఉండంగ ,,
ఏమి చెయ్యవట్టె ,,
ఆ రూపావాతి ,,
కారండ పెక్క ,,
దర్వాజ మీద ,,
అటు ఇటు జూసి ,,
కలె జూసినాది ,,
ఎవ్వారు లేరు ,,
లేదాని చెప్పె ,,
కలె జూసినాది ,,
తల్లి జూసినాది ,,11

ఎంగిలి అన్నం తిన్న రూపవతి గర్భం దాలుస్తుంది. ఈ విషయం తెలిసిన భీముడు రూపవతిని చంపి రమ్మని తలారులకు ఆజ్ఞాపించాడు. వారు

ఆమెను చంపక వదలి పెడుతారు. కొంత కాలానికి రూపవతికి పుత్రుడు జన్మిస్తాడు. పార్వతి మంత్రసాని రూపంలో వచ్చి ఆ పుత్రుని తీసుకొని ఒక కంసాలి దంపతులకు ఇస్తుంది. రూపవతికి పుట్టిన కొడుకు మరణించాడని పార్వతి రూపవతితో చెప్పుతుంది.

రూపవతి కొడుకు భూపాలుడనే పేరుతో ఒక రాజ్యానికి రాజయ్యాడు. ఒకసారి అతడు రూపవతిని చూసి తన తల్లి అని తెలియక ఆమెను మోహించాడు. ఒకరాత్రి భూపాలుడు రూపవతి దగ్గరకు వెళ్ళుతుండగా శ్రీకృష్ణుడు బ్రాహ్మణ వేషంలో వచ్చి భూపాలుని అడ్డగించి, రూపవతి అతని తల్లి అని తెలిపి, అతని జన్మ వృత్తాంతం అంతా వివరిస్తాడు. భూపాలుడు తాను చేసిన పొరపాటుకు చింతించి శ్రీకృష్ణునితో పాండవుల దగ్గరకు వెళ్లుతాడు. వారందరు కలసి దేవలోకానికి వెళ్ళి రంభను బంధించి తండ్రి రంపాలుని విడిపించుకొని ఢిల్లీకి తిరిగి వస్తారు. రంపాలునికి రూపవతికి వివాహమై నాగవెళ్ళి కాలేదు కాబట్టి, వారి కుమారుడు భూపాలుడే స్వయంగా తన తల్లిదండ్రులకు నాగవెళ్ళి జరిపిస్తాడు.

ఈ రకంగా జానపదులు మహాభారతానికి సంబంధించిన గాథలను మూలానికి భిన్నంగా సృష్టించి బతుకమ్మ పండుగ సందర్భంలో పాటలుగా పాడుకుంటారు.

## భాగవతానికి సంబంధించిన పాటలు

రామాయణ మహాభారతాల తరువాత జానపదులు ఎక్కువగా అభిమానించే గ్రంథం భాగవతం. సాక్షాత్ భవత్స్వరూపుడయిన శ్రీకృష్ణుని లీలలు, హరిభక్తుల మహిమలు భాగవతంలో ఎక్కువగా కనిపిస్తాయి. యశోద మాతృ వాత్సల్యం, రాధాకృష్ణుల అమరప్రేమ జానపదుల హృదయాలలో ముద్ర వేసుకున్నాయి. జానపదులు శ్రీకృష్ణుని అల్లరి పనులకు, చిలిపి చేష్టలకు పరవశించి ఎన్నో పాటలు పాడుకున్నారు. శ్రీకృష్ణుని పుట్టుక మొదలు అవతార పరిసమాప్తివరకు అతని లీలలు కథలుగా, పాటలుగా జానపద సాహిత్యంలో చోటు చేసుకున్నాయి. బతుకమ్మ పండుగ సందర్భంలో కృష్ణుని లీలలను వర్ణిస్తూ పాడిన పాటలు ఎన్నో ఉన్నాయి.

శ్రీకృష్ణుడు బాల్యంలో బంతితో ఆడుకుంటున్నప్పుడు ఆ బంతి ఒక గోపికకు తగులుతుంది. అపుడు కృష్ణునికి గోపికకు జరిగిన సంవాదం ఈ పాటలో కనిపిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| బజార్ల కృష్ణుడు | కోల్ | బంతూలాడంగా | కోల్ |
| బంతిపోయె గొల్లదాన | ,, | బోడిమల్లెచెక్కా | ,, |
| బంతితీయె గొల్లదాన | ,, | బోడిమల్లెదాన | ,, |
| నా బంతి నా కియ్యే | ,, | నత్తిగొల్లాదాన | ,, |
| నీ బంతి నీ కియ్యా | ,, | నిన్ను నే విడువా | ,, |
| నీ బంతి నీ కియ్యా | ,, | నా దొక్క ముచ్చటుంది | ,, |
| ముత్యాల కడుప మీద | ,, | వజ్రాల ముగ్గు | ,, |
| వజ్రాల కడుప మీద | ,, | పవడాల ముగ్గు | ,, |
| మాపటికి రావయ్యా | ,, | మాయల్లా కృష్ణా | ,, |
| మాపటికి మీవాడా | ,, | ఎందుకూ రావాలే | ,, |
| మా యత్త నెల్లూరు | ,, | చల్లమ్మవాయె | ,, |
| మా మామ మల్లెపూల | ,, | తోటాకుబాయె | ,, |
| ఇంతి నను ఎరుగావె | ,, | గోవిందూడనుచు | ,, |
| నల్లావు తెల్లావు | ,, | నేనెరుగానైతి | ,, |
| నెలత నన్నెరుగావె | ,, | నాగేంద్రూడనుచు | ,, |
| నల్లావు తెల్లవు | ,, | నేనెరుగానైతి | ,, 12 |

కృష్ణుడు ఒకనాడు వీధిలో బంతిఆట ఆడుకుంటున్నాడు. ఆ సమయంలో ఒక గోపిక అటువైపు నుండి వెళ్ళుతుంది. బంతి ఆమెకు తగిలింది. ఆ గోపిక బంతిని తీసి దాచిపెట్టింది. తన బంతి తనకివ్వమని కృష్ణుడు ఎంత వేడుకున్నా ఆమె ఇవ్వలేదు. శ్రీకృష్ణుడు ఆమెను అనేక రకాలుగా బోడి మల్లెదాన, బోడి మల్లె చెక్క, నత్తిగొల్లదాన అని వెక్కిరించాడు. అయినా ఆమె కృష్ణునికి బంతి ఇవ్వకుండా "నిన్నూ నేనిడువా - నాదొక్క ముచ్చటుందీ'' అంటూ తన కోరికను తెలిపింది. అత్త నెల్లూరుకు చల్ల అమ్మ పోయిందని, మామ మల్లెతోటకు వెళ్ళాడని చెప్పి రాత్రికి కృష్ణున్ని తన ఇంటికి రమ్మంటుంది. కృష్ణుడు మాత్రం, తనకు ఏమి తెలియదని, నల్లావుకు తెల్లావుకు ఉన్న భేదం కూడ తెలియని

అమాయకుడనని చెప్పుతాడు. కృష్ణుడు తానే గోవిందుడనని, నాగేంద్రుడనని, బంతి యిచ్చి విడిచి పెట్టుమని గోపికతో అంటాడు.

బాల కృష్ణుని చేష్టలన్నీ నర్మగర్భోక్తులతో ఉంటాయి. అంతకంటే వ్యంగ్యంగా, కొంటెగా జానపదులు కృష్ణుని చేత చిలిపి పనులు చేయించి తమ ముచ్చట తీర్చుకుంటారు. ఈ పాటను ఎక్కువగా కన్యలు 'బతుకమ్మ'ను ఆడే టప్పుడు లయబద్ధంగా చప్పట్లు చరుస్తూ పాడుకుంటారు.

తల్లులు పిల్లలకు రకరకాల అలంకారాలు చేసి, తమ ముచ్చట తీర్చు కుంటారు. ఎంత సేపు తల్లికి పిల్లవాడు వీధిలో ఆడుకొని ఇంటికి రాగానే అలంకారం చెదిరిపోయిందోమోనని, తాను వేసిన నగలన్నీ ఉన్నాయో లేదోనన్న తలంపే ఉంటుంది.

కృష్ణయ్య వీధిలో ఆడుకొని ఇంటికి రాగానే యశోదమ్మ అంతకు ముందు తాను కృష్ణుని వేలుకు తొడిగిన ఉంగరం ఉందో లేదోనని చూస్తుంది. ఉంగరం కనిపించలేదు. ఆ ఉంగరం ఏమైందని ఆమె కృష్ణుని నిలదీస్తుంది. కాని కృష్ణుడు ఆ ఉంగరం ఏ గోపికకు ఇచ్చాడో ఏమో! రకరకాల కారణాలు చెపుతూ తల్లిని మభ్యపెడతాడు. ఈ భావాన్ని తెలిపే పాట-

| | | | |
|---|---|---|---|
| నీ వ్రేలి ఉంగరమ్ము | ఉయ్యాలో | ఏదిరా కృష్ణయ్య | ఉయ్యాలో |
| పాలు పిండాబోతె | ,, | పాలల్ల పడెనేమొ | ,, |
| పట్టు బట్టా తెచ్చి | " | పాలన్ని వడపోసి | " |
| ఇండ్ల లేదుర కృష్ణా | " | మాయదారి కృష్ణ | " |
| చల్ల చేయబోతే | ,, | చల్లల బడెనేమొ | " |
| సైను బట్టా తెచ్చి | " | చల్లంత వడబోసె | " |
| ఇండ్ల లేదురా కృష్ణా | " | మాయదారి కృష్ణా | ,, |
| బట్ట లుతుకాబోతె | " | బాయిల్ల పడెనేమొ | " |
| బాయిలా నీళ్ళన్నీ | " | బండల్ల బోయించి | " |
| ఇండ్ల లేదుర కృష్ణా | " | మాయదారి కృష్ణ | " |
| శెల్లలుతుకాబోతే | " | చెర్లల్ల బడెనేమొ | " |
| చెర్లయీ నీళ్ళన్నీ | " | చెట్లకూ బోయించి | " |
| ఇండ్ల లేదుర కృష్ణా | " | మాయదారి కృష్ణ | "13 |

అని కృష్ణుడు తల్లి అడిగిన ప్రశ్నలకు ఈ రకంగా సమాధానమిస్తాడు. కృష్ణుడెలాగు అల్లరివాడు, కొంటెవాడు. అందుకే జానపద స్త్రీలందరికీ లోకువ. కృష్ణుడు పరమాత్మ అని కూడా మరచి అతనిచేత బట్టలుతికించడం, పాలు పిండించడం, చల్ల చేయించడం మొదలైన పనులన్నీ చేయిస్తారు. వీరి దృష్టిలో రాముడు, కృష్ణుడు అందరూ తమ బిడ్డల వంటి సామాన్య బాలురే. బిడ్డలపై తల్లులకు అధికారం ఉన్నట్లే, కృష్ణునిపై గూడ జానపద స్త్రీలకు ప్రేమ, అధికారం ఉంటుంది.

ఇంకా శ్రీకృష్ణుడు చేసే అల్లరి పనులు, కొంటే పనులు, శృంగారపు చేష్టలు క్రింది పాటలో జానపదులు ఎంతో రమ్యంగా చిత్రించారు:

పెద్ద పెద్ద దొడ్లల్ల ఉయ్యాలో పెందలే దియ్యంగా ఉయ్యాలో
పెల్లతాళ్లాతోటి " కొట్టెనే మీవాడు "
ఏమమ్మ గోపెమ్మ " యశోద నందనుడు "
ఎంత దుష్టువాడు " ఎంత దుడుకువాడు "
మావాడుకాదమ్మ " మరి ఎవ్వరో గాని "
బాపనోరి పిల్ల " వసుపుల్లు దంచంగ "
పారజల్లిపాయె " మీద జల్లి పాయె "
మావాడు కాదమ్మ " మరి ఎవ్వడో కాని "
మావాడు మందలో " కలసి పోయినాడు "
కోమటోరి పిల్ల " కొబ్బరీ దంచంగ "
కొంగు పట్టీలాగె " మీవాడు ఓయమ్మ "
మావాడు కాదమ్మ " మరి ఎవ్వరో గాని "
మావాడు మందలో " కలసిపోయినాడు "
కాపోల్ల పిల్ల " కలువనే పోవంగా "
కన్నుగీటినాడె " మీవాడె ఓయమ్మ "
మావాడు కాదమ్మ " మరి ఎవ్వరో గాని "
మావాడు మందలో " కలసిపోయినాడు "14

ఈ విధంగా జానపదులు తమ బిడ్డలు చేసే కొంటే పనులన్నీ బాల కృష్ణునికి అంటగట్టి అల్లరిపాలు చేశారు. కృష్ణయ్య చేసిన అల్లరి పనులన్నింటిని యశోదమ్మ కప్పిపుచ్చుతుంది. తమ బిడ్డలు చేసిన తప్పుడు పనులను వారు చేయలేదని చెప్పి, బిడ్డలను వెనకేసుకు రావడం తల్లుల సహజగుణం. ఈ విధంగా మాతృహృదయాన్ని పై పాటలో ఎంతో ఉదాత్తంగా చిత్రించారు.

ఇలాంటిదే మరోపాటలో బాలకృష్ణుని జననం, అతని లీలలను బతుకమ్మ పండుగ సందర్భంగా ఇలా పాడుకుంటారు.

| | | | |
|---|---|---|---|
| కస్తూరి రంగ | ఉయ్యాలో | కావేటి రంగా | ఉయ్యాలో |
| కంసుని వధియింప | ,, | శ్రీ మహా విష్ణువూ | ,, |
| దేవకీ గర్భమున | ,, | కృష్ణుడై జన్మించే | ,, |
| ఆదివారము పూట | ,, | అష్టమీ దినమందు | ,, |
| జన్మించినాడమ్మ | ,, | అవతారపురుషుడై | ,, |
| కేవు కేవున ఏడ్చె | ,, | పసిబిడ్డ అప్పుడూ | ,, |
| నన్నేల ఎత్తుకొనవె | ,, | నా తల్లి దేవకీ | ,, |
| ఒడలెల్ల హీనంబు | ,, | ఈ రీతి నున్నావు | ,, |
| గంగనూ ప్రార్థించే | ,, | గంగతానుప్పొంగె | ,, |
| గంగ ఉదకముతోను | ,, | జలకంబులాడెను | ,, |
| కామధేనువునపుడు | ,, | మదియందు దలపగా | ,, |
| అప్పుడూ బిడ్డపై | ,, | పాలధారలు కురిసే | ,, |
| అప్పుడూ దేవకీ | ,, | ఏమి చేయుచుండె | ,, |
| తడివస్త్రములు విడిచి | ,, | పొడివస్త్రములు గట్టె | ,, |
| పొత్తిళ్ల బాలుని | ,, | పవళింప జేసెను | ,, |
| అద్దాల బాలుని | ,, | చక్కదనమును చూసి | ,, |
| వసుదేవ పుత్రుడూ | ,, | వైకుంఠ వాసుడూ | ,, |
| నవనీత చోరుడూ | ,, | నందగోపాలుడూ | ,, |
| శిరసునా చింతామణి | ,, | నాలుకన నక్షత్రము | ,, |
| భుజమునా శిశువుకు | ,, | శంఖ చక్రంబులు | ,, |
| బొడ్డునా పారిజాతం | ,, | వీపునా వింజామర | ,, |

| | | | |
|---|---|---|---|
| అరికాళ్ల తామరలు | ఉయ్యాలో | అమరియున్నవి తండ్రి | ఉయ్యాలో |
| అన్యకారీ గర్భమున | ,, | జన్మించినావయ్యా | ,, |
| మా యన్న కంసుడూ | ,, | వచ్చేటి వేళాయె | ,, |
| నిన్ను నేనెత్తుకొని | ,, | ఏ త్రోవ పోదురా | ,, |
| అని తలచి దేవకీ | ,, | శోకింపసాగెను | ,, |
| తల్లిశోకము మాన్ప | ,, | బాలుదేమీ జేసె | ,, |
| పెడబొబ్బలు పెట్టుచూ | ,, | గట్టిగా ఏడ్వగా | ,, |
| నాయనా ఊరుకో | ,, | నా తండ్రిగోపాల | ,, |
| అల్లదిగో బూచోడు | ,, | వస్తూనే ఉన్నాడు | ,, |
| బూచినీ మర్దింప | ,, | బుద్ధిమంతుడ నేను | ,, |
| అల్లదిగో జోగివాడు | ,, | పవళించు నా తండ్రి | ,, |
| జోగిమందులు అన్ని | ,, | నావంక నుండగా | ,, |
| జోగేమి చేయునే | ,, | నా తల్లి దేవకీ | ,, |
| అదిగో పాము వచ్చె | ,, | నా తండ్రి గోపాల | ,, |
| పాములకు రాజైన | ,, | శేషునే పాన్పుగా | ,, |
| పవళించు వాడనూ | ,, | పామేమి చేయునే | ,, |
| నీలమేఘచ్ఛాయ | ,, | నీ మేని రూపంబు | ,, |
| నిన్ను నేనెత్తుకొని | ,, | ఏ త్రోవ బోదురా | ,, |
| మాయన్న కంసుడూ | ,, | వచ్చె వేళాయెను | ,, |
| నా మామ నా చేత | ,, | మరణమై పోవునే | ,, |
| వచ్చె వేళాయెనని | ,, | వాసుదేవుని పిలిచె | ,, |
| అంతలో వసుదేవుడు | ,, | బాలున్ని ఎత్తుకొని | ,, |
| వ్రేపల్లె వాడకూ | ,, | పయనమై పోయెను | ,, |
| గోపెమ్మ ఇంటికే | ,, | చేరుకున్నాడమ్మ | ,, |
| బాలున్ని అక్కడ | ,, | పవళింపజేసి | ,, |
| గోపెమ్మ పుత్రికను | ,, | వసుదేవుడెత్తుకొని | ,, |
| పరుగునా వచ్చెను | ,, | దేవకి దరిచేరె | ,, |
| దేవకి తనయుడూ | ,, | పుట్టెనని తెలియగా | ,, |
| కంసుడూ అరుదెంచె | ,, | గుండెఝల్లు మనగా | ,, |

| | | | |
|---|---|---|---|
| జాతకంబు జూచె | ఉయ్యాలో | గండంబు తగిలెనని | ఉయ్యాలో |
| అష్టమా సంతానం | ,, | తనకు కీడని యెంచె | ,, |
| చక్రాయుధం బూనె | ,, | శీఘ్రంబుగా అపుడు | ,, |
| దేవకి కడకేగి | ,, | పుత్రుని ఇమ్మనే | ,, |
| మగవాడు కాదన్న | ,, | ఆడపిల్లర నమ్ము | ,, |
| ఉపవాసముండి | ,, | నోములు నోచియు | ,, |
| పుత్రికను గంటిరా | ,, | నా యన్న వినరా | ,, |
| పుత్రదానం జేయరా | ,, | పుణ్యవంతుడ నీవు | ,, |
| ప్రేమతో చెల్లెలపుడు | ,, | అన్నయ్య చెయిబట్టి | ,, |
| కాదు కాదని కంసుడు | ,, | పుత్రికను ఇమ్మనె | ,, |
| బాలను పుచ్చుకొని | ,, | పైకి ఎగరేసెను | ,, |
| ఆకాశమునకేగి | ,, | ఆ బాల అప్పుడు | ,, |
| కంసున్ని జూచి | ,, | ఏమి పలికినాదీ | ,, |
| నన్నేల చంపేవురా | ,, | పాపంబురా నీకు | ,, |
| నిన్ను చంపూ వాడు | ,, | వ్రేపల్లె వాడలో | ,, |
| కృష్ణావతారమున | ,, | పెరుగుచున్నాడు | ,, |
| కంసునికి అప్పుడు | ,, | గుండె ఝల్లుమనియె | ,, |
| ఏమి ఉపాయంబు | ,, | కంసుడు జేసెను | ,, |
| పూతనకు కబురాయె | ,, | పూతకీ అరుదెంచె | ,, |
| పూతన స్తనములా | ,, | విషధారలుంచుకొని | ,, |
| బాలురతో బంతాట | ,, | ఆడుచుండ కృష్ణుడు | ,, |
| కావుకావుమని యేడ్చుచు | ,, | పరుగెత్తుకా వచ్చె | ,, |
| కృష్ణునీ జూచియు | ,, | ప్రేమతో పూతన | ,, |
| నాయనా రమ్మని | ,, | పాలనిస్తానాని | ,, |
| మూడు గుక్కిళ్ళనే | ,, | పీల్చినాడు అపుడు | ,, |
| మోసకారి పూతన | ,, | నేలకూ ఒరిగెను | ,, |
| ఉగ్గుగిన్నెతో అపుడు | ,, | అరుదెంచె గోపెమ్మ | ,, |
| ఉగ్గుపోసీ తాను | ,, | పవళింప జేసెను | ,, |
| అంతలో కంసుడూ | ,, | పందిరూపానొచ్చె | ,, |

| | | | |
|---|---|---|---|
| పాదాలతో తన్నె | ఉయ్యాలో | పిడుగోలె పడిపాయె | ఉయ్యాలో |
| వృశభమై వచ్చెను | ,, | ఒక్కమాటున తరిమె | ,, |
| చల్లమ్మ వారలతో | ,, | చక్కగా తిరుగుచూ | ,, |
| అల్లరీ పనులెల్ల | ' | చేయుచున్నాడమ్మ | ,, |
| గోపికలు అందరూ | ,, | గోపెమ్మతో చెప్పె | ,, |
| బుద్ధిచెప్పి వాని | ,, | పదిలముగ చేయుమని | ,, |
| ఒప్పుగా వారంత | ,, | కృష్ణుని పట్టుకొని | ,, |
| కట్టేసిపోయిరి | ,, | గోపెమ్మకడకూ | ,, |
| అమ్మ నేనెరుగను | ,, | నాత్రోవ నేబోవ | ,, |
| అంతటా వారంత | ,, | ఇండ్లకూ బోయిరి | ,, |
| పౌర్ణమీరోజునా | ,, | జలజాక్షులందరూ | ,, |
| చీరలన్నీ దీసి | ,, | గట్టుపైనుంచీ | ,, |
| గోపికాలందరూ | ,, | జలకమాడుచుండ్రి | ,, |
| వేణుగానముతోను | ,, | కృష్ణుడు ఏతెంచె | ,, |
| చీరలన్నీ తీసి | ,, | చెట్టుపై నుంచెను | ,, |
| జలకాలు ఆడినా | ,, | గోపికా స్త్రీలంతా | ,, |
| పొన్న చెట్టుమీద | ,, | చిన్నికృష్ణుని జూచి | ,, |
| ఇవ్వరా చీరలు | ,, | మా చిన్నికృష్ణా | ,, |
| దండెంబు పెట్టుతా | ,, | దయచేసి ఇవ్వరా | ,, |
| అందరూ ఒక చేత | ,, | దండంబు బెట్టగా | ,, |
| ఒంటిచేతి దండంబు | ,, | నాకు ఒప్పదానే | ,, |
| పొందుగా వారంతా | ,, | రెండుచేతుల మ్రొక్క | ,, |
| వారి వలువాలన్ని | ,, | వేరువేరుగ ఇచ్చె | ,,15 |

దేవకికి బిడ్డ జన్మించిందని తెలుసుకున్న కంసుడు ఉగ్రుడై శిశువును చంపడానికి సిద్ధమౌతాడు. దేవకి అష్టమ గర్భాన జన్మించిన శిశువుచే తనకు ప్రమాదమని తెలిసిన కంసుడు పుత్రిక అని కూడ కనికరం చూపక, చంపడానికి పైకి ఎగురవేస్తాడు. ఆకాశానికి ఎగిరిన ఆ పాప, నిన్ను సంహరించే వాడు వ్రేపల్లెలో పెరుగుచున్నాడని తెలుపుతుంది.

కంసుడు బాలకృష్ణుని చంపడానికి, విషపు పాలివ్వమని పూతనను ప్రేపల్లెకు పంపిస్తాడు. కృష్ణుని చేతిలో పూతన మరణిస్తుంది. తర్వాత కంసుడు వరాహరూపంలో, వృషభరూపంలో కృష్ణుని చంపడానికి వచ్చి విఫలుడౌతాడు. ఇది జానపదుల కల్పన.

చిన్నికృష్ణుని బాల్యంలోని లీలలు జానపదులకు ఎంతో ఇష్టం. అతని కొంటె పనులు చూసి, గోపికలు గోపెమ్మకు మొరపెట్టుకోవడం, ఆమె తల్లి ప్రేమతో తన కుమారున్ని వెనుకేసుకు రావడం ఈ పాటలో కనిపిస్తుంది. స్త్రీలు తమ సంతానంపై ఈగ వాలనివ్వరు. తర్వాత బాలకృష్ణుడు గోపికాస్త్రీల చీరలన్ని చెట్టుపై ఉంచి, ఒంటిచేతి దండం వలదని, వారి సంపూర్ణ భక్తి భావాన్ని పరీక్షిస్తాడు. ఈ విధంగా మూలానికి భిన్నంగా విచిత్రమైన కల్పనలతో జానపదులు ఈ పాటను పాడుకున్నారు.

ఇంకా "గోపికావస్త్రాపహరణ" ఘట్టాన్ని జానపదులు మరో రకమైన పాటలో ఎంతో అందంగా పాడుకుంటారు.

| | | | |
|---|---|---|---|
| ఊరికి ఉత్తరాన | భామలు | దారికి దక్షిణానా | భామలు |
| పదహారు వేల స్త్రీలు | ,, | పడుచు కన్యలమ్మా | ,, |
| మామిడి వనమూలో | ,, | మల్లెవనమూలో | ,, |
| చెలిమెలు తోడించి | ,, | చెంగలించిరేమో | ,, |
| చీరలు రవికేలు | ,, | గడ్డకు విడనాడీ | ,, |
| కురులు విప్పినారు | ,, | కూడ దునికినారు | ,, |
| అకాశగిరినుంచీ | కృష్ణుడు | అంద వచ్చినాడు | కృష్ణుడు |
| మైలకోకలన్నీ | ,, | మడతబెట్టినాడు | ,, |
| సలువ కోకలన్నీ | ,, | చంకబెట్టినాడూ | ,, |
| అక్కడిక్కడ జూచి | ,, | పొన్నమామిడి జూసి | ,, |
| పొన్నమామిడిమీద | ,, | పొందుగ గూర్చుండె | ,, |
| చీరలు లేవక్కా మనవి | | రైకలు లేవక్కా మనవి | |
| అక్కరో వోయక్కా మనవి | | చీరలేవి అక్కా మనవి | |

| | | | |
|---|---|---|---|
| గాలిదేవుడొచ్చె నేమో | చెల్లే | గాలికి పాయెనేమొ | చెల్లే |
| వానదేవుడొచ్చెనేమొ | ,, | వరదకు పాయెనేమొ | ,, |
| సుడిగాడుపొచ్చె నేమొ | ,, | చుట్టుకపాయెనేమొ | ,, |
| అక్కడిక్కడ జూసీ | భామలు | పొన్నమామిడి జూసి | భామలు |
| పొన్నమామిడిమీద | కృష్ణుడు | పొందుగ గూర్చుండే | కృష్ణుడు |
| ఒంటిచేయి దండంబూ | కృష్ణా | చీరలీయ వయ్యా | కృష్ణా |
| ఒంటిచేయి దండంబు | భామలు | ఒప్పదు నా మనసు | భామలు |
| రెండు చేతుల దండంబు | కృష్ణా | చీరలీయ వయ్యా | కృష్ణా |
| నీది ఏమి చీరా | భామలు | నీది ఏమి రవికా | భామలు |
| భీముడు బెట్టింది | కృష్ణా | బీరపూవు చీరా | కృష్ణా |
| కాముడు పెట్టింది | కృష్ణా | కాకరపూవు చీరా | కృష్ణా[16] |

ఈ పాట శ్రీకృష్ణుని కొంటె చేష్టలను, గడసరితనాన్ని చక్కగా ప్రతిబింబింపచేసింది.

గోపికలు ఒంటిచేతితో దండంపెట్టి తమ బట్టలు తమ కివ్వమని వేడుకుంటే "ఒంటిచేతి దండంబు, ఒప్పదు నా మనసు" అంటాడు. తరువాత సిగ్గు విడిచి గోపికాస్త్రీలు రెండు చేతులెత్తి నమస్కరిస్తారు. అప్పుడు కృష్ణుడు వారి వస్త్రాలు వారికి ఇస్తాడు. భక్తులు భగవంతునికి సంపూర్ణంగా దాసోహం అని వేడుకుంటేనే తప్ప అనుగ్రహించడు. ఈ రకంగా జానపదులు "శరణాగతి ప్రాధాన్యం" తెలియజేశారు.

సత్యభామా కృష్ణుల సరసల్లాపాలు వివరించే మరో పాట:

గుట్ట మీద కృష్ణయ్య పుంజీత మాడే - పుంజీతమాడె
గుట్ట క్రింద సత్యభామ దేగాటలాడె - దేగాటలాడె
పరుగు పరుగున వచ్చి పైటకొంగూ పట్టే - పైట కొంగూపట్టె
పైటకొంగు విడువామాని సత్యభామ అడిగె - సత్యభామ అడిగె
ఎవ్వరమ్మా ఎవ్వరమ్మా గొళ్ళెం కొట్టేరు - గొళ్ళెం కొట్టేరు
మేమైనా పిల్లాలాము ఆటాకొచ్చాము - ఆటాకొచ్చాము
ఆటవేళా దాటినాక ఆటెక్కడిదోయి - ఆటెక్కడిదోయి

ఎవ్వరమ్మా ఎవ్వరమ్మా గొళ్ళెం కొట్టేరు - గొళ్ళెం కొట్టేరు
మేమైనా కుక్కలాము కూడూకొచ్చాము - కూడూ కొచ్చాము
కూడూవేళా దాటీనాక కూడెక్కడిదోయి - కూడెక్కడిదోయి
ఎవ్వరమ్మా ఎవ్వరమ్మా గొళ్ళెం కొట్టేరు - గొళ్ళెం కొట్టేరు
మేమైనా పిల్లులాము పాలా కొచ్చాము - పాల కొచ్చాము
పాలావేళా దాటీనాకా పాలెక్కడివోయి - పాలెక్కడివోయి17

ఒకనాడు కృష్ణుడు పుంజీత మాడుతున్నాడు. సత్యభామ పిల్లలతో దేగాట ఆడుతోంది. కాసేపయాక కృష్ణుడు పరుగు పరుగున వచ్చి సత్యభామ పైట కొంగు పట్టి సరసానికి రమ్మని పిలిచాడు. అప్పటిదాకా తనతో ఆడు కుంటున్న చిన్న పిల్లలను సత్యభామా వెంటనే బయటికి పంపించి తలుపుగడియ (గొళ్ళెం) వేసింది. తమను ఆట మధ్యలో ఆపి బయటికి పంపినందుకు పిల్లలు కోపగించి, సత్యాకృష్ణుల ఏకాంతానికి భంగం కలిగిస్తారు. ఆట కొరకు వచ్చిన పిల్లలం అని, కూడు కొరకు వచ్చిన కుక్కలం అని, పాల కొరకు వచ్చిన పిల్లులం అని గొళ్లెం కొడుతూ అల్లరి చేస్తారు. హాస్యంతో నిండిన ఈ పాటను జానపదులు చాలా చక్కగా చిత్రించారు.

శ్రీకృష్ణుని లీలలే గాకుండా విష్ణుభక్తుల మహిమలు కూడ జానపదులు పాటలుగా పాడుకుంటారు. భక్త అంబరీషుని వృత్తాంతాన్ని తెలిపే ఈ పాట బొడ్డెమ్మ, బతుకమ్మ పండుగల సందర్భంలో పాడుతారు.

| | | | |
|---|---|---|---|
| అంబరీషుడనువాడు | ఉయ్యాలో | పుణ్యక్షత్రియుడు | ఉయ్యాలో |
| గోవిందరాజులా | ,, | మహిమనే తెలియ | ,, |
| హరిరామభక్తుండు | ,, | హరివాసమునందు | ,, |
| ఒక్కదినమూనాడు | ,, | అతిభక్తి తోడ | ,, |
| పంచపాదార్థములు | ,, | పక్వములు చేసి | ,, |
| రెచ్చినా భక్తితో | ,, | బ్రాహ్మణుల పిలిచి | ,, |
| అన్నదానంబులు | ,, | అవుదానంబులు | ,, |
| అన్నదానంబులు | ,, | ఆ రాజును చేసె | ,, |
| అశ్వదానంబులు | ,, | ఆ రాజును చేసె | ,, |

పాడిగోవులు కొన్ని ఉయ్యాలో ఉపయోగమునిచ్చె ఉయ్యాలో
పాడియావుల తల్లి ,, పసుపు కొమ్ములు కట్టి ,,
కాళ్ళకు రత్నాలు ,, అందియములు కట్టి ,,
గంగీ అవులు దెచ్చి ,, కడు భక్తితోడను ,,
అన్నిదానంబులు ,, అట్లుచేయుచునుండె ,,
ఈరీతి ఉండంగ ,, దుర్వాసముని ,,
అంబరీషుడుండేటి ,, నగరికి వచ్చె ,,
అర్ఘ్యపాద్యంబులు ,, అ_ర్తితో నిచ్చె ,,
సకలోపచారములు ,, శోభితంబుగ నిచ్చె ,,
నిలిపినాతీరుయు ,, నా పుణ్యఫలము ,,
నీ బంతిభోజనము ,, నే కోరివత్తు ,,
అట్లైకానిమ్మని ,, సంతోషపాడె ,,
స్వర్గద్వాదశినాడు ,, హరిపూజలు చేసి ,,
వేంచేయుమాని ,, విన్నపములుచేసె ,,
వచ్చెదారనుంటోయి ,, నదితీరమున ,,
ఒక వరుస స్నానము ,, అపుడు చేసినాడు ,,
దేవతార్చన చేసి ,, బ్రాహ్మణుల పిలిచి ,,
రారాయెవీరని ,, బడిబడి పంపే ,,
పిలిచితే పలుకడు ,, పిలువంగరాడు ,,
జలములో కూర్చుండి ,, శంకించుచుండె ,,
ద్వాదశీ భోజనము ,, వ్రతభంగమనుచును ,,
ఉదక పారణము ,, చేయవచ్చునానె ,,
నీచుడా నీవెట్లు ,, భోంచేసితివయ్యా ,,
అల్పుడా నీ చేతి ,, అన్నంబు నేను ,,
వొల్లాను నేనని ,, జడతీసి వేసె ,,
వేసినా అ జడే ,, వెయ్యి భంగులాను ,,
కారుచిచ్చున భంగి ,, కాలుచునుండె ,,
అంబరీషుడుండేటి ,, దరికిచేర వచ్చే ,,
కృష్ణ కృష్ణ యనియేటి ,, కి ర్తనలు చేయ ,,

కృష్ణచక్రము వచ్చి ఉయ్యాలో
ఆ మంటలను మ్రింగి ,,
దుర్వాస మునిని ,,
జలములో జొచ్చినా ,,
కొండలో జొచ్చినా ,,
ఈ లోకమందును ,,
దేవేంద్రుడుండేటి ,,
విష్ణుచక్రము నన్ను ,,
కావుమని పలికెను ,,
ఏమి వరమడిగినా ,,
విష్ణుతో విరోధము ,,
అని ఇట్లు పలుకగా ,,
కైలాస పర్వతము ,,
విష్ణుచక్రమూ నన్ను ,,
కావుమని పలికెను ,,
ఏమి వరమడిగినా ,,
విష్ణుతో విరోధము ,,
అని యిట్లు పలుకగా ,,
బ్రహ్మలోకంబునకు ,,
కావుమని పలికెను ,,
వైరిముని నీవెంత ,,
అదియేస్థితిలున్న ,,
రాకేశుడుండేటి ,,
అని యిట్లు పలుకగా ,,
ముత్యాలు దాటినా ,,
రత్నాలు ఎదిగినా ,,
కృష్ణ కృష్ణ యనెడి ,,
అచ్యుతా అనియేటి ,,
గోవింద యనియేటి ,,

ఆ మంటలను మ్రింగె ఉయ్యాలో
అతని చావనివ్వక ,,
వెంటాడ దరిగె ,,
జలములో జొచ్చె ,,
గుహల్లో జొచ్చినా ,,
ఏ లోకమందైనా ,,
లోకంబుపోయి ,,
వెంబడించుచుండె ,,
దేవేంద్రుని జూచి ,,
ఇచ్చెదనుగాని ,,
కూడదాని యనియె ,,
ఆ మునీశ్వరుడు ,,
కదదాక ఏగి ,,
వెండించుచుండె ,,
కాలకంఠునితోని ,,
ఇచ్చెదనుగాని ,,
కూడదాని యనియె ,,
ఆ మునీశ్వరుడు ,,
పరికించిబోయి ,,
బ్రహ్మదేవునితోటి ,,
ఎందుతిరిగిన గాని ,,
అక్కడికి బొమ్మ ,,
లోకమ్ము పొమ్మ ,,
ఆ మునీశ్వరులు ,,
ముంగిల్లు దాటె ,,
రత్నాలు దాటి ,,
కీర్తనలు కొన్ని ,,
హంసల్లు కొన్ని ,,
కోవెలలు కొన్ని ,,

| | | | |
|---|---|---|---|
| పరమాత్మ యనియేటి | ఉయ్యాలో | పక్షుల్లు కొన్ని | ఉయ్యాలో |
| శ్రీరామ అనియేటి | ,, | చిలుకల్లు కొన్ని | ,, |
| పక్షులు కొలువంగ | ,, | యతులు కొలువంగ | ,, |
| పన్నగేంద్రుని మీద | ,, | పవళించియుండె | ,, |
| అది చూచి అప్పుడు | ,, | ఆ మునీశ్వరుడు | ,, |
| అచ్యుతా మాధవా | ,, | గోవింద యనుచు | ,, |
| అనేక సాష్టాంగ | ,, | దండములు బెట్టె | ,, |
| విష్ణుభక్తుల చరిత | ,, | వివరింపగాను | ,, |
| తప్పేరు కొంత | ,, | చెవియొగ్గి వినుడి | ,, |
| భక్తవత్సలుడాను | ,, | భక్తులకే నేను | ,, |
| భక్తప్రబుద్ధుడని | ,, | పొగడుచుందురు నన్ను | ,, |
| భక్తిజూచేకదా | ,, | బలిచక్రవర్తి | ,, |
| వాకిటా కావలై | ,, | వసియించుచుంటి | ,, |
| భక్తిజూచేకదా | ,, | యశోద యింట్ల | ,, |
| చులకనై వారి చేత | ,, | కొట్లల్ల పడితి | ,, |
| భక్తి చూచే కదా | ,, | భృగుమహర్షి | ,, |
| నవ్వంగ తన్నితే | ,, | నవ్వంగ నుంటి | ,, |
| భక్తి జూచే గదా | ,, | పాండవులవారి | ,, |
| చెంతనుండి నేను | ,, | వెంట తిరిగితిని | ,, |
| భక్తి జూచే కదా | , | వాళ్ళకు లోబడితిని | ,, |
| చిక్కరాజెవ్వనికి | ,, | చిక్కపొమ్మనెను | ,, |
| వేదములకు జిక్క | ,, | శాస్త్రములకు జిక్క | ,, |
| ముక్కోటి తీర్థములు | ,, | మునిగినా జిక్కను | ,, |
| చిక్కరాజెవ్వనికి | ,, | చిక్కపొమ్మనెను | ,, |
| అంబరీషుడె నీకు | ,, | దిక్కుపొమ్మన్నెను | ,, |
| అని ఇట్లు పలుకగా | ,, | ఆ మునీశ్వరులు | ,, |
| అంబరీషుడుండేటి | ,, | నగరికి పోయె | ,, |
| క్షమియించుమాని | ,, | ఆ మునితావేడె | ,, |
| అర్ఘ్యపాద్యంబులు | ,, | ఆర్తితోడనిచ్చె | ,, |

| | | | |
|---|---|---|---|
| షోడశోపచారములు | ఉయ్యాలో | శోభితంబుగ నిచ్చె | ఉయ్యాలో |
| కంచపళ్ళెము బెట్టి | ,, | కడుభక్తితోడ | ,, |
| కూర్చుండు దుర్వాసు | ,, | కూర్చుండవయ్య | ,, |
| గడిగడికి నేయిపోసి | ,, | అన్న మొడ్డించె | ,, |
| గడిగడికి గోవింద | ,, | గోవింద యనుచు | ,, |
| విష్ణుపాదార్థమని | ,, | విందారగించె | ,, |
| ఈ పాట ఎవ్వరూ | ,, | పాడినా విన్న | ,, |
| పాడినా వారికి | ,, | బ్రహ్మలోకములు | ,, |
| విన్నవారికి కలుగు | ,, | విష్ణులోకములు | ,, |
| కృష్ణజే కృష్ణజే | ,, | కృష్ణమ్మ జేజ | ,,[18] |

అంబరీషుడు ఒకనాడు ద్వాదశీ వ్రతం చేసి బ్రాహ్మణులకు భోజనం పెట్టి, తాను కూడా భోజనానికి కూర్చుంటాడు. అంతలో ముక్కోపి అయిన దుర్వాసముని రాగానే అతన్ని కూడా భోజనానికి అహ్వానిస్తాడు. కాని దుర్వాస మునీంద్రుడు స్నానం చేసి వస్తానని నదికి వెళ్ళాడు. అంబరీషుడు దుర్వాసుని కొరకు వేచి ఉండగా ద్వాదశి గడియలు దాటిపోతున్నాయి. ద్వాదశి గడియలు దాటిపోయిన తరువాత భోజనం చేస్తే వ్రతఫలం ప్రాప్తించదు. కాని, ఇక్కడ అతిథి రాకుండా తానే ముందు భోజనం చేస్తే దోషం చేసినట్టు అవుతుంది. చివరికి వ్రత దోషం కలుగకుండా అంబరీషుడు కొన్ని నీళ్ళు త్రాగాడు. తర్వాత దుర్వాస మునీంద్రుడు వచ్చి, తాను లేకుండ ఉదకపారణం చేశాడని తెలుసుకొని అంబరీషునిపై ఆగ్రహిస్తాడు. వెంటనే తన జడ నుండి కృత్యను సృష్టించాడు. అది కారుచిచ్చులాగ మండుతూ అంబరీషుని దరిచేరగా విష్ణుచక్రం వచ్చి దానిని మింగివేసింది. పైగా ఆ చక్రం గర్వాంధుడైన దుర్వాసుని వెంటపడింది. అపుడు దుర్వాసుడు బ్రహ్మ దేవుని, శంకరుని ప్రార్థించినా ఎవరూ రక్షించలేదు. చివరికి విష్ణువును వేడుకుంటాడు. విష్ణువు తాను కూడా భక్తులకు లోబడి వున్నానని, అతడిని రక్షింపలేనని, భక్తుడైన అంబరీషుని దగ్గరకే వెళ్ళుమని చెప్పాడు. అప్పుడు అంబరీషుడు హరినామ స్మరణతో విష్ణుచక్రాన్ని నిరోధించి దుర్వాస మునిని రక్షించాడు. ఇదంతా మూలంలోని కథ. దుర్వాసముని విష్ణుదరి చేరి నప్పుడు, విష్ణువు తాను, తన భక్తులైన భృగుమహర్షికి, పాండవులకు, యశోదకు లోబడి ఎన్ని కష్టాల పాలయ్యాడో వివరంగా తెలియచేస్తాడు. ఇది జానపదులు భక్తిభావంతో కల్పించినదే.

ఇంకా మూలానికి భిన్నమైన మరొక అంశం - రక్షించుమని తన వద్దకు వచ్చిన దుర్వాసమునికి అంబరీషుడు మళ్ళీ భోజనం పెట్టి తృప్తిపరుస్తాడు.

ఈ విధంగా, కృష్ణుని లీలలే గాకుండా విష్ణుభక్తుల వృత్తాంతాలను కూడా కడు రమ్యంగా వివరిస్తూ, 'బతుకమ్మ పండుగ' సందర్భంగా జానపదులు పాటలు పాడుకుంటారు.

ఇంకా ఈ పాట చివర పాటపాడిన వారికి బ్రహ్మలోకములు, విన్నవారికి విష్ణులోకములు కలుగునని జానపదులు ఫలశ్రుతిని కూడ తెలిపారు.

భక్తిమార్గ ప్రాధాన్యం తెలిపే క్రింది పాటను కూడ ఈ పండుగ సందర్భంలో పాడుకుంటారు.

| | | | |
|---|---|---|---|
| పరమాత్మ నీపొద్దు | ఉయ్యాలో | భావంబులో నిలిపి | ఉయ్యాలో |
| నిశ్చలా భక్తితో | ,, | నియమనిష్ఠలతోటి | ,, |
| సర్వకాలంబునా | ,, | స్వామినిను కొలిచెదను | ,, |
| సంసారలోపంబు | ,, | జాలార జేసితి | ,, |
| దీనులా గాచేటి | ,, | దేవుడున్నాడమ్మ | ,, |
| విశ్వమంతా నిండి | ,, | వెన్నుడున్నాడమ్మ | ,, |
| దివ్యశక్తులతోటి | ,, | తేజరిల్లువాడు | ,, |
| సర్వాంతరాత్ముడై | ,, | స్వామియున్నాడమ్మ | ,, |
| సూడగా మనసులో | ,, | సూత్రధారుండయి | ,, |
| భావానికందకా | ,, | పరమాణురూపుడై | ,, |
| మనతెలివి లోపలే | ,, | మరిగి ఉన్నాడమ్మ | ,, |
| పరిశుద్ధ హృదయాన | ,, | పరమాత్ముడున్నాడు | ,, |
| తాను తానయి యున్న | ,, | జ్ఞానమెంతానమ్మ | ,, |
| కంటికీ కానరాని | ,, | కారుణ్యమూర్తి | ,, |
| భక్తిభావంబునా | ,, | పట్టవచ్చునమ్మ | ,, |
| ప్రేమకూ సరియైన | ,, | విలువనే లేదమ్మ | ,, |
| వెలలేని ప్రేమతో | ,, | వెన్నున్ని పూజించి | ,, |
| మోక్షసామ్రాజ్యంబు | ,, | పొందవచ్చునమ్మ | ,, |

| | | | |
|---|---|---|---|
| భక్తియోగంబునా | ఉయ్యాలో | పాపంబులు పోగొట్టి | ఉయ్యాలో |
| స్వామినీజేరుటే | ,, | జన్మసాఫల్యంబు | ,, |
| అక్కలారా దీనిని | ,, | చక్కగా శ్రద్ధతో | ,, |
| చదివినా విన్ననూ | ,, | సర్వేశు కృపగల్గు | ,, |
| అనుభవమ్మున మీరు | ,, | ఆచరించేవారు | ,, |
| కర్మలన్నియు బాపి | ,, | కైవల్యమందేరు | ,, |
| జయజయా శ్రీరామ | ,, | జయము సీతారామ | ,, |
| జయము నీ భక్తులకు | ,, | జయము సద్గుణులకు | ,,[19] |

నిశ్చలమైన భక్తితో, పవిత్రమైన హృదయంతో, నిష్కల్మషమైన మనస్సుతో భగవంతుని ధ్యానించాలని, పరమాణురూపంలో దేవుడు అంతటా వ్యాపించి ఉన్నాడని, పరిశుద్ధమైన హృదయంలో తెలివిలో భగవంతుడు ప్రకాశిస్తూ ఉంటాడని జానపదుల నమ్మకం, కష్టాలలో ఆదుకునే దయామయుడైన భగవంతున్ని వెలలేని ప్రేమతో ఆరాధిస్తే మోక్షం సాధ్యమేనని జానపదుల భావన. ఈవిధంగా జానపదులు గహనమైన విషయాన్ని చిన్న చిన్న మాటలతో బోధించి మోక్ష సామ్రాజ్యాన్ని అందరికీ కరతలామలకం చేశారు.

## గ్రామదేవతలకు సంబంధించిన పాటలు

భారతదేశం వ్యవసాయిక దేశం. వ్యవసాయమే ప్రధాన వృత్తిగా ఉన్న గ్రామాలలో కఱవు కాటకాలు, అంటువ్యాధులు, పశువులకు సంబంధించిన వ్యాధులు మొదలైనవి సంభవిస్తే వాటికి కారణాలు ప్రకృతి శక్తులేనని జానపదుల విశ్వాసం. ఈ ప్రకృతి శక్తులను పూజిస్తే వారి అనుగ్రహం వల్ల తమ బిడ్డలు, పశువులు, పంటలు క్షేమంగా ఉంటాయని వీరు భావిస్తారు. ఈ ప్రకృతి శక్తులను స్త్రీ పరంగా పూజించే విధానం నుండి ఉద్భవించిన వారే ఈ గ్రామ దేవతలు. అంతేగాకుండా "మాతృస్వామిక వ్యవస్థాప్రభావము, స్త్రీయే వ్యవసాయ ఆరంభకు రాలగుట, సఫలతకు స్త్రీయే ఆధారమను అభిప్రాయ మేర్పడుట; ఆమె సృజనాత్మక శక్తి స్వరూపిణి అను భావములు ప్రబలుట. గ్రామ దేవతల ఆవిర్భావమునకు, ఆరాధనకు ముఖ్య కారణములైనవి."[20]

ఈ గ్రామ దేవతలు ప్రతి గ్రామంలో ఉంటారు. వీరినే జానపదులు ఎల్లమ్మ, మైసమ్మ, పోషమ్మ, నూకాలమ్మ అని అనేక రూపాలతో కొలుస్తారు. ప్రతి సంవత్సరం ఈ గ్రామ దేవతలకు కోళ్లు, మేకలు, దున్నపోతులు బలి ఇచ్చి, బోనాలు పెట్టి, కల్లు సాకపట్టి పూజలు చేయడం, ఉత్సవాలు, జాతరలు నిర్వహించడం సంప్రదాయంగా నిలిచింది. ఈ దేవతల పట్ల గ్రామీణులకు భక్తి గౌరవాలకంటే భయమే ఎక్కువ.

ఎల్లమ్మ గ్రామ దేవతలలో చాలా ప్రసిద్ధమైంది. ఈమెకు రేణుకాదేవి, అక్కలిదేవి, మాహురమ్మ, ఏకవీర అని అనేక పేర్లున్నాయి. ఈమె శివ పార్వతుల సంతానం అని, పల్లెలను ప్రజలను రక్షిస్తుందని గ్రామాలలో అనేక కథలు ప్రచారంలో ఉన్నాయి. ముఖ్యంగా ఎల్లమ్మ జాతరలో బైండ్లవాళ్లు జమిడికలను వాయిస్తూ, ఎల్లమ్మ కథలను చెప్పుతారు.

చర్మవ్యాధులు, కండ్ల కలక, కడుపునొప్పి, జ్వరాలు, వ్యాధులు వచ్చినప్పుడు ఎల్లమ్మకు మొక్కి బోనాలు పెట్టి పూజిస్తారు. స్వప్నంలో గవ్వలు, పాములు కనిపిస్తే ఎల్లమ్మగానే భావిస్తారు. తెలంగాణా ప్రాంతంలో శ్రావణ మాసంలో మంగళవారం ఎల్లమ్మను పూజించి ఉపవాసం ఉంటారు.

బతుకమ్మ పండుగ సందర్భంతో ఎల్లమ్మ కథలను తెలిపే పాటలెన్నో జానపదులు పాటుకుంటారు. 'రేణుక' నే ఎల్లమ్మగా వ్యవహరిస్తారు.

మహాభారతం ఆధారంగా రేణుకా వృత్తాంతం ఈ విధంగా ఉంటుంది: రేణుక ప్రసేనజిత్తుని కుమార్తె. ఈమె ఋచీకుడు, సత్యవతుల కుమారుడైన జమదగ్ని మునిని వివాహం చేసుకున్నది. ఈ దంపతులకు రమణ్వాతుడు, సుసేషణుడు, వసువు, విశ్వావసువు, పరశురాముడు అను పుత్రులు జన్మించారు.

ఒకరోజు రేణుక నీళ్ళ కొరకు నదికి వెళ్ళుతుంది. అక్కడ చిత్రరథుడనే వాడు స్నానం చేస్తూ ఉండగా, అతన్ని రేణుక కొంతసేపు ప్రేమతో చూసి తరువాత నీళ్ళు తీసుకొని భర్త దగ్గరికి వెళ్ళుతుంది. జమదగ్ని రేణుక ఆలస్యానికి కారణం తెలుసుకొని ఉగ్రుడై తన కొడుకులను పిలిపించి తల్లిని వధింపుమని చెప్పాడు. వారిలో పెద్దవారు నలుగురు మాతృవధకు అంగీకరించక

పోవడం వల్ల తండ్రిచే శాపగ్రస్తులయ్యారు. పరశురాముడు తండ్రి మాటలను జవదాటక తల్లిని వధించాడు. తరువాత పరశురాముడు తన తండ్రి వరప్రసాదం వల్ల తల్లిని బ్రతికించి, సోదరులను శాపవిముక్తులను చేశాడు.

ఒకనాడు హైహయుడను రాజు తన పరివారంతో వేటకై వచ్చి అలసిపోయి జమదగ్ని ముని ఆశ్రమానికి వచ్చాడు. ఆ ముని తన కామధేనువు ప్రభావంతో మహానగరం నిర్మించి హర్మ్య ప్రాసాదాల నేర్పరచి అందులో రాజుకు ఆయన పరివారానికి షడ్రసోపేతమైన భోజనం పెట్టించాడు. కామధేనువును చూసిన రాజు తన భటులకు కావలసినంత ధనం ఇచ్చి ఆ ధేనువును తెమ్మని అజ్ఞాపించాడు. అతిథ్యమిచ్చి భోజనం పెట్టిన వాని గోవును అపహరింతురా అని జమదగ్ని ముని అడ్డగించినా భటులు వినకుండా ఆ మునిని కొట్టి చంపారు. తరువాత ఆ గోవుని తీసుకొని వెళ్ళిపోయారు.

పరశురాముడు తన తండ్రిన చంపిన రాజుపై ఆగ్రహించి మాహిష్మతీపురానికి వెళ్ళి ఆ రాజును, అతని పరివారాన్ని వధించాడు. ఆ తరువాత భృగుమహర్షి వచ్చి జమదగ్నిని బ్రతికించాడు. పట్టపురాజును చంపడం పాపం అని చెప్పి పరశురాముని తీర్థయాత్రలు చేసిరమ్మని తండ్రి చెప్పాడు. కాని పరశురాముడు వినకుండా క్షత్రియుడు అకారణంగా తన తండ్రిని చంపినాడు కనుక ఇరవై ఒక్కమారులు యుద్ధం చేసి వారిని నిర్మూలనం చేస్తానని శపథం చేసి, క్షత్రియులను సంహరించసాగాడు. కార్తవీర్యుడు ఆ కోపంతో జమదగ్నిని చంపాడు.[21] (మహాభారతం). పరశురాముడు అర్జున సుతాదులందరిని చంపి రాజుల రక్తాన్ని తొమ్మిది మడుగులుగా చేసి, ఖండింపబడిన తన తండ్రి శిరస్సు తెచ్చి మేనుకు అతికించి, యాగం చేశాడు. ఆ యాగ ప్రభావం వల్ల ఆకాశంలో సప్తర్షి మండలంలో ఒకడై వెలుగుతాడు.[22] (బ్రహ్మాండపురాణం).

జానపదులు ఈ ఎల్లమ్మ కథను మూలానికి భిన్నంగా ఎన్నో కల్పనలు చేసి పాటలుగా పాడుకుంటారు,

ఎల్లమ్మ కథ తెలిపే ఈ క్రింది పాటను బతుకమ్మ పండుగ సందర్భంతా పాడుకుంటారు.

| | | | |
|---|---|---|---|
| రామరామరామ | ఉయ్యాలో | శ్రీరామ ఓరామ | ఉయ్యాలో |
| శ్రీ గణేశ్వర నిన్ను | ,, | చిత్తమందున తలుతు | ,, |
| ఏగిచేసి నేను | ,, | ఎవ్వరిని దలుతు | ,, |
| ఎల్లి పెద్దా కొడుకు | ,, | పరశురాముని దలుతు | ,, |
| గౌరి పెద్దాకొడుకు | ,, | గణపాతీని తలుతు | ,, |
| శంకరుడు ఏలేటి | ,, | ఎండికొండ పట్నము | ,, |
| పార్వతీ ఏలేటి | ,, | పంచాది గిరులు | ,, |
| ఏడ జూచినగాని | ,, | ఈడుజోడుగ నుండె | ,, |
| కడతేరిన బాలలు | ,, | కళ్యాణ మాడింౢడు | ,, |
| నాతోటి బాలలు | ,, | వివాహ మాడింౢడు | ,, |
| బాజర్ల పొంటినీ | ,, | బత్కమ్మ లాడుతుంౢడి | ,, |
| మానింట్ల బత్కమ్మ | ,, | ఉన్నదా నా తంౢడి | ,, |
| నేనాడె బత్కమ్మ | ,, | ఆడుకుండా నేను | ,, |
| నీకునూ వివాహం | ,, | కాలేదు అంటుంౢడు | ,, |
| నా గౌరమ్మను | ,, | తీసి వేస్తున్నరూ | ,, |
| నాతోటి బాలలు | ,, | కళ్యాణ మాడింౢడు | ,, |
| నాకు లగ్గంబును | ,, | చెయ్యాలి నాతంౢడి | ,, |
| నిజమాయె నీవన్న | ,, | మాటల్లు రేణుకా | ,, |
| ఎక్కడన్నా బోయి | ,, | వెతికి తెస్తానేను | ,, |
| నీకు వివాహము | ,, | చేత్తాను నాబిడ్డ | ,, |
| గరుడ స్తంభం పైన | ,, | గంటలూ గొట్టెదా | ,, |
| అరవై మూల్లా పాగ | ,, | తలపైన చుట్టగా | ,, |
| అప్పుడు లగ్గంబు | ,, | చేత్తనని యన్నాడు | ,, |
| ఊరూరి రాజులకు | ,, | ఉత్తరాలు రాసిండు | ,, |
| పల్లె రాజులాకు | ,, | పత్రికలు పంపిండు | ,, |
| దేశవు రాజులకు | ,, | లేఖల్లు పంపిండు | ,, |
| వచ్చిరీ బాపండ్లు | ,, | ఇంటి దగ్గరికి | ,, |
| లేండి తమ్ములార | ,, | పోదాము మనమింక | ,, |
| ఎన్నడు లేని లేఖలు | ,, | మన ఇంటిలో నుండె | ,, |

| పన్నుగా ఎవరన్న | ఉయ్యాలో | పాలివాండ్లున్నరా | ఉయ్యాలో |
|---|---|---|---|
| అన్న నాకియ్యవే | ,, | చిన్నగా చదువుతా | ,, |
| పాలి వాండ్లెవరు లేరు | ,, | పార్వతీశుడు రాశే | ,, |
| దయగల్గి మన మామ | ,, | దయతోద రాశిండు | ,, |
| చిన్నగా వానిపుత్రి | ,, | ఉన్నదాటా తమ్మి | ,, |
| పండిరా అందరము | ,, | పార్వతీశు నింటికి | ,, |
| గరుడ స్తంభం పైన | ,, | గంటలు గట్టిండు | ,, |
| గరుడ స్తంభం పైన | ,, | గంటలు మ్రోగాయి | ,, |
| ఓ బొబ్బ ఈ దినము | ,, | నా తరము కాదురా | ,, |
| తల్లి దండ్రి చేసినా | ,, | పాప పుణ్యంబులూ | ,, |
| పాప పుణ్యంబులు | ,, | కట్టుకున్నరు తండ్రి | ,, |
| ఆకాశ వాణియు | ,, | ఏమి చెప్పుచుండె | ,, |
| ఓ ముని బాలకా | ,, | వెండి కొండా కెళ్ళు | ,, |
| శంకరుడు ఘోరమైన | ,, | ప్రతిజ్ఞ బూనిండు | ,, |
| ప్రాతిజ్ఞ చెల్లితే | ,, | పణతి నిస్తానానె | ,, |
| అప్పుడూ బాలుడు | ,, | ఎనుకకూ మర్రిండు | ,, |
| వెండికొండా కెళ్ళి | ,, | సూర్యచంద్రుల చేరి | ,, |
| సూర్య చంద్రులాకు | ,, | నమస్కరించియు | ,, |
| ఎక్కడ వున్నావు | ,, | శివశంకరుడ నీవు | ,, |
| గరుడ స్తంభంపైన | ,, | గంటలు గొడుతున్నా | ,, |
| అరవై మున్నా పాగ | ,, | తలకు చుట్టుతున్న | ,, |
| ఓ పాసి బాలకా | ,, | నీ పేరు దెల్పుమా | ,, |
| నీ తల్లి దండ్రులూ | ,, | ఎవ్వరూ చెప్పుమా | ,, |
| తల్లి అహల్యాదేవి | ,, | తండ్రి గౌతమూడు | ,, |
| శాలదానను గన్న | ,, | సత్యవంతులు వారు | ,, |
| సింతాపురమూ నాది | ,, | చిత్రమైనా ఊరు | ,, |
| జమదగ్నిముని యని | ,, | జగతిలో పిలుతురు | ,, |
| ఇప్పుడూ లగ్గమూ | ,, | చేత్తాను నేనని | ,, |
| సక్కని బాపండ్ల | ,, | పిలిపించినారు | ,, |

| | | | |
|---|---|---|---|
| వందనము వందనము | ఉయ్యాలో | శివశంకర స్వామి | ఉయ్యాలో |
| పాదేళ్ళ పబ్బతీ | ,, | శివశంకర స్వామి | ,, |
| శుక్కురారము నాడు | ,, | చక్కన్నీ ఘడియలు | ,, |
| చక్కన్నీ ఘడియలు | ,, | లగ్గమూ చేసింద్రు | ,, |
| లగ్గ మాయినాక | ,, | నాగెల్లి కావాలి | ,, |
| నాగెల్లి ఎందుకూ | ,, | ఆపుచున్నారమ్మ | ,, |
| కార్తీక రాజులు | ,, | అడ్డమొచ్చినారు | ,, |
| శుక్కురారము నాడు | ,, | అచిన్ని ఘడియలు | ,, |
| చక్కని ఘడియలు | ,, | లగ్గమాయి నాది | ,, |
| మన పట్నామందు | ,, | చేరబోదామని | ,, |
| అప్పుడు మునిరాజు | ,, | భార్యకు చెపుతుండు | ,, |
| నేను పోతున్నను | ,, | నన్నుగన్నా తండ్రి | ,, |
| నన్నుగన్నా తల్లి | ,, | రేణుకా మాత | ,, |
| మత్సమౌరము కొండ | ,, | చేరబోతున్నవా | ,, |
| మా తల్లి వినవమ్మ | ,, | మా తల్లి ఎల్లమ్మ | ,, |
| కొత్త కోడలు వాని | ,, | వస్తురు నినుజూడ | ,, |
| ఒంట శాలల్లోన | ,, | ఒంటలూ చేయంగా | ,, |
| అత్తమామలతోను | ,, | ఎదురు నడువొద్దమ్మ | ,, |
| తల్లిదండ్రులా మాట | ,, | చెప్పి తోలీనారు | ,, |
| రమ్ము ప్రాణానాథ | ,, | పోదాము మనమింక | ,, |
| సంపెంగ పూవులు | ,, | ఇంపుగా ఉన్నవి | ,, |
| విరులు త్రెంపూనాథ | ,, | జెడలోన పెట్టుమా | ,, |
| అంత జూమూతిని | ,, | సంతోష మాయెను | ,, |
| రమ్ము ప్రాణానాథా | ,, | బోజనంబు చేద్దాము | ,, |
| అప్పాలు వడియాలు | ,, | ఆకు కూరాలయ్యా | ,, |
| నవకోటి రుచుల | ,, | భోజనంబు చేసినా | ,, |
| మత్స్యకంటి వినుము | ,, | వచ్చువాడను నేను | ,, |
| తృప్తిగా భోజనంబు | ,, | నేను చేత్తానమ్మ | ,, |
| రమ్ము ప్రాణానాథ | ,, | పరుపుల్లు ఏసినా | ,, |

పరుపుల్ల నీవింక ఉయ్యాలో
అప్పుడూ నేనింక ,,
నాతోటి రెండును ,,
ఆ గేదెలా నేను ,,
నీకంటె ఎక్కువా ,,
నీతోటి నేనొస్త ,,
నాతోటి నువ్వొద్దు ,,
నీకు యానువాలు ,,
నాకు అక్కడైన ,,
పాలి వారెవరైన ,,
నాకును ఏమైన ,,
మల్లె వృక్షంబులు ,,
నీ చేతి గాజులు ,,
నీ నొష్టి కుంకుమా ,,
కాలికున్నా మట్టె ,,
ఈ నాలు గానువాలు ,,
అప్పుడూ తావుల్లు ,,
పోయివస్తా నేను ,,
అప్పుడూ దేవుడు ,,
టికుటాకూలాంటి ,,
గట్టుకూ పారినా ,,
గన్నేర్లు దాటంత ,,
పరుల గేదెల్లారా ,,
ఉత్తరా దిక్కుకు ,,
దక్షిణా దిక్కుకు ,,
పడమరా దిక్కుకు ,,
కార్తీక భూముల్లు ,,
గుర్తు పట్టాకుండా ,,
ఇట్లనూ బుద్ధులూ ,,

పండుకో నా నాథ ఉయ్యాలో
ఎండికొండా కొస్తే ,,
గేదెలొచ్చినాయి ,,
మేపు కొస్తానమ్మ ,,
నాకేమి ఉన్నది ,,
రమ్ము ప్రాణానాథ ,,
ఇంటికాడుండాలె ,,
పెట్టి పోతున్నను ,,
ఏమన్న జరిగితే ,,
నన్ను జూసితేనె ,,
హాని కలుగుతేను ,,
ఆరిపోతాయమ్మ ,,
నలిగిపోతాయమ్మ ,,
చెదిరిపోతాదమ్మ ,,
నొక్కుపోతాదమ్మ ,,
నువ్వు జూసుకోని ,,
పట్టుకోని రావె ,,
భయమేమిలేదమ్మ ,,
బయిలెల్లుతున్నడూ ,,
కోటల్లు దాటిండు ,,
గన్నేర్లు దాటిండు ,,
బాటల్ల పడ్డడూ ,,
భూములెల్లా మనము ,,
పోయిరమ్మన్నడూ ,,
పోయిరమ్మన్నడూ ,,
పోయిరమ్మన్నడూ ,,
కాలుతు ఉన్నవీ ,,
మీరు మేసిరాండ్రి ,,
చెప్పిండు దేవుడు ,,

| ఊరి కుత్తారాన | ఉయ్యాలో | పాద దక్షిణాన | ఉయ్యాలో |
|---|---|---|---|
| ఊడలూ చిన్నదీ | ,, | ఊరెలుపు మర్రిండ | ,, |
| కాడలు చిన్నది | ,, | కంచాల మర్రింద | ,, |
| కాంచాల మర్రికింద | ,, | కారణాల పుట్ట | ,, |
| పుట్టక్రింద తపస్సు | ,, | పట్టిండు దేవుడు | ,, |
| తమ్ముళారా మనము | ,, | దొంగవోలే వాడు | ,, |
| దొంగవోలె వాడు | ,, | దొరికిండు మనకు | ,, |
| పాలి వాడెవ్వడో | ,, | పుట్టిండు ఇక్కడా | ,, |
| వాన్ని హాతమ్మును | ,, | చేద్దాము రాతమ్మి | ,, |
| కార్తీక రాజులు | ,, | బయలుదేరుతున్నరు | ,, |
| ఏడుగూరు వారు | ,, | అన్నదమ్ములు వారు | ,, |
| అన్నదమ్ములు వారు | ,, | బయలుదేరుతున్నరు | ,, |
| ఈ మర్రి చెట్టుక్రింద | ,, | దొరికినాడూ వీడు | ,, |
| ఇప్పుడు వాన్ని మనము | ,, | హతం చెయ్యాలిరా | ,, |
| ప్రాతిజ్ఞ చెల్లించి | ,, | పడతిని పెండ్లాడి | ,, |
| పుట్టబోగుల ఎల్లి | ,, | ముండపొయ్యాలేరా | ,, |
| మనకన్న ఎక్కువా | ,, | బలవంతులూ లేరు | ,, |
| అన్నదమ్ములు గూడి | ,, | బుద్ధులూ చెప్పుకోని | ,, |
| ఏడు బాణాలైన | ,, | ఎదలోన ఏసింద్రు | ,, |
| బాణాలు ఏసింద్రు | ,, | ఇంటికీ బోయింద్రు | ,, |
| ఇంటికాడ భామకు | ,, | ఏమి కలిగీనాది | ,, |
| మల్లె వృక్షంబును | ,, | ఆరిపోయీనాది | ,, |
| నొష్టిదీ కుంకుమా | ,, | చెదిరిపోయీనాది | ,, |
| చేతికి గాజులు | ,, | చెదురుతున్నాయమ్మ | ,, |
| కాళ్లకున్నా మట్టె | ,, | నొక్కి పోయినాది | ,, |
| పాలి వాడెవ్వడో | ,, | పుట్టిండు ఓ నాథ | ,, |
| దుండగూ డెవడొచ్చె | ,, | దుష్మాను ఎవడొచ్చె | ,, |
| మిత్రుడూ ఎవడొచ్చె | ,, | శత్రుడూ ఎవడొచ్చె | ,, |
| చక్కనీ రేణుకా | ,, | బయిలెల్లిపోతుంది | ,, |

మత్స్యమవురము కొండ ఉయ్యాలో
అరణ్యమందునా ,,
వలవల రేణుకా ,,
సతిలేని బ్రతుకులు ,,
మునిరాజు దగ్గరికి ,,
శివునికి ఆ బిడ్డ ,,
గౌతముని కోడలూ ,,
చక్కనీ అ తల్లి ,,
ప్రాణంబోయె ఘడియ ,,
నాకేమి ఆనవాలు ,,
ఏడ్చేటి పనియేమి ,,
సత్యాన బోనము ,,
నీ సత్యాన నేను ,,
ఈ రెండు మాటల్లు ,,
చక్కనీ రేణుక ,,
తన కన్నతండ్రినే ,,
నన్ను గన్నాతండ్రి ,,
ప్రాణనాథుని ప్రాణం ,,
సత్యాన బోనము ,,
బోణము జాదలు ,,
నీ తల్లి పార్వతీ ,,
నన్ను గన్నాతల్లి ,,
సత్యాన బోనము ,,
నాకెరుక లేదమ్మ ,,
నీతండ్రి శంకరుని ,,
అన్నించి రేణుకా ,,
శివల్ల మాతనే ,,
నన్ను గన్నాతండ్రి ,,

వదలి పెట్టినాది ఉయ్యాలో
చక్కని ఆ తల్లి ,,
వల పోసుకుంటు ,,
అయే ప్రాణానాథ ,,
శివంగి ఉరికింది ,,
శివునెల్ల మాతల్లి ,,
ఘనశాలి రేణుకా ,,
ఏమి అంటున్నదీ ,,
దగ్గరొచ్చే నాథ ,,
పెట్టి పోతున్నవూ ,,
ఇక్కడా లేదమ్మ ,,
తీసుకొస్తేగాని ,,
లేచి వస్తానమ్మ ,,
దేవుడు చెప్పిండు ,,
బయిలెల్లినాదమ్మ ,,
వద్దకే పోయింది ,,
లోకాల శంకరుడు ,,
పోయె గడియాలొచ్చె ,,
జాదలు చెప్పవే ,,
నాకు దెలువాదమ్మ ,,
ఉన్నదడుగూ పోవె ,,
పార్వాతి దేవి ,,
జాదలు చెప్పవే ,,
నా చిన్ని రేణుకా ,,
అడుగు పోరాదమ్మ ,,
ఎనుకకూ మర్రింది ,,
శిట్కునా మర్రింది ,,
చిన్ని శంకారూడ ,,

| | | | |
|---|---|---|---|
| బోనంబు జాడలు | ఉయ్యాలో | చెప్పుమంటేనీవు | ఉయ్యాలో |
| చెప్పకుంటే నీవు | ,, | చేపుతావా లేదాని | ,, |
| ఎనుగంత పాదము | ,, | ఎదలోని పెట్టింది | ,, |
| నీ కాళ్ళు మొక్కుతా | ,, | నా చిన్న బిడ్డ | ,, |
| బోనంబు జాడలు | ,, | నీకు చెప్పుతానే | ,, |
| అప్పుడూ రేణుకా | ,, | పాదంబు తీసింది | ,, |
| ఆడదానివి నీకింత | ,, | బాలంబు ఉంటెనే | ,, |
| మగవారు ఎప్పుడూ | ,, | ఉండలేరు బిడ్డ | ,, |
| అడవిలో కట్టేలు | ,, | ఇర్తుంటే రేణుకా | ,, |
| అట్ల కొంత నీకు | ,, | పోవునమ్మా బలము | ,, |
| ఇట్లనూ నెలవులు | ,, | పెట్టిండు దేవుడు | ,, |
| బోనంబు జాడలు | ,, | చెప్పుతున్నానమ్మ | ,, |
| దూసమారి మడుగుల్ల | ,, | పోవాలి నా బిడ్డ | ,, |
| దూసవోరీ వొడ్లు | ,, | దూసుకా రావాలె | ,, |
| అరిచేయి రోలును | ,, | చెయ్యాలి నా బిడ్డ | ,, |
| మోచేయి రోకలి | ,, | చెయ్యాలి నా బిడ్డ | , |
| కంటిరెప్పలతోని | ,, | పొట్టు చెరుగాలమ్మ | ,, |
| కంటినీళ్ళతోని | ,, | కడిగి వొంపాలమ్మ | ,, |
| ఒడిపినా నీళ్ళతో | ,, | ఒంటనే చేయాలి | ,, |
| శనివారమునాడు | ,, | గడువతోను బెట్టి | ,, |
| ప్రాణనాథుని తలచి | ,, | నిప్పునే పుట్టించి | ,, |
| ఛాతిమీద వొంట | ,, | వండుకోవాలెను | ,, |
| ఇవన్ని రేణుకా | ,, | మనసులో పెట్టింది | ,, |
| పచ్చి కడువకు నేను | ,, | పోతనని ఎల్లింది | , |
| కుమ్మరి రామన్న | ,, | కండ్లనే జూసిండు | ,, |
| ముంగిల్లు పరిచిండు | ,, | ముత్యాలు పరిచిండు | ,, |
| సందుగొందూ నూకి | ,, | జవ్వాది పరిచిండు | ,, |
| కూసుండు రేణుకా | ,, | కుర్చీపీటల కొరిగి | ,, |
| కూసుంటె పనిగాదు | ,, | ఏగిరాము పనివుంటె | ,, |

ఏగిరాము పనులుంటే ఉయ్యాలో
శ్రీఘమే చెప్పుతే ,,
పాలివారెవ్వరో ,,
నా ప్రాణనాథున్ని ,,
పచ్చికడువా నాకు ,
అప్పుడూ రేణుకా ,,
పచ్చికడువా నీకు ,,
నీ ప్రాణనాథున్ని ,,
బోనమూ ఆ తల్లి ,,
తలపైన ఆ తల్లి ,,
చక్కనీ రాజులు ,,
బాలగా మాయాది ,,
అడ్డమ్మ మనము ,,
వాళ్ళను ఏడుగురు ,,
అన్నదమ్ములయితే ,,
సత్యాన బోనము ,,
సక్కని అడవిలో ,,
శివశివ అనుకుంటూ ,,
పంచాదీ గురులేలే ,,
ఎండికొండా నేలె ,,
ఈ దేవ చెలిమల్లు ,,
చక్కని రేణుకా ,,
కార్తీక రాజులు ,,
ఆకలీ అవుతుంది ,,
చల్లనీ తల్లివే ,,
ఆకలాయి మేము ,,
తడబాడుచుండెనూ ,,
ఆకలీకి మేము ,,
మీకునూ పెట్టేటి ,,

శ్రీఘమే చెప్పు ఉయ్యాలో
చిటికెలో చేత్తునూ ,,
పొగవారెవ్వరో ,,
ద్రుంచినారే అన్న ,,
కావాలి రామన్న ,,
ఇవన్ని చెప్పింది ,,
ఇస్తిపోరా చెల్లె ,,
లేపుకూ పోవమ్మ ,,
పండుకున్నాదమ్మ ,,
పెట్టుకొన్నాదమ్మ ,,
కండ్లజూసినారు ,,
ఎల్లిపోతున్నదీ ,,
తిరుగుదాము తమ్మి ,,
అన్నదమ్ములమ్మ ,,
చెప్పుకుంటున్నారూ ,,
తలపైన పెట్టుకోని ,,
బాటల్లు పట్టింది ,,
శివ యెల్ల మాతనే ,,
పార్వతీ దేవి ,,
సన్ను గన్నా తండ్రి ,,
పోయివస్తా నేను ,,
బయలెల్లినాదమ్మ ,,
అడ్డమొచ్చినారు ,,
మమ్మ గన్నా తల్లి ,,
కడుపుల్లు నింపవే ,,
అడ్డమొచ్చినాము ,,
మాయి దేహంబులు ,,
తాళలేమే తల్లి ,,
బోనము గాదురా ,,

| | | | |
|---|---|---|---|
| ప్రాణనాథుని కొరకు | ఉయ్యాలో | పాల బోనము నేను | ఉయ్యాలో |
| ఏడొంతు రాలదీ | ,, | పచ్చిబోనము కుండ | ,, |
| సత్యాన బోనము | ,, | తీసుకా పోతున్నా | ,, |
| ముందు ముందూ మీరు | ,, | ముట్టనే రాకుండ్రి | ,, |
| మీయొక్క పాదాలకు | ,, | మ్రొక్కేదాను నేను | ,, |
| నాయొక్క దారికిని | ,, | అడ్డమూ రాకుండ్రి | ,, |
| పక్కకూ మీరును | ,, | తొలగి పోరాదుండ్రి | ,, |
| ఆకలీ మాకును | ,, | ఎక్కువౌతున్నదే | ,, |
| సల్లనీ తల్లివే | ,, | కడుపుల్లు నింపవే | ,, |
| సక్కనీ ఆ తల్లి | ,, | బోనంబు దించింది | ,, |
| ఏడుగూరికైనా | ,, | ఇస్తార్లు బెట్టింది | ,, |
| సక్కనీ ఎల్లమ్మ | ,, | నువ్వు బెట్టినాను | ,, |
| నువ్వు బెట్టినాను | ,, | పుణ్యమేముండదే | ,, |
| మీద పారిపాయె | ,, | గండబేరుండ పక్షులు | ,, |
| గండబేరి పక్షులు | ,, | చూసుకుంటూ పాయె | ,, |
| పసులకాడి బాలలూ | ,, | కండ్లతో జూసిరి | ,, |
| నువ్వు బెట్టినాను | ,, | పుణ్యమేముండదే | ,, |
| కట్టుకున్నా చీర | ,, | చుట్టు పరదలుగట్టి | ,, |
| అప్పుడు ఆ తల్లి | , | ఎవరిని యాజేసింది | ,, |
| వెండి కొండేలేటి | ,, | నన్ను గన్నా తండ్రి | ,, |
| పంచాగ్ని గిరులేలె | ,, | పార్వతీదేవి | ,, |
| కారండ మందునా | ,, | మానభంగా మాయె | ,, |
| కట్టుకున్నా చీర | ,, | వస్త్రాలు ఇడిచింది | ,, |
| ఏడుగురీ చుట్టు | ,, | పరదాలు గట్టింది | ,, |
| తల్లిన్నీ దండ్రినీ | ,, | యాదికి చేసింది | ,, |
| తాలకూరా లేమొ | ,, | నిలువెల్ల పెరిగెను | ,, |
| వాళ్ళు ఏడుగూరు | ,, | అన్నమూ తిన్నరూ | ,, |
| మిగిలినా బోనము | ,, | ఎత్తుకా పోవమ్మ | ,, |
| నీ యొక్క మోగడూ | ,, | లేచి వస్తాదమ్మ | ,, |

ఆల్లును ఏడుగురు ఉయ్యాలో
సక్కనీ ఆ తల్లి ,,
కాంచాల పుర్రిని ,,
పుట్ట దగ్గరీకి ,,
సత్యాన బోనము ,,
పట్టిమాటలు నాతో ,,
ఏడుగూరు నీకు ,,
నడుమనే వాళ్ళయినా ,,
ఎంగిలయినా బోనము ,,
నాయొక్క బాణము ,,
నాయొక్క జీవిని ,,
నువ్వు పోయినాక ,,
నేను ఒక్కదాన్ని ,,
బాణమ్ము నీవయిన ,,
ఏడు దోసిల్లనే ,,
సక్కనీ దేవుడు ,,
సక్కనీ ఆ తల్లి ,,
ఏడు దోసిల్లనే ,,
కాదలూ చిన్నదీ ,,
కొత్తకుండాలోన ,,
ఉత్తరపు బాగాన ,,
మచ్చుమపురముకొండ ,,
ఒక్కేనీ నేలల్లో ,,
మూడవ నెలల్లో ,,
మూడవ నేలల్లో ,,
ఐదవా నేలల్లో ,,
ఏడవ నేలల్లో ,,
తొమ్మిదీ నెలల్లు ,,
తొమ్మిది గడియలు ,,

ఇట్టనే చెప్పింర్రు ఉయ్యాలో
బయిలెల్లి నాదమ్మ ,,
కారణాల పుట్ట ,,
తల్లి పోయినాది ,,
తెచ్చినావె తల్లి ,,
గట్టిగా పలికేవె ,,
మొగలున్నారమ్మ ,,
బోనము తిన్నరే ,,
తీనుకొచ్చినావె ,,
పీకేయ రాదమ్మ ,,
ఎల్లి పోతున్నదే ,,
నాకేమి ఉన్నదీ ,,
ఎట్ల ఉందునాథ ,,
పీకెయ రాదమ్మ ,,
రక్తమ్ము తాగాలె ,,
ఇట్ల మాటలు చెప్పి ,,
బాణంబు పీకింది ,,
రక్తమారగించె ,,
కంచాలమర్రుండె ,,
బొక్కలూ ఏసింది ,,
ఊదకూ గట్టిందీ ,,
చేరవచ్చినాది ,,
ఓకిలింతలాయె ,,
ఏమి కోరినాది ,,
ముల్కపండ్లు కోరె ,,
అరటిపండ్లు కోరె ,,
ఎలుగపండ్లు కోరె ,,
నిండివచ్చినాయి ,,
ఏమంట ఉన్నదీ ,,

రాగి కొమ్మలు పట్టు ఉయ్యాలో
చింతకొనలూ పట్టి ,,
పత్తికొమ్మలు పట్టు ,,
బట్టు బ్రాహ్మణులను ,,
నూటనే ఒక్కను ,,
దూలాల మీదనే ,,
పుస్తకాల కట్ట ,,
పాలనే సేతుల్ల ,,
వొంగిసదువూ తుండ్రు ,,
నిలిచిసదువూ తుండు ,,
రెండోవ కమ్మని ,,
పారిన్న రక్తము ,,
పరశు రాముడాని ,,
జారిన రక్తమ్ము ,,
జంపనయ్యా అని ,,
ప్రక్కల్ల రక్తమ్ము ,,
పక్కలయ్యా అని ,,
డొల్లిన్న రక్తమ్ము ,,
డొక్కలయ్యా అని ,,
చిల్లిన్న రక్తమ్ము ,,
చిట్కెలయ్యా అని ,,
ఇంకిన్న రక్తము ,,
ఈల గౌరమ్మని ,,
ఐదుగురు బాలలకు ,,
సక్కనీ బ్రాహ్మణులు ,,
సక్కని ఆ తల్లి ,,
మత్స్యమపురము కొండల్ల ,,
ఆట పెంచేటోళ్ళ ,,
పిల్లలను పెద్దగా ,,

రామనీలా గొందు ఉయ్యాలో
చీమనీలా గొంతు ,,
బాలునీ గన్నదీ ,,
పిలిపించుమన్నది ,,
బ్రాహ్మణుల పిలిపించె ,,
పుస్తకాల కట్ట ,,
చేత బట్టినాడు ,,
పాటిగా కడిగిండు ,,
ఓలారి గన్నుల్ల ,,
నీలారి గన్నుల్ల ,,
మర్లేసినారు ,,
త్రాగినా నా తల్లి ,,
పేరు పెట్టినారు ,,
త్రాగినా వారికే ,,
పేరు పెట్టినారు ,,
త్రాగినా వారికి ,,
పేరు పెట్టినారు ,,
త్రాగినా వారికి ,,
పేరు పెట్టినారు ,,
త్రాగినా వారికి ,,
పేరు పెట్టినారు ,,
త్రాగిన వారికి ,,
పేరు పెట్టినారు ,,
పేరు పెట్టినారు ,,
ఎల్లిపోయినారు ,,
మత్స్యమపురము కొండ ,,
ఏమి చేసినాది ,,
అనోట పెంచింది ,,
తల్లి జేసినాది ,,

| | | | |
|---|---|---|---|
| తల్లిని బాలలు | ఉయ్యాలో | ఏమంట ఉన్నారు | ఉయ్యాలో |
| చదువుల్లు మేమింక | ,, | చాలించుతామమ్మ | ,, |
| ఏడబోయిన గాని | ,, | బాలలందరు గూడి | ,, |
| బాల లందరుగూడి | ,, | ఆట లాడుతుండ్రు | ,, |
| బడిలోన బాలలు | ,, | బడి ఇడసినంకునూ | ,, |
| బడి ఇడిసినంకనూ | ,, | ఆటలాడు తుండ్రు | ,, |
| నన్ను గన్నా తల్లి | ,, | తల్లిరో రేణుకా | ,, |
| నాకొక్క గోళినే | ,, | కొనియ్య రమ్మ | ,, |
| నా చిన్ని కొడుకరో | ,, | నా చిక్కలయ్యరో | ,, |
| గోళికొరకూ నీవు | ,, | చింతచేయకు తండ్రి | ,, |
| గోళీల ఆటలో | ,, | పోటి పెడుతావార | ,, |
| సక్కన్ని రాముడు | ,, | ఏమి అంటాడమ్మ | ,, |
| అమ్మరో నాకొక్క | ,, | బొంగరము గావాలే | ,, |
| సక్కనీ రేణుకా | ,, | ఏమి అంటాదమ్మ | ,, |
| అట్లనే చేపిస్తు | ,, | పాటిగా బొంగరము | ,, |
| పొద్దునే ఓ తల్లి | ,, | నాకు ఆ బొంగరమ్ము | ,, |
| ఆరాజు కారాజులు | ,, | పట్టినా బొంగరమ్ము | ,, |
| ఎండిదీ బొంగరమ్ము | ,, | బంగారు ముల్కినే | ,, |
| పొడీయ జాల | ,, | చుట్టియూ ఉన్నదీ | ,, |
| అట్లాంటి బొంగరము | ,, | కావాలె నా తల్లి | ,, |
| రంగయిన బొంగరము | ,, | రాదురా మనచేతికి | ,, |
| బంగారి బొంగరము | ,, | గంగ వద్దనె యుండె | ,, |
| గంగవద్దనే యుండే | ,, | ఘనముగా పోదునే | ,, |
| అచ్చోటి వేగినీ | ,, | తెచ్చేవారెవరయ్య | ,, |
| చక్కని ఆతల్లి | ,, | ఇట్ల చెప్పుతుంది | ,, |
| చెప్పినా మాటల్లు | ,, | ఇంటనే లేడమ్మ | ,, |
| ఎర్రనీ గుడ్లకు | ,, | ఎత్తిండు కోపాలు | ,, |
| చక్కని రాముడు | ,, | సెలవీయి మంటుండు | ,, |
| పోయిరాపో కొడుక | ,, | కొడుకరో రాముడు | ,, |

| | | | |
|---|---|---|---|
| పోనాక్క గంటరా | ఉయ్యాలో | రానాక్క గంటరా | ఉయ్యాలో |
| మూడోగ గంటల్ల | ,, | తిరిగిరాపో కొడుక | ,, |
| నడుమ గంగాదేవి | ,, | ఉంటదీ రాముడా | ,, |
| నడుమ గంగాదేవి | ,, | అడ్డగించా వలెరా | ,, |
| చక్కనీ రాముడు | ,, | చెప్పినా మాటల్లు | ,, |
| చెప్పినా మాటల్లు | ,, | చెవి నందూ పెట్టె | ,, |
| అట్లె పోయెదనమ్మ | ,, | ఇంటి లోపలాను | ,, |
| చక్కనీ రాముడు | ,, | బయిలెల్లి నాడమ్మ | ,, |
| నడుమ గంగాదేవి | ,, | అడ్డ గించీనాది | ,, |
| ఎవ్వడవురో బాల | ,, | ఏదేశ మున్నదీ | ,, |
| నాది ఆజ్ఞ లేక | ,, | నదియు దాటగలవా | ,, |
| ఆడ దానివాయి | ,, | అడ్డగించె దావె | ,, |
| సక్కన్ని రాముడు | ,, | అనరాని మాటల్లు | ,, |
| అనరాని మాటల్లు | ,, | అంట ఉన్నాడమ్మ | ,, |
| నాది ఆజ్ఞలేక | ,, | నదిని దాటగలవా | ,, |
| చూడరా ఓ బాల | ,, | పొంగు తుందీచాల | ,, |
| పిల్లాడవయినీవు | ,, | వెల్లిపోయేదావు | ,, |
| తల్లిదండ్రికి నీవు | ,, | పాసి పోయేదావు | ,, |
| అప్పుడూ రాముడు | ,, | ఏమి అంటాడమ్మ | ,, |
| అడుగు లోపలానె | ,, | దాటెదానె అమ్మ | ,, |
| అడ్డమ్మ నాకైన | ,, | రావొద్దె ఓ యమ్మ | ,, |
| సక్కన్ని రాముడు | ,, | పండ్లు కొరుకాపట్టె | ,, |
| ఎర్రనీ గుడ్లకూ | ,, | ఎత్తిండు కోపాలు | ,, |
| తెల్లనీ గుడ్లకు | ,, | తెచ్చిండు రక్తాలు | ,, |
| ఎండి వంటి పండ్లు | ,, | పిండివోలే కొరికె | ,, |
| సక్కనీ తల్లిని | ,, | ఏమి అంటాడమ్మ | ,, |
| ఒక్కొక్క దెబ్బనే | ,, | కొడుతు ఉన్నాడమ్మ | ,, |
| చూడబోతే బాల | ,, | జానడంతా లేవు | ,, |
| తండ్రి ఎవ్వాడురో | ,, | తల్లి ఎవ్వాతిరో | ,, |

అప్పుడూ ఆ గంగ ఉయ్యాలో ఈ మాట లన్నది ఉయ్యాలో

లోకమాతా ఎల్లి ,, లోకులు మెచ్చగా ,,

ఆ మాతా సుతుడను ,, తల్లికి నేనమ్మ ,,

తల్లికీ నేనునూ ,, ఏక ధీరుడనమ్మ ,,

పొంగినా గంగమ్మ ,, క్రిందికే క్రుంగింది ,,

నాముద్దు మనుమడా ,, నన్ను గన్నాతండ్రి ,,

నీ తల్లి ఎల్లమ్మ ,, క్షేమంగ యున్నదా ,,

అంతలో నా తల్లి ,, ఆనందముగ యుండె ,,

ఇమ్మగా మేముంద ,, నీకేమి భాయమే ,,

చిన్నదీ నీ ముఖము ,, వాలిపోయినాది ,,

సద్ది అన్నము మూట ,, నీవద్ద లేదయ్యా ,,

ఎంత దూరమునుండి ,, అలసి వచ్చినావు ,,

చక్కనీ ఆగంగ ,, ఇట్లు మాటలానె ,,

సక్కనీ రాముడు ,, ఏమి అంటాడమ్మ ,,

బొంగరము కోసము ,, నేను వస్తినమ్మ ,,

బొంగరము జాడలు ,, నాకు చెప్పావమ్మ ,,

సక్కనీ రాముడూ ,, గంగనే అడిగిండు ,,

ఇట్లనే పోవయ్యా ,, ఈ నాగలోకానికి ,,

నాగలోకము లోనె ,, బొంగరామున్నది ,,

పన్నెండు శిరసుల ,, పడిగె నాగన్నుండె ,,

ఎప్పటికి నాగన్న ,, పడిగెనే తీసెను ,,

ఆ పడిగె మీదనే ,, బొంగ రామున్నది ,,

నాగన్న నిన్నును ,, ఏమన్న అంటేను ,,

ఈ గండ్రగొడ్డలి ,, నీకు ఇస్తున్నను ,,

లాభాన పోయి నీవు ,, క్షేమాన రావయ్యా ,,

సక్కనీ ఆ గంగ ,, సెలవుల్లు పెట్టింది ,,

సక్కనీ రాముడు ,, బయిలెల్లి నాడమ్మ ,,

నాగ లోకంబైన ,, ఎంత సొంపూగుండె ,,

ఆట కాళ్ళందరూ ,, ఆటకే వెళ్ళిండ్రు ,,

| | | | |
|---|---|---|---|
| పాడేటి అందరూ | ఉయ్యాలో | భోగమోళ్ళుండిరి | ఉయ్యాలో |
| పచ్చనిది అక్కడా | ,, | మర్రి చెట్టుండెను | ,, |
| పారేటి సముద్రాలు | ,, | అక్కడా ఉన్నవి | ,, |
| పైటాపు లేసేటి | ,, | వారలున్నారమ్మ | ,, |
| పాకేటి మేనేమొ | ,, | తట్టు రాళ్ళున్నవి | ,, |
| కారేటి రక్తము | ,, | కారుతున్నాదమ్మ | ,, |
| ఇంతటి శృంగారము | ,, | నాగ లోకాముండె | ,, |
| సక్కనీ రాముడు | ,, | అక్కడికి చేరిండు | ,, |
| బొంగరము అయితెనే | ,, | చేత బట్టినాడు | ,, |
| సక్కనీ రాముడు | ,, | ఎనుకకూ మర్రిండు | ,, |
| చల్లగా రాముడు | ,, | చేర వచ్చీనాడు | ,, |
| బడి లోపలికి | ,, | చేర వచ్చినాడు | ,, |
| బడి లోపలవున్న | ,, | ముని బాలకులు | ,, |
| ముని బాలకులు | ,, | ఏమి అంటారమ్మ | ,, |
| అన్నరో రామన్న | ,, | ఆటలాడుదాము | ,, |
| బొంగరాల ఆట | ,, | మనము ఆడుదాము | ,, |
| నువ్వేను ఫస్టును | ,, | పెట్టాలి నాయన్న | ,, |
| పెట్టండి జాలలు | ,, | ఎయ్యండి బొంగరాలు | ,, |
| వాళ్లు ఏసీనంక | ,, | రాముడే మంటడూ | ,, |
| చుట్టండి జాలలు | ,, | కొట్టండి బొంగరాలు | ,, |
| చుట్టిరీ జాలలు | ,, | కొట్టిరీ బొంగరాలు | ,, |
| అన్నరో రామన్న | ,, | నాది బొంగరాము | ,, |
| నాది బొంగరము | ,, | పగిలింది ఓయన్న | ,, |
| ఇప్పుడు ఆటలు | ,, | బందు చెయ్యాలన్న | ,, |
| చక్కని రాముడు | ,, | ఏమి అంటాడమ్మ | ,, |
| కబడ్డి మనమిపుడు | ,, | ఆడాలెరా తమ్మి | ,, |
| కబడ్డి ఆడినా | ,, | కలహాలు వచ్చినా | ,, |
| మేము పస్తీమి అన్న | ,, | మీరు రాండ్రి అన్న | ,, |
| నువ్వు వచ్చి ఇపుడు | ,, | జోపి పోరాదన్న | ,, |

సక్కనీ రాముడు ఉయ్యాలో జోపుతనే ఉన్నడూ ఉయ్యాలో
ఆయొక్క బాలలు ,, ఏమంట ఉన్నరూ ,,
ఉండలేము అన్న ,, ఊరెళ్ళి పోతాము ,,
భూమి లోపలాను ,, బత్కలేము అన్న ,,
నాయొక్క కాలును ,, ఇరిగి పోయీనాది ,,
చక్కన్ని బాలలు , బట్టల్లు గట్టింౘ్రడు ,,
చక్కనీ బాలలు ,, బాటల్లు వట్టింౘ్రడు ,,
మీరు ఇంటికిపోయి ,, మీరు చెప్పుతారు ,,
మీ ఎనుక నేనును ,, వస్తాను పాదరా ,,
అనరాని మాటలు ,, తిట్టిపి స్త్రీరు నన్ను ,,
నీ తల్లిదండ్రికి ,, చెప్పుతారు మీరు ,,
అనుకుంటు రాముడు ,, బయిలెల్లుతున్నాడూ ,,
సక్కని రాముడు ,, బయిలెల్లి నాడమ్మ ,,
ఎవ్వరూ తిట్టిరి ,, ఎవ్వరూ గొట్టిరి ,,
ఆటల్లనే మేము ,, ఆట లాడుకుంటే ,,
లంజెల్లి కొడుకాట ,, దొంగెల్లి కొడుకాట ,,
కర్రోడు కటోడ్కడు ,, దెబ్బలాకు వాడు ,,
సక్కని రాముడు ,, మమ్ములా గొట్టెనా ,,
అనరాని మాటల్లు ,, అంట ఉన్నాడమ్మ ,,
నీకు తండ్రియైన ,, ఉన్నదారా వోరి ,,
నీకు తండ్రి లేరు ,, నీకురా వోరారి ,,
ఎన్ని ఇత్తులకు ,, వుట్టినవురో వారి ,,
సన్నవూ రైకలకు ,, శాలోనికి గన్నది ,,
దొడ్డు దోతూలకు ,, దొరోనికి గన్నది ,,
సూరియా ఆశకు ,, గొండ్లోనికి కన్నది ,,
అనరాని మాటల్లు ,, వాళ్ళు అంటున్నరు ,,
చక్కనీ రాముడు ,, చిన్నబోయినాడు ,,
మవురము కొండల్ల ,, చేర వచ్చినాడు ,,
సక్కని ఆ తల్లి ,, ఏమి అంటాదమ్మ ,,

ఏందిరా నా కొడుకా ఉయ్యాలో నన్ను గన్నా తండ్రి ఉయ్యాలో
చిన్నగా నీ ముఖము ,, ఆరిపోయినాది ,,
ఎవరన్నా నిన్ను ,, తిట్టినారా కొడుకా ,,
ఎవరన్నా నిన్ను ,, కొట్టినారా కొడుకా ,,
సక్కని ఆ తల్లి ,, ఇట్లు అడుగుతుంది ,,
నన్ను గన్నా తల్లి ,, తల్లిరో ఎల్లమ్మ ,,
ఏడ జూసినగాని ,, జనని జనకూలాట ,,
జనని నీఉన్నవూ ,, జనకుడు ఎవ్వరే ,,
తండ్రిలేని పోరడాని ,, జగతిలో అందురు ,,
జగతిలో అందురు ,, పిలుస్తు ఉన్నరూ ,,
పుత్రకా నీకిట్టి ,, బుద్ధు లెవ్వరుచెప్పె ,,
బుద్ధు లెవ్వరుచెప్పె ,, జ్ఞాన మెవ్వరుచెప్పె ,,
ముందుగా నీవిపుడు ,, భోంచేయి నా కొడుకా ,,
ముచ్చటంతా నీకు ,, చెప్పెదాను కొడుకా ,,
నాకునూ ఇప్పుడూ ,, భోజనా మొద్దమ్మ ,,
తండ్రివార్తలు నాకు ,, చెప్పనందాకను ,,
తల్లిరో నేనిపుడు ,, స్నాన మాడేదాను ,,
నువ్వన్న మాటలు ,, చిత్రమ్ము గుండెరా ,,
నా తండ్రి వార్తనూ ,, నాకు తెలుపాలనీ ,,
విత్తనమ్ము లేని ,, మొలకెట్లు మొలిచెనో ,,
మొలకలేని చెట్టు ,, చెట్టెట్లు పెరిగెనే ,,
చక్కనీ రాముడు ,, అనరాని మాటలు ,,
అనరాని మాటలు ,, అంట ఉన్నాడమ్మ ,,
కొట్టరాని నన్ను ,, దెబ్బలు కొట్టకురా ,,
చక్కనీ రేణుకా ,, ఇట్ల మాటలానె ,,
దాహంబు నాకునే ,, ఎక్కువైతున్నదీ ,,
ఇక్కడా నేనిపుడు ,, గిరిగీసి పోతున్న ,,
ఈ గిరి దాటినే ,, నువ్వుపోతే తల్లి ,,
కొట్టరాని నిన్ను ,, దెబ్బలు కొట్టెదా ,,

| | | | |
|---|---|---|---|
| కుక్క నక్కలకు | ఉయ్యాలో | సుఖమ్ము చేసెదా | ఉయ్యాలో |
| సక్కని రాముడు | " | ఇట్ల మాటలానె | " |
| సక్కన్ని రాముడు | " | మాట లానుకుంటు | " |
| దాహమ్ము త్రాగనే | " | పోత ఉన్నాదమ్మ | " |
| నా కొడుకు ఇప్పుడు | " | ఎల్లిపోయినాడు | " |
| వాడు వచ్చేవరకు | " | ఎక్కడి కెల్లుదూ | " |
| నన్ను గన్నా తండ్రి | " | శివుడు శంకారుడా | " |
| నన్ను గన్నా తల్లి | " | పార్వాతీదేవి | " |
| ఎండికొండా కైన | " | చేరబోయేదాను | " |
| చక్కని రేణుకా | " | మాటలాడుకుంటూ | " |
| గ్రద్దనే సూడనీ | " | మద్దానపడవిలో | " |
| పిట్టలే దూరనీ | " | ఆ పిరికి అడవిలో | " |
| ఆ పిరికి అడవిలో | " | ఒక్కబాయి ఉన్నదీ | " |
| సక్కనీ రేణుకా | " | ఏమి చేసీనాది | " |
| నా కొడుక రాముడా | " | నువ్వు వచ్చేవరకు | " |
| వాని చేతికి నేను | " | దొరుకనానూకుంటూ | " |
| పరిటల్లు జీరింది | " | గుంజకూ గట్టింది | " |
| మచ్చుమాయాతోటి | " | బాయిల్ల నీళ్ళను | " |
| బాయిల్ల నీళ్ళను | " | తొలకినట్లాయెనే | " |
| చక్కన్ని రేణుకా | " | ఎండికొండాకెళ్ళి | " |
| నన్ను కన్నా తండ్రి | " | శివ శంకారూడా | " |
| నా కొడుకు రాముడు | " | పెట్టేటి బాధలు | " |
| అనరాని మాటలు | " | నన్ను అంటున్నాడూ | " |
| తండ్రిజాడలు నన్ను | " | అడుగుతున్నాదమ్మ | " |
| అప్పుడూ దేవుడు | " | ఏమి అంటాదమ్మ | " |
| చిన్నవాడాతడు | " | కండ్లతో బెదిరియ్యి | " |
| సక్కన్ని దేవుడు | " | ఇట్ల చెప్పుచుండె | " |
| నేనైన ఇక్కడ | " | తలదాసుకుంటా | " |
| శివుడు ఏలేటి | " | శివకోల్లాపూరి | " |

శివకోల్లా వూరిలో ఉయ్యాలో
సక్కన్ని రేణుకా ,,
తల్లి అనువాలు ,,
ఎడమకాలు వేను ,,
గవ్వలానువాలు ,,
సక్కన్ని రాముడు ,,
అడవి లోపలాను ,,
చక్కనీ రాముడు ,,
నా తల్లి ఎల్లమ్మ ,,
తండ్రి జాడా నేను ,,
బాధకూ తాళకా ,,
సక్కనీ నా తల్లి ,,
నా తండ్రి జాడలు ,,
చక్కనీ రాముడు ,,
ఎక్కడా చూసినా ,,
ఇండ్లనే నా తల్లి ,,
సక్కన్నీ రాముడు ,,
ఎండి కొండాకైనా ,,
వందనము వందనము ,,
మా తల్లి ఎల్లమ్మ ,,
నీ తల్లి ఎల్లమ్మ ,,
పతివ్రత నా బిడ్డ ,,
పతివ్రతా రాలమ్మ ,,
చక్కని రాముడు ,,
పతివ్రతా నీ బిడ్డ ,,
పతివ్రతా నీ బిడ్డ ,,
పతి మరణించినపుడు ,,
సతి గర్భమున నీవు ,,
తనయుల గంటెనూ ,,

తలదాసుకుంటు ఉయ్యాలో
దాసుకుంటున్నదీ ,,
చూసుకుంటున్నాడు ,,
బండారు ఉన్నదీ ,,
చూసుకుంటున్నాడు ,,
బాటల్లు బట్టిండు ,,
బాటల్లు పట్టిండు ,,
బాయి కాడికొచ్చె ,,
ఇండ్లనే పడ్డదీ ,,
అడిగితే నా తల్లి ,,
బాయిలా పడ్డవా ,,
బాయిల్ల ఉన్నదీ ,,
నాకును తెల్పుమనీ ,,
బాయిలా దుంకిండు ,,
తల్లి దొరుకాలేదు ,,
పాడ లేదన్నడు ,,
ఎట్ల బలులెల్లుండు ,,
చేర వచ్చినాడు ,,
తాత శంకారుడా ,,
ఇక్కడికి వచ్చిందా ,,
ఇక్కడా రాలేదు ,,
ఎక్కడా బోయింది ,,
భూవిలోపాలాను ,,
ఏమి అంటాడమ్మ ,,
పరుగ మమ్మెటుగావె ,,
మమ్మేల గన్నదీ ,,
పతి గర్భమున నీవు ,,
ఉన్నావూ బాలకా ,,
తండ్రి పేరు తెల్పరా ,,

మంచి మాటాకొద్ది ఉయ్యాలో
సెప్పుతున్నా తాత ,,
మా తల్లి ఎల్లమ్మ ,,
నాకెరుక లేదయ్యా ,,
పంచాగ్ని గిరులేలు ,,
నా తల్లి ఎల్లమ్మ ,,
చక్కని మాతరో ,,
నా బిడ్డ ఎల్లమ్మ ,,
దేవనారి ఎల్లుతే ,,
జాను లందారికి ,,
పతివాత అందురు ,,
ఎర్రనీ గుడ్డకూ ,,
తెల్లనీ గుడ్డకూ ,,
సక్కనీ రాముడు ,,
నా తల్లి ఎల్లమ్మ ,,
ఎంత సేపయినను ,,
అనుకుంటు రాముడు ,,
చక్కనీ రేణుకా ,,
సిగ్గు లేకుండాను ,,
తల్లిగారింటిలో ,,
తండ్రినే జాడల్లు ,,
అక్కడి కెల్లొచ్చి ,,
ఎంత దాసుకున్న ,,
చక్కనీ రాముడు ,,
నా తల్లి ఎల్లమ్మ ,,
నా తండ్రి జాడలు ,,
ఎప్పటికైనను ,,
గండ్రగొడ్డలితోని ,,
కుక్కా నక్కాలాకు ,,

తల్లినే సూపియ్యి ఉయ్యాలో
చెవునందూ పెట్టు ,,
ఇక్కడే ఉన్నదీ ,,
మీయమ్మ నడుగయ్య ,,
అమ్మ పారువాతీ ,,
ఇక్కడికి వచ్చిందా ,,
ఎక్కడా బోయింది ,,
ఎక్కడా బోయింది ,,
జాను లందారికి ,,
తెలుపుతున్నాదయ్య ,,
ఆమెను అందరూ ,,
ఎత్తిండు కోపాలు ,,
తెచ్చింది రక్తాలు ,,
ఎండి కొండాలోనా ,,
ఎక్కడా దాగింది ,,
దేవులాడుకుంట ,,
తిర్గుతున్నాదమ్మ ,,
జడుసుకుంటున్నదీ ,,
శెరము లేకుండాను ,,
తలదాచుకున్నవో ,,
నేను అడిగితేను ,,
దాసుకున్నావమ్మా ,,
నిన్ను ఇడువాలేనె ,,
గుంజుకొచ్చినాడు ,,
నా తండ్రి జాడలు ,,
నాకు చెప్పరాదె ,,
ఇడువజాలానమ్మ ,,
నరికి వేస్తానమ్మ ,,
సుఖమ్ము జేస్తాను ,,

చక్కనీ రాముడూ ఉయ్యాలో
చక్కన్ని రేణుకా ,,
పన్నెండు మునిగాల ,,
ఎక్కడున్నాడాని ,,
ఎక్కడ బోయిండాని ,,
అనరాని మాటలు ,,
ఎనుకకు సేతులు ,,
అక్కడా చూడవమ్మ ,,
పన్నెండు బీగాల ,,
ఆ పరుపు బండను ,,
ఆ బండపై నిన్ను ,,
ఎర్రగా ఆ బండ ,,
ఆ బండ మీదనే ,,
అనరాని మాటలు ,,
చక్కని రేణుకా ,,
ఎర్రనీ చర్మమూ ,,
నా ఒంటి చర్మము ,,
నా కొడుకా రాముడా ,,
నూయ్యిలోతైనాను ,,
ఆ యొక్క శేకకు ,,
ఇట్లు పొర్లిచ్చినా ,,
ఎక్కడా తల్లిని ,,
చెల్లె దగ్గారికి ,,
నా చెల్లె గౌరమ్మ ,,
తల్లినీ నీవైన ,,
మచ్చు మాయాతోని ,,
మంచిగా నీవైన ,,
నాకును దూపల్లు ,,
జాలమ్మ కోరకు ,,

మాటలాడూకుంటు ఉయ్యాలో
ఏమి అంటున్నదీ ,,
ఈ కులములలోనా ,,
చెప్పుదూ రాముడా ,,
వస్తడని చెప్పుదూ ,,
రాముడంటున్నడు ,,
ఇర్సి కట్టినాడు ,,
ననుగన్నా తల్లి ,,
పరుపు బండున్నదీ ,,
కాలబెడ్తా నేను ,,
పొర్లి యిస్తానమ్మ ,,
కాలబెట్టినాడు ,,
పొర్లిస్తు ఉన్నడూ ,,
అనుకుంటు రాముడు ,,
ఏమి అంటాదమ్మ ,,
ఏటి పాలాయెరా ,,
మట్టి పాలాయెరా ,,
చిన్నవాడవురా ,,
శేకల్లు ఉన్నవీ ,,
చేతులుడికిపోవు ,,
జాడ చెప్పాదాని ,,
తీసుకాపోతుండు ,,
తీసుకాపోతుండు ,,
నా ఈల గౌరమ్మ ,,
సూడాలె నా చెల్లె ,,
మరి ఎల్లిపోతేవే ,,
చూడాలే నా చెల్లె ,,
అవుతున్నదీ చెల్లె ,,
పోతను నా చెల్లె ,,

సక్కనీ రాముడు ఉయ్యాలో
సక్కనీ రాముడు ,,
చిన్నగా ఆ తల్లి ,,
అట్టి వార్తా అయిన ,,
కాలము కన్నాల్లు ,,
చెయ్యంగ మా తల్లి ,,
ఎందుకూ ఈ బాధ ,,
సక్కనీ గౌరమ్మ ,,
సక్కనీ రేణుకా ,,
చిన్నగా నీ ముఖము ,,
ఆనంద మాయెనే ,,
చెఱసాల లోపల ,,
అన్ననే రాముడు ,,
సక్కనీ గౌరమ్మ ,,
అన్నతోనీ నేను ,,
అన్న రామూడొచ్చి ,,
ఎట్లైన నేనును ,,
నీవైన ఎక్కడా ,,
సక్కనీ గౌరమ్మ ,,
ఏమిటి మాటల్లు ,,
ఆడపిల్ల అత్మ ,,
నీవు చెప్పినమాట ,,
సక్కనీ రేణుకా ,,
ఆడికెల్లి తల్లి ,,
వైశాఖ వాసము ,,
సక్కన్ని రేణుకా ,,
ఏడు గాల్లానేమె ,,

అక్కడా పోయిండు ఉయ్యాలో
ఎల్లిపోయినంక ,,
ఏమి అంటాదమ్మ ,,
అన్నయ్యాకూ తెలుప ,,
కడుపూల ప్రేమతో ,,
చెఱసాల పాలాయె ,,
చెప్పరాదే తల్లి ,,
తల్లి నడుగూతుంది ,,
ఏమి అంటాదమ్మ ,,
చూచె వారకు బిడ్డ ,,
నన్నుగన్నా తల్లి ,,
ఎట్ల ఉందూనమ్మ ,,
ఎల్లి పోయినాక ,,
ఏమి పలుకుతుంది ,,
ఏమన్న అంటెనే ,,
ఏమన్న అడిగితే ,,
బొంకుతానె తల్లి ,,
ఎల్లిపోయె తల్లి ,,
తల్లి నెల్లాగొట్టే ,,
రేణూకాన వట్టె ,,
దొరుకది నా బిడ్డ ,,
నేను ఇంటన్ననే ,,
బయిలెల్లినాదమ్మ ,,
ఏడికెళ్ళి పాయె ,,
చేర వచ్చినాది ,,
ఏమి అంటాదమ్మ ,,
అయెల్ల గావుడు ,,

| | | | |
|---|---|---|---|
| మూడు గాల్లానేమొ | ఉయ్యాలో | ఓ ముత్త గావుడు | ఉయ్యాలో |
| నాకు దాహంబులు | ,, | ఎక్కువాయినాయి | ,, |
| ఈ ముంత దంతను | ,, | కల్లు పొయ్యరాద | ,, |
| సక్కన్ని రేణుక | ,, | పోయిమంటున్నది | ,, |
| ఏడుగాల్లా వాళ్ళు | ,, | ఏమి అంటున్నారు | ,, |
| నువ్వుజూడా బోతె | ,, | పుండ్లు ఉన్నాయమ్మ | ,, |
| నువ్వు ఇక్కడాను | ,, | ఉంటెనె నా తల్లి | ,, |
| కల్లుకు ఎవ్వరూ | ,, | రాబోరె నా తల్లి | ,, |
| పుండ్లపొంటీ అన్ని | ,, | ఈగల్లు ఉన్నవి | ,, |
| కల్లునే లేదమ్మ | ,, | ఏమినీ లేదమ్మ | ,, |
| ఇక్కడా నుంచైనా | ,, | ఎల్లి పోరాదమ్మ | ,, |
| సక్కనీ గావుడు | ,, | ఎల్ల గొట్టినాడు | ,, |
| మూడుగాల్లా నేమొ | ,, | ముత్త గావుడమ్మ | ,, |
| సక్కనీ నా తల్లి | ,, | నేను పోసేదాను | ,, |
| నీకు దాహంబులు | ,, | ఎక్కువైతున్నవీ | ,, |
| ముంతదంతాసూర | ,, | నేను పోసేదాను | ,, |
| సక్కనీ ఆ గావుడు | ,, | సూరియా బోసిండు | ,, |
| సక్కనీ ఆ తల్లి | ,, | ఎల్లిపోతున్నదీ | ,, |
| అప్పుడు గౌండ్లోల్లు | ,, | ఏమి చేసీనారు | ,, |
| చెట్లకాడికి పోయి | ,, | కల్లు ఇడిచీనారు | ,, |
| నిన్న మొన్నా నేమొ | ,, | కల్లు ఎల్లినాది | ,, |
| ఇప్పుడూ నా చెట్టు | ,, | ఎండిపోయినాది | ,, |
| ఇప్పుడూ వచ్చినా | ,, | ముసలిదానీ మాయ | ,, |
| సక్కని గౌండ్లోల్లు | ,, | అడ్డమ్మ తిరిగిరి | ,, |
| సక్కనీ గౌండ్లోల్లు | ,, | బాటకడ్డా మొచ్చి | ,, |
| తప్పితిమి మా యమ్మ | ,, | చిన్ని ముసలమ్మా | ,, |
| నాయొక్క చెట్టుకు | ,, | కల్లు లేదు తల్లి | ,, |
| అనుకుంటు వాళ్ల | ,, | ఒంగి పాదంబట్టిరి | ,, |
| ఒంగి పాదంబట్టి | ,, | కదులనియ్యారమ్మ | ,, |

సక్కన్ని రేణుకా ఉయ్యాలో
అప్పుడు ఇప్పుడు ,,
కల్లు పోయనాని ,,
ఆనాటికి ఈనాటికి ,,
ఆనాటి దినముల్ల ,,
ఈనాటి దినముల్ల ,,
ఒంగినా చెట్టును ,,
లేచినా చెట్లైయిన ,,
మీకు మూడు బేడీలు ,,
మూడు బేడీలైన ,,
సక్కనీ ఆ తల్లి ,,
సక్కనీ ఆ తల్లి ,,
వైశాఖ వనములో ,,
అనుకుంటు ఆ తల్లి ,,
బ్రాపనా వాడల్ల ,,
బ్రాప నమ్మల్లారా ,,
నా కొడుకు రాముడు ,,
బాధలాకే నేమో ,,
నన్ను గా సేపును ,,
సక్కనీ రేణుకా ,,
నా కొడుకు రాముడు ,,
నీ కొడుక పోరును ,,
మాకును ఎక్కువా ,,
వాద్దొద్దు మా తల్లి ,,
మాకదుపకు ఐదు ,,
సక్కనా వాళ్ళయినా ,,
వలవల మా తల్లి ,,
నా కొడుక రాముడా ,,
పన్నెండు ఆమడ ,,

ఏమి చెప్పుతుంది ఉయ్యాలో
చెప్పుతున్నానయ్యా ,,
ఎల్లగొట్టినారు ,,
వైశాఖవాసము ,,
ఒంగు మంటొంగింది ,,
ఒంగినా చెట్టును ,,
మీదికి లేవదు ,,
క్రిందకి వంగవు ,,
ముడతది గొండ్లోడ ,,
కావాలెరా మీకు ,,
శాపంబు పెట్టింది ,,
నాయొక్క గుడిసీ ,,
కట్టీయవాలెరా ,,
ఎల్లిపోయె తల్లి ,,
పోయినాదీ తల్లి ,,
నాయి తల్లుల్లారా ,,
పెట్టేటి బాధలు ,,
తాళ లేకాను ,,
దాసుక రాదమ్మ ,,
అడుగుతున్నాడమ్మ ,,
పెట్టె బాధాలమ్మ ,,
చెప్పుతూ ఉంటెను ,,
భయముగ ఉన్నది ,,
మాయింట్ల వద్దమ్మ ,,
బొట్లు పెట్టి పోవె ,,
ఏమి అంటారమ్మ ,,
వాల పోసుకుంటు ,,
నీ పేరు చెప్పుతే ,,
భయపాడుచున్నారు ,,

సక్కన్నీ ఆ తల్లి ఉయ్యాలో
కోమటి వాడల్ల ,,
కోమటమ్మల్లారా ,,
నన్ను కాసేపును ,,
నా కొడుకు రాముడు ,,
సక్కని ఆ తల్లి ,,
రాముని పేరును ,,
మాకును ఎక్కువ ,,
మాయొక్క పంచకు ,,
ఎల్లిపో మా తల్లి ,,
సక్కనీ రేణుకా ,,
గోడగోడ ఆ తల్లి ,,
వలవోల ఆ తల్లి ,,
సక్కన్ని రేణుకా ,,
మాత వాడలకెల్లి ,,
మాదిగే వాడల్ల ,,
పేరుకూ పెద్దనే ,,
పెద్ద మాతరోను ,,
సక్కనీ ఆ తల్లి ,,
సక్కనీ ఆ తల్లి ,,
సక్కనీ ఆ తల్లి ,,
నన్నుగన్న తల్లి ,,
నామీద నున్నవి ,,
సొమ్ములన్ని తల్లి ,,
నీ యింటి లోపలా ,,
నీ కొడుకు రాముడు ,,
ఏమని మేమును ,,
సక్కన్ని ఆ తల్లి ,,
ఎన్ని బాధలు వాడు ,,

ఏడి కెల్లినాది ఉయ్యాలో
తల్లి పోయినాది ,,
నాయి అమ్మల్లారా ,,
దాయి అమ్మల్లారా ,,
పెట్టె బాధలాకు ,,
సెప్పుకుంటున్నదీ ,,
చెప్పేవారాకల్ల ,,
భయమూగ ఉన్నదీ ,,
ఐదు బొట్లు పెట్టు ,,
మాయింట్ల వద్దమ్మ ,,
గొడగొడ ఆ తల్లి ,,
గో|్రటిల్లుకుంటె ,,
వొల పోసుకుంటె ,,
ఎక్కడి బాటలు పట్టె ,,
బాటల్లు పట్టింది ,,
ఎవ్వరున్నారమ్మ ,,
పెద్ద మాతారమ్మ ,,
పోశయ్య ఉన్నడు ,,
అక్కడికి చేరింది ,,
అక్కడా చేరింది ,,
ఏమి అంటాదమ్మ ,,
నన్నుగన్నా తండ్రి ,,
సొమ్ములు ఉన్నవి ,,
నేను ఇస్తన్ననే ,,
నన్ను దాసుకుంటె ,,
వచ్చి అడుగుతేనె ,,
చెప్పుకుందూమమ్మ ,,
ఇట్లు అంటున్నదీ ,,
పెట్టినా గాదను ,,

నీ నేతు లున్నది ఉయ్యాలో
పెద్దకత్త్రీ ఉండె ,,
నీకొక్క బిడ్డనీ ,,
వాళ్లా ముగ్గిరితోడ ,,
సక్కనీ ఆ తల్లి ,,
పెయిమీది సొమ్ములు ,,
సక్కనీ రేణుకా ,,
శాలి మాపాలమ్మ ,,
జోడు లొందల్లనే ,,
నట్టనడుముండెను ,,
లొంద గోళాములో ,,
పాపకారీ వాడు ,,
పరశు రాముడూను ,,
సక్కనీ ఆ తల్లి ,,
చక్కనీ రాముడు ,,
చెల్లెకాడికొచ్చి ,,
నా ముద్దు చెల్లెలా ,,
నా తల్లి ఎల్లమ్మ ,,
ఎన్ని బుద్ధులు నీకు ,,
మచ్చు మాయాతోని ,,
తల్లి మాటాలేమొ ,,
ఒక్కటీ రీతిగా ,,
తల్లి పిల్లల మాట ,,
సక్కనీ గౌరమ్మ ,,
నాయన్న రాముడా ,,
నువ్వు చెప్పిన రీతి ,,
దర్వాజ లోపలా ,,
అప్పుడు రాముడు ,,
ఫోగల మాటలు ,,

పెద్ద కత్త్రినమ్మ ఉయ్యాలో
పెద్దారె ఉండెనె ,,
బిడ్డ పోశమ్ముండె ,,
ఒట్టు తీనాకుంద్రి ,,
బుద్ధులే చెప్పింది ,,
తీసి ఇచ్చినాది ,,
ఎక్కడా పోతుంది ,,
జోడు లొందాలుండె ,,
పోతుంది రేణుకా ,,
లంద గోళాములు ,,
దుంకి యున్నాదమ్మ ,,
పరశురామూడమ్మ ,,
పెట్టె బాధలాకు ,,
లొందలా దుంకింది ,,
చెల్లె కాడికొచ్చి ,,
ఏమంట ఉన్నడు ,,
సిరియాల గౌరమ్మ ,,
ఎక్కడా పోయింది ,,
చెప్పినా గౌరమ్మ ,,
పోతదని చెప్పినా ,,
పిల్లి మాటాలమ్మ ,,
ఉంటదే నా చెల్లె ,,
ఒక్కటే ఉంటదే ,,
ఏమి అంటాదమ్మ ,,
నాకేమి తెలియదు ,,
ఇక్కడే ఉన్ననే ,,
నేను ఉన్నా అన్న ,,
ఏమి అంటున్నాడు ,,
పల్కు తున్నావమ్మ ,,

వోగల మాటలు ఉయ్యాలో
అనరాని మాటలు ,,
సక్కని ఆ చెల్లె ,,
వోగల మాటలు ,,
జగము లోపలాను ,,
వోగల మాటలు ,,
సక్కనీ ఆ తల్లి ,,
నన్ను గన్న తల్లి ,,
ఎంత దూరము నీవు ,,
అనరాని మాటలు ,,
కొట్టరాని దెబ్బలు ,,
తల్లిదండ్రులు నాకు ,,
నాకునూ ఇప్పుడు ,,
దిక్కులేని నేను ,,
సక్కనీ గౌరమ్మ ,,
వలవోల తల్లినే ,,
అడవి లోపలాను ,,
సక్కనీ రాముడు ,,
నా తల్లినీ నేను ,,
నాతోడ బుట్టెనా ,,
చెల్లెనూ నేనైతీ ,,
చక్కనీ రాముడు ,,
చెల్లెకు అడ్డము ,,
ఏమని మాటల్లు ,,
నా ముద్దు చెల్లెలా ,,
నా ముద్దు చెల్లెలా ,,
నా తవ్వు మన్నించు ,,
సక్కనీ ఆ తల్లి ,,
అనరాని మాటలు ,,

తెలిసి పోయినాయి ఉయ్యాలో
చెల్లె నంటున్నడు ,,
ఏమి అంటున్నదీ ,,
ఏమిటో ఓ యన్న ,,
ఏమి చెప్తినమ్మ ,,
ఏమి పల్కితీనె ,,
బయిలెల్లినాదమ్మ ,,
రేణుకా ఎల్లమ్మ ,,
పారిపోయినావు ,,
అన్న రాముడానె ,,
అన్న రాముడుగొట్టె ,,
లేనిదానా నైతి ,,
దిక్కునూ ఎవ్వారమ్మ ,,
పోరినయితీని ,,
వలవోల తల్లినే ,,
వాలపోసుకుంటే ,,
పారిపోతున్నది ,,
ఏమి అంటాదమ్మ ,,
కొట్టెల్ల గొట్టినా ,,
ఒక్క చెల్లుండెనే ,,
కొట్టెల్ల గొట్టితీ ,,
చెల్లెకు అడ్డము ,,
తిర్గుతున్నాదమ్మ ,,
అంట ఉన్నాదమ్మ ,,
సిరియాల గౌరమ్మ ,,
నా తప్పు మన్నించు ,,
నామీద దయలుంచు ,,
ఏమి అంటాదమ్మ ,,
నన్ను అన్నావన్న ,,

| | | | |
|---|---|---|---|
| ఇక్కడా నేనైనా | ఉయ్యాలో | ఉండజాలానన్న | ఉయ్యాలో |
| మనసుకు నాకైన | " | బాధ లాయెనన్నా | " |
| మాటలన్ని నేను | " | పొదలేని అన్న | " |
| తల్లిపోయినా దారి | " | చూసుకుంటు నేను | " |
| ఎక్కడికైనను | " | వెళ్ళి బతుక్కతాను | " |
| ఇక్కడా నేనిపుడు | " | ఉండజాలానన్న | " |
| సక్కన్ని రాముడు | " | ఏమి అంటాడమ్మ | " |
| నువ్వు పోయినాక | " | నాకేమి ఉన్నదే | " |
| నామీద దయలుంచి | " | నన్ను మన్నించమ్మ | " |
| సక్కన్ని రాముడు | " | చెల్లెను ఏమనీ | " |
| నా చిన్ని చెల్లెలా | " | సిరియాల గౌరమ్మ | " |
| తప్పులన్నీ నీవు | " | క్షమించు నా చెల్లె | " |
| మన ఇంటి లోపలా | " | నువ్వుండు నాచెల్లె | " |
| ఎక్కడా పోయిందో | " | ఆ నీచురాలెనే | " |
| ఎక్కడా పోయినా | " | ఎత్కి తేస్తానమ్మ | " |
| సక్కనీ రాముడు | " | చెల్లె నెత్తుకోని | " |
| చెల్లె నెత్తుకోని | " | ఇంటి కొచ్చినాడు | " |
| తల్లిజాడకు నేను | " | పోతనే ఉన్ననే | " |
| గంద్రగొడ్డా లేమొ | " | చేత బట్టినాడు | " |
| సక్కని రాముడు | " | తల్లిజాడలు పాయె | " |
| పోయినంత దూరము | " | ఏమానువాలుండె | " |
| బండారు కుంకుమా | " | గవ్వ లుండెనుగాద | " |
| గవ్వ లానువాలు | " | సూసుకుంటున్నాడు | " |
| సక్కనీ రాముడు | " | పోత ఉన్నాదమ్మ | " |
| వైశాఖ వనములో | " | లేదాయె మా తల్లి | " |
| పాపకారీ వాడు | " | ఆ పరశురాముడు | " |
| పటపట వండ్లనూ | " | కొరుక్కుంటున్నడు | " |
| తల్లినే జాడల్లు | " | ఎల్లుతున్నాదమ్మ | " |
| వైశాఖవనములో | " | దాటేసి నాదమ్మ | " |

| సక్కనీ రాముడూ | ఉయ్యాలో | ఏడికా చెరొచ్చె | ఉయ్యాలో |
|---|---|---|---|
| బ్రాపనీ వాడల్ల | ,, | రాముడు చేరెనే | ,, |
| కోమటి వాడల్ల | ,, | రాముడు చేరెనే | ,, |
| ఇక్కడా నా తల్లి | ,, | లేదానుకుంటును | ,, |
| సక్కనీ రాముడు | ,, | ఎక్కడా పోతుండు | ,, |
| మాతరీ వాడలకు | ,, | రామన్న పోయెనే | ,, |
| పెద్ద మాతారోల్ల | ,, | ఇంటికి పాయెనే | ,, |
| ఇంట్ల ఉన్నవారు | ,, | ఎవ్వరయ్యా మీరు | ,, |
| మా తల్లి ఎల్లమ్మ | ,, | వచ్చిందా ఇక్కడికి | ,, |
| వాళ్ళయిన రాముని | ,, | మాట వింటాలేదు | ,, |
| సక్కనీ పోశయ్య | ,, | ఏమి అంటాడమ్మ | ,, |
| ఎక్కాడి కెల్లను | ,, | మాట్లాడుతున్నడు | ,, |
| నాదిని ముచ్చట | ,, | చెవునందు పెట్టయ్య | ,, |
| సక్కనీ పోశయ్య | ,, | అల్లు అంతలవాల్లు | ,, |
| వాల్లిదాండ్ల వాల్లు | ,, | మాట్లాడుకుంటండ్రు | ,, |
| చక్కనీ రాముడు | ,, | ఎర్రని గుడ్లకూ | ,, |
| పాపకారీ వాడు | ,, | పరశురాముడని | ,, |
| గుడిసె లోపలాను | ,, | ఎవ్వడవురా నీవు | ,, |
| ఎంతపిల్చిన గానీ | ,, | పలుకవేమిరా నీవు | ,, |
| అనుకుంటు రాముడు | ,, | కోపాలు చేసెనే | ,, |
| అప్పుడు పోశయ్య | ,, | ఇవతలికి వచ్చిండు | ,, |
| ఇవతలికి వచ్చిండు | ,, | ఏమంట ఉన్నడు | ,, |
| ఏ ఊరు బాలకా | ,, | ఏ దేశ మున్నదీ | ,, |
| ఉత్తరానా నీది | ,, | ఊరుపేరు చెప్పు | ,, |
| సక్కనీ పోశయ్య | ,, | పేరు అడుగూతుండు | ,, |
| నా తల్లి ఎల్లమ్మ | ,, | నీ ఇంటి కొచ్చిందా | ,, |
| తల్లి అనువాలు | ,, | నీయి వాకిటనుండె | ,, |
| అయ్యోరో నీ తల్లి | ,, | ఎవ్వరో కానీను | ,, |
| నాకు తెలువాలేదు | ,, | ఇక్కడా రాలేదు | ,, |

రాత్రిపూటనేమొ ఉయ్యాలో
పోశమ్మ పండుగలు ,,
వాల్లు వీల్లు అయినా ,,
బండారి కుంకుమా ,,
సక్కనీ రాముడు ,,
మా తల్లి ఎల్లమ్మ ,,
పెద్దకత్తీ తోడు ,,
పెద్దార తోడను ,,
బిడ్డ పోశవ్వాను ,,
ఆబిడ్డ తోడను ,,
సక్కనీ రాముడు ,,
పెద్ద మాతరోను ,,
పెద్దకత్తి తోడు ,,
పెద్దార తోడును ,,
ఒక్క బిడ్డా తోడు ,,
సక్కనీ ఆ బిడ్డ ,,
హేరాము జాతికి ,,
సక్కని పోశయ్య ,,
సక్కనీ రాముడు ,,
సిగ్గు లేకుండెనే ,,
మాదిగా లొందలో ,,
తండ్రినే జాడల్లు ,,
మాదిగోని లొందలో ,,
అన్నించి రాముడు ,,
సక్కనీ రాముడు ,,
నా చిన్ని చెల్లెలా ,,
చెప్పుతా ముచ్చటా ,,
మాతల్లి ఎల్లమ్మ ,,
ఘోరు వేళంబులు ,,

పోశమ్మ పండుగా ఉయ్యాలో
మేము చేసినాము ,,
కొట్లాడుకున్నరు ,,
రాలి పడ్డాదయ్యా ,,
ఏమి అంటాడమ్మ ,,
ఇక్కడా రాలేదు ,,
పెట్టుకో పోశయ్యా ,,
పెట్టుకో పోశయ్యా ,,
నీకు ఉన్నాదయ్యా ,,
ఒట్టి తీనావయ్యా ,,
ఇట్ల మాటలానే ,,
ఏమి అంటున్నడు ,,
ఒట్టు తిన్నడమ్మి ,,
ఒట్టు తిన్నాడమ్మ ,,
ఒట్టు తిన్నాడమ్మ ,,
ఏమాయి నాదమ్మ ,,
తల్లి పోయినాది ,,
ఒట్టు తిన్నడయ్యా ,,
లందగోశము కాడ ,,
శరము లేకుండెను ,,
దాగి యున్నాదమ్మ ,,
అడిగితేనె తల్లి ,,
దాగి యున్నారమ్మ ,,
ఎనుకకు మర్రిండు ,,
చెల్లెకాడికొచ్చె ,,
సిరియాల గౌరమ్మ ,,
చెవునందు పెట్టు ,,
లొందలో దాగింది ,,
ఎయ్యవాలే చెల్లె ,,

| | | | |
|---|---|---|---|
| బాయింద్ల వేళము | ఉయ్యాలో | కట్టుకున్నారమ్మ | ఉయ్యాలో |
| సక్కనీ రాముడు | ,, | సిరియాల గౌరమ్మ | ,, |
| అన్నచెల్లెలు పోయి | ,, | ఆలుమోగలరీతి | ,, |
| ఆలుమోగలరీతి | ,, | అల్లు పోతున్నరూ | ,, |
| లందగోళము కాడ | ,, | వేడుకొంటున్నరు | ,, |
| చల్లని తల్లిరో | ,, | మా తల్లి ఎల్లమ్మ | ,, |
| ఎల్లు ఎల్లు తల్లి | ,, | రేణుకా ఎల్లమ్మ | ,, |
| పాలకాయల తోటి | ,, | పండుగా చేత్తుమో | ,, |
| పందుము బండారు | ,, | పట్టు రా సెదమమ్మ | ,, |
| ఏదుము కుంకుమా | ,, | ఎదురూగ బేడుదుమే | ,, |
| పందుమూ గవ్వలు | ,, | పక్క దర్శనాలు | ,, |
| నాగము బాములు | ,, | నీకు ఒడ్డానమే | ,, |
| జెరి పోతులైన | ,, | నీ జెడ రిబ్బన్లు | ,, |
| తుట్టె పురుగూలేమొ | ,, | చుట్టబట్టలు నీకు | ,, |
| కల్లు శాకలు పెట్టి | ,, | కొలుచుకుందూమమ్మ | ,, |
| సక్కని ఎల్లమ్మ | ,, | కల్లు శాకలతోటి | ,, |
| సక్కనీ రాముడు | ,, | సిరియాల గౌరమ్మ | ,, |
| లంజదానివే ఎల్లి | ,, | దొంగదానివే ఎల్లి | ,, |
| సిగ్గులేదే నీకు | ,, | శరములేదే నీకు | ,, |
| మాదిగా లొందలో | ,, | దాగి యున్నావమ్మ | ,, |
| సక్కన్నీ ఆ తల్లి | ,, | ఇవతలికి ఎల్లింది | ,, |
| అప్పుడు రాముడు | ,, | ఏమంట ఉన్నడూ | ,, |
| నా తండ్రి జాడలు | ,, | నన్నుగన్నా తల్లి | ,, |
| ఇంకనన్నా నీవు | ,, | జాడల్లు చెప్పవే | ,, |
| నడువను నా చేత | ,, | కాదురా నా కొడుకా | ,, |
| సక్కన్నీ రాముడు | ,, | ఎత్తుకున్నడమ్మ | ,, |
| తల్లి రేణుకాను | ,, | ఎత్తుకున్నాడమ్మ | ,, |
| అప్పుడూ పన్నెండు | ,, | ఏండ్లు నిండినాయి | ,, |
| పన్నెండు ఏండ్లకూ | ,, | చెప్పుతానన్నది | ,, |

| | | | |
|---|---|---|---|
| పుత్రకా నీ తండ్రి | ఉయ్యాలో | చిత్రమ్ముగుండెరా | ఉయ్యాలో |
| కంచుగుబ్బల కోట | ,, | ఏలేటి నా తండ్రి | ,, |
| కార్తీక రాజులు | ,, | ఏడుగూరు వారు | ,, |
| నీ తండ్రి ప్రాణము | ,, | తీసినారు కొడుకా | ,, |
| అప్పుడూ రేణుకా | ,, | చెప్పుచున్నదమ్మ | ,, |
| సక్కన్ని రాముడు | ,, | ఏమంట ఉన్నడూ | ,, |
| పదవేమి తల్లిరో | ,, | పాపకర్ముల ద్రుంచ | ,, |
| అట్టి దుర్మార్గులు | ,, | ఎక్కడా ఉన్నరే | ,, |
| సక్కనీ రాముడు | ,, | పోత ఉన్నాడమ్మ | ,, |
| ఏడుగుఱు వాల్లు | ,, | కార్తీక రాజులు | ,, |
| కార్తీక రాజులు | ,, | అక్కడున్నరమ్మ | ,, |
| పరశురాముడును | ,, | ఏమి అంటున్నడూ | ,, |
| దాపుకు వొచ్చినా | ,, | దండించెదానురా | ,, |
| పసివాడివని మేము | ,, | పాపమనక మేము | ,, |
| పాపమానుకోక | ,, | త్రుంచివేస్తాముురా | ,, |
| ఇక్కడీ కెల్లినీ | ,, | పారిపోరాదురా | ,, |
| అవన్ని మాటల్లు | ,, | కార్తీక రాజులు | ,, |
| కార్తీక రాజులు | ,, | అట్లు అంటున్నరు | ,, |
| పరశురాముడూను | ,, | ఏమి చేసినాడు | ,, |
| చిన్నవాడనుకొని | ,, | బెదిరించుచున్నరా | ,, |
| అన్నుమిన్ను మీరు | ,, | తెలియకా యున్నరా | ,, |
| దాపుకొచ్చినార | ,, | దండించెదా నేను | ,, |
| ఇట్టి పాపాత్ములను | ,, | చంపివేస్తా నేను | ,, |
| సక్కన్ని రాముడు | ,, | చంపివేస్తానాని | ,, |
| వాయువ్యాఘ్రము నేను | ,, | ఏస్తున్న చూడరా | ,, |
| ఏడుగురు రాజులు | ,, | పతనమైపోయిరి | ,, |
| అట్టి పాపాత్ముల | ,, | చంపివేసినాను | ,, |
| వాల్లరక్తంతోటి | ,, | తల్లి పాదాలను | ,, |
| తల్లి పాదాలను | ,, | కడుగుచున్నాడమ్మ | ,, |

| | | | |
|---|---|---|---|
| అప్పుడు మాతరో | ఉయ్యాలో | ఏమి అంటున్నదీ | ఉయ్యాలో |
| ఊరి కుత్తరాన | ,, | ఊడాల మర్రుండ | ,, |
| మర్రిక్రింద నీతండ్రి | ,, | బొక్కలు కట్టినా | ,, |
| చక్కని రాముడు | ,, | ఏమానుచుండెను | ,, |
| హరమ్మునా నన్ను | ,, | కన్నావె నా తల్లి | ,, |
| వందనములు నీకు | ,, | చేసెదానే తల్లి | ,, |
| సత్యాన నన్నును | ,, | కన్నవే రేనుకా | ,, |
| లోకులన్నా మాట | ,, | కోసమే నాతల్లి | ,, |
| కొట్టరాని దెబ్బలు | ,, | నిన్ను గొట్టినాను | ,, |
| అనరాని మాటలు | ,, | నిన్ను అన్నా తల్లి | ,, |
| సక్కనీ రాముడు | ,, | దండాలు చేసెనే | ,, |
| పాదేళ్ళ పబ్బతీ | ,, | పట్టెనే రామన్న | ,, |
| ఊడాల మర్రినే | ,, | బయటికి పోయిండు | ,, |
| చక్కనీ రామన్న | ,, | మర్రి ఎక్కుతుండు | ,, |
| కొత్త కుండాలోని | ,, | బొక్కలను తీసిండు | ,, |
| అప్పుడూ రామన్న | ,, | క్రిందకూ తెచ్చిండు | ,, |
| కీలు కీలు కేమొ | ,, | బొక్క బొక్క కేమొ | ,, |
| సక్కగా తండ్రిని | ,, | పెట్టుకున్నాడమ్మ | ,, |
| సక్కనీ మా తండ్రి | ,, | పుల్లబాపీనారు | ,, |
| గరిక మామిడిపండు | ,, | జీవధారీ పుల్ల | ,, |
| జీవదారీ పుల్ల | ,, | పుల్లబాపీనారు | ,, |
| చక్కనీ మునిరాజు | ,, | లేచి కూర్చున్నడు | ,, |
| అప్పుడూ రాముడు | ,, | ఏమి అంటాడమ్మ | ,, |
| సక్కనీ నా తండ్రి | ,, | జమదగ్ని మూని | ,, |
| తల్లిని నేనైనా | ,, | అనరాని మాటల్లు | ,, |
| అనరాని మాటల్లు | ,, | అన్ననే నా తండ్రి | ,, |
| నేను కొట్టె దెబ్బలాకు | ,, | తాళలేకా తల్లి | ,, |
| నాకు శాపంబులు | ,, | పెట్టినాది తండ్రి | ,, |
| నాయొక్క చేతులు.. | ,, | ఇర్గిపోయినాయి | ,, |

నాకేమి అభయమ్మ ఉయ్యాలో ఇస్తవూ నా తండ్రి ఉయ్యాలో
అప్పుడు మునిరాజు ,, ఏమి చెప్పుచుండే ,,
భక్తులు చూడగా ,, బాయిలకాడా కొడుకా ,,
మల్లెపూలాతోటి ,, వాసనాతో కొడుకా ,,
గుభగుభ అని నీవు ,, వాసనాలా తోటి ,,
ఐదు ఏళ్ళాతోని ,, ఉప్పలమ్మయి మొలువు ,,
మరువకా ఉగ్రగయ్య ,, దాసున్ని నమ్మినా ,,
కరుణతో ఉగ్రగయ్య ,, కాపాడిపోవయ్య ,,
వానిగా ఉగ్రగయ్య ,, దాసున్ని నమ్మినా ,,[23]

ఈ జానపదుల పాట ప్రకారము రేణుక మరో పేరు ఎల్లమ్మ. ఈమె శివ పార్వతుల కూతురు. ఈమె బాల్యంలో బతుకమ్మ ఆడుకోవడానికి వెళ్ళుతుంది. కాని తనకు వివాహం కాకపోవడం వల్ల, తనను ఆడుకోనివ్వడం లేదని, తన గౌరమ్మను తీసివేస్తున్నారని చెప్పి తనకు కూడ వివాహం జరిపించుమని ఎల్లమ్మ తన తండ్రి శంకరునితో చెప్పుతుంది. శంకరుడు అందుకు సమ్మతించి తన కూతురుకు స్వయంవరం ఏర్పాటు చేసి ఒక నియమాన్ని విధించాడు. అదేమిటంటే, వెండికొండ దగ్గర "ఒక గరుడ స్థంబానికి గంటను కట్టినాడు. తన కూతురును పెళ్ళి చేసుకొనదలచిన వారు అక్కడికి వచ్చి అరవైమూళ్ల పాగ తలకు చుట్టుకొని ఆ గంటను మ్రోగించాలి." తరువాత ఈ వార్తను "ఊరూరి రాజులకు దేశపు రాజులకు" ఉత్తరాలు వ్రాసి పంపించాడు. ఈ వార్త ఆకాశవాణి ద్వారా ప్రత్యేకంగా విన్న, అహల్యా గౌతముల కుమారుడు జమదగ్ని ముని, వెండికొండకు వెళ్ళి అరవైమూళ్ల పాగ తలకు చుట్టుకొని, సూర్య చంద్రులకు నమస్కరించి గరుడ స్థంభం పైన ఉన్న గంటను మ్రోగించాడు. అపుడు శంకరుడు సంతోషించి ఎల్లమ్మకు జమదగ్నితో వివాహం జరిపించాడు. వివాహం తరువాత నాగవెల్లి కావాలి. కాని "కార్తీక రాజులు అడ్డమొచ్చినారు" కాబట్టి నాగవెల్లి కాలేదు. తరువాత ఆ దంపతు లిద్దరూ మత్సుమవురం కొండకు వెళ్లిపోయారు.

తరువాత తాను వెండికొండకు వచ్చినపుడు తన వెంబడి రెండు గేదెలొచ్చి నాయని, వాటిని అడవికి వెళ్ళి మేపుకొస్తానని భార్యకు చెప్పి, బయలుదేరాడు.

ఆ గేదెలను కార్తీక రాజుల భూములలోకి వెళ్ళకుండా, జాగ్రత్తగా మేసిరండని పంపించి, తాను మర్రిచెట్టు క్రింద తపస్సు చేసుకుంటున్నాడు. జమదగ్ని మహాఋషి. అయినా, జానపదుల దృష్టిలో గోపాలుడే. అందుకే అయన గేదెలకు హితబోధ చేసి, జాగ్రత్తగా మేసిరండని చెప్పి పంపించాడు. ఇదే అదనుగా భావించిన కార్తీక రాజులు దొంగ చాటుగా వచ్చి జమదగ్నిపై బాణాలు వేశారు. భర్తకు కలిగిన ఈ ఉపద్రవానికి సూచనగా, ఎల్లమ్మకు ఇంటి దగ్గర మల్లెచెట్టు వాడిపోయింది. చేతి గాజులు చిట్లిపోయినాయి. నుదుట తిలకం చెదిరిపోయింది. వెంటనే దుఃఖంతో ఎల్లమ్మ భర్త దగ్గరకు పరుగెత్తుతుంది. కొన ఊపిరిలో వున్న జమదగ్ని తనకు 'సత్యానబోనం' తీసుకువస్తే బ్రతుకుతాను అంటాడు. "సత్యాన బోనం" చేసే విధానం గురించి తెలుసుకోవడానికి ఎల్లమ్మ తన తండ్రి శంకరుని దగ్గరికి వెళ్ళింది. శంకరుడు ఆ బోనం గురించి చెప్పకపోతే, ఎల్లమ్మ తన ఏనుగంత పాదాన్ని తండ్రి ఎదపై పెట్టి "సత్యానబోనం" జాడలు చెప్పమంటుంది. బిడ్డ ఆగ్రహానికి భయపడిన శంకరుడు సత్యానబోనం జాడలు ఈవిధంగా చెప్పుతాడు.

దూసవోరి మడుగుల్లోని వడ్లు దూసుకొని వచ్చి, అరచేతిని రోలుగా, మోచేతిని రోకలిగా చేసుకొని ధాన్యం దంచాలి. తరువాత కంటి రెప్పలతో ధాన్యపు పొట్టు చెరిగి, కంటినీరుతో కడిగి ఒంపి, శనివారం నాడు వక్షస్థలంపైన కడువతో బియ్యంపెట్టాలి. ప్రాణనాథుని స్మరించగానే నిప్పు పుడుతుంది. అప్పుడు అన్నం వండుకొని భర్తకు తీసుకుపోవాలి.

ఇక్కడ పతిభక్తిని పరిక్షించడానికి జానపదులు ఎల్లమ్మకు కఠోరమైన పరీక్షలు విధించారు. పురాణాలలోని అనసూయ, సావిత్రి మొదలైనవారు కూడ ఇంతటి కఠినమైన పరీక్షల నెదుర్కొనలేదు. జానపదులు అంతకంటే గొప్పగా పరీక్షలు పెట్టి ఎల్లమ్మ పాతివ్రత్య మహిమను తెలియచేశారు.

ఎల్లమ్మ తండ్రి చెప్పిన పద్ధతి ప్రకారం "సత్యాన బోనం" తయారు చేసుకుని భర్త దగ్గరికి వెళ్లుతుంది. మార్గమధ్యంలో కార్తీకరాజులు తమకు భోజనం పెట్టుమని ఎల్లమ్మను బలవంతం చేస్తారు. బోనం అపవిత్రం చేస్తే జమదగ్ని మరణిస్తాడని వారి ఎత్తుగడ. పైగా, ఎల్లమ్మను వివస్త్రగా మారి

భోజనం పెట్టుమంటారు. అప్పుడు ఆమె తన తల్లిదండ్రులను తలచుకొని తన చీరలు చుట్టు తెరలుగా కట్టి వివస్త్రయై వారికి భోజనం పెడుతుంది. ఆ సమయంలో ఆమె తల వెంట్రుకలు ఒంటినిండా పెరిగి, ఆమె శరీరాన్ని కప్పి వేస్తాయి.

వారికి వడ్డించగా మిగిలిన భోజనం తీసుకుని ఎల్లమ్మ భర్త దగ్గరికి వెళ్లింది. భర్త బోనం అపవిత్రం అయిందని తన దివ్య దృష్టితో తెలుసుకుని ఎల్లమ్మ శీలాన్ని శంకిస్తాడు. కాబట్టి తాను మరణిస్తానని కూడ చెప్పతాడు. తన శరీరం నుండి కారిన రక్తం సేవిస్తే నీకు సంతానం కలుగుతుందని ఎల్లమ్మకు చెప్పి జమదగ్ని మరణిస్తాడు. తరువాత ఎల్లమ భర్త శరీరం నుండి ఏడు దోసిళ్ళ రక్తం సేవించింది. భర్త శరీరంలోని ఎముకలు క్రొత్త కుండలో పెట్టి మర్రి చెట్టుకు ఉత్తర భాగంలో కట్టి మత్స్యపురం కొండకు తిరిగి వచ్చింది.

భర్త శరీరంలోని రక్తం సేవించిన ఎల్లమ్మకు సంతానం కలుగుతుంది. తనకు పుట్టిన పిల్లలకు నామకరణం చేయడానికి, బ్రాహ్మణులను పిలిపించింది. "పారిన రక్తం త్రాగుతే పుట్టినవాడు పరశురాముడని, ప్రక్కల రక్తం త్రాగడం వల్ల పుట్టినవాడు పక్కలయ్య అనీ, డొల్లిన రక్తం త్రాగడం వల్ల డొక్కలయ్య అనీ, చిందిన రక్తం త్రాగడం వల్ల చిట్కలయ్య అని ఇంకిన రక్తం త్రాగడం వల్ల పుట్టింది ఈలగౌరమ్మ" అనీ బ్రాహ్మణులు వారికి పేర్లు పెట్టారు.

పరశురాముడు పెరిగి పెద్దవాడయి తన తోటి స్నేహితులతో ఆడుకుంటాడు. తాను బొంగరం ఆట ఆడాలనీ, తనకు వెండి బొంగరం కావాలని తల్లిని అడుగుతాడు. బొంగరం కొరకు ఎల్లమ్మ తన పిన తల్లి అయిన గంగమ్మ దగ్గరికి పరశురాముణ్ణి పంపిస్తుంది. పరశురాముడు తన మనుమడే అని తెలుసుకున్న గంగమ్మ అతనికి రక్షణగా గండ్ర గొడ్డలి ఇచ్చి, బొంగరం కొరకు నాగలోకం పంపిస్తుంది. పరశురాముడు నాగలోకం వెళ్ళి వెండి బొంగరం సంపాదించి తిరిగి వచ్చి తన స్నేహితులతో బొంగరాల ఆట ఆడుకుంటాడు. ఆటలలో పరశురాముని చేత దెబ్బలు తిన్న పిల్లలు ఏడుస్తూ వారి తల్లులతో చెప్పకుంటారు. అపుడు వారు పరశురామునితో—

| | | | |
|---|---|---|---|
| నీకు తండ్రియైన | ఉయ్యాలో | ఉన్నాడారావోరి | ఉయ్యాలో |
| ఎన్ని ఇత్తునాలకు | ,, | పుట్టినవురావారి | ,, |

అంటూ నీ తల్లి వ్యభిచారిణి అని నిందిస్తారు. అవమానం భరించలేక ఆగ్రహంతో పరశురాముడు ఇంటికి వచ్చి, తన తండ్రి జాడలు చెప్పమని తల్లిని నిలదీస్తాడు.

సామాన్యంగా వీర కథలలో కథా నాయకుని శౌర్యం ప్రకోపింప చేయ డానికి జానపదులు వీరులు బొంగరాలాట ఆడినట్లు చిత్రిస్తారు. పల్నాటి వీర కథలోని బాలచంద్రుడు కూడ బాల్యంలో బొంగరం ఆట ఆడినట్లు ఉంది.

తన కుమారునికి పన్నెండేండ్ల ప్రాయం వచ్చేంత వరకు తన పేరు చెప్పరాదని జమదగ్ని ఎల్లమ్మకు చెప్పి మరణించడంవల్ల ఎల్లమ్మ తన కుమా రునికి తండ్రి పేరు చెప్పకుండా ఎన్నో విధాలుగా మభ్యపెడుతుంది. అయినా పట్టువదలని పరశురాముడు తండ్రి జాడలకొరకు తల్లిని ఎన్నో కష్టాల పాలు చేస్తాడు. క్రూరంగా తల్లిని దెబ్బలు కొట్టి హింసిస్తాడు. దెబ్బలు భరించలేక ఎల్లమ్మ పరుగెత్తుకుంటూ వెళ్ళి ఒక బావిలో దూకుతుంది. ఆమె మాహాత్మ్యంతో బావిలోని నీళ్ళు ఇంకిపోతాయి. అందులో నుండి ఆమె తన తల్లిదండ్రులుండే వెండికొండకు చేరుకుంటుంది. ఆమె వచ్చిన దారి వెంబడి బండారు, కుంకుమ, గవ్వలు కనిపించాయట. ఆ జాడల ననుసరించి పరశురాముడు ఆ బావి దగ్గరికి వచ్చాడు. అక్కడి నుండి ఆయన కూడా వెండికొండకు చేరుకుని, ఎంతో కోపంతో తాత శంకరునికి నమస్కరించి తన తల్లి ఎల్లమ్మ వచ్చిన జాడలు చెప్పమంటాడు. ఇక్కడ పరశురామునికి, శంకరునికి కొంతసేపు వాదం జరుగుతుంది.

| | | | |
|---|---|---|---|
| మా తల్లి ఎల్లమ్మ | ఉయ్యాలో | ఇక్కడికి వచ్చిందా | ఉయ్యాలో |
| నీ తల్లి ఎల్లమ్మ | ,, | ఇక్కడికి రాలేదు | ,, |
| పతివ్రతా నాబిడ్డ | ,, | ఎక్కడా పోయింది | ,, |
| పతివ్రతా నీ బిడ్డ | ,, | పరగ మమ్మేటు లగనె | ,, |
| పతి మరణించినపుడు | ,, | సతిగర్భమున నీవు | ,, |
| సతిగర్భమున నీవు | ,, | ఉన్నావు బాలకా | ,, |
| తనయుల గంటెనే | ,, | తండ్రిపేరు తెలుపరా | ,, |

అని పరశురాముడు శంకరుని కూడ కోపంతో ప్రశ్నిస్తాడు. పుట్టింటిలో తలదాచుకున్న తల్లిని బయటికి ఈడ్చుకుని వచ్చి అనరాని మాటలంటాడు. తండ్రి జాడలు చెప్పకపోతే గండ్రగొడ్డలితో నరికి కుక్కలకు, నక్కలకు ఆహారంగా వేస్తానంటాడు. ఇంకా తల్లిని రెండుచేతులు వెనుకకు కట్టి వేడెక్కిన బండమీద క్రూరంగా దొర్లిస్తాడు. అయినా, ఎల్లమ్మ తన భర్తపేరు చెప్పదు. చివరికి తల్లిని తన చెల్లెలు ఈల గౌరమ్మ దగ్గరికి తీసుకొని వెళ్లతాడు. అక్కడి నుండి ఎల్లమ్మ తప్పించుకుని గౌండ్లవాళ్ళ ఇంటికి వచ్చి, కల్లుపోసి దాహం తీర్చుమంటుంది. గౌండ్లవాళ్ళు ఆమెను తిరస్కరిస్తారు. అందుకు ఎల్లమ్మ ఈ విధంగా శపిస్తుంది:

| | | | |
|---|---|---|---|
| ఒంగినా చెట్టును | ఉయ్యాలో | మీదికి లేవదు | ఉయ్యాలో |
| లేచినా చెట్లైయినా | ,, | క్రిందికి వంగవు | ,, |
| మీకు మూడుబేడలు | ,, | ముడుతవీ గౌండ్లోడ | ,, |
| మూడు బేడలైన | ,, | కావాలెరా మీకు | ,, |

అప్పటి నుండి తాటిచెట్లు నిటారుగా అయినాయని. రోజుకు మూడు బేడలకు మించిన సంపాదన వారికి ఉండదని జానపదుల విశ్వాసము. తరువాత ఎల్లమ్మ అక్కడి నుండి బ్రాహ్మణ వాడలకు, కోమటి వాడలకు వెళ్ళుతుంది. పరశురామునికి భయపడి ఎల్లమ్మకు ఎవ్వరూ ఆశ్రయమివ్వలేదు. చివరికి ఆమె మాదిగ వాడలకు వెళ్ళగా మాదిగ పోషయ్య ఆమెను ఆదరిస్తాడు. తన కొడుకు వచ్చి అడుగుతే తాను ఇక్కడికి రాలేదని చెప్పమంటుంది ఎల్లమ్మ. కాని, ఈ విషయంలో బిడ్డపై ఒట్టు పెట్టుకోవద్దని ఎల్లమ్మ పోషయ్యకు చెప్పుతుంది. తరువాత ఎల్లమ్మ ఆ ప్రక్కనే ఉన్న "లందగోళం" దగ్గర దాగి ఉంటుంది. హరిజనులు తోలు నానబెట్టుకోడానికి ఒక పెద్ద గోళంతో నీళ్ళు నింపి ఉంచుకుంటారు. దానినే "లందగోళం" అంటారు. పరశురాముడు తల్లిని వెతుక్కుంటూ హరిజన వాడకు వచ్చి మాదిగ పోషయ్యను అడుగుతాడు. అక్కడ కూడ ఎల్లమ్మ వచ్చినట్టు నిదర్శనంగా బండారు, కుంకుమ రాలి పడుతుంది. కాని, పోషయ్య తన బిడ్డపై ఒట్టు పెట్టుకొని, ఎల్లమ్మ ఇక్కడికి రాలేదని,

గత రాత్రి ఇక్కడ పోషమ్మ పండుగ జరిగి, తగవు లాడుకుంటే కుంకుమ రాలి పడిందని అబద్ధం చెపుతాడు. తరువాత అతని బిడ్డ చనిపోతుంది. అందుకే జానపదులు అనవసరమైన వాటికి ఒట్టు పెట్టుకోవాలంటే భయపడుతారు. హరి జన వాడలో ''లందగోళం'' దగ్గర తల్లి దాగి ఉందని గ్రహించిన పరశురాముడు బైండ్లవాని వేషం వేసుకుని జమిడికలు మ్రోగించుకుంటూ, తన చెల్లెలు ఈల గౌరమ్మతో కలసి అక్కడికి వస్తాడు. అపుడు వారిద్దరు "లందగోళం" దగ్గరికి చేరుకుని తమ తల్లిని బయటికిరమ్మని ప్రార్థిస్తూ—

| | | | |
|---|---|---|---|
| చల్లనీ తల్లిరో | ఇయ్యాలో | మా తల్లి ఎల్లమ్మ | ఉయ్యాలో |
| ఎల్లు ఎల్లు తల్లి | ,, | రేణుకా ఎల్లమ్మ | ,, |
| పాలకాయల తోటి | ,, | పండుగా జేత్తుమే | ,, |
| పందుమూ బండారు | ,, | పట్టు రాసెదమమ్మ | ,, |
| పందుమూ కుంకుమా | ,, | ఎదురూగ బెడుదుమే | ,, |
| పందుమూ గవ్వలు | ,, | పక్క దెర్శెనాలు | ,, |
| నాగంబాములు | ,, | నీకు ఒడ్డానమే | ,, |
| జేరిపోతూలైన | ,, | నీ జెడరిబ్బన్లు | ,, |
| తుట్టెపురుగులేమొ | ,, | నీ చుట్టుబట్టలు | ,, |
| కల్లుసాకలు పెట్టె | ,, | కొలుచుకుందూమమ్మ | ,, |

అని ఎన్నో విధాలుగా వేడుకుంటూ తల్లిని బయటికి రమ్మంటారు. అప్పుడు ఎల్లమ్మ బయటికి వస్తుంది. పరశురామునికి పన్నెండేండ్లు నిండినాయి. అపుడు ఎల్లమ్మ తన భర్త జమదగ్ని అని, అతన్ని కార్తీకరాజులు చంపిన వృత్తాంతం అంతా కొడుక్కు చెప్పుతుంది. అప్పుడు పరశురాముడు ఆగ్రహంతో కార్తీకరాజులను చంపి, వారి రక్తంతో తన తల్లి పాదాలు కడుగుతాడు. తల్లిని హింసించినందుకు చింతిస్తాడు. తల్లి అనుమతిపై మర్రిచెట్టుపై ఉన్న కొత్తకుండ లోని ఎముకలను తెచ్చి, వాటిని క్రమంగా అమర్చి 'జీవదారి' పుల్లతో తండ్రిని తిరిగి బ్రతికిస్తాడు. తరువాత తల్లిని ఎన్నో విధాలుగా హింసించినందుకు తనను శపించిందని, తన చేతులు విరిగిపోయాయని, తనకు అభయం ఇవ్వుమని పరశురాముడు తండ్రిని వేడుకుంటాడు. అపుడు జమదగ్ని పరశురాముతో—

| | | | |
|---|---|---|---|
| భక్తులు చూడగా | ఉయ్యాలో | బాయిలకాడా కొడుకా | ఉయ్యాలో |
| మల్లెపూలా తోట | ,, | వాసనాతో కొడుకా | ,, |
| గుభగుభలని నీవు | ,, | వాసనాలాతోటి | ,, |
| బదు వ్రేళ్ళతోటి | ,, | ఉప్పలమ్మయి మొలువు | ,, |

అని చెప్పుతాడు. అందుకే జానపదులు బావుల దగ్గర పెంటకుప్పల దగ్గర పెరిగే తెల్లని చేతివంటి మొక్కలను పరశురాముని హస్తంగా, ఉప్ప లమ్మగా భావిస్తారు. ఈ విధంగా పరశురాముడు కన్నతల్లిని ఎన్నో విధాలుగా కష్టపెడతాడు. చివరికి తల్లిని బయటికి పంపించినందుకు చెల్లెలును కూడా అనరాని మాటలు అంటాడు. తరువాత తన తప్పును తెలుసుకుని ఎంతో చింతిస్తాడు కోపం, పట్టుదల, సాహసంతో కూడుకొన్న వ్యక్తి పరశురాముడు. కొడుకు పెట్టే బాధలకు తాళలేక ఎల్లమ్మ మాదిగ వాడలకు వెళ్ళినప్పుడు వారు ఆమెకు ఆశ్రయమిచ్చి ఆదరించారు. అందుకే ఇప్పటికి గ్రామాలలోని హరిజన వాడలలో ఎల్లమ్మ గుడి కనిపిస్తుంది. ఎల్లమ్మ ముఖ్యంగా హరిజనులచేత ఆరాధ్య దేవతగా పూజలందుకొంటుంది.

మాతపురాణం, ఈదెమ్మ కథ మొదలైన ఎల్లమ్మకు సంబంధించిన కథా గేయాలలో శివభక్తుడైన ప్రతాపరుద్రునికి, ఎల్లమ్మకు ఘర్షణ జరిగినట్లున్నది. కాని ఈ బతుకమ్మ పాటలో ఎల్లమ్మకు పరశురామునికి ఘర్షణ జరిగింది. ఏది ఏమైనప్పటికి ఈ ఎల్లమ్మ కథ మాతృ స్వామ్య వ్యవస్థ అంతరించి పితృస్వామ్య వ్యవస్థ ఆరంభమైన దశలో ఉద్భవించిందని చెప్పవచ్చు. ఈ రెండు వ్యవస్థల మధ్య జరిగిన ఘర్షణలో ఈ కథ పుట్టింది.

బతుకమ్మ పండుగ సందర్భంగా ఈ ఎల్లమ్మ వృత్తాంతాన్ని జానపదులు ఎన్నోరకాల పాటలుగా పాడుకుంటారు.

అదే విధంగా గ్రామ ప్రజలు ఆరాధించే మరొక గ్రామదేవత మైసమ్మ.

## మైసమ్మ :

మైసమ్మ కూడ శివపార్వతుల కూతురే. ఈమె మహిషదేవత. అంటే తెలంగాణాలో ఈమెను పశువులను కాపాడే దేవతగా జానపదులు వ్యవహ రిస్తారు. ఈ దేవతను కోట వద్దనో, ఊరి వెలుపలనో, గడివద్దనో రాళ్ళతో చిన్న

గుడి కట్టి అందులో నిలుపుతారు. ఆ గుడిలో చిన్న గురిగి (ముంత) పెట్టి, దానికి సున్నం పూసి, బొట్లు పెట్టి చిన్న ప్రమిదలో నూనెపోసి దీపం వెలిగిస్తారు. ఈమెనే మైసమ్మ అంటారు. ఈమె కోటవద్ద స్థాపితమైతే కోట మైసమ్మ అని, గడివద్ద స్థాపితమైతే గడి మైసమ్మ అని, కట్టమీద స్థాపితమైతే కట్ట మైసమ్మ అని, ఊరవతల స్థాపితమైతే ఊర మైసమ్మ అని పిలుస్తారు. ప్రతి యేట ప్రజలు తమ పశువులు క్షేమంగా ఉండాలని మైసమ్మకు ఉత్సవాలు జరుపుకుంటారు. ఆ ఉత్సవాలలో గ్రామ ప్రజలంతా బోనాలు చేసి, కోళ్ళను, మేక పోతులను, దున్నపోతులను బలి ఇస్తారు. దున్నపోతులను బలి ఇస్తే దానికి కొన్ని రోజుల ముందుగానే బొట్టు పెట్టి ఊరుమీద విడిచి పెడుతారు. అది ఎక్కడికి వెళ్ళినా, ఎవరి పంటచేను మేసినా ఎవ్వరూ అడ్డగించరు. దానిని అందరూ మైసమ్మ పోతుగా వ్యవహరిస్తారు. మైసమ్మకు ఉత్సవం జరిపే రోజు, దానిని పెద్ద కత్తితో నరికి, దేవతకు హారంగా ఇస్తారు.

మైసమ్మ జంతువులనే గాకుండా మనిషిని కూడ తనకు హారమడిగినట్లు క్రింది పాటలో కనిపిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| చాటంత మొగులాయె | ఉయ్యాలో | కట్టతెగిపాయె | ఉయ్యాలో |
| మొంటంత మొగులాయె | ,, | తెప్పతేగిపాయె | ,, |
| కట్టమీది మైసమ్మ | ,, | హారమడిగినాది | ,, |
| పెద్దకొడుకూ నైన | ,, | ఇయ్యవయ్యరాజ | ,, |
| పెద్దకొడుకూ నిస్తె | ,, | పేరుకూ ఎవ్వరూ | ,, |
| నడిపి కొడుకూనైన | ,, | ఇయ్యవయ్యరాజ | ,, |
| నడిపి కొడుకునిస్తె | ,, | నాకునూ ఎవ్వరూ | ,, |
| చిన్నకొడుకునైన | ,, | ఇయ్యవయ్య రాజ | ,, |
| చిన్నకొడుకు నిస్తే | ,, | ముద్దుకూ ఎవ్వరూ | ,, |
| పెద్ద కోడలినైన | ,, | ఇయ్యవయ్యరాజ | ,, |
| పెద్దకోడలినిస్తే | ,, | పేరుకూ ఎవ్వరూ | ,, |
| నడిపి కోడలినైన | ,, | ఇయ్యవయ్యరాజ | ,, |
| నడిపి కోడలి నిస్తే | ,, | నాకునూ ఎవ్వరూ | ,, |
| చిన్న కోడలినైన | ,, | ఇయ్యవయ్యరాజ | ,, |

| | | | |
|---|---|---|---|
| చిన్నకోడలునాగ | ఉయ్యాలో | నా చిన్ని నాగ | ఉయ్యాలో |
| తొట్లెల్ల బాలునికి | ,, | అంగీలు తొడిగినవా | ,, |
| అప్పుడే తొడిగినా | ,, | ఇప్పుడెందుకు మామ | ,, |
| తొట్లెల్ల బాలునికి | ,, | పాలయిన ఇచ్చినవా | ,, |
| అప్పుడే ఇచ్చినా | ,, | ఇప్పుడెందుకు మామ | ,, |
| తలకన్న పోసుకోవె | ,, | నా చిన్ని నాగ | ,, |
| అప్పుడే పోసుకున్న | ,, | ఇప్పుడెందుకు మామ | ,, |
| బొట్టైన పెట్టుకోవె | ,, | నా చిన్ని నాగ | ,, |
| అప్పుడే పెట్టుకున్న | ,, | ఇప్పుడెందుకు మామ | ,, |
| పెట్టెల్ల చీరలు | ,, | కట్టుకోవె నాగ | ,, |
| అప్పుడే కట్టుకున్న | ,, | ఇప్పుడెందుకు నాగ | ,, |
| పెట్టెల్ల సొమ్ములు | ,, | పెట్టుకోవె నాగ | ,, |
| అప్పుడే పెట్టుకున్న | ,, | ఇప్పుడెందుకు మామ | ,, |
| నీళ్ళకొరకూ నీవు | ,, | చెఱువు దగ్గరికి | ,, |
| బిందె తీసుకోని | ,, | పోవాలె నాగె | ,, |
| చీరలన్నీ తీసి | ,, | చుట్టబట్టలు చేసి | ,, |
| బంగారు బిందెను | ,, | చేత బట్టినాది | ,, |
| అన్నించి ఆ నాగ | ,, | బౌసలీ వాడలకు | ,, |
| బౌసలక్కల్లారా | ,, | నీళ్ళకొస్తారమ్మ | ,, |
| అప్పుడే తెచ్చినమూ | ,, | అగచూడు చుట్టలు | ,, |
| అకచూడు చుట్టలు | ,, | ఇగచూడు బిందెలు | ,, |
| అన్నించి ఆ నాగ | ,, | బాపనా వాడలకు | ,, |
| బాపనక్కల్లారా | ,, | నీళ్ళకొస్తారమ్మ | ,, |
| అప్పుడే తెచ్చినమూ | ,, | అగచూడు చుట్టలు | ,, |
| అగచూడు చుట్టలు | ,, | ఇగచూడు బిందెలు | ,, |
| అన్నించి ఆ నాగ | ,, | కోమటి వాడలకు | ,, |

| కోమటక్కల్లారా | ఉయ్యాలో | నీళ్ళ కొస్తారమ్మ | ఉయ్యాలో |
|---|---|---|---|
| అప్పుడే తెచ్చినమూ | ,, | అగచూడు చుట్టలు | ,, |
| అగచూడు చుట్టలు | ,, | ఇగచూడు బిందెలు | ,, |
| అన్నించి వెళ్లింది | ,, | చెఱువు దగ్గరికి | ,, |
| చెఱువులో బిందేసి | ,, | బుడ బుడ ముంచింది | ,, |
| పాదాల మంటొచ్చె | ,, | బిందె మునగది మామ | ,, |
| అసుంట బోనాగ | ,, | బిందె మునుగుతాది | ,, |
| నడుములా మంటొచ్చె | ,, | బిందె మునగది మామ | ,, |
| అసుంట బోనాగ | ,, | బిందె మునుగుతాది | ,, |
| నేను మునిగె మంటొచ్చె | ,, | బిందె మునగది మామ | ,, |
| అట్లట్ల పోయేటి | ,, | అది పక్షుల్లారా | ,, |
| నన్ను గన్న తల్లికి | ,, | బిడ్డ లేదని చెప్పు | ,, |
| నాతోడి అన్నలకు | ,, | చెల్లె లేదని చెప్పు | ,, |
| తొట్టెల్ల బాలునికి | ,, | తల్లి లేదని చెప్పు | ,, |
| నా ప్రాణ నాథునికి | ,, | వందనాలని చెప్పు | ,,24 |

చెఱువు కట్టమీద ఉన్న కట్టమైసమ్మ ఆగ్రహం వల్ల చెఱువు పొంగి గ్రామాలన్ని జలమయ మవుతాయి. తనకు మనిషిని 'హారంగా' ఇచ్చి తనను శాంతింప చేస్తే ప్రమాదం ఉండదని మైసమ్మ చెప్పుతుంది. గ్రామ ప్రజలంతా ఆ ఊరి రాజు దగ్గరికి వెళ్లి ఆయన కొడుకులను గాని కోడళ్ళను గాని ఒకరిని కట్ట మైసమ్మకు హారంగా ఇవ్వుమంటారు. రాజు తన చిన్న కోడలు నాగతో స్నానం చేసి, చీరలు, సొమ్ములతో అలంకరించుకొమ్మని చెపుతాడు. తరువాత బిందె తీసుకుని నీళ్ళ కొరకు చెఱువు దగ్గరికి వెళ్ళుమంటాడు. నీళ్ళకొరకు చెఱువు మధ్యలోకి వెళ్ళిన చిన్ననాగ చెఱువులో మునిగి చెఱువు కట్టమీద ఉన్న మైసమ్మకు హారం అవుతుంది. కరుణ రసాత్మకమైన ఈ పాట జానపదులకు ఎంతో ఇష్టం.

ఈ విధంగా జానపదులు బతుకమ్మ పండుగ జరుపుకునే రోజుల్లో గ్రామ దేవతల పాటలు ఎన్నో పాడుకుంటారు.

## కుటుంబానికి సంబంధించిన పాటలు

కుటుంబం అంటే భార్య, భర్త, వారి పిల్లలు అనే అర్థం ఈనాడు వాడుకలో ఉంది. కాని కుటుంబం అనే పదాన్ని స్థూలంగా పరిశీలిస్తే భార్యా భర్తలు వారి సంతానమే గాకుండా వారితో రక్తసంబంధం కలిగినవారు, సన్నిహితులు కూడా చేరుతారని చెప్పవచ్చు.

ఆదిమకాలంలో మానవుడు ఎటువంటి కట్టుబాట్లు, నియమాలు లేకుండా స్వేచ్ఛగా జీవించాడు. అపుడు స్త్రీ పురుష సంబంధాలు నియమరహితంగా ఉండేవి. నాగరికత మారినదృష్ట్యా సంతానాభివృద్ధికోసం, వంశస్థాపన కోసం, ఒక స్త్రీకి ఒక పురుషునితో వివాహబంధం ఏర్పడింది. తద్వారా కుటుంబం విస్తరించి తాత, నాయనమ్మ తల్లి, తండ్రి, కొడుకులు, కోడండ్లు, మనమలు, మనుమరాండ్లు మొదలైన వారితో సమష్టి కుటుంబం ఏర్పడింది. కాలక్రమేణా ఆర్థిక, సాంఘిక కారణాలవల్ల సమష్టి కుటుంబాలు విడిపోయి చిన్న కుటుంబాలుగా మారిపోయాయి. కుటుంబ సభ్యులంతా కలసిమెలసి ఉన్నటువంటి సమష్టి కుటుంబంలోనే బంధుత్వ ప్రదర్శకమైన పాటలు ఎక్కువగా పాడుకుంటారు. వారి కుటుంబాలలో ఏదైనా పండుగో, పబ్బమో, శుభకార్యమో వచ్చినప్పుడు అంతా ఒకేచోట కలుసుకుంటారు. కనుకనే నేటికీ ఈ వావి వరుసలకు సంబంధించిన పాటలు సజీవంగా ఉన్నాయి.

సంసార జీవితంలోని కష్టసుఖాలు, సంబంధ బాంధవ్యాలు జానపదులు పాటల రూపంలో పాడుకుంటారు. అత్తాకోడండ్ల వేధింపులు, బావామరదండ్ల సరసాలు, భార్యాభర్తల శృంగారం, సవతుల కయ్యాలు, అక్కాచెల్లెండ్ల అనురాగం, అన్నాచెల్లెండ్ల అనుబంధం ఈ పాటలలో వస్తువులైనాయి.

బతుకమ్మ పండుగ సందర్భంలో తమ తమ కష్టసుఖాలను, సంబంధ బాంధవ్యాలను తెలిపే రకరకాల పాటలు పాడుకుంటారు.

తల్లీబిడ్డల అనుబంధం చాలా అపురూపమైంది. నవమాసాలు మోసి కని పెంచిన తల్లికి తన బిడ్డపై ప్రేమ, మమకారం అధికంగా ఉంటాయి. బిడ్డ కొరకు, బిడ్డ భవిష్యత్తు కొరకు తల్లి ఎన్నో కలలు కంటుంది. అట్లాగే బిడ్డకు

కూడ తల్లిపై అనురాగం ఆప్యాయతలు ఉంటాయి. బిడ్డలు పెరిగి పెద్ద వారయిన తరువాత తల్లిదండ్రులు వారికి పెళ్ళిళ్ళు చేసి అత్తవారింటికి సాగ నంపుతారు మళ్ళీ పండుగలకు పబ్బాలకు పుట్టింటికి తీసికొనివచ్చి కట్న కానుకలు పెట్టి పంపుతారు. పెళ్ళి అయిన స్త్రీ పుట్టింటికి వచ్చినప్పుడు తన తల్లి, తండ్రి, వదిన, అన్నలు తనను ఏ విధంగా ఆదరించారో క్రింది పాటలో కనిపిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| చిలుక తిన్నాపండు | ఉయ్యాలో | సిద్ధించగారాదు | ఉయ్యాలో |
| అమ్మ నీ కోడలితో | ,, | వడ్డించగారాదు | ,, |
| వడ్డించు కోడలుతో | ,, | మాట పడరాదు | ,, |
| మాటపడి పుట్టింట్లో | ,, | మరి ఉండరాదు | ,, |
| అమ్మ ఏమన్నదే | ,, | అభిరామచిలుక | ,, |
| అమ్మొక్క ఆర్నెల్లు | ,, | ఉండిపొమ్మన్నది | ,, |
| నాయనేమన్నదే | ,, | అభిరామచిలుక | ,, |
| నాయనా నాలుగు నెలలు | ,, | ఉండిపొమ్మన్నదూ | ,, |
| పెద్దన్న ఏమన్నదే | ,, | అభిరామచిలుకా | ,, |
| పెద్దన్న నాకొక్క | ,, | పెయ్య నిస్తనన్నదూ | ,, |
| నడిపన్న ఏమన్నదే | ,, | అభిరామచిలుక | ,, |
| నడిపన్న నాకొక్క | ,, | నగ పెడ్తనన్నదూ | ,, |
| చిన్నన్న ఏమన్నదే | ,, | అభిరామచిలుక | ,, |
| చిన్నన్న నాకొక్క | ,, | చీర పెడ్తనన్నదు | ,,25 |

కూతురు పుట్టింటికి వచ్చినప్పుడు అమ్మ, నాన్న ఆర్నెల్లపాటు ఉండి పొమ్మన్నారు. పెద్దన్న పెయ్యను ఇస్తాను అన్నాడు. నడిపి అన్న నగ పెడుతానన్నాడు. చిన్నన్న చీర పెడుతాను అన్నాడు. తన తల్లి తనకు ఏది పెట్టినా ఇష్టమే. కాని, వదినా మరదండ్ల మధ్య ఉండే సున్నితమైన అనుబంధం చెడకుండా—

| | | | |
|---|---|---|---|
| అమ్మ నీ కోడలితో | ఉయ్యాలో | వడ్డించగారాదు | ఉయ్యాలో |
| వడ్డించిన కోడలితో | ,, | మాటపడరాదు | ,, |

అంటుంది.

తల్లిదండ్రులు తమ బిడ్డకు మంచి సంబంధం చూసే పెళ్లి చేస్తారు. కాని, అత్తవారి ఊరు చాల దూరమైనప్పుడో, అత్తవారింట్లో ఆ అమ్మాయికి కష్టాలు ఎక్కువైనప్పుడో తట్టుకోలేక ఆమె తన తల్లిదండ్రులకు, పంచాంగం చూసిన బ్రాహ్మణులకు, పెండ్లికి వచ్చిన పెద్దలకు తన ఉసురు తాకుతుందని నిష్ఠూరాలాడుతుంది.

| | | | |
|---|---|---|---|
| ఆకంత ఆకాయె | ఉయ్యాలో | బోనగిరి పాలాయె | ఉయ్యాలో |
| ఎరుగనీరాజ్యంబు | ,, | సన్నిచ్చినారు | ,, |
| ఏడ్చినా నా ఉసురు | ,, | ఎవరికి ముట్టు | ,, |
| కన్నెదార పోసినా | ,, | కన్నతల్లికి ముట్టు | ,, |
| కాళ్ళను కడిగినా | ,, | కన్నతండ్రికి ముట్టు | ,, |
| పంచాంగం చూసినా | ,, | బ్రాహ్మణులకు ముట్టు | ,, |
| పెళ్లికి వచ్చినా | ,, | పెద్దలకు ముట్టు | ,,[26] |

అత్తవారింట్లో ఆదరణ కరువైనప్పుడు స్త్రీలు ఈ విధంగా బాధ పడడం సహజమే.

అన్నాచెల్లెండ్ల అనురాగం ఎంతో పవిత్రమైంది. బాల్యం నుండి వారు ఏ అరమరికలు లేకుండా ఎంతో చనువుగా ఉంటారు. ఒకరి కష్టంలో మరొకరు పాలు పంచుకుంటారు. అంతేగాక, సోదరుడు తండ్రి తరువాత తండ్రి అంతటి స్థానం వహిస్తాడు. స్త్రీలు క్రొత్త వాళ్ళను కూడ సోదరుని వరుసతో పిలిచి తమ ఆత్మీయతను తెలియజేస్తారు.

పెళ్లి అయిన తరువాత అత్తవారింట్లో ఉంటున్న చెల్లెలును చూడడానికి వచ్చిన అన్నతో చెల్లెలు తన కష్టాలు ఈ రకంగా చెప్పుకుంటుంది:

| | | | |
|---|---|---|---|
| దచ్చన్నదారి పూలా వయ్యారి | | ఎన్నాదూరానోడుఅన్నొచ్చెనాని దచ్చన్నదారి | |
| ,, | ,, | కాళ్లాకు నీళ్ళిచ్చి కన్నీరుదీసె | ,, |
| ,, | ,, | చేయీకి నీళ్ళిచ్చి చేయివారజూసి | ,, |
| ,, | ,, | ఏందమ్మ చెల్లెల ఏడిసేటిపనులు | ,, |
| ,, | ,, | పాలివారి బాధ పడరాదె యన్నా | ,, |
| ,, | ,, | ఫలము లందేదాక పడవాలె చెల్లె | ,, |
| ,, | ,, | తొట్టెండ్ల బాలుడు తొలుకాడెదాక | ,, |
| ,, | ,, | ఆకిట్ల బాలుడు అంబాడే దాక | ,,[26] |

పాలివారి బాధ పడలేనని చెప్పుతున్న చెల్లెలుతో అన్న ఫలములందే వరకు, ఆ బిడ్డ పుట్టేవరకు, ఆ బిడ్డ వాకిట్లో అంబాడేవరకు కొంతకాలం కష్టాలు అనుభవించక తప్పదని ఓదార్చుతాడు. అటువంటిదే ఇంకొక పాట:

| | | | |
|---|---|---|---|
| సూర్యుడూ చంద్రుడూ | ఉయ్యాలో | చుట్టమై వచ్చిరీ | ఉయ్యాలో |
| మాకు మా అన్నలు | ,, | బలుగమై వచ్చిరీ | ,, |
| వస్తైవస్తైనే జూచి | ,, | అన్న అని పిలిచె | ,, |
| చేతికి నీళ్ళిచ్చి | ,, | చేయివార జూసి | ,, |
| కాళ్ళకు నీళ్ళిచ్చి | ,, | కన్నీరు తీసె | ,, |
| ఏవమ్మ చెల్లెల | ,, | ఏడుపు ఎందుకు | ,, |
| తుడుచుకో కన్నీరు | ,, | ముడుచుకో కురులు | ,, |
| కూర్చుండు అన్నయ్య | ,, | కుర్చి పీటలమీద | ,, |
| పడుకోవె అన్నయ్య | ,, | పట్టె మంచము మీద | ,, |
| అన్నయ్య వచ్చిండు | ,, | కూరేమి లేదు | ,, |
| తోట గుమ్మడికాయ | ,, | తొడిమె వంకాయ | , |
| అర్సంత పప్పేసి | ,, | ఆవునెయ్యి పోసి | ,, |
| తినుమని అన్నయ్యకు | ,, | మారు అన్నము పెట్టె | ,, |
| ఒంటశాలల ఉన్న | ,, | ఓ అత్తగారు | ,, |
| మాయన్న లొచ్చారు | ,, | మమ్మంపుతార | ,, |
| ఎత్తుకోవే బిడ్డను | ,, | పోయిరావె తల్లి | ,,[27] |

పుట్టింటినుండి అన్న రాగానే చెల్లెలు కాళ్ళకు నీళ్ళిచ్చి కన్నీరు తీసింది. పుట్టింటివారికి దూరమైపోయాననే భావంతో స్త్రీకి సహజంగా దుఃఖం వస్తుంది. ఆ తరువాత అన్నకు భోజనంపెట్టి పడకవేసి సకల మర్యాదలు చేసింది. తరువాత అత్తగారి దగ్గరికి వెళ్ళి "మాయన్న లొచ్చారు మమ్మంపుతార" అని అడిగింది. ఆ ఇంట్లో అత్తగారిదే పెత్తనం. ఆ అత్త లోకంలో ఉన్న అత్తల వంటిది కాదు. అందుకే కోడలు కోరికను మన్నించి ప్రేమతో సాగనంపుతుంది.

ఇంకా మత్స్యావరాజు పాటలో మత్స్యవుడు, ఐతవ్వ అన్నా చెల్లెండ్లు. బాల్యంలోనే వారి తల్లిదండ్రులు మరణించారు. అన్న మత్స్యవుడు తన చెల్లెలు ఐతవ్వను ఎంత గారాభంగ చూసుకుంటాడో ఈ పాటలో వర్ణింపబడింది.

అన్న మత్స్యవుడు ఉయ్యాలో
చక్కని చెల్లెను ,,
నా చెల్లె రాయె ,,
పాలీయ దాయి ,,
ఏడుగురు దాయీలు ,,
నెయ్యేక బుక్క ,,
బంగారమో ఎత్తు ,,
చెల్లె బతవ్వ ఉయ్యాలో
ఎట్ల సాదాలే ,,
బతవ్వ రాయె ,,
పండవెట్ట దాయి ,,
ఎల్లబెట్టినారు ,,
బువ్వొక్క బుక్క ,,
బాల వో యెత్తు ,,

ఈ విధంగా అన్న చెల్లెలును ప్రేమతో పెంచి పెద్ద చేశాడు. తరువాత చెల్లెలుకు పెళ్ళిచేసి అత్తవారింటికి సాగనంపేటప్పుడు, అన్నా చెల్లెండ్లు ఒకరిని విడిచి ఒకరు ఉండలేక దుఃఖిస్తుంటారు.

చెల్లె బతవ్వ ఉయ్యాలో
చక్కని బతవ్వ ,,
అన్న ముఖాము ,,
చెల్లె ముఖాము ,,
తన దుఃఖాము ,,
ఏడవకు చెల్లి ,,
వేరె చెల్లెండ్లు ,,
కష్టసుఖమ్ము ,,
చెల్లాని పిలువ ,,
అన్నాని పిలువ ,,
చెల్లాని నీకు ,,
వెళ్ళుతున్నదేమొ ఉయ్యాలో
వలపోసినాది ,,
చెల్లె చూస్తుంది ,,
అన్న చూస్తుండు ,,
తాను అణచుకోని ,,
ఎడ్డి బతవ్వ ,,
నాకు లేరు తల్లి ,,
నేను చూస్తాను ,,
ఒక్కదానివి ,,
నేను ఒక్కన్ని ,,
బుద్ధి చెప్పేద ,,[29]

అని చెల్లెలును ఓదార్చుతాడు. అన్నా చెల్లెండ్ల అనురాగం జానపదులు ఈ పాటలో ఎంతో కరుణరసాత్మకంగా వర్ణించారు.

పుట్టినప్పటి నుండి పెళ్ళి అయ్యేంత వరకు తల్లిదండ్రుల నీడలో స్వేచ్ఛగా పెరిగిన కూతురు పెళ్ళి అయిన తరువాత అత్తగారింట్లో ఉండవలసి వస్తుంది. క్రొత్తగా అత్తగారింటికి వచ్చిన అమ్మాయికి ఆ ఇంట్లో వాతావరణం అంతా క్రొత్తగా ఉంటుంది. ఆమెకు సిగ్గు, బిడియం, భయం ఉంటాయి.

తనకు ఏది కావాలనిపించినా తన భర్తనో అత్తగారినో అడగాలి. సమష్టి కుటుంబంలో అయితే అందరికీ అణకువగా ఉండాలి. అందరి అనుమతులు వేడుకోవాలి గర్భవతియైన స్త్రీకి మలీదముద్ద (బెల్లం, కొబ్బరి కలిపి చేసిన ముద్ద) తినాలని కోరిక కలిగింది. దాని కోసం అత్తను, మామను, భర్తను అందరినీ అడుగుతుంది. కోడలు కోరికకు వాళ్ళు చెప్పే సమాధానాలు ఎలా ఉంటాయో జానపదులు క్రింది పాటలో చాలా సహజంగా వర్ణించారు:

దచ్చన్నదారి పూలావయ్యారి ఒక్కత్తకోడండ్లు ఏడుగూరారండ్లు దచ్చన్నదారి
,, ,, అందరికన్నా చిన్నది అండాలుదేవి ,,
,, ,, ఆండాలుదేవిను గర్భిణయింది ,,
,, ,, పట్టెమంచంలోన పండుకున్న మామ ,,
,, ,, మలీదముద్ద మీద మనసాయె మామ ,,
,, ,, నాకెరుకాలేదమ్మా నీ అత్తా నడుగు ,,
,, ,, ఒంటశాలల ఉన్న ఓ అత్తగారు ,,
,, ,, మలీదముద్ద మీద మనసాయె అత్తా ,,
,, ,, నాకెరుకాలేదమ్మ నీ అక్కా నడుగు ,,
,, ,, తోటకూర కోసేటి తోటి యారాలా ,,
,, ,, మలీదముద్ద మీద మనసాయె అక్కా ,,
,, ,, నాకెరుకాలేదమ్మ నీ చెల్లె నడుగు ,,
,, ,, శెనిగే తోటల ఉన్న ఓ చెల్లెగారు ,,
,, ,, మలీదముద్ద మీద మనసాయె చెల్లె ,,
,, ,, నాకెరుకాలేదమ్మ మన బావ నడుగు ,,
,, ,, మోటల్లు గొట్టేటి ఓ మోగావారు ,,
,, ,, మలీదముద్ద మీద మనసాయెనయ్యా ,,
,, ,, మోటల్లు ఇడిశిండు ఇంటికొచ్చిండు ,,
,, ,, కోమాటింటికైనా తానేపొయ్యిండు ,,
,, ,, కిలో బెల్లము తెచ్చి కిలో కుడుకాలు ,,
,, ,, అవ్వయినా తెచ్చిండు తల్లి కిచ్చిండు ,,
,, ,, అప్పుడు ఆ తల్లి రోట్లేసి దంచె ,,
,, ,, ఏడుముద్దాలైనా తానే గట్టింది ,, 30

మలీదముద్ద మీద మనసున్న ఆమె చివరికి భర్తను అడిగి తనకు తినా లనిపించిన మలీద ముద్దను అత్తగారితో తయారు చేయించుకొని తింటుంది. కోడలు కుటుంబంలోని అత్తను, మామను, అక్కను, మొదలైన వారినే గాకుండా తనకంటె చిన్నదైన తోటి కోడలును అనుమతి అడుగడం విశేషం. దీనిని బట్టి ఒక చిన్న కోరికను తీర్చుకోవడానికి కుటుంబంలో ఉన్న వారందరిని ఆశ్ర యించడం మొదలైన సామాజిక స్థితిగతులకు అద్దం పట్టింది ఈ పాట. సమష్టి కుటుంబంలో స్త్రీకి తగినంత స్వేచ్ఛ ఉండడం అరుదు.

మరొక పాటలో చెల్లెలును పుట్టింటికి తీసుకుపోవడానికి అన్న వచ్చి నప్పుడు ఆ అమ్మాయి "కలికి కామాక్షి" కుటుంబంలోని వారందరి అనుమతిని పొంది ఏవిధంగా పయనమయిందో వర్ణింపబబడింది.

| | | | |
|---|---|---|---|
| కలవారి కోడలు | ఉయ్యాలో | కలికికామాక్షి | ఉయ్యాలో |
| కడుగుచున్నది పప్పు | ,, | కడువలో బోసి | ,, |
| అప్పుడే వచ్చెను | ,, | అన్న పెద్దన్న | ,, |
| కూర్చోవె అన్నయ్య | ,, | కుర్చిపీటల మీద | ,, |
| పోదాము భాగ్యమ్మ | ,, | మీ అత్తానడుగు | ,, |
| వచ్చీసలాడేటి | ,, | ఓ అత్తగారు | ,, |
| మా యన్నలొచ్చారు | ,, | మమ్మంపుతార | ,, |
| వస్తైవస్తిరిగాని | ,, | ఏమి తెచ్చినారు | ,, |
| పాపనికి పట్టంగి | ,, | పాలు త్రాగె గిన్నె | ,, |
| కన్ననికి నిండంగి | ,, | నీళ్ళు త్రాగె చెంబు | ,, |
| అట్లయితే నా కెరుకలే | ,, | నీ మామ నడుగు | ,, |
| పట్టె మంచము మీద | ,, | పండుకున్న మామ | ,, |
| మాయన్న లొచ్చారు | ,, | మమ్మంపుతార | ,, |
| వస్తై వస్తిరి గాన | ,, | ఏమి తెచ్చినారు | ,, |
| పాపనికి పట్టంగి | ,, | పాలు త్రాగె గిన్నె | ,, |
| కన్ననికి నిండంగి | ,, | నీళ్ళు త్రాగే చెంబు | ,, |
| అట్లయితే నా కెరుకలే | ,, | నీ అక్కా నడుగు | ,, |
| ఒంటశాలల ఉన్న | ,, | ఓ అక్కా గారు | ,, |

మాయన్న లొచ్చారు ,, మమ్మంపుతార ,,
వస్తె వస్తిరిగాని ,, ఏమి తెచ్చినారు ,,
పాపనికి పట్టంగి ,, పాలు త్రాగే గిన్నె ,,
కన్ననికి నిండంగి ,, నీళ్ల త్రాగే చెంబు ,,
అట్లయితే నా కెరుకలే ,, నీ బావ నడుగు ,,
భాగోతం చదివేటి , ఓ బావగారు ,,
మాయన్న లొచ్చారు ,, మమ్మంపుతార ,,
వస్తె వస్తిరిగాని ,, ఏమి తెచ్చినారు ,,
పాపనికి పట్టంగి ,, పాలు త్రాగే గిన్నె ,,
కన్ననికి నిండంగి ,, నీళ్ళ త్రాగే చెంబు ,,
అట్లయితే నాకెరుకలే ,, నీ భర్త నడుగు ,,
రచ్చలో కూర్చున్న ,, రాజేంద్రభోగి ,,
మాయన్నలొచ్చారు ,, మమ్మంపుతార ,,
బుట్టలున్న సొమ్ములు ,, పెట్టుకోవమ్మ ,,
పెట్టెలున్న చీరలు ,, కట్టుకోవమ్మ ,,
ఇరుగుపొరుగు అక్కలకు ,, పోతనని చెప్పు ,,31

అన్నతో పుట్టింటికి వెళ్ళడానికి కోడలు తన అత్త, మామ, బావ, అక్కల అనుమతి కోరుతుంది. అందరు ''వస్తెవస్తిరి గాని ఏమి తెచ్చినారు" అని ప్రశిస్తారు. పుట్టింటి వారు ఘనంగా కట్నకానుకలు తెస్తేనే అత్తింటి వారికి సంతోషం కలుగుతుంది. కనుకనే తన అన్న—

పాపనికి పట్టంగి ఉయ్యాలో పాలుత్రాగే గిన్నె ఉయ్యాలో
కన్ననికి నిండంగి ,, నీళ్ళుత్రాగే చెంబు ,,

తెచ్చాడని చెప్పుతుంది. వారంతా చివరికి భర్తనడుగుమని చెప్పుతారు. భర్త మాత్రం ఎంతో ఔదార్యంతో "ఏమి తెచ్చినారు" అని అడుగకుండా సొమ్ములు, చీరలతో అలంకరించుకొని ఇరుగుపొరుగువారికి చెప్పి వెళ్లమంటాడు. సమష్టి కుటుంబంలోని తీరు తెన్నులు జానపదులు ఈ పాటలో చక్కగా వివరించారు.

సమష్టి కుటుంబంలో వదినా మరదళ్ళ మధ్యన సరసాలు వేళాకోళాలు ఎక్కువగా ఉంటాయి. ఒకరితో ఒకరు పరిహాసం కోసం చమత్కారంగా మాట్లాడుకుంటారు. వారి సరసాలు, పరిహాసపు మాటలు ఎంతో వినోదం కలిగి స్తాయి. ముఖ్యంగా ఒక కుటుంబంలో వదినెను అట పట్టించడానికి మరదళ్ళు ఈ విధంగా పాడుతారు:

దుక్కి దుక్కి దున్నంగా
ఏం దుక్కి దున్నంగా
జవ్వాది తోటలోన జాజి దుక్కి దున్నంగా
ఇత్తు ఇత్తు పెట్టంగా
ఏం ఇత్తూ పెట్టంగా
జవ్వాది తోటలోన జాజి ఇత్తు పెట్టంగా
మొలుకా మొలుకా మొలువంగా
ఏం మొలుకా మొలువంగా
జవ్వాది తోటలోన జాజి మొలుకా మొలువంగా
ఎవ్వరు తెంపాలి
వదినెలు తెంపాలి
ఎవ్వరు తినాలి
అన్నలు తినాలి
అన్నలు తిన్నా తోల్ చెక్కలు వదినెలు తినాలి.[32]

ఈ రకంగా దుక్కి దున్ని, విత్తనం నాటి, మొలుక పెద్దదై, కాయలు కాసిన తరువాత వాటిని అన్నలు తినాలి. వారు తినివేసిన తోలు చెక్కలు వదినెలు తినాలని మరదళ్లు పరిహాసం చేస్తారు.

ఒకసారి మరదలు నీళ్ళు మోస్తూ కాలు జారి క్రింద పడిపోతుంది. తన అత్త, మామ, అన్న, వదినెలను తనకు సహాయంగా రమ్మని, వాళ్ళని వేళా కోళంగా రకరకాల పేర్లతో పిలుస్తుంది.

ఒక్కో బిందెడు నీళ్లెచ్చి ఓరాసగుమ్మడి మారాస గాబులు నిండే ఓరాసగుమ్మడి
రెండో బిందెడు నీళ్లెచ్చే ,, ,, ,,
మూడో బిందెడు నీళ్లెచ్చే ,, ,, ,,
నాలుగో బిందెడు కాళ్లారే ,, ,, ,,

అత్తానైనా పిలువారాదే ఓరాసగుమ్మడి అత్త పేరు అరటిచెట్టు మారాసగుమ్మడి
మామనైనా పిలువారాదే ,, మామ పేరు మంచంకోలు ,,
అన్నానైనా పిలువారాదె ,, అన్న పేరు అరటీ మొగ్గ ,,
వదినానైనా పిలువారాదె ,, వదినా పేరు వంకాయ తొడిమా,,33

అత్తను అరటిచెట్టు అని, మామను మంచం కోలు అని, అన్నను అరటి మొగ్గ అనీ పిలిచి, వదినెను 'వంకాయ తొడిమ' అంటుంది. ఇటువంటి సరస మైన, చమత్కారమైన మాటలు ప్రయోగించడం జానపదులకు వెన్నతో పెట్టిన విద్యలు.

కుటుంబంలోని భార్యాభర్తల బంధం చాలా ప్రధానమైంది. వీరు పర స్పరం ప్రేమ, అనురాగంతో ఉంటే సంసారం సక్రమంగా సాగుతుంది. భార్యా భర్తల మధ్య సహనం, సర్దుబాటు తేకపోతే చిన్న చిన్న కలహాలు "చిలికి చిలికి గాలివానగా" మారుతాయి.

చింతాకు చీరల్ల చీరగట్టిందో చందమామయ్యో చీరగట్టిందో చందమామయ్యో
రాలాకు వన్నెల్ల రైకతొడిగిందో ,, రైకతొడిగిందో ,,
బంగారు బిందెను చేతబూనిందో ,, చేతబూనిందో ,,
ఎన్నాడెళ్ళని బాల నీళ్ళాకెళ్ళిందో ,, నీళ్ళాకెళ్ళిందో ,,
ఓబిందె ఎత్తుకొచ్చి లోగిళ్ళదించి ,, లోగిళ్ళదించి ,,
మారొక్క బిందేను మరిదించినాదో ,, మరిదించినాదో ,,
అనాడు గట్కైనా నేను బోసితే ,, నేను బోసితే ,,
గట్కంత తిన్నాడు మాడుంచినాడు ,, మాడుంచినాడు ,,
పచ్చిశాపల కూర నేనొండినాను ,, నేనొండినాను ,,
శాపలన్నీ తిన్నాడు చారుంచినాడు ,, చారుంచినాడు ,,
ఇట్లైతే సంసారం ఎట్లైతాదయ్యో ,, ఎట్లైతదయ్యో ,,
బాయన్న చెఱువన్నా నేను జూసుకుంటా ,, నేను జూసుకుంట ,,
బాయన్న చెఱువన్నా నువు జూసుకుంటే ,, నువు జూసుకుంటే ,,
బోనగిరి బోగందాన్ని నేనుంచుకుంటా ,, నేనుంచుకుంటా ,,
బోనగిరి బోగందాన్ని నువ్వుంచుకుంటే ,, నువ్వుంచుకుంటే ,,

| | | | |
|---|---|---|---|
| సిద్ధిపేట సిక్కులోన్ని నేను జూసుకుంటా | ,, | నేను జూసుకుంటా | ,, |
| సిద్ధిపేట సిక్కులోన్ని నువుజూసుకుంటే | ,, | నువుజూసుకుంటే | ,, |
| మూలకున్నా ముల్లుగట్టే నేను చేతబడతా | ,, | నేను చేతబడతా | ,, |
| మూలకున్నా ముల్లుగట్టే నువు చేతబడితే | ,, | నువు చేతబడితే | ,, |
| తల్లిగారి ఇంటికి నే పారిపోతా | ,, | నే పారిపోతా | ,, [34] |

తాను వండిన గట్క (ఉడికించిన జొన్నరవ్వ) చేపలకూర అంతా అతడే తిని అడుగున ఉండే మాడు (మాడిపోయింది) చేపలు లేని పులుసు మాత్రమే తనకు మిగల్చాడని భార్య భర్తపై అలిగింది. దాంతో చెలరేగిన కలహం కారణంగా ఇద్దరు ఎన్నో రకాలుగా తిట్టుకుంటారు. పట్టుదల, పంతాలతో పెంచుకున్న కలహం చివరికి—

"మూలకున్న ముల్లుగట్టే నువు చేతబడితే
తల్లిగారి ఇంటికి నే పారిపోతా"
అనే వరకు వచ్చింది.

ప్రకృతిలోని పక్షుల్లో కూడ మగపక్షి ఆహారం సంపాదించి తన ఆడ పక్షికి ప్రేమతో పెడుతుంది. అది ప్రకృతి ధర్మం. అలాంటిది భర్త తన భార్యకు ఏమీ మిగల్చకుండా అంతా తానే తింటే భార్య బాధ పడడం సహజం. భార్యాభర్తల మధ్య అప్పుడప్పుడు చిన్న చిన్న కలహాలు వస్తూ వుంటాయి. వాటిని సహనంతో సర్దుబాటు చేసుకోవాలి. అంతేగాని ఇద్దరు పట్టుదలకు పోయి సమస్యను జటిలం చేసుకోకూడదు. ఏది ఏమైన భార్యాభర్తలు, ఒకరికొకరు ప్రేమ, అనురాగంతో ఉంటే వారి దాంపత్యం సుఖంగా ఉంటుంది.

ఈ రకంగా కుటుంబంలోని కలహాలు, సమస్యలు జానపదులు పాటలుగా పాడుకుంటారు. ఈ రకమైన పాటలు బతుకమ్మ పండుగ సందర్భంలో ఎన్నో పాడుకుంటారు.

## స్థానిక సంఘటనలకు సంబంధించిన పాటలు

మానవుడు సంఘజీవి. తాను ఉంటున్న సమాజంలో జరిగే సంఘటలకు స్పందిస్తాడు. అన్యాయాలను అక్రమాలను ఖండిస్తాడు. వాటిని చూసి కథలుగా పాటలుగా పాడుకుంటాడు.

భూస్వామ్య వ్యవస్థలో జమీందారుల దురాగతాలకు ఎందరో స్త్రీలు బలై పోయారు. ఆర్థికంగా, రాజకీయంగా పలుకుబడి ఉన్న వ్యక్తులు చేసిన ఘోర కృత్యాలకు ఎంతోమంది ప్రాణాలు కోల్పోయారు. మతకలహాలు, హత్యలు, దోపిడులు, మానభంగాలు, రైలు ప్రమాదాలు మొదలైన ఎన్నో సంఘటనలవల్ల ఎంతోమంది స్త్రీలు, పురుషులు ధన, మాన, ప్రాణాలను కోల్పోతున్నారు. జరుగు తున్న అన్యాయాలకు ప్రజలే ఒక్కొక్కసారి ఎదురు తిరుగుతారు. ఉద్యమాలు లేవదీస్తారు. అవన్నీ కథలుగా, పాటలుగా ప్రచారంలోకి వస్తాయి. బతుకమ్మ పండుగ సందర్భంలో కూడ ఇటువంటి పాటలు పాడుకుంటారు.

నల్లగొండజిల్లా ప్రాంతంలో 'పాపిరెడ్డి' అనే భూస్వామి ఉండేవాడు. అతని దగ్గర మల్లన్న పాలేరుగా ఉన్నాడు. మల్లన్న భార్య మల్లమ్మ. కామాంధుడైన పాపిరెడ్డి దౌర్జన్యానికి బలై మల్లమ్మ ప్రాణం కోల్పోయింది. వారి వృత్తాంతాన్ని తెలిపే పాట 'పాపిరెడ్డి కథ.'

| | | | |
|---|---|---|---|
| రామరామరామ | ఉయ్యాలో | శ్రీరామ రామ | ఉయ్యాలో |
| అయ్యొ రాములు | ,, | నేను కొలువునట్టి | ,, |
| అర్తి పాధంబు | ,, | అపరాధినైతి | ,, |
| నిల్తి పాదంబు | ,, | నీలిగొల్లనైతి | ,, |
| తప్పనీ పాట | ,, | తల్లి గలనాథ | ,, |
| ఇక్కడి ముచ్చట | ,, | ఇట్ల ఉండాని | ,, |
| మల్ల ముచ్చాట | ,, | మాద్దండిదమ్మ | ,, |
| ఇనుజనులార | ,, | ఇష్టంబుగాను | ,, |
| పాటిజనులార | ,, | కష్టకాలాలు | ,, |
| ఇన్న వారికి | ,, | ఇష్టి పున్నాలు | ,, |

పాడిన వారికి ఉయ్యాలో
ఇక్కడి ముచ్చాట ,,
మల్ల ముచ్చాట ,,
అప్పుడు కాదాని ,,
పాతేలూను ,,
పాపిరెడ్డీను ,,
జాగ భూముల్లు ,,
మారి ఎవ్వరీని ,,
మాదీ గేను ,,
మల్లాన్నాను ,,
మల్లన్నాకు ,,
మాదీగాను ,,
అప్పుడు మల్లమ్మ ,,
సత్య పురుషల్లో ,,
కడుపూకు లేక ,,
పాతేలు తాన ,,
ఒక్క దినమందు ,,
అప్పుడు మల్లమ్మ ,,
పాతెలూను ,,
మాకు జీతంబు ,,
కష్టమొచ్చేను ,,
తినబోతేను ,,
కట్టబోతేను ,,
మాకు జీతమ్మ ,,
ఇట్లు మల్లమ్మ ,,
పాపిరెడ్డిని ,,
ఇనుడు బిడ్డాను ,,
క్రొత్తబాయి కాద ,,
వారికోతల్లు ,,

బ్రహ్మ లోకాలు ఉయ్యాలో
ఇట్ల ఉండాని ,,
మా దండిదమ్మ ,,
పాపిరెడ్డిని ,,
పాపిరెడ్డీను ,,
తాను ఉన్నాడు ,,
మస్తుగున్నావి ,,
నౌకారి పెట్టి ,,
మల్లన్నాను ,,
నౌకరుంచేను ,,
భార్య ఉండేను ,,
మల్లమ్మాను ,,
ఏమి జేసేను ,,
వాళ్లు ఉన్నారు ,,
పాతీలు తాన ,,
నౌకరున్నారు ,,
ఒక్క మద్యంబు ,,
ఏమి అడిగింది ,,
పాపిరెడ్డిని ,,
ఇయ్యావు తండ్రి ,,
కరువు వచ్చేను ,,
తిండికి లేక ,,
వస్త్రమ్ము లేక ,,
ఇయ్యాలే తండ్రి ,,
అడిగినాది ,,
ఏమి చెప్పినాడు ,,
ఇష్టమ్ముల్లెల్ల ,,
వరిశేన్లుండె ,,
అవుతున్నయమ్మ ,,

| | | | |
|---|---|---|---|
| కొత్తబాయి కాడ | ఉయ్యాలో | కారణాల పుట్ట | ఉయ్యాలో |
| కారణాలపుట్ట | ,, | కంచాల మట్టి | ,, |
| వరిశేనుల్లు | ,, | అయినాయమ్మ | ,, |
| పాదిమందీని | ,, | కూలోల్లాను | ,, |
| కూలోల్లాను | ,, | తోలుకాపోయి | ,, |
| వరికోతల్లు | ,, | పట్టాలెనమ్మ | ,, |
| వరికోతల్లు | ,, | పట్టినంకాను | ,, |
| నియ్యిజీతంబు | ,, | ఇచ్చెదనీకు | ,, |
| పెద్దపాతేలు | ,, | చెప్పినాడమ్మ | ,, |
| అప్పుడు పాతేలు | ,, | పాపిరెడ్డిని | ,, |
| పాపిరెడ్డిని | ,, | ఇట్ల చెప్పినాడు | ,, |
| అప్పుడైనాను | ,, | తల్లి మల్లమ్మాను | ,, |
| ఊల్లోకైనా | ,, | ఉరుకొచ్చింది | ,, |
| ఎల్లక్కాను | ,, | మల్లక్కాను | ,, |
| కొత్తబాయికాడ | ,, | వారిశేనుల్లు | ,, |
| వరిశేనుల్లు | ,, | అయినాయమ్మ | ,, |
| పదిమందీను | ,, | కూలోల్లాను | ,, |
| కూలోల్లాను | ,, | పిలుచుకున్నాదీ | ,, |
| అప్పుడైనాను | ,, | తల్లి మల్లమ్మ | ,, |
| తల్లి మల్లమ్మ | ,, | తిర్గి వచ్చినాది | ,, |
| ఆమెకు బన | ,, | ఆరు నెల్లాది | ,, |
| ఆరు నెల్లాది | ,, | బిడ్డ ఉన్నాది | ,, |
| అప్పుడైనాను | ,, | తల్లి మల్లమ్మ | ,, |
| అన్నంబూను | ,, | తాను తిన్నాది | ,, |
| బిడ్డాకునైన | ,, | పాలు ఇచ్చినాది | ,, |
| తొట్టెండ్ల బిడ్డను | ,, | పరుండబెట్టి | ,, |
| కొడవండ్లాను | ,, | చేతబూనినాది | ,, |
| చేతబూనినాది | ,, | ఎల్లినాదమ్మ | ,, |
| ఊల్లోకినైనా | ,, | ఎల్లమ్మ వచ్చి | ,, |

రాంద్రమ్మాను ఉయ్యాలో
పది మందీని ,,
ఎడ్డి మల్లమ్మ ,,
కొత్తబాయి కాడికి ,,
వాళ్ళ కూలోల్లు ,,
పదిమందికి ,,
మునుమూలైన ,,
వాళ్ళవెనుకాలె ,,
వారు కోతల్లు ,,
అందారికన్న ,,
ఒక్క మునుమూను ,,
అప్పుడైనాను ,,
బాయి ఒడ్డూకు ,,
పక్కాకువెళ్ళె ,,
పాతేలును ,,
పాతేలును ,,
నా బిడ్డాకు ,,
పాలియ్యాను ,,
పాతేలును ,,
తల్లి మల్లమ్మ ,,
చెప్పి మల్లమ్మ ,,
కానుగు చెట్లల్ల ,,
చెట్లల్ల కెల్లి ,,
అప్పుడు మల్లమ్మ ,,
కానుగూను ,,
కాంద్రానీను ,,
పాపకారీని ,,
మరి ఏమీని ,,
ఏనుకెనుకాను ,,

మల్లక్కాను ఉయ్యాలో
వెంటబెట్టుకోని ,,
ఎల్లినాదమ్మ ,,
వెళ్ళినాదమ్మ ,,
ఒడ్డూకి వచ్చిరి ,,
మునుమూలైనా ,,
పట్టి ఇచ్చింది ,,
వచ్చెను తల్లి ,,
కొయ్యానెవ్వట్రి ,,
ఎక్కువానైనా ,,
ఎక్కువ పట్టి ,,
పాతేలునైనా ,,
తాను ఉన్నాడు ,,
మల్లమ్మాను ,,
ఏమడుగ వట్టె ,,
పాపిరెడ్డిని ,,
పాలియ్యాను ,,
పోతానయ్య ,,
నేను పోతున్న ,,
ఇట్ల చెప్పెను ,,
పోత ఉన్నది ,,
తొవ్వ ఉన్నాది ,,
తల్లి పోతుంది ,,
తాను పోతుంది ,,
చెట్లల్లకెళ్ళి ,,
చెట్లల్లకెల్లి ,,
పాపరెడ్డిని ,,
చేయ బట్టేను ,,
పోత ఉన్నాడు ,,

| | | | |
|---|---|---|---|
| మల్లమ్మ వెనుక | ఉయ్యాలో | తాను పోతుండు | ఉయ్యాలో |
| మునిమునిగ | ,, | నవ్వానుకుంటు | ,, |
| ముత్యాలాను | ,, | కొంగుబట్టేను | ,, |
| పక పకాను | ,, | నవ్వుకుంటూను | ,, |
| పరిట కొంగును | ,, | తాను పట్టెను | ,, |
| ఎడ్డి మల్లమ్మ | ,, | ఏమానవట్టె | ,, |
| ఇడు విడువూను | ,, | నాయికొంగుల్లు | ,, |
| నాయి బిడ్డాను | ,, | చిన్న దున్నాది | ,, |
| పాలిచ్చిని | ,, | పోయి వత్తాను | ,, |
| చక్కని మల్లమ్మ | ,, | దులుపరిచ్చేను | ,, |
| దులుపరిచ్చేను | ,, | సక్కని మల్లమ్మ | ,, |
| అప్పుడు గాదాను | ,, | మల్లమ్మ నెమొ | ,, |
| వొలవొల తల్లి | ,, | వలపోసుకుంటు | ,, |
| తల్లి మల్లమ్మ | ,, | ఏడ్చుకుంటాను | ,, |
| ఏడ్చుకుంటాను | ,, | ఇంటికిపాయె | ,, |
| కొడవండ్లూను | ,, | పారవేసేను | ,, |
| దొడ్డి బండల్ల | ,, | కాళ్ళు కడుగుకోని | ,, |
| కాళ్ళు చేతుల్లు | ,, | కడుక్కొనీను | ,, |
| తొట్లెకాడికి | ,, | తాను వచ్చేను | ,, |
| బిడ్డను చూసి | ,, | దుఃఖపాడెను | ,, |
| నాయి బిడ్డాను | ,, | లచ్చవ్వాను | ,, |
| పాలిస్తాను | ,, | రావు నా బిడ్డ | ,, |
| విచ్చిబియ్యమోలె | ,, | చిన్ని నా బిడ్డ | ,, |
| బువ్వ వేస్తాను | ,, | రావు నా బిడ్డ | ,, |
| ఏడ్చిపొయ్యనేను | ,, | చిన్ని నా బిడ్డ | ,, |
| గల్లనాడేమొ | ,, | తల్లి మల్లమ్మ | ,, |
| ఎదురొమ్ముల్ల | ,, | ఎత్తుకుంటూను | ,, |
| ఏయి చిక్కుల్లు | ,, | తీసినాదమ్మ | ,, |
| కుడి రొమ్ముల్లు | ,, | ఇచ్చుకుంటూనె | ,, |

కుడి చికుక్కల్లు ఉయ్యాలో
బిడ్డ నెత్తుకొని ,,
తల్లి నాయితే ,,
పాపకారిని ,,
నాయి ప్రాణంబు ,,
నిన్ను కంటిని ,,
నీయి కష్టంబులు ,,
తల్లిలేని నీవు ,,
చక్కని మల్లమ్మ ,,
చెక్కు లెక్కించి ,,
నేను బోతున్న ,,
నువ్వు పైలంబు ,,
పాపకారిని ,,
నాయి ప్రాణంబు ,,
ఇట్లు అనుకుంటు ,,
తల్లి మల్లమ్మ ,,
ఇట్ల అనుకుంటు ,,
కానరా నీను ,,
కానూ గూను ,,
తల్లి మర్యాద ,,
పాతేలును ,,
పాపి రెడ్డిను ,,
ఉప్పుల్లాను ,,
ఊటంగాను ,,
పప్పుల్లాను ,
నెయ్యిల్లాను ,,
వాని కత్తుల్లు ,,
కదలకుండాను ,,
ఏమంటాను ,,

తీసినాదమ్మ ఉయ్యాలో
చక్కని మల్లమ్మ ,,
తాన బిడ్డాను ,,
పాపిరెడ్డిని ,,
తీస్తా దమ్మ ,,
ఏమి కష్టంబు ,,
నేను జూడలేను ,,
పిల్లవైతావు ,,
చెక్కు లెక్కించి ,,
చెరు ముద్దులాడె ,,
చిన్ని నా బిడ్డ ,,
ఉండాలి బిడ్డ ,,
పాతేలూను ,,
తీస్తాదమ్మ ,,
తల్లి మల్లమ్మ ,,
ఎల్లినాదమ్మ ,,
యాడికొచ్చేను ,,
గెట్ల ల్లాను ,,
చెట్ల ల్లాను ,,
ఇట్లుండగ ,,
పాపి రెడ్డిను ,,
ఏంచేయబట్టె ,,
ఆ కత్తిని ,,
నూరినాదమ్మ ,,
పాతీగ నూరి ,,
నేతీగ నూరి ,,
నూరుకున్నాడు ,,
కడుపుల్ల చెక్కి ,,
పాపిరెడ్డిని ,,

| | | | |
|---|---|---|---|
| అడ్డ బట్టల్ల | ఉయ్యాలో | కట్టి నాడమ్మ | ఉయ్యాలో |
| దాని మీదాను | ,, | మనసు కుదిరేను | ,, |
| దులుపరిచ్చిను | ,, | ఎల్లి పాయేను | ,, |
| దాని ప్రాణంబు | ,, | నేను కూడాను | ,, |
| తీయందీను | ,, | పాతేలును గాదు | ,, |
| మల్లిమ్మను | ,, | అప్పుడైనాను | ,, |
| త్రొవ్వలోనైన | ,, | చూస్తున్నదమ్మా | ,, |
| వచ్చె మల్లమ్మ | ,, | వాయినంగాను | ,, |
| నిలబడ్డాది | ,, | మల్లమ్మాను | ,, |
| నిలువూగాను | ,, | నరికినాడమ్మ | ,, |
| కాళ్ళు జేతూలు | ,, | తీసినాడమ్మ | ,, |
| కాళ్ళు దీసేసి | ,, | కానుగుల్లేని | ,, |
| చేతుల్లు దీసి | ,, | చెలుకల్ల ఏసి | ,, |
| తలుకాయ దీసి | ,, | పొదల్ల ఏసి | ,, |
| తన బట్టల్లు దీసి | ,, | బండకిందనూకి | ,, |
| అప్పుడుగా దాని | ,, | పాపిరెడ్డిని | ,, |
| వెళ్ళి యింటికి | ,, | వాడు పోయేను | ,, |
| పాపిరెడ్డిని | ,, | ఇంటికి పోయి | ,, |
| మల్లి తానంబు | ,, | వాడు చేసేను | ,, |
| తానంబు జేసి | ,, | బట్టలేసుకొని | ,, |
| మల్ల కూడాను | ,, | వచ్చినాడమ్మ | ,, |
| మందెనుకాను | ,, | కూచున్నాడు | ,, |
| ఎడ్డోని లెక్క | ,, | ఎల్లి కూచుండె | ,, |
| ఒడ్డు మీదాను | ,, | కూర్చున్నాడు | ,, |
| పదిమందిని | ,, | కూలోల్లాను | ,, |
| పొద్దు కుంకిందాక | ,, | సూశినారమ్మ | ,, |
| మల్లమ్మాను | ,, | ఎటు పోయిందీ | ,, |
| పాలియ్య పోయ్యి | ,, | మల్ల రాలేదు | ,, |
| అప్పుడుగాదాను | ,, | వారికినైన | ,, |

| | | | |
|---|---|---|---|
| పాతేలును | ఉయ్యాలో | అడుగుదామంటే | ఉయ్యాలో |
| అడుగుదామంటే | ,, | ధైర్యమ్ము లేదు | ,, |
| పదిమందీని | ,, | కూలోల్లాను | ,, |
| ఎల్లక్కాను | ,, | మల్లక్కాను | ,, |
| పొద్దు గూకింది | ,, | పోదాముర్రాండె | ,, |
| వాళ్ళ కూలోల్లు | ,, | ఎల్లినారమ్మ | ,, |
| ఎవరు యింటికి | ,, | వాళ్ళు పోయిండ్రు | ,, |
| మల్లమ్మాను | ,, | అత్తగారూను | ,, |
| వచ్చి తల్లినీ | ,, | వెతుకుతున్నారు | ,, |
| మీరంతాను | ,, | వచ్చినారమ్మ | ,, |
| నాయి కోడాలు | ,, | రాలేదమ్మ | ,, |
| ఏమి పానుల్లు | ,, | చెప్పినాడమ్మ | ,, |
| ఎడ్డి లచ్చవ్వ | ,, | ఏడ్వవట్టేను | ,, |
| అప్పుడుగాదాను | ,, | అత్తనానుకోని | ,, |
| వచ్చె కూలోల్లు | ,, | ఏమి అంటారు | ,, |
| నీ కోడల్లు | ,, | మల్లమ్మాను | ,, |
| పాలియ్యాను | ,, | వొచ్చినాదమ్మ | ,, |
| మల్లి కూడాను | ,, | రాలేదమ్మ | ,, |
| ఇట్ల కూలోల్లు | ,, | చెప్పినారమ్మ | ,, |
| అల్ల నాడూను | ,, | తల్లి మల్లమ్మ | ,, |
| మల్లమ్మాను | ,, | మొగడొచ్చినాడు | ,, |
| కొడుకనాయి కొడుక | ,, | నాయి మల్లన్నా | ,, |
| మల్లామ్మాను | ,, | ఏడ ఉంచీరి | ,, |
| ఇంటికి కూడ | ,, | రాకపోయేను | ,, |
| అప్పుడైనాను | ,, | తల్లి చెప్పేను | ,, |
| గలనాడూను | ,, | ఏమి చేసిరి | ,, |
| చక్కని బిడ్డాను | ,, | ఎత్తుకున్నాడు | ,, |
| నేను ఏమాను | ,, | చేత్తానుగాద | ,, |

మల్లన్నాను ఉయ్యాలో ఏమి చెప్పిండు ఉయ్యాలో
తల్లిగారిని ,, ఇంటికినైన ,,
అప్పుడైనాను ,, మనిషిని తోలె ,,
అప్పుడైనాను ,, ఏమి చెప్పేరు ,,
నీ బిడ్డాను ,, ఒచ్చింద మారి ,,
తల్లిగారూను ,, మాకెరుక లేదు ,,
తల్లి మల్లమ్మను ,, రాలేదు అనిరి ,,
ఇంటిరాజుల్లు ,, తాళమ్ము పెట్టి ,,
ఏడుగూరైన ,, అన్నలుండిరి ,,
ఏడుగూరితోడ ,, ఒక్కాడపిల్ల ,,
అన్ననైతేను ,, కొట్టుకుంటూను ,,
కొట్టుకుంటాను ,, మొత్తుకుంటారు ,,
తల్లి దండ్రిని ,, బయిలెల్లినారు ,,
దండువోతేను ,, తల్లి గారైన ,,
వొచ్చి లోగిల్లు ,, వాళ్ళు నిండిరి ,,
చక్కని మల్లన్న ,, ఏమి చేసినాడు ,,
అప్పుడైనాను ,, మల్లన్నాను ,,
తిర్గు తున్నాడు ,, అడవిలోపాల ,,
కాకులు దూరాని ,, కారండపడవి ,
గద్దలు దూరాని ,, గద్దానపడవి ,,
పిల్లలుదూరాని ,, అదిపిరికి అడవి ,,
చెట్టు చెట్టాకు ,, తిర్గుతున్నాడు ,,
ఈగాది ఎండ ,, ఉప్పుగ గురిసె ,,
నడిఎండల్లు ,, వాడిగ గూర్చేను ,,
ఎక్కడ జూసీనా ,, ఏమి లేదాయె ,,
తిర్గుతున్నారు ,, వారుగాదాను ,,
కొన్రానీను ,, గెట్లల్లాను ,,
గెట్లల్లాను ,, కన్నేసినారు ,,
కాకులు గద్దల్లు ,, వాలుతున్నాయి ,,

మల్లమ్మ చచ్చి ఉయ్యాలో
మూడు రోజుల్లు ,,
చక్కని మల్లన్న ,,
గెట్లల్ల కెల్లి ,,
పోయినా గానీ ,,
కాళ్ళకూడాను ,,
చెలుకల్లాను ,,
తలుకాయేను ,,
ఏమి అంటాడు ,,
ఎంత పాపమ్మొ ,,
ఎవడు పాపంబు ,,
ఎవ్వానికైన ,,
నా కొంపాను ,,
నా యిల్లూను ,,
నీమీద బుద్ధి ,,
పొడిచె పొద్దూకు ,,
నీకై నాను ,,
గుద్దుకుంటాడు ,,
మూడు రోజుల్లు ,,
చెక్కు లెక్కించి ,,
నీ బిడ్డాను ,,
ఎవరికొప్పాను ,,
తల్లిలేనిపిల్ల ,,
ఎవ్వన్ని మాయ ,,
పాతేలూను ,,
వాని గుడ్లుగూల ,,
నిన్ను జూసీను ,,
వాని మాయల్లు ,,
తల్లిదండ్రులు ,,

మూడు రోజులు ఉయ్యాలో
కావట్టినేమొ ,,
ఎల్లినాడమ్మ ,,
తొవ్వ పట్టిండు ,,
ఏమి దొరికేను ,,
దొరికినాయమ్మ ,,
చేతుల్లు దొరికె ,,
తీసుకున్నాడు ,,
అప్పుడు మల్లన్న ,,
నువ్వు జేస్తివి ,,
కట్టుకున్నాడు ,,
పాపం జేసినావు ,,
నువ్వు ముంచినావు ,,
ముంచితివాయె ,,
నాకు తీరలేదు ,,
వంకలున్నాయి ,,
ఏ వంకలేదు ,,
మొత్తుకుంటాడు ,,
మురుగుల్లు పట్టె ,,
చెరు ముద్దులాడె ,,
లచ్చవ్వాను ,,
చెప్పినావమ్మ ,,
అయిపాయెనమ్మ ,,
ఇది ఉన్నాది ,,
పాపిరెడ్డిను ,,
వాని పాపంబాయ ,,
ఓర్వలేదాయె ,,
అయినాయాని ,,
ఏడ్వసాగిరి ,,

| | | | |
|---|---|---|---|
| ఏడుగురన్నలు | ఉయ్యాలో | ఎట్ల ఏడ్చిరి | ఉయ్యాలో |
| వారి దుఃఖమ్ము | ,, | దరియారలేదు | ,, |
| చెల్లె నా చెల్లె | ,, | ఎల్లమ్మ నీవు | ,, |
| నీవంతూను | ,, | బియ్యంబు చెల్లె | ,, |
| ఎవ్వారికిని | ,, | నేను బోస్తూను | ,, |
| మారు చెల్లేలు | ,, | మాకు లేరాయె | ,, |
| మారు అక్కల్లు | ,, | మాకు లేరాయె | ,, |
| ఏమాని నీవు | ,, | చేతమంటివి | ,, |
| ఇటు ఏడిచీరి | ,, | అటు ఏడిచీరి | ,, |
| బొంద తోడీరి | ,, | బొంద పెట్టీరి | ,, |
| మల్ల యింటికి | ,, | వాళ్ళు వచ్చిరి | ,, |
| చక్కని మల్లన్న | ,, | ఏమి చేయబట్టె | ,, |
| నూరు మందీని | ,, | కూర్చినాడమ్మ | ,, |
| కచ్చీరు కాడికి | ,, | పిలువనంపేను | ,, |
| పిల్లలు పెద్దల్లు | ,, | చేరుకున్నారు | ,, |
| పాతేలూను | ,, | పాపిరెడ్డీను | ,, |
| దొరసానైన | ,, | తోలుకున్నాడు | ,, |
| కచ్చీరు కాడికి | ,, | రప్పించినాడు | ,, |
| ఏమి అంటాడు | ,, | చక్కని మల్లన్న | ,, |
| నాగాతీని | ,, | ఏమిగావాలె | ,, |
| ఏమి పాపంబు | ,, | నేను జేస్తిని | ,, |
| కడుపుకు లేక | ,, | నౌకరుంటేను | ,, |
| నాయి పెండ్లాన్ని | ,, | ప్రాణం తిన్నావు | ,, |
| నూరు మందిలో | ,, | వెయ్యి మందిలో | ,, |
| వెయ్యి మందిలో | ,, | నూరు మందిలో | ,, |
| నాకు సంసారం | ,, | నువ్వు జెయ్యాలె | ,, |
| దొరసానినైన | ,, | రెట్ట పట్టుకోని | ,, |
| మాదిగ వాడల్ల | ,, | తీసుకపాయె | ,, |
| ఇజ్జతు పాతేలు | ,, | పాపి రెడ్డమ్మ | ,, |
| ఇజ్జాతుకైన | ,, | గుట్టాకు పోయి | ,, |
| గుట్టాకు పోయి | ,, | ఉరి పోసుకున్నాడు | ,, |
| ఉరి పెట్టుకున్నాడు | ,, | చక్కని పాతేలు | ,, 35 |

ఒకరోజు మల్లమ్మ తినడానికి తిండి లేక పాపిరెడ్డి పటేలు దగ్గరికి వెళ్ళి జీతం అడుగుతుంది. బావిదగ్గర వరి కోతకు వచ్చిందనీ, వరి కోయించినతరువాత జీతం ఇస్తానంటాడు పటేలు. వరి కోస్తున్న మల్లమ్మ మధ్యాహ్నం పూట పటేలు అనుమతితో తన బిడ్డకు పాలివ్వడానికి బయలుదేరింది. కామాంధుడైన పటేలు మార్గమధ్యంలో మల్లమ్మను బలాత్కరిస్తాడు. మల్లమ్మ భయంతో తప్పించుకొని ఇంటికి చేరుకుంటుంది. తనకు జరిగిన పరాభవానికి పటేలు మల్లమ్మను ఇంటినుండి తిరిగి వచ్చేటప్పుడు చంపి ప్రతీకారం తీర్చుకుంటాడు. పాపిరెడ్డి కౌర్యం, అహంకారం, ఈ పాటలో ప్రస్ఫుటంగా కనిపిస్తాయి.

చీకటిపడినా తల్లి రాలేదని బిడ్డ లచ్చవ్వ ఏడుస్తుంది. భర్త మల్లన్న భార్య కోసం తిరుగుతూ ఆమె పుట్టింటికి కూడ కబురు పంపుతాడు. వారు కూడ వచ్చి మల్లమ్మకోసం గాలిస్తారు. చివరికి మల్లమ్మ శవం ముక్కలు ముక్కలుగా అడవిలో లభిస్తుంది. ఈ ఘోరకృత్యానికి పాలుపడినవాడు పాపిరెడ్డేనని మల్లన్న గ్రహిస్తాడు. మరునాడు మల్లన్న ఊరి ప్రజలందరిని కచేరి దగ్గరికి పిలిపించాడు. ఊరి ప్రజల సహకారంతో మల్లన్న పాపిరెడ్డిని అతని భార్యను అక్కడికి రప్పించాడు. తన భార్యను బాలాత్కరించి ప్రాణం తీసిన పటేలుకు తగిన శిక్ష విధించాలని మల్లన్న నిర్ణయించుకున్నాడు. ఊరి ప్రజలందరి సమక్షంలో పటేలు భార్యను "నాకు సంసారం నువ్వు చెయ్యాలె" అంటూ బలవంతంగా తీసుకొని వెళ్ళాడు. అవమానం భరించలేని పటేలు ఆత్మహత్య చేసుకున్నాడు.

ఈ పాటలో మల్లన్న ధైర్య సాహసాలు గమనించ దగ్గవి. తన బిడ్డకు పాలివ్వడానికి ఇంటికి వచ్చిన మల్లమ్మ బిడ్డను దగ్గరికి తీసుకొని ఎంతో దుఃఖిస్తుంది. ఎంతటి కఠినులకైనా జాలికలిగించే విధంగా జానపదులు ఈ సన్నివేశం పాడుకుంటారు. పాపిరెడ్డి తన అహంకారానికి, దుర్మార్గానికి చివరికి తానే బలై పోయాడు ఏ నేరమూ చేయని పటేలు భార్య మల్లన్న కోపానికి బలైపోయింది.

జానపదులు ఎంతో కరుణరసాత్మకమైన ఈ పాటను బతుకమ్మ పాటగా పాడుకుంటారు.

అదే విధంగా రైలు ప్రమాదాల వంటి విషాద సంఘటనలను సైతం పాటలుగా పాడుకుంటారు. పాటలుగా పాడుకోవడం వేరు. పండుగ సంధ

ర్భంలో కూడ ఇటువంటి దుఃఖపూరితమైన పాటలు పాడు కోవడం విశేషం. జానపదులు సుఖదుఃఖాలను సమానంగా స్వీకరిస్తాదు.

రఘునాథపల్లి రైలు ప్రమాదంలో ఎందరో స్త్రీలు పురుషులు తమ పిల్లలను, ఆస్తిని, ప్రాణాలను కోల్పోయారు. ఆ సంఘటనను తెలిపే పాట___

| | | | |
|---|---|---|---|
| రామరామ రామ | ఉయ్యాలో | శ్రీరామ రామ | ఉయ్యాలో |
| ఆరామ రఘురామ | ,, | అయోధ్యరామ | ,, |
| ధీకరంబైనట్టి | ,, | క్షితిభారతభూమి | ,, |
| ప్రాకటమ్మైన నగు | ,, | భామలు వినరమ్మ | ,, |
| హైదరాబాదు యను | ,, | అది మేటి పట్నంబు | ,, |
| సాధారణంబైన | ,, | జనగామ తాలుక | ,, |
| రైలు స్టేషను కలదు | ,, | రఘూనాథపల్లిలో | ,, |
| పందొమ్మిదొందల | ,, | యాబది నాలుగు | ,, |
| సెప్టెంబరు నెల | ,, | ఇరవై ఏడవ తేది | ,, |
| సిద్దైన జయనామ | ,, | సంవత్సరంబున | ,, |
| భాద్రపద మాసము | ,, | బహుళ పక్షమున | ,, |
| ఆరోజు అమవాస్య | ,, | సోమవారమునాడు | ,, |
| అయ్యయ్యో ఇయ్యెంత | ,, | అన్యాయ దినమాయె | ,, |
| రెండు రోజుల నుండి | ,, | మెండుగా వర్షంబు | ,, |
| కుండబోసిన యట్టు | ,, | గుమ్మరించుచుండె | ,, |
| వానెంత వచ్చినా | ,, | వరదెంత వచ్చినా | ,, |
| కాలచక్రమాగదు | ,, | ఏ పనులు ఆగవు | ,, |
| వ్యాపారముకై ఒకరు | ,, | చుట్టాలకై యొకరు | ,, |
| పెండ్లిండ్ల కొకరు | ,, | స్నేహితులకై ఒకరు | ,, |
| ఎవరి పనులకు వారు | ,, | పోవగా దలచియు | ,, |
| సికింద్రాబాదు | ,, | స్టేషన్ చేరారు | ,, |
| ఢిల్లీ పోయేబండి | ,, | రానె వచ్చినాది | ,, |
| గంట గొట్టంగానే | ,, | పచ్చదీపము వెలిగె | ,, |
| ఎక్కిరీ జనులంత | ,, | బండి కదులాసాగె | ,, |

భుగభుగ మంచును ఉయ్యాలో
బాగైన జనగాము ,,
వారు ఆపినచోట ,,
మరలి వచ్చేదారి ,,
అంతకూ ముందైనా ,
తరలించి లోకులు ,,
అది పోయినంతలో ,,
అది ఎక్స్ప్రెస్సని ,,
జనులు ఆగిన చోట ,,
కలినుండి మార్గంబు ,
ఇంతింత వరదలు ,,
ఇంతలో మాస్టరు ,,
ఇంతకు ముందుగా ,,
ఇంతలో ఏమని ,,
ఈ రైలు బండియు ,,
కారుచీకట్లలో ,,
పోయినా ఈ బండి ,,
చేత జండను చూప ,,
బుస్సు బుస్సు రైలు ,,
వాన మొదలయ్యేను ,,
కుంభవృష్టిగ మారె ,,
తలుపులు కిటికీలు ,,
దడదడమని వాన ,,
ఫెళఫెళమని ఉరుము ,,
అయ్యొయ్యొ ఇంకేమి ,,
నీటితో పొంగింది ,,
రైలు దాటసాగె ,,
అంతనే దిమ్మనే ,,
వత్తుకా పట్టాలు ,,

పొగబండి పోసాగె ఉయ్యాలో
పట్నంబులో ఆగె ,,
వరుసగా బండ్లుండె ,,
మంచిదే అనిపించె ,,
ఒక బండి పాయెను ,,
దారి అడ్డులేక ,,
అరగంట ఆగెను ,,
ఏగి దెంచితి నేను ,,
బస్సు ఆగీనాది ,,
కలిదూర మేగేను ,,
ఎక్కువై పోయెను ,,
ఎంతసేపని జూచి ,,
ఏగినాది బండి ,,
ఈల వేయించెను ,,
ఏగుచున్నాదండి ,,
ములిగింది ఈబండి ,,
కూత బెట్టినాది ,,
చేరుతూ ఉండెను ,,
పొగజిమ్ము చుండగా ,,
కొద్దిసేపటిలోనె ,,
గుమ్మరించూచుండె ,,
జనులు మూసుకొనిరి ,,
కురవసాగెను బాగా ,,
ఉరమసాగెను బాగ ,,
అశ్వంతపురవాగు ,,
వాగుపై వంతెన ,,
వంతెన కూలీపాయె ,,
బుస్సు కొట్టినది ,,
వరుసగా తప్పెను ,,

పట్టరాని వట్టి ఉయ్యాలో
తలలు క్రిందికాయి ,,
ఇంజను ముందుకు ,,
ఇంజను లోపలికి ,,
ఈ వల ఒకడబ్బ ,,
మధ్య రైలుడబ్బ ,,
గొర్ల మందలరీతి ,,
తలక్రిందులా జనులు ,,
ఒక డబ్బాయందు ,,
ఇక బతుకుదామని ,,
చీకటి వరదలో ,,
మిసమిసలాడేటి ,,
పసుపు కుంకుమలతోటి ,,
బిడ్డలే తల్లికి ,,
భార్యకు భర్తయే ,,
వాలాయమైనట్టి ,,
మద్రాసు పోయేటి ,,
తథ్యంబుగా ఢిల్లి ,,
సర్కారు పనిమీద ,,
వాన రాకడ ,,
ఎవ్వరికి తెలియదు ,,
పీరు వారనకుండా ,,
ముల్లలు మూటలు ,,
వెండి బంగారంబు ,,
ఇలయందు ఈ తీరు ,,
లోక రక్షకుడయిన ,,
మరి అయిదు డబ్బాలు ,,
తుత్తునియలై పోయె ,,
భర్తితో ఒక డబ్బ ,,

పరుసుమని విరిగెను ఉయ్యాలో
దొరలుచున్నారమ్మ ,,
ఈడ్చుచున్నాదమ్మ ,,
కూలుచున్నదమ్మ ,,
ఆవల ఒక డబ్బ ,,
మాయమై పోయెను ,,
దొర్లుచూ తామంత ,,
పడిపోతు ఉన్నరూ ,,
ఉన్నారు కొందరు ,,
ఆశతో వారును ,,
చేరదుంకుచుండిరి ,,
పిల్లపడుచు ఒక్కతి ,,
పయనమైనాది ,,
దూరమై పోయిరి ,,
దూరమై పోయెను ,,
వాణిజ్యకారులు ,,
మహనీయులెందరో ,,
పయనమైనావారు ,,
పోయేటి వారలు ,,
ప్రాణము పోకడ ,,
అన్న సామెత రీతి ,,
అందరూ హతమైరి ,,
కొల్లలుగ పోయెను ,,
చెట్ల పాలెయెను ,,
జరుగుచూ నుండగా ,,
దైవమేమి చేసె ,,
మచ్చుకే లేకుండా ,,
దొర్లి పోయినాయి ,,
దూరెను ఇసుకలో ,,

| | | | |
|---|---|---|---|
| మనదేశ రక్షకులు | ఉయ్యాలో | మన ప్రభుత్వము వారు | ఉయ్యాలో |
| మన సైనికులు కొంత | ,, | కాపాడినారమ్మ | ,, |
| మిగిలినవారలు | ,, | తెగనడచినారమ్మ | ,, |
| అగుపడినవారిని | ,, | అందుకొన్నారమ్మ | ,, |
| అందులో కొందరికి | ,, | అధిక దెబ్బలు తాకి | ,, |
| గాయాలు పడినారు | ,, | గలరమ్మ అందులో | ,, |
| పొద్దుపోయినంక | ,, | పెద్దమంత్రూ లంత | ,, |
| గద్దాన వచ్చిరీ | ,, | గుద్దుకొన్నారమ్మ | ,, |
| కన్నీరు కార్చిరి | ,, | కాలమిట్లాయేనని | ,, |
| ఉన్నవారిని కొంత | ,, | ఉత్తరీతిన జూసి | ,, |
| వస్త్రాన్నంబు లిచ్చి | ,, | జనినారు వారలు | ,, |
| శ్రీరామరామ | ,, | శ్రీరామ జయరామ | ,,36 |

పందొమ్మిది వందల ఏభై నాలుగవ సంవత్సం సెప్టెంబరు ఇరవై ఏడవ తేదీన వరంగల్ జిల్లా రఘునాథపల్లిలో ఘోరమైన రైలు ప్రమాదం జరిగింది. ప్రమాదం జరిగిన విధానాన్ని, ప్రమాదానికి గురైన వారి బాధలను ఎంతో సహజంగా ఈ పాటలో వర్ణించారు. ఇటువంటి పాటలను బతుకమ్మ పండుగ సందర్భంలో జానపదులు పాడుకుంటారు.

ఇంకా దుర్మార్గుల దౌష్ట్యానికి ప్రాణం కోల్పోయిన స్త్రీ నక్క అండాలమ్మ. పందొమ్మిది వందల ఏభై ఒకటి ఆగష్టు పదిహేనవ తేదీన భువనగిరి గ్రామంలో కొందరు దుండగులు నక్క అండాలమ్మ అనే అమ్మాయిని చెరచి, నగలు దోచుకొని, చంపివేశారు. ఆ సంఘటనకు ప్రతిస్పందించిన జానపదులు ఆమె కథను ఈ రకంగా పాడుకుంటారు:

| | | | |
|---|---|---|---|
| భువిలోన పేరైన | ఉయ్యాలో | భువనగిరి గ్రామాన | ఉయ్యాలో |
| జరిగినా ఈ వింత | ,, | జాడ జెప్పెదనంతా | ,, |
| నక్క చెన్నయ్యాని | ,, | నామంబు గలవాడు | ,, |
| బుద్ధిలో పేరైనా | ,, | పెద్దవాడని యొప్ప | ,, |

పరుల దూషించెడీ ,, దురితంబు లెరుగడు ,,
పంచాయతులు చెప్పినా ,, లంచంబు లెరుగడు ,,
సంతాన మతనికి ,, అంత ఇంతో కలదు ,,
తెలివైనదీ బిడ్డ ,, తొలుచూరి తన బిడ్డ ,,
అండాలు యని పేరు ,, నిండు ప్రేమతో బెట్టి ,,
జోలపాటలు పాడి ,, లాలించి నాడమ్మ ,,
పదమూడు ఏండ్లు ,, పడ్డాయి తల్లికి ,,
అంతలో ఆమెను ,, అడుగ వచ్చినారు ,,
పెద్దలందరు మెచ్చ ,, పెండ్లి చేశాడమ్మ ,,
అత్తవారింటికి ,, అంపెను మరునాడు ,,
అత్తమామల సేవ ,, ఉత్తమంబుగ చేయు ,,
చదువులో ఘణమైన ,, చాతుర్యవంతురాలు ,,
పరఇండ్లు తిరిగేటి ,, పద్ధతే ఎరుగదు ,,
చాడీలు చెప్పేటి ,, పాడుబుద్దులు లేవు ,,

ఎంతో ఉత్తమ లక్షణాలున్న అండాలమ్మ ఒకనాడు అత్తవారింటి నుండి పుట్టింటికి వచ్చింది. అక్కడ-

పంద్రా గష్టనీ ఉయ్యాలో పండుగొచ్చిందమ్మ ఉయ్యాలో
స్వాతంత్ర్య దినమాని ,, సంతోషమున తాను ,,
అన్నంబుకూరలు ,, ఆనందముగ వండి ,,
తరువాత ఇంటిని ,, పరిశుభ్రము చేసి ,,

ఇంటిని అలికి, చాటలు, మొంటలు శుభ్రం చేయడానికి పేడ కావాలని ఊరిబయటికి బయలుదేరింది. పేడకోసం వెళ్ళుతూ ఉంటే ఆమెకు ఎక్కడా పేడ కనిపించలేదు.

పేడవెతుకూకుంటు ఉయ్యాలో పెదదారి వెళ్ళెను ఉయ్యాలో
ఊరికి తూర్పున ,, ఉండెనూ ఒక దరుగ ,,
ఆ దరుగ త్రోవలకు ,, పోయినె ఆండాలు ,,
అండాలు రాకడ ,, తురకలు జూసిరి ,,
శని దేవుడామెను ,, ఎత్తుకెళ్ళిన రీతి ,,
వగవారలామెను ,, పట్టుకెళ్ళిన రీతి ,,

అండాలు రాకను గమనించిన దుండగులు దర్గ లోపల పేడ ఉందని అబద్ధం చెప్పుతారు. అమాయకురాలు అండాలమ్మ వారి మాటలు నమ్మి దర్గ లోపలికి వెళ్ళింది. అప్పుడు ఆ దుర్మార్గులు—

| | | | |
|---|---|---|---|
| ఎడమ చేతిలో ఉన్న | ఉయ్యాలో | ఎర్రద స్తిని దీసి | ఉయ్యాలో |
| కఠినంబుగా వాడు | ,, | కండ్లకూ బిగియించె | ,, |
| ఆమె నెత్తుకోని | ,, | అర్రలోపల ఏసె | ,, |
| అంతలో అరుగురు | ,, | హంతకులు ఏతెంచి | ,, |
| నాయినా యనిపిలువ | ,, | నరికి చంపుత మనుచు | ,, |
| భరియింప రానట్టి | ,, | బాధలెన్నో పెట్టే | ,, |

ఈ విధంగా వారు పెట్టే బాధలకు భరించలేక అండాలు రోదిస్తూ, చేతిలోని పేడను వదిలిపెట్టి చెయ్యెత్తి దండం పెడుతూ—

| | | | |
|---|---|---|---|
| ఆకాశం పోయేటి | ఉయ్యాలో | ఆది పక్షులారా | ఉయ్యాలో |
| తల్లికీ బిడ్డనూ | ,, | లేదాని చెప్పు | ,, |
| చెల్లెకు తమ్మునికి | ,, | అక్క లేదని చెప్పు | ,, |
| సోదరి అంతమ్మ | ,, | శోకించకు మరల | ,, |
| అనసూర్య పుల్లమ్మ | ,, | ఆడుకుంటి మమ్మ | ,, |
| నాగరత్నం నేను | ,, | ఆగలేను తల్లి | ,, |
| ఇక నేను వెళ్ళేద | ,, | శకుంతలాబాయి | ,, |
| పంతులమ్మల నిపుడు | ,, | ఎంతో నడిగితినమ్మ | ,, |
| శంకరమ్మకు నేను | ,, | చంకబిడ్డగ నుంటి | ,, |
| బుద్ధులెన్నో చెప్ప | ,, | బుచ్చమ్మ మరినాకు | ,, |
| నిత్యపాఠము చెప్ప | ,, | సత్యభాయమ్మయు | ,, |
| నాయనా చెన్నయ్య | ,, | ఏగుచున్నానయ్య | ,, |

అని ఏడుస్తూ, తల్లిదండ్రులను సోదరులను, స్నేహితురాండ్లను, తనకు చదువులు, బుద్ధులు చెప్పిన పంతులమ్మలను కడసారిగా జ్ఞాపకంచేసింది. ఇంకా-

| | | | |
|---|---|---|---|
| పోతూనే దేవుని | ఉయ్యాలో | పోరాడుతానమ్మ | ఉయ్యాలో |
| ఇట్టి దుర్మార్గుల | ,, | ఎట్టులుంచితివనుచు | ,, |
| గట్టిగా దేవున్ని | ,, | తిట్టియడుగుతాను | ,, |

అంటూ ప్రాణాలు వదిలింది తరువాత ఆ హంతకులు అండాలుపై ఉన్న నగలన్నీ దోచుకొని, శవాన్ని ఆ గది ప్రక్కనే గొయ్యి త్రవ్వి పాతిపెట్టి వెళ్ళిపోయారు. ఆ నగలను అమ్మి వచ్చిన డబ్బుతో త్రాగి ఆనందించారు. మళ్ళీ అదే రాత్రి, తాము దొరికిపోతామనే భయంతో ఆ శవాన్ని తీసి ఒక పాడుపడ్డ బావిలో వేసి వెళ్ళిపోయారు. ఈ వార్త తెలిసిన ఆమె తల్లిదండ్రులు-

| | | | |
|---|---|---|---|
| రొమ్ములు గుద్దుకొని | ఉయ్యాలో | రోదనా జేసిరి | ఉయ్యాలో |
| పడివున్న శవమును | ,, | పైకి నెత్తీ తీసి | ,, |
| వారి శోకమునైన | ,, | వర్ణింపగా రాదు | ,, |
| కాకి శోకము కన్న | ,, | కడు ఎక్కువాయెను | ,, |

తరువాత ఊరి ప్రజలంతా కలసి గుండాలను పట్టి పోలీసులకు అప్ప జెప్పారు. ఆ పోలీసు కచేరిలో పోలీసులకు లంచాలు అందలేదని కేసును ఆలస్యం చేశారు. ఊరి జనులు, బడిపిల్లలంతా కలిసి, ఊరేగింపుగా నల్లగొండ జిల్లా న్యాయ స్థానానికి వెళ్ళి కేసు విచారణ చేయించారు. వారి ప్రయత్నం వల్లనే హంతకులకు ఉరిశిక్ష విధించబడింది. తరువాత ఆ దుండగులు కేసును హైకోర్టులో విచారణ జరిపించగా, అక్కడ ఉరిశిక్ష రద్దుచేసి, హంతకులను విడిచి పెట్టారు. దీనికి ప్రతిఘటించిన అండాలు తల్లిదండ్రులను ఊరిప్రజలందరిని బల వంతంగా బయటికి పంపించారు.

| | | | |
|---|---|---|---|
| ఎక్కడీన్యాయము | ఉయ్యాలో | ఏనాడు ఎరుగము | ఉయ్యాలో |
| భారత దేశంబు | ,, | పసలేని దాయెనా | ,, |
| లంచగొండితనం | ,, | రూపుమాపగలేర | ,, |
| ప్రభు శాసనమిట్లు | ,, | పక్షపాతంబున | ,, |
| ప్రజలలో బీదలకు | ,, | బ్రతుకుతెరువూ లేదు | ,, |
| విన్నవారల గుండె | ,, | వెలవెల బోవంగ | ,, |
| కన్నవారలకెట్లు | ,, | కలికలిగాకుండు | ,, |
| దుష్టులను శిక్షించ | ,, | శిష్టులను రక్షించ | ,, |
| అవతార మెత్తడా | ,, | ఆ పరమాత్ముడు | ,, |
| జోహార్లు అండాలు | ,, | జోహార్లు నీకు | ,,[37] |

...అని ప్రజలంతా జరిగిన అన్యాయానికి స్పందించి ఎదురు తిరిగినప్పటికీ, లంచగొండి అధికారులవల్ల న్యాయం నశించిపోయింది. కరుణరసాత్మకమైన ఈ అండాలమ్మ కథను జానపదులు బతుకమ్మ పాటగా పాడుకుంటారు.

## అధోజ్ఞాపికలు :

1. పాడినవారు శ్రీమతి యశోద మెట్‌పల్లి, కరీంనగర్‌జిల్లా.
2. ,, ,, అంతమ్మగారు, గాగిళ్ళాపురం, వరంగల్‌జిల్లా.
3. ,, ,, బాలమణి, ఇబ్రాహింపురం, నల్లగొండజిల్లా.
4. ,, ,, సత్యవతి, మడికొండ, వరంగల్ జిల్లా.
5. ,, ,, ,, ,, ,,
6. ,, ,, అంజమ్మ, ఇబ్రాహింపురం, నల్లగొండ జిల్లా.
7. ,, ,, శోభారాణి, మెట్‌పల్లి, కరీంనగర్ జిల్లా.
8. ,, ,, చంద్రకళ, ఆకునూరు, వరంగల్ జిల్లా.
9. పూర్వగాథాలహరి, మహాభారతం, పుట 487.
10. పాడినవారు శ్రీమతి శాంతమ్మ, ఇబ్రాహింపురం, నల్లగొండజిల్లా.
11. ,, ,, యశోద, మెట్‌పల్లి, కరీంనగర్ జిల్లా.
12. ,, కుమారి మనోహర, ఇబ్రాహింపురం, నల్లగొండ జిల్లా.
13. " " పద్మ, మెట్‌పల్లి, కరీంనగర్ జిల్లా.
14. ,, శ్రీమతి సత్యవతి, మడికొండ, వరంగల్ జిల్లా.
15. ,, ,, వనజ, ఆకునూరు, వరంగల్ జిల్లా.
16. ,, ,, జయలక్ష్మి, ఆకునూరు, వరంగల్ జిల్లా.
17. ,, ,, శివజ్యోతి, మెట్‌పల్లి, కరీంనగర్ జిల్లా.
19. ,, ,, శ్యాంబాయి, ఆకునూరు, వరంగల్ జిల్లా.
19. ,, ,, కట్కూరి రాజగంగు, కోరుట్ల, కరీంనగర్ జిల్లా.
20. డా॥ రావి ప్రేమలత, తెలుగు జానపద సాహిత్యము, పురాగాథలు, పుట-169.
21. పూర్వగాథాలహరి, పుట-168.
22. పూర్వగాథాలహరి, పుట-168.

23. పాడినవారు కుమారి బాలమణి, జయ్యాల, వరంగల్ జిల్లా.
24. ,, ,, రాణి లింగంపల్లి, ,,
25. ,, ,, శ్రీలత, కేశవాపురం, ,,
26. ,, ,, రాణి, కేశవాపురం, ,,
27. ,, ,, బాలమణి, జయ్యాల, ,,
28. ,, ,, స్వరాజ్యం, లింగంపల్లి, ,,
29. ,, శ్రీమతి బాలమణి, గాగిళ్ళాపురం, ,,
30. ,, ,, పద్మవ్వ, ఇబ్రాహింపురం, నల్లగొండజిల్లా.
31. ,, కుమారి శ్రీలత కేశవాపురం, వరంగల్ జిల్లా.
32. ,, ,, రమాదేవి, మెట్‌పల్లి, కరీంనగర్ జిల్లా.
33. ,, ,, శిరీష, మడికొండ, వరంగల్ జిల్లా.
34. ,, శ్రీమతి శంకరమ్మ, ఇబ్రాహింపురం, నల్లగొండ జిల్లా.
35. ,, ,, బుషమ్మ, ఇబ్రాహింపురం, నల్లగొండ జిల్లా.
36. ,, ,, శ్యాంబాయి, ఆకునూరు, వరంగల్ జిల్లా.
37. ,, ,, అంతమ్మగారు, గాగిళ్ళాపురం, వరంగల్ జిల్లా.

# 4. బతుకమ్మ పండుగ పాటల ఆధారంగా సంస్కృతీ సంప్రదాయాల పరిశీలన

మానవుడు జన్మించింది మొదలు క్రమంగా పెరిగి పెద్దవాడై తనదైన ఒక జీవన విధానంలో కొన్ని నియమాలు, కట్టుబాట్లు, ఆచారాలు, సంప్రదాయాలు ఏర్పరచుకుంటాడు. అతడు ఏర్పరచుకున్న జీవన పద్ధతులు, నియమాలు, ఆచార సంప్రదాయాల సమాహార స్వరూపమే "సంస్కృతి" అని చెప్పవచ్చు. ఈ సంస్కృతి వ్యక్తి అంతర్గత జీవితాన్ని, అతని కార్యాచరణ పద్ధతిని తెలుపుతుంది.

"మానవుడు సమాజంలో సభ్యుడుగా ఉంటూ ఉపార్జించే జ్ఞానం, నమ్మకం, కళ, నీతి, చట్టం, ఆచారం- ఇంకా ఇతర సామర్థ్యాలు, నిపుణతలు- ఇవి అన్నీ కలసి సంస్కృతి అవుతాయని చెప్పవచ్చు."[1]

మానవుడు సంస్కృతికి శిశువనీ, సంస్కృతి అనగా భిన్న వర్గాలకు భిన్నకాలాలకు భిన్న ప్రాంతాలకు చెందిన రకరకాల ఆచారాల యొక్క విశ్వాసాల యొక్క నమూనాలను (పాటరన్స్) సంతరించుకున్న సమాహార స్వరూపమని డా॥ నాయని కృష్ణకుమారిగారు నిర్వచించారు.[2]

ఎవరెన్ని రకాలుగా సంస్కృతిని నిర్వచించినప్పటికి మానవ జాతి పుట్టినప్పటి నుండి దాని మనుగడకు అవలంబించిన విధానాలు సంస్కృతీ సంప్రదాయాలుగా పరిగణింపవచ్చును.

అదేవిధంగా ఒక జాతి క్షీణ దశనుండి అది అభివృద్ధి మార్గంలో పయనించడానికి చేసే ప్రయత్నాల పరంపరే ఆ జాతి సంస్కృతిగా వ్యవహరింపబడుతుంది.

ఈ సంస్కృతినే ముందు తరాలవారు కూడ ఆచరించడం వల్ల అది సంప్రదాయంగా మారిపోతుంది.

పరిసరాల ప్రభావమేకాక సమాజంలో క్రొత్త అవసరాలు ఏర్పడడంవల్ల మానవ జీవితంలో మార్పులు సంభవిస్తాయి. ఆ మార్పుల కనుగుణంగా అతని జీవన పద్ధతులు, ఆచార సంప్రదాయాలు మారి, సంస్కృతిలో కూడా మార్పులు వస్తాయి. మానవుని పురోభివృద్ధికి దోహదం చేసే సంస్కృతి భావితరాలకు సంప్రదాయంగా మిగులుతుంది.

జానపదులు జరుపుకునే పండుగలు, వ్రతాలు, నోములు, ఉత్సవాలు, వేడుకలు మొదలైనవన్నీ వారి సంస్కృతిని ప్రతిబింబింప చేస్తాయి. ఈ పండుగ రోజులలో పురుషులకంటే స్త్రీలే ఎక్కువ ఆసక్తి చూపుతూ, ఆచారాలను, నియమాలను, కట్టుబాట్లను ఎక్కువగా పాటిస్తారు.

తెలంగాణా ప్రాంతంలో స్త్రీలే ప్రత్యేకంగా జరుపుకునే పండుగ బతుకమ్మ పండుగ. ఈ పండుగ సందర్భంగా పాడుకునే పాటలలో నాటి సాంఘిక, ఆర్థిక పరిస్థితులు, కట్టుబాట్లు, నీతి నియమాలు, మత విశ్వాసాలు, నమ్మకాలు, కళలు, ఆటలు, పండుగలు, వేషభూషణాలు మొదలైనవి ఎన్నో కన్పిస్తాయి.

## 1. వ్యవసాయానికి సంబంధించిన అంశాలు :

బతుకమ్మ పండుగ ఋతు పరివర్తనంవల్ల ఏర్పడిన పండుగగా భావింపవచ్చు. ఈ పండుగ సమయంలో తెలంగాణా ప్రాంతంలో మెట్ట పంటలన్నీ పండి ఇంటికి చేరుతాయి. కొన్ని ప్రత్యేకమైన ధాన్యాలు పెసర, మొక్కజొన్న, జొన్న, సజ్జలు, మినుములు, గోధుమలు ఎక్కువగా పండుతాయి. ఈ పంటలు పండించే తరుణం ఆసన్నమైందని చెప్పుతూ జానపదులు ఈ క్రింది పాటను పాడుకుంటారు:

చెలుకల్లు దున్నించి గోధుమాలలికించి చందమామయ్యో
,, ,,
చెలుకల్లు దున్నించి పెసర్లలికించి చందమామయ్యో
,, ,,
చెలుకల్లు దున్నించి మినుమూలలికించి చందమామయ్యో
,, ,,
చెలుకల్లు దున్నించి జొన్నాలలికించి చందమామయ్యో
,, ,,

వరికోతలు కోసేటప్పుడు స్త్రీలు గుంపులుగా వెళ్ళుతారు. అందులో ఎవరైనా ఒకరు ఆ గుంపుకు నాయకత్వం వహిస్తారు. వారే మిగతా కూలీవాళ్ళ నందరిని చేను దగ్గరకు తీసుకుపోయి చేను కోయడానికి వారికి కొంత భాగాన్ని కేటాయిస్తారు. అంటే, ఎవరి భాగం లేదా వరసను వారే కోసుకుంటూ పోవాలి. ఈ పద్ధతిని మునుము పట్టడం అంటారు.

| | | | |
|---|---|---|---|
| క్రొత్త బాయికాడ | ఉయ్యాలో | వరిశేన్లుండె | ఉయ్యాలో |
| అప్పుడు కాదాను | ,, | మల్లమ్మనయితే | ,, |
| క్రొడువండ్లూను | , | చేత బూనినాది | ,, |
| రాంౘద్రమ్మాను | ,, | మల్లక్కాను | ,, |
| మల్లక్కాను | , | ఎల్లక్కాను | ,, |
| పదిమందీని | ,, | ఎంటబెట్టుకోని | ,, |
| క్రొత్తబాయికాడికి | ,, | ఎల్లినాదమ్మ | ,, |
| వాళ్ళు కూలోల్లు | ,, | ఒడ్డూకు వచ్చిరి | ,, |
| పదిమందికి | ,, | మునుమూలైన | ,, |
| మునుమూలైన | ,, | పట్టి ఇచ్చినాది | ,, |
| అందరికన్నాను | ,, | మల్లమ్మయితే | ,, |
| ఒక్క మునుమూ | ,, | ఎక్కూవబట్టె | ,, |

నాయకత్వం వహించిన మల్లమ్మ వరికోతలో మిగతా కూలీల కంటె ఒక మునుము ఎక్కువ పట్టిందట. అంటే ఇంకో వరుస ఎక్కువ కోసిందని అర్థం. "మునుము పట్టడం" అనే పద్ధతి పై పాటవల్ల తెలుస్తుంది.

వ్యవసాయంలో పశువులకు అధిక ప్రాధాన్యం ఉంటుంది. పశువులు లేనిది వ్యవసాయమే లేదు. రైతులు పశువులను పని బిడ్డలతో సమానంగా చూసుకుంటారు. నాగలితో దుక్కి దున్నడానికి, బండి కట్టడానికి, మోట కొట్టడానికి పశువులు అవసరం. అందుకే రైతులు పశువులను ఎంతో ప్రేమగా చూస్తూ, వాటిని రకరకాల పేర్లతో పిలుచుకుంటారు.

'పేదరాశి పెద్దమ్మ' పాటలో - పెద్దమ్మ కూతురు అక్కమ్మను పుట్టింటికి తీసుకురావడానికి ఆమె అన్న బండిగట్టుకొని బయలుదేరుతాడు.

| ఆ బండి నడిచేటి | ఉయ్యాలో | ఎడ్ల పేరేమిటే | ఉయ్యాలో |
|---|---|---|---|
| నడుములూ సక్కనా | ,, | నాగభూతా ఎడ్లు | ,, |
| కొమ్ములూ సక్కనా | ,, | కోడెభూతా ఎడ్లు | ,, |
| మడిమలు సక్కనా | ,, | మాయభూతా ఎడ్లు | ,, |
| వెండిబారెడు జోళ్లు | ,, | ఎడ్లమెడానేసి | ,, |
| ముత్యాల ముల్లుగట్టె | ,, | ముడ్లమీదా మోపి | ,, |
| కహ అని ఆ బండి | ,, | కదలదోలినారు | ,, |
| పోయెనే ఆ బండి | ,, | కొమురెల్లి దాకా | ,, |

కోడెభూత ఎడ్లని, మాయ భూత ఎడ్లని, నాగభూత ఎడ్లని జానపదులు వారి పశువులకు పెట్టుకున్న పేర్లు. ఇంకా ఎర్రావు, కర్రావు, నల్లావు, తెల్లావు, గంగావు అని వాటి రంగులనుబట్టి ఆవులను పిలుచుకుంటారు. "వెండిబారెడు జోళ్లు ఎడ్లా మెడానేసి" అనగా పశువుల మెడపైన బండి కాడి మోపి దానిని చర్మంతో చేసిన బారెడు జోళ్ళతో ఆ పశువు మెడకు కడతారు.

భూస్వామ్య వ్యవస్థలో వ్యవసాయ కూలీలు ఎన్నో కష్టాలను ఎదుర్కోవలసి వచ్చేది. ప్రొద్దంతా వారిచే పని చేయించుకొని, వారికి తగిన ప్రతిఫలం ఇవ్వకుండా భూస్వాములు కూలీల శ్రమ శక్తిని దోచుకునేవారు. కూలీల బ్రతుకులు భారంగా గడుస్తుండేవి. ఒక్కొక్కసారి వారికి తినడానికి తిండి కూడా కరువై ఎన్నో ఇక్కట్లను ఎదుర్కొంటారు. "పాపిరెడ్డి కథ"లో పాపిరెడ్డి వద్ద కూలీలుగ పని చేస్తున్నవారు మల్లన్న, అతని భార్య మల్లమ్మ. ఒకనాడు మల్లమ్మ పాపిరెడ్డి దగ్గరికి పోయి—

| అపుడు మల్లమ్మ | ఉయ్యాలో | ఏమి చేసేను | ఉయ్యాలో |
|---|---|---|---|
| పాతేలు తాన | ,, | నౌక రున్నాది | ,, |
| ఒక్కదిన మందు | ,, | ఒక్క మధ్యమందు | ,, |
| అపుడు మల్లమ్మ | , | ఏమి అడిగినాది | ,, |
| పాతేలూను | ,, | పాపిరెడ్డిని | ,, |
| మాకు జీతంబు | ,, | ఇయ్యావు తండ్రి | ,, |
| కష్టమొచ్చేను | ,, | కరువు వచ్చేను | ,, |

| | | | |
|---|---|---|---|
| తినబోతేను | ఉయ్యాలో | తిండికి లేదు | ఉయ్యాలో |
| కట్టబోతేను | ,, | వస్త్రమ్ము లేవు | ,, |
| మాకు జీతంబు | ,, | ఇయ్యావు తండ్రి | ,, |
| ఇట్లు మల్లమ్మ | ,, | అడిగినాది | ,, |
| పాపిరెడ్డిని | ,, | ఏమి చెప్పినాడు | ,, |
| కొత్తబాయి కాడ | ,, | వరిశేన్లుండె | ,, |
| వరిశేనులయిన | ,, | కోత కొచ్చినాయి | ,, |
| వరి కోతల్లు | ,, | పట్టాలే నమ్మ | ,, |
| వరి కోతల్లు | ,, | పట్టి నంకాను | ,, |
| నియ్యు జీతంబు | ,, | ఇచ్చేద నీకు | ,, |

తినడానికి తిండిలేక, కట్టుకోవడానికి బట్టలు లేక మల్లమ్మ బాధపడుతూ పాపిరెడ్డిని జీతం అడుగుతుంది. భూస్వామి పాపిరెడ్డి వరిసేను కోత కొచ్చిందని, వరి కోయించిన తరువాత జీతం ఇస్తానంటాడు. నాటి సాంఘిక వ్యవస్థలో జమీందారుల కఠిన చర్యలు. కూలీవాళ్ళ సమస్యలు పై పాటద్వారా తెలుస్తున్నాయి.

"కలికి కామాక్షి" పాటలో కలికి కామాక్షి తనను పుట్టింటికి తీసుకుపోవడానికి తన అన్న వచ్చాడని చెప్పతూ, తన భర్త దగ్గరకు వెళ్ళి—

"మోటల్లు గొట్టేటి ఉయ్యాలో ఓ మోగవారు
మాయన్నలొచ్చారు ఉయ్యాలో మమ్మంపుతార"

అని అడుగుతుంది. పంటలకు నీరు పారించడానికి మోటగొట్టి బావినుండి నీటిని తోడుతారు. ఆధునిక కాలంలో విద్యుత్ మోటారు పంపులు రావడంవల్ల మోటకొట్టడం చాలా అరుదుగా కనిపిస్తుంది.

బతుకమ్మ పండుగ కాలంలో పూసే తంగేడు, గునుగు, సంపెంగ, జాజి, మల్లె, ఉద్రాక్ష, కాకర, బీర, కట్ల, బంతి, చామంతి, అల్లియ, గుమ్మడి, గన్నేరు మొదలైన పువ్వులు కూడ జానపదుల పాటలలో కనిపిస్తాయి. ఇంకా రైతులు జామ, దానిమ్మ తోటలను గూడ పెంచి ఆయా పండ్లను పండిస్తారు. ఈ పండ్లు పూవులు సంపదకు, సౌభాగ్యానికి ప్రతీకలు.

దానిమ్మ వనముల చిలుకలుగా చిలుకలు మము జూచి పలుకవిగా
పండ్లు తింటమని పలుకవిగా
నాతో పలహరి నరహరి చిలుకా అమ్మాడాకుల గుమ్మాడీ
జామా వనముల చిలుకలుగా చిలుకలు మముజూచి పలుకవిగా
పండ్లు తింటమనిప లుకవిగా
నాతో పలహరి నరహరి చిలుకా అమ్మాడాకుల గుమ్మాడీ
నారింజ వనముల చిలుకలుగా చిలుకలు మముజూచి పలుకవిగా
పండ్లు తింటమని పలుకవిగా
నాతో పలహరి నరహరి చిలుకా అమ్మాడాకుల గుమ్మాడీ

జామ, నారింజ దానిమ్మ మొదలైన పండ్ల తోటలే గాకుండా, చింత, మామిడి, అరటి చెట్లను కూడ పెంచుతారు. ఆ చెట్ల పేర్లను వర్ణిస్తూ పాడే మరో పాట—

చింతచెట్టు మీద చిల్కలాల చిల్కలాల
చింతపండు తిని పల్కరేమె పల్కరేమె
అన్నయ్య తెచ్చిన డాయిలాల డాయిలాల
వదిన కొప్పుమీద వాలరేమె వాలరేమె
మామిడి చెట్లమీద చిల్కలాల చిల్కలాల
మామిడి పండ్లు తిని పల్కరేమె పల్కరేమె
అన్నయ్య తెచ్చిన డాయిలాల డాయిలాల
వదిన కొప్పుమీద వాలరే మెవాలరేమె
అరటి చెట్లమీద చిల్కలాల చిల్కలాల
అరటి పండ్లు తిని పల్కరేమె పల్కరేమె
అన్నయ్య తెచ్చిన డాయిలాల డాయిలాల
వదినె కొప్పుమీద వాలరేమె వాలరేమె[3]

పశువులను పెంచడం, చెలుకలు (దుక్కి) దున్నడం, మోటకొట్టడం, వరికోతలు, పండ్లతోటలు పెంచడం మొదలైన వ్యవసాయానికి సంబంధించిన ఆచారాలు, సంప్రదాయాలను వివరించే పాటలు బతుకమ్మ పండుగ రోజుల్లో జానపద స్త్రీలు పాడుకుంటారు.

## 2. స్త్రీ పురుష సంబంధాలు - సాంఘిక జీవనం :

పూర్వం ఆది మానవుడు కందమూలాలను తినుకుంటూ కొండ గుహల్లో నివసిస్తూ జీవనం గడిపేవాడు. తరువాత జంతువులను పక్షులను వేటాడుతూ నిప్పును పుట్టించి వంట చేయటం నేర్చుకున్నాడు. అప్పటి నుండి నాగరికత మొదలైంది. మానవుడు తోటి మనుషులతో సామూహికంగా పని చేస్తూ ఆహారం పంచుకొని తినడం నేర్చుకున్నాడు. నిత్య జీవన కృత్యాలన్నీ సామూహికంగా చేస్తూ వుండేవాడు. కాలక్రమేణ సైగలతో సంకేతాలతో మాటలు ఏర్పడి, వాటితో తన భావాలను ఇతరులకు తెలియచేశాడు.

నాగరికతా వికాస క్రమంలో సామాజిక ఆర్థిక కారణాల వల్ల కొన్ని నిర్దిష్టమైన కట్టుబాట్లతో స్త్రీ పురుషులకు కుటుంబ వ్యవస్థ ఏర్పడింది. మాతృ స్వామ్య వ్యవస్థలో కుటుంబ భారమంతా స్త్రీపైనే ఆధారపడి ఉండేది. పురుషుడు కేవలం ఆహార సంపాదన మాత్రమే చేసేవాడు. స్త్రీ కుటుంబానికి యజమానిగా ఉంటూ పిల్లలను కని పోషిస్తూ ఉండేది స్త్రీకే ఆస్తి హక్కు ఉండేది. సామాజిక పరిణామంలో పురుష స్వామ్య వ్యవస్థ ఏర్పడింది. పురుషుడే కుటుంబ యజమాని. ఆస్తిపైన హక్కు పుత్రునికే ఉండేది. మాతృస్వామ్య వ్యవస్థ బలహీనపడి పితృ స్వామ్య వ్యవస్థ ప్రబలంగా ఏర్పడింది.

మాతృస్వామ్య వ్యవస్థలో స్త్రీలు తమ సంతానాన్ని రక్షిస్తూ, ఆకులను పళ్లను, గింజలను సేకరించి ఆహారం సంపాదించడం వృత్తిగా నేర్చు కున్నారు. తరువాత విత్తనాలు చల్లడం, మొక్కలు పెంచడంతో వ్యవసాయం ఆరంభమైంది. అంటే వ్యవసాయ ఆరంభకురాలు స్త్రీయే అన్నమాట. స్త్రీకి ప్రాధాన్యత పెరిగి ఆమె దేవతామూర్తిగా భావించబడేది. ఈ భావనలే గ్రామ దేవతల ఆవిర్భావానికి మూలకారణాలు. వ్యవసాయం ప్రారంభమైన తరువాత పురుషుని బాధ్యత పెరిగింది. పశుపోషణ, నాగలితో భూమి దున్నడం మొదలైన బరువైన పనుల వల్ల పురుషునికి ప్రాధాన్యత పెరిగింది. అయినా సృష్టికి మూలం స్త్రీ అని, సఫలతకు స్త్రీయే కారణమని ఆమె చేతనే విత్తనాలు చల్లించడం ఇప్పటికీ ఆచారంలో ఉంది. వ్యవసాయం వృద్ధిపొందిన తరువాత స్త్రీ ప్రాబల్యం తరిగింది. ఇక్కడ కుటుంబ పోషణ భారమంతా పురుషునిపైననే ఎక్కువగా

ఉండేది. తండ్రి ఆ కుటుంబానికి యజమాని. స్త్రీ కేవలం పురుషునికి సేవలు చేస్తూ, పిల్లలను కనడం, వంట చేయడం వరకే పరిమితమైపోయింది. ఈ రెండు వ్యవస్థల మధ్య ఏర్పడిన సంధికాలంలో పుట్టినవే ఎల్లమ్మ, ఈదెమ్మ మొదలైన కథలు.

ఎల్లమ్మ కథలో పరశురాముడు ఎల్లమ్మను ఎన్నో రకాలుగా బాధ పెడతాడు. అంతరిస్తున్న స్త్రీస్వామ్య వ్యవస్థకు ఎల్లమ్మ ప్రతీక కాగా, అరంభం లోని పురుషాధిక్యతకు ప్రతీక పరశురాముడు. ఈ కథలో పరశురాముడు గంగమ్మను కూడ బెదిరించడంతో పురుష ప్రాబల్యం కనిపిస్తుంది. ఎల్లమ్మకు సంబంధించిన మరో కథలో కాకతీయ వంశపురాజు ప్రతాపరుద్రుడు స్త్రీ దేవత అయిన ఎల్లమ్మను పూజించడానికి ఒప్పుకోడు. స్త్రీ దేవతలను పూజించడం పురుషులకు అవమానంగా ఆ రాజు భావిస్తాడు.

క్రమక్రమంగా సమాజంలో స్త్రీని పురుషుడు ఎన్నో సాంఘిక కట్టు బాట్లతో నీతి నియమాల పేరుతో అణచి వేయడానికి ప్రయత్నించాడు. అంతే గాక ఇద్దరు, ముగ్గురు స్త్రీలను కూడ వివాహమాడేవాడు. శీలం, పాతివ్రత్యం పేరుతో స్త్రీలకు ఎన్నో కట్టుబాట్లు విధించి పురుషులు స్త్రీలను తమకు అను కూలంగా మార్చుకున్నారు. క్రమంగా స్త్రీ జీవితావసరాలకు బాల్యంలో తండ్రిపై, యవ్వనంలో భర్తపై, వృద్ధాప్యంలో కొడుకులపై ఆధారపడవలసి వచ్చింది. ఈ నేపథ్యంలోనే స్త్రీలకు పతివ్రతా ధర్మాలు నిర్దేశింపబడ్డాయి. ఇవి స్త్రీలు తమకు అణకువగా ఉండడంకోసమే పురుషులు ఏర్పరచుకున్నవి అని భావింప వచ్చు.

## పతివ్రతాధర్మము

| | | | |
|---|---|---|---|
| శ్రీకరంబైనట్టి | ఉయ్యాలో | స్త్రీ ధర్మములు కొన్ని | ఉయ్యాలో |
| చెప్పబూనితినమ్మ | ,, | చిత్తగించుడి మీరు | ,, |
| నీతి దప్పగరాదు | ,, | నిందింపగ రాదు | ,, |
| శాస్త్ర ధర్మంబులు | ,, | పాడు వించగరాదు | ,, |
| పెద్దలూ చెప్పినా | ,, | బుద్ధితప్పగరాదు | ,, |
| కూడదన్నా పనులు | ,, | కోరి చేయగరాదు | ,, |

| | | | |
|---|---|---|---|
| ఎట్టివారలకైన | ఉయ్యాలో | పెట్టి చెప్పగరాదు | ఉయ్యాలో |
| కొంచ గుణములచేత | ,, | కురుచ లేదనరాదు | ,, |
| పరుల వంచనచేరి | ,, | పరిహసింపగరాదు | ,, |
| తోటివారలతోడ | ,, | కూడియుండుట మేలు | ,, |
| కలహించుకోరాదు | ,, | కాంతలు తమలోనా | ,, |
| ఓర్పుగలిగినవారు | ,, | ఉత్తమా కాంతలు | ,, |
| పతియాజ్ఞలన్నిటిని | ,, | భక్తితో చేయుము | ,, |
| పతిని పూజించుటే | ,, | పతివ్రతా ధర్మంబు | ,, |
| భర్త ఎల్లప్పుడు | ,, | పరమాత్మ యంచు | ,, |
| పాదపూజలు చేయు | ,, | పరమపావన విద్య | ,, |
| భర్త మేలునుకోరు | ,, | భాగ్యవంతురాలు | ,, |
| భర్త కీడును గోరు | ,, | పాపాత్మురాలు | ,, |
| పతులు వ్యసనమొంద | ,, | సతులు చూడగరాదు | ,, |
| భక్తి శ్రద్ధలచేత | ,, | భావంబు రంజిల్లు | ,, |
| భర్త ప్రేమను తీర్చు | ,, | భార్య పాతివ్రాత | ,, |
| పతి భక్తియును లేక | ,, | పాప భీతియు లేక | ,, |
| తన సౌఖ్యమునుకోరు | , | ఏవేళ భర్తలా | ,, |
| వెలయుండు ఈరీతి | ,, | ఇంత మాటలచేత | ,, |
| ఎచ్చోట నొందింప | ,, | చిర్రు గుణములు చూప | ,, |
| చిత్తమెల్లా చెరచు | ,, | నగలుచాలా యనుచు | ,, |
| నగలు చాలయంచు | ,, | నిగలు తింపినడచు | ,, |
| పెట్టు వన్నెలకొరకు | ,, | పీడంపగారాదు | ,, |
| భర్తలతో పోరాడి | ,, | బాధింపగ రాదు | ,, |
| పతులకూ దొంగలై | ,, | ఎతల పెట్టగరాదు | ,, |
| పరుల భాగ్యమును | ,, | భ్రమ నొందగరాదు | ,, |
| ఇతర పురుషులజూసి | ,, | పతిభక్తియు మరచి | ,, |
| తనపతులు తనకట్లు | ,, | తగువారు గారనుచు | ,, |
| మిక్కిలి తనమునా | ,, | తిరుగగా రాదు | ,, |
| ఉన్నంత కాపురము | ,, | ఉన్నంత చేయుచు | ,, |

ఇరుగుపొరుగు అమ్మలకు ఉయ్యాలో ఎట్లు చెప్పుకొనుచు ఉయ్యాలో
బీదత్వముజూచి ,, బెదరకు పతులకు ,,
తగని మార్గంబున ,, కేగి తిరుగగరాదు ,,
అనరాని మాటలు ,, అనిచూపగ రాదు ,,
మగువలారా మనకు ,, మర్యాద అదిగాదు ,,
ముందుగతు లెరుగకా ,, మోటదన మొందకా ,,
మందమతులై చాలా ,, నిందించు పతులను ,,
సరసములు ఇదికాదు ,, సఖియలారా మనకు ,,
బ్రమకు బానిసయైన ,, బ్రతుకెట్టి బ్రతుకు ,,
చాతుర్యవతులారా ,, సంసారవతులారా ,,
కులకాంత యనిపేరు ,, కుల ముద్దరించుటే ,,
భర్తలగు తగరీతి ,, వర్తించవలెనమ్మ ,,
పతివ్రతా ధర్మంబు ,, పాలించవలెనమ్మా ,,
మేలు మేలున పరులు ,, మెచ్చేరు ప్రేమతో ,,
శ్రీలక్ష్మి వారింట్ల ,, ఏవేళ నివసించు ,,
లక్ష్మి నివాసమై ,, రంజిల్లు వారిల్లు ,,
నాటకపు వేశాలు ,, బూటకపు నాగలు ,,
ఎన్ని కల్గినయున్న ,, సన్నుతాంగులారా ,,
పెట్టి తిరుగగరాదు ,, గట్టి సొమ్ములైన ,,
సంతతానందంబు ,, సమకూరు ధరలోన ,,
మట్టెలు గాజులు ,, మంగళా సూత్రాలు ,,
పసుపు కుంకుమలు ,, పరగనే దొరుకునా ,,
తేడాలు చెప్పరు ,, శృంగార నాగలు ,,
సూడ సొంపైనట్టి ,, సొమ్ములు లేకున్న ,,
పెయ్యినిండా పసిడి ,, ఎంత వెలిగినగాని ,,
సార్థకంబే లేదు ,, వ్యర్థమే నీ నగలు ,,
కనక దేహంబునా ,, కలత నొందగరాదు ,,
నలుగురూ మెచ్చేటి ,, నడక గల్గియుండండి ,,
కుల ముద్ధరించుటే ,, కులకాంత ధర్మంబు ,,

పై పాటలో జానపదులు పతివ్రతాధర్మాలనే గాకుండా స్త్రీ సమాజంలో ఎలా మెలగాలో కూడ వివరించారు. స్త్రీకి జీవితంలో ఎన్ని కష్టాలొచ్చినా నీతిని, ధర్మాన్ని అతిక్రమించగూడదు. గొప్పలు చెప్పుకోవడం, ఇతరులను దెప్పిపొడవడం లాంటివి స్త్రీలకు పనికిరావని, అందుకే "ఎట్టివారలకైనా పెట్టి దెప్పగరాదు" అని అంటారు. ఎల్లప్పుడు భర్త శ్రేయస్సును కాంక్షించి, భర్తలు వ్యసనాలకు బానిసలైనప్పుడు వినయంతో, మర్యాదగా వారిని సక్రమమైన మార్గంలో పెట్టవలసిన బాధ్యత భార్యకు ఉంటుంది. సంకుచిత మనస్తత్వంతో భర్తలను తమకు నగలు, చీరలు తగినన్ని తేలేదని దూషించి భర్తల హృదయాలను గాయపరుచరాదు ఇంకా—

"తోటివారలతోడ ఉయ్యాలో కూడియుండుట మేలు ఉయ్యాలో
కలహించుకోరాదు ,, కాంతలు తమలోన ,,

అని స్త్రీలంతా ఐకమత్యంగా కలిసి ఉండాలని బుద్ధులు చెప్తున్నారు జానపదులు. బీదవారమని బాధపడకుండా, తమకున్నంతలోనే తృప్తిచెంది కాపురం చేయాలని, ఇతరుల ఐశ్వర్యాన్ని చూసి అసూయపడడం భావ్యం కాదని, చెప్తారు. మానవుడు అత్యాశకు పోయి కష్టాల పాలు కాకూడదని, తృప్తికి మించిన ధనం వేరే లేదని జానపద స్త్రీల అభిప్రాయం. భ్రమలకు బానిసలై పోకుండా, దూరదృష్టితో ఆలోచించి స్త్రీలు తమ సంసారాన్ని స్వర్గమయం చేసుకోవాలని "పతివ్రతాధర్మాలు" పాటలో వ్యక్తం చేయబడింది. ఇవే లక్షణాలు పురుషులకు కూడ నిర్దేశింపబడితే ఆ ఇల్లు స్వర్గధామమే.

పసుపు, కుంకుమ, మాంగళ్యం అపూర్వమైన సంపదలని, ఇవి లేకుండా ఎంత ఐశ్వర్యమున్నా స్త్రీ జీవితానికి సార్థకం లేదని జానపద స్త్రీల నమ్మకం. ఈ రకంగా స్త్రీలకు ఉత్తమ గుణాలను బోధించే ఇటువంటి పాటలను బతుకమ్మ పండుగ సందర్భంగా స్త్రీలు అనేక రకాలుగా పాడుకుంటారు.

ఇంకా జానపదులు నీతి, నియమాలకు అధిక ప్రాధాన్యత ఇస్తారు. జీవితంలోని కష్టసుఖాలు అనుభవించిన స్త్రీలు తమకన్న చిన్నవారైన ఇతర స్త్రీలకు హితబోధలు చేస్తారు.

| | | | |
|---|---|---|---|
| సఖియలారా మనము | ఉయ్యాలో | సాధారణంబుగా | ఉయ్యాలో |
| కలిగె లోపంబులు | ,, | కని దిద్దుకొనవలయు | ,, |
| విద్య నేర్చితిననుచు | ,, | విర్రవీగగరాదు | ,, |
| విద్యకూ తగినంత | ,, | వినయముండిన మేలు | ,, |
| సక్కదన మున్నదని | ,, | నిక్కి తిరుగగరాదు | ,, |
| మురికితోలుకు ఇంత | ,, | మురిపెంబు కూడదు | ,, |
| కలవారమని యట్టి | ,, | గర్వంబు దగదమ్మ | ,, |
| కలిమిలేములు రెండు | ,, | కలవంటియేనమ్మ | ,, |
| క్షణభంగురమ్మైన | ,, | తనమేను నమ్మియు | ,, |
| మురికి సంసారమని | ,, | మురిసి పోరానిది | ,, |
| మగవారి కెదురుగా | ,, | యేగి తిరుగగ రాదు | ,, |
| దొంగసూపుల తోటి | ,, | తొంగిసూడగ రాదు | ,, |
| మగవారిని వలపించే | ,, | సొగసులెన్నో చేసె | ,, |
| తగని మార్గంబున | ,, | ధర్మబుద్ధిని వీడి | ,, |
| తుచ్ఛసుఖముల మీద | ,, | యిచ్ఛనిలుపగ రాదు | ,, |
| మంచి గుణములచేత | ,, | గొప్పవారనియేరు | ,, |
| నీచగుణములు ఎంత | ,, | దాచివుంచిన గాని | ,, |
| అదనుకలిగిన వేళ | ,, | అన్ని బయటపడును | ,, |
| భాగ్యంబు చేతను | ,, | మోసపోరాదమ్మ | ,, |
| మంచి సహవాసమున | ,, | మంచిగుణములు గలుగు | , |
| దయ్యంపు గుణములు | ,, | గయ్యాళి వారితో | ,, |
| కాని పోనీలేని | ,, | కయ్యాలు పెంచించు | ,, |
| పనిలేక కూర్చుంటె | ,, | పరనింద ముచ్చట్లు | ,, |
| చెప్పుకో దగదమ్మ | ,, | చేటు వాటిల్లును | ,, |
| తలవెంట్రుకాలన్ని | ,, | తన తప్పులుండగా | ,, |
| పరుల తప్పులెన్న | ,, | పాటిగాదేటికి | ,, |
| మగవారు తాగితే | ,, | మన్నించగా వలెను | ,, |
| మంచి మాటలచేత | ,, | మనసు గరగించు | ,, |
| వినయంబుతోడనే | ,, | వేడుకొనవలయును | ,, |

| | | | |
|---|---|---|---|
| తాగుబోతుతనము | ,, | తగదమ్మ స్త్రీలకు | ,, |
| తాగుడు మొదలైన | ,, | తప్పుడు నడకాలైన | ,, |
| దీక్షతో పోగొట్టి | ,, | దిద్దుకోవలెనమ్మ | ,, |
| భర్తమానము గాచి | ,, | భార్య పతివ్రత | ,, |
| నీతివర్తన చేత | ,, | నిలుచుండె ధర్మంబు | ,,5 |

పైపాటలో క్షణికమైన, నీచసుఖాల కోసం ధర్మబుద్ధిని వీడి వచ్చని కాపురం పాడుచేసుకోరాదని, పనిలేక పరనింద చేయకూడదని, విద్య, ధనం ఉందని గర్వపడకుండా, వినయవిధేయతలు కలిగి ఉండాలని సామాన్య స్త్రీకి ఉండవలసిన గుణాలన్ని వివరించారు. సంసారంలో కలమిలేములున్నా సర్దుకు పోవాలి.

మగవారు తాగితే - మన్నించగావలెను
మంచి మాటల చేత - మనసు కరగించు

కోవాలని చెప్పడం వల్ల పురుషులెన్ని తప్పులు చేసినా, వారిని దూషించ కుండా మంచి మాటలతోనే వారి మనస్సులను మార్చాలని అంటారు. ఈ పాటలో పురుషాధిక్యత, పక్షపాతవైఖరి గోచరిస్తుంది. పురుషాధిక్య సమాజంలో పురుషుడు తన స్వార్థంకోసం స్త్రీకి ఇన్నిరకాల నియమాలు, కట్టుబాట్లు విధించాడు. స్త్రీ వ్యక్తిత్వం ఎదుగనీయకుండా ఆమెను అణచివేసే ధోరణిపై పాటలో వ్యక్త మైంది.

ఆది దంపతులైన శివపార్వతులపై తెలుగువారికి భక్తిశ్రద్ధలు ఎక్కువ. గౌరీదేవిని పూజిస్తూ స్త్రీలు ఎన్నో నోములు వ్రతాలు జరుపుకుంటారు. సౌభాగ్యం కోసం సుమంగళత్వం కోసం ఈమెను ఆరాధిస్తారు. శివుడు ఆది భిక్షువు. అయినా భక్తుల పాలిటి కల్పతరువు. శివపార్వతులపై ఉన్న భక్తిభావం వల్ల తాము ఏర్పరచుకున్న ఉత్తమ స్త్రీ లక్షణాలను ఆ పురాణ దంపతుల చేత బోధింప చేశారు జానపదులు. శివుని నిరాడంబరత, పార్వతి పతిభక్తి, జానపదులకెంతో ఇష్టం. అందుకే క్రింది పాటలో స్త్రీకి ఉండవలసిన సద్గుణాలను జానపదులు శివపార్వతులతో ఈ రకంగా చెప్పించారు:

# పురాణ దంపతులు

| | | | |
|---|---|---|---|
| ఆకాశమందునా | ఉయ్యాలో | అల్లెను మేఘములు | ఉయ్యాలో |
| మేఘముల నడుమనూ | ,, | మేలైన కాంతితో | ,, |
| అందునా గౌరమ్మ | ,, | ఆనందమొప్పగా | ,, |
| కంటికీ నిండుగా | ,, | కన్పించు చుండెనూ | ,, |
| గౌరమ్మ వెనుకనూ | ,, | గౌరీశ్వరుడును | ,, |
| పులితోలును కట్టి | ,, | పూనికను చేపట్టి | ,, |
| కొండ జంగమయ్య | ,, | కండెందుమయ్య | ,, |
| భక్తులా పాలింప | ,, | వచ్చిరీ సతిగూడి | ,, |
| పురాణ దంపతులు | ,, | బోధించిరిట్లు | ,, |
| సాతులారా మీరు | ,, | సద్బోధ వినరండి | ,, |
| పతిభక్తియే మీకు | ,, | పచ్చలా పతకంబు | ,, |
| భర్తసేవలు మీకు | ,, | బంగారు గాజులు | ,, |
| నాధునిపై ప్రేమ | ,, | నడుముకూ వడ్డాణము | ,, |
| అత్తమామల సేవ | ,, | అందెలూ గాజులు | ,, |
| కష్టము లోర్చుటే | ,, | కంకణము కాకట్లు | ,, |
| చుట్టాల ప్రీతియే | ,, | పట్టి గొలుసులు | ,, |
| కులాభిమానంబు | ,, | వజ్రాల కమ్మలు | ,, |
| దేశాభిమానంబు | ,, | కాసుల దండలు | ,, |
| ఈ సొమ్ములు మీరు | ,, | ఇంపుగా దలచండి | ,, |
| ఈ సొమ్ములా వంటి | ,, | ఏ సొమ్ములు లేవు | ,, |
| సదువులు శాస్త్రములు | ,, | చక్కగా నేర్వండి | ,, |
| సదువులొచ్చే మీకు | ,, | సద్గునంబు కలుగు | ,, |
| పిల్లలాకూ మీరు | ,, | విద్యనే నేర్పండి | ,, |
| విద్యలొచ్చే మీరు | ,, | వృద్ధినే చెందేరు | ,, |
| ఇల్లువాకిలి మీరు | ,, | ఇంపుగా ఉంచండి | ,, |
| పరిశుభ్రమూ కొరకు | ,, | స్నానమూ చేయండి | ,, |
| స్వామియో తలవండి | ,, | పనిపాటలను మీరు | ,, |
| భద్రంగ పనిచేసి | ,, | పరమాత్మునీకొరకు | ,, |

| | | | |
|---|---|---|---|
| ఫలము లర్పించండి | ఉయ్యాలో | ఈ విధులన్నీ | ఉయ్యాలో |
| ఏమారగను మీరు | ,, | భక్తితోడా చేయ | ,, |
| భాగ్యంబు కల్గును | ,, | మోదంబుతో జేయ | ,, |
| పుత్రులూ గల్గేరు | ,, | భక్తితోడా జేయా | ,, |
| ముక్తియూ కల్గును | ,, | భక్తితోడా జేయ | ,, |
| అన్నియిట్లు తెల్పి | ,, | అటు మాయమాయిరి | ,, |
| మాయమయిన దిక్కు | ,, | మల్లెలు మొల్లాలు | ,, |
| మల్లెలు మల్లేలు | ,, | మంకెనా పూవులు | ,, |
| పువ్వులన్నీ దెంపి | ,, | పీటకద నింపి | ,, |
| బతుకమ్మను పేర్చి | ,, | బయలులో పెట్టిరి | ,, |
| సుద్దరా కాంతాలు | ,, | చుట్టుగా నిలుచుండి | ,, |
| ఆటలు ఆడీరి | ,, | పాటలూ పాడీరి | ,, |
| ఆ పాటను జూచి | ,, | ఆనంద మొందీరి | ,, |
| గౌరమ్మ వరమిచ్చే | ,, | కాంతా లందరికి | ,, |
| ఆ వరము గొనిపోయి | ,, | వల్లబుని చూపించి | ,, |
| మెప్పులా పొందిరీ | ,, | వప్పులా కొప్పులు | ,, |
| జయజయా గౌరమ్మ | ,, | జయము నీకు తల్లి | ,, |
| జయజయ శార్వాణి | ,, | జయతు పంకజపాణి | ,,[6] |

సాధారణంగా స్త్రీలు పట్టు పీతాంబరాలు, బంగారు నగలు, గాజులు ఎక్కువగా కోరుకుంటారు. కాని తృణాన్నే మేరువుగా భావించే జానపద స్త్రీలు విలువైన నగలు, చీరలపై మోజుపడరు. తమ స్థోమతకు మించిన అడంబరాల జోలికి పోరు. వారికి కావలసినవి కాపురాలను సరిదిద్దుకునే చక్కని గుణాలు. భర్త నుండి, బంధువుల నుండి ప్రేమ, మమకారం, ఆప్యాయత కాంక్షిస్తారు. "పతి భక్తియే పచ్చలాపతకమని, చుట్టాల ప్రీతియే పట్టగొలుసులని" భావించు మనతంలో జానపదుల హృదయ నైర్మల్యం గోచరిస్తుంది. అంతేగాకుండా—

| | | | |
|---|---|---|---|
| కులాభిమానంబు | ఉయ్యాలో | వజ్రాల కమ్మలు | ఉయ్యాలో |
| దేశాభిమానంబు | ,, | కాసుల దండలు | ,, |

గా భావించిన జానపదుల హృదయం ఎంత విశాలమైందో విశదమవుతుంది.

స్త్రీలు చదువులు శాస్త్రాలు నేర్చుకుంటే తమ పిల్లలకు బుద్ధులు చక్కగా నేర్పుతారని, ఆరోగ్యం, పరిశుభ్రత బోధిస్తారని వారి అభిప్రాయం. ఇన్ని ఉత్తమ లక్షణాలతో పాటు స్త్రీలకు భక్తి మార్గాన్ని కూడ నిర్దేశించారు. అందుకే బతుకమ్మ పండుగ రోజుల్లో మల్లె, మంకెన, తంగేడు మొదలైన పువ్వులతో బతుకమ్మను పేర్చి, గౌరమ్మను పూజిస్తే తమకు సకలసంపదలు కలుగుతాయని, ముక్తి ప్రాప్తిస్తుందని జానపదస్త్రీల విశ్వాసం.

కులకాంత ధర్మాలను, పతివ్రతా లక్షణాలను తెలిపే పై పాటలలో స్త్రీలకు సహజంగా ఉండవలసిన ఉత్తమ లక్షణాలతోపాటు పురుషాధిక్యతను సమర్థించే భావాలు కూడ కనిపిస్తున్నాయి. వివాహ వ్యవస్థలో ఏకపత్నీ వ్రతం నుండి పురుషుడు అనేకమంది స్త్రీలను భార్యలుగా చేసుకునే స్థితి ఏర్పడింది. అంతేగాక, వివాహ విషయంలో స్త్రీకి స్వేచ్ఛలేదు. ఆమె ఇష్టంతో సంబంధం లేకుండా పురుషునికి అంటగట్టే పరిస్థితి ఏర్పడింది. కట్నకానుకల విషయంలో కూడ స్త్రీకి పెళ్ళిచేసి అత్తవారింటికి పంపేటప్పుడు అమ్మాయి తండ్రి తన తృప్తి కోసం కొంత ధనం, వస్తువులు వరకట్నంగా ఇచ్చేవాడు. కాలక్రమేణా అది ఆచారంగా మారి సమాజాన్ని పట్టి పీడిస్తున్నది. అంతకు ముందు కాలంలో పురుషుడు కన్యాశుల్కం పేరుతో స్త్రీ తండ్రికి కొంత డబ్బు యిచ్చి వధువును తెచ్చుకునేవాడు. అటు కన్యాశుల్క ఆచారంలోను, ఇటు వరకట్నంలోను కష్టాలు అనుభవించేది స్త్రీయే.

ఇక పెళ్ళి జరిగే సమయంలో వరునితో నిమిత్తం లేకుండా వరునికి సంబంధించిన ఆయుధంతో వధువుకు వివాహం జరిపించే ఆచారం మనకు జానపద కథలలో కనిపిస్తుంది. "ధర్మాంగుని పాము" పాటలో ధర్మాంగునికి సంబంధించిన కత్తితో వధువుకు వివాహం జరిపిస్తారు.

కుటుంబ వ్యవస్థలో, సమష్టి కుటుంబంలో ఒకరితో ఒకరికి సంబంధ బాంధవ్యాలు ఎక్కువగా ఉంటాయి. ముఖ్యంగా తల్లి - తండ్రి, కొడుకులు-కోడండ్లు, మనుమలు-మనుమరాండ్లు మొదలైనవారితో ఉన్న కుటుంబమే సమష్టి కుటుంబం. ఈ సమష్టి కుటుంబంలో ఎన్నో ఆచారాలు, సంప్రదాయాలు, విశ్వాసాలు, కట్టుబాట్లు నిలిచి ఉంటాయి. ఈ ఆచారాలన్నీ జానపదుల పాటలలో

ప్రతిబింబిస్తాయి. మానవుడు పుట్టింది మొదలు మరణించే వరకూ ఎన్నో వేడుకలు, ఉత్సవాలు జరుపుకుంటాడు.

జీవితంలో వివాహ ఘట్టం చాలా ముఖ్యమైంది. పూర్వకాలంలో కూతురుకు తగిన వరుణ్ణి వెదుకడం కోసం 'స్వయంవరం' ఏర్పాటు చేసేవారు. జనక మహారాజు కూతురు సీతమ్మకు వివాహం చేయడానికి స్వయంవరం ఏర్పాటు చేశారు. "శివధనుస్సు" ఎక్కుపెట్టి విరిచినవారినే సీతమ్మ వరిస్తుంది. శివ ధనుస్సు ఎక్కుపెట్టిన శ్రీరామునితో సీతమ్మ వివాహం జరిగింది. దమయంతీ స్వయంవరం, ద్రౌపదీ స్వయంవరం కూడ ఇటువంటివే. ద్రౌపదీ స్వయంవరంలో మత్స్యయంత్రం పడగొట్టిన అర్జునునితో ద్రౌపదికి వివాహం జరుగుతుంది. కాలక్రమేణా వివాహానికి సంబంధించిన పద్ధతులు ఎన్నో మార్పులు చెందాయి. పూర్వం కూతురుకు తగిన వరుణ్ణి తల్లిదండ్రులు వెదకి తెచ్చి తమ ఇంటి వద్దనే వివాహం జరిపించేవారు. ఇప్పటికి కూడా కన్యాదాత గృహంలోనే వివాహం జరుగుతుంది. కాని, కొన్ని ప్రత్యేక పరిస్థితులలో వరుని ఇంటివద్ద కూడ వివాహం జరిపిస్తారు. జానపదుల మహాభారతంలోని "రాజరంపాలకథ"లో సహదేవుని కుమారుడు రాజరంపాలునికి పాండవులు వివాహం చేయ నిశ్చయించారు. లేకలేక తమకు ఒక్కడే కుమారుడని, మా పట్టణంలో మా ఇంట్లోనే వివాహం జరుపుకుంటామని పాండవులు పెళ్ళికూతురు తండ్రి భస్మరాయుణ్ణి వేడుకుంటారు. అందుకు అతడు ఒప్పుకొని, తన కూతురు రూపవతిని పాండవుల ఇంటికి తీసుకువస్తాడు.

| | | | |
|---|---|---|---|
| రాజ ఓరాజ | ఉయ్యాలో | ఓ భస్మరాజ | ఉయ్యాలో |
| లేకలేక మాకు | ,, | ఒక్క కొడుకూను | ,, |
| మన పట్నముల | ,, | మేమును లగ్గంబు | ,, |
| మా ఇంటీకాడ | ,, | లగ్గం జేసుకుందాము | ,, |
| మీ పిల్ల నయితే | ,, | మాకును ఇయ్యాలే | ,, |
| మా ఇంటికి మీరు | ,, | రావాలె తండ్రి | ,, |
| చక్కని పాండువాలు | ,, | అట్లు పలికినారు | ,, |
| తప్ప కిత్తునాని | ,, | భస్మరాయుడూ | ,, |
| బిడ్డాను అయితే | ,, | చేతిలో బెట్టిండు | ,, |

| | | | |
|---|---|---|---|
| కాళ్ళు మొక్కినాడు | ,, | సాగనంపినాడు | ,, |
| ఢిల్లీలో అయితే | ,, | ఏమి తయారు | ,, |
| అకాశ మెత్తు | ,, | పందిర్లు వేసి | ,, |
| భూ లోక మంత | ,, | పీటల్లు పరచి | ,, |
| పచ్చని తోరణాలు | ,, | వారు కట్టినారు | ,, |
| ఊరూరు కైతే | ,, | ఉత్తరాలు ఏసి | ,, |
| పల్లె పల్లెకు | ,, | పత్రికలు పంపి | ,, |
| లగ్గము తయారు | ,, | వాళ్ళు చేసినారు | ,, |
| చుట్టాలు అంత | ,, | చేర వచ్చినారు | ,, |
| వచ్చని పందిట్ల | ,, | లగ్గము పోలునయితే | ,, |
| లగ్గము పోల్లు | ,, | వాళ్ళు పోసినారు | ,, |
| వారికి లగ్గమ్మొ | ,, | అట్ల అయినాది | ,, |
| నాగెల్లి అయితే | ,, | మల్లరాయ పత్రి | ,, |

ఈవిధంగా వారికి వివాహం అయింది కాని తరువాత జరిగే నాగవెల్లికి అంతరాయం కలిగింది. ఈ రకంగా ఆచార వ్యవహారాలను, జానపదులు తమకు అనుకూలంగా మార్చుకోవడం పై పాటలో కనిపించింది.

ఆ తరువాత నూతన వధువును భర్తతో అత్తవారింటికి సాగనంపుతారు ఈ సందర్భంగా తల్లి తన బిడ్డను అత్తవారింటికి సాగనంపుతూ ఎన్నో బుద్దులు నేర్పుతుంది. హిమవంతుని కూతురు పార్వతీదేవికి పెళ్ళి చేసి అత్తవారింటికి సాగనంపుతూ ఆమెకు జానపద స్త్రీలు ఎన్నో బుద్దులు నేర్పుతారు.

ఎవ్వరే మన్ననూ - ఎదురాడ బోకు
ఇద్దరున్నా చోట - ముచ్చటా బెట్టకు
పలుమార్లు - పలుదెరిచి నవ్వబోకమ్మ
అష్టకంకణాల చెయ్యి - అదిలించి నడువాబోకూ
పక్కనున్న పరిటాకొంగు - జారవిడిచీ నడువాబోకు
మాతల్లి అత్తావాడా పోయిరావమ్మ - మాయమ్మ పార్వతీదేవి పోయిరావమ్మ

ఆని అత్తవారింట్లో ఎలా మసలుకోవాలో వివరించారు. ఇంకా అత్తమామలకు సేవలు చేయాలని, అందరితో మర్యాదగా మెలగాలనీ, సాధుసత్పురుషులు సమయానికి వచ్చినప్పుడు వారికి భోజనం పెట్టి అదరించాలని చెప్పారు. వీరి దృష్టిలో పార్వతీదేవి సైతం సామాన్య స్త్రీయే.

పెళ్ళికాగానే అత్తవారింటికి వెళ్ళిన స్త్రీలను పండుగలకు, పబ్బాలకు తల్లిదండ్రులు తమ ఇంటికి పిలిపించుకునే ఆచారం ఉంది. స్త్రీకి పెళ్ళయిన తరువాత పుట్టింటితో సంబంధం పరిమితమైపోయి, అత్తవారింట్లో ఆమె స్థానం పెరుగుతుంది. అందుకే పుట్టింటికి అత్తవారింటికి మధ్యన సంబంధబాంధవ్యాలు చక్కగా ఉండడం కోసం తల్లిదండ్రులు తమ ప్రేమను వ్యక్తం చేయడం కోసం, పుట్టింటికి వచ్చిన కూతుళ్ళకు కట్నకానుకలిచ్చి సాగనంపుతారు. ముఖ్యంగా బతుకమ్మ పండుగ రోజుల్లో కొత్తగా పెళ్ళయిన కూతురును తల్లిదండ్రులు తమ ఇంటికి పిలిపించుకోవడం అనే ఆచారం తప్పనిసరి. ఇది క్రింది పాటలో కనిపిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| పేదరాశి పెద్దమ్మ | ఉయ్యాలో | ఏడుగురు కొడుకులు | ఉయ్యాలో |
| ఏడుగురు కొడుకులు | ,, | పెద్దమ్మ పెదరాజుకు | ,, |
| ఒక్కతే అక్కమ్మ | ,, | ఏడుగురితోడ | ,, |
| శ్రీశైల పర్వతం | ,, | ఏలేటివారలు | ,, |
| మల్లికార్జుననకు | ,, | అక్కమ్మ నిచ్చిరి | ,, |
| అక్కమ్మ నిచ్చి | ,, | పెండ్లి చేసినారు | ,, |
| వారత్త మామలు | ,, | చక్కదనముగ ఉండి | ,, |
| అక్కమ్మ కెన్నియు | ,, | చీరాలే తల్లి | ,, |
| తొమ్మిదీ చీరలు | ,, | తొమ్మిదీ రైకలు | ,, |
| పెద్దలా కొచ్చింది | ,, | పెత్తరామాస | ,, |
| బాలలా కొచ్చింది | ,, | బతుకమ్మ పండుగ | ,, |
| అందరు వచ్చిరిగాని | ,, | నా బిడ్డ రాలేదు | ,, |
| పెద్దోడ రామన్న | ,, | చెల్లెను తోలుకరార | ,, |
| వ్యవసాయపు పనులు | ,, | వెళ్ళనీయవు తల్లి | ,, |
| అట్లయితే నా మనస్సు | ,, | తృప్తినీయదు కొడుక | ,, |
| అమ్మ నీ మనసుకు | ,, | తృప్తిగా లేదు | ,, |

| | | | |
|---|---|---|---|
| అటక మీదా చక్రం | , | క్రింద ఏసినాడు | ,, |
| దుమ్ము దులిపినాడు | ,, | ఆ బండి చక్రాలు | ,, |
| ఆ బండి నడిచేటి | ,, | ఎడ్ల పేరేమి | ,, |
| నడుములా సక్కానా | ,, | నాగభూతా ఎడ్లు | ,, |
| కహా అనీ ఆ బండి | ,, | కదల దోలీనారు | ,, |
| పోయెనే ఆ బండి | ,, | పర్వతాలు ఎల్ల | ,, |
| అందరూ వచ్చిరీ | ,, | చెల్లి రాలేదని | ,, |
| అమ్మ బెంగటిల్లె | ,, | నీ కోసమయిన | ,, |
| అత్తమామల్లు | ,, | పంపించరమ్మ | ,, |
| చీరలు పెట్టుకోని | ,, | రైకలు పెట్టుకోని | ,, |
| అన్ని సొమ్ములు పెట్టి | ,, | అద్దములో చూసుకోని | ,, |
| అత్తమామలకు | ,, | దండంబు పెట్టి | ,, |
| ఇంటికొచ్చినాది | ,, | బండి దిగినాది | ,,7 |

ఈ విధంగా పేదరాశి పెద్దమ్మ బతుకమ్మ పండుగనాడు ఎన్ని పను లున్నా తన బిడ్డను ఇంటికి పిలిపించుకొని తృప్తిపడింది. ఈ ఆచారం ఇప్పటికి కూడ జానపదులు ఆచరిస్తూనే ఉన్నారు. పుట్టింటిలో కూతురు సంతోషంగా పండుగ జరుపుకొని, కట్నకానుకలతో అత్తవారింటికి వెళ్ళిపోతుంది. తల్లి దండ్రులు తనను పుట్టింటికి పిలువకపోతే ఆ కూతురు అలుగుతుంది. తనమీద తల్లిదండ్రులకు ప్రేమ తగ్గిపోయిందేమోనని భావిస్తుంది.

స్త్రీకి మాతృత్వం అనేది ఒక మధురమైన అనుభూతి. స్త్రీ జీవితానికి సార్థకం కలుగజేసి, ఆమెలో ఆత్మవిశ్వాసం పెంపొందింపచేసేది మాతృత్వం. అందుకే స్త్రీలు సంతానం కొఱకు ఎన్నోపాట్లు పడుతారు. సంతానం కోసం నోములు, వ్రతాలు చేస్తారు.

స్త్రీలు సంతానం కోసం తులసి మొక్కకు పూజచేయడం ఆచారం. ఇంటి దగ్గర తులసి మొక్కను పెంచుకొని, దానిచుట్టు గద్దె కట్టించి, నీళ్ళుపోస్తూ రోజూ పూజిస్తారు. తులసి పూజను చేయడం వల్ల కలిగే ఫలితాలను స్త్రీలు క్రింది పాటలో పేర్కొన్నారు,

నల్లరాగెడినున్న ఉయ్యాలో ఓ పున్నె తులసి ఉయ్యాలో
పౌడి కొమ్మలతోటి ,, పౌళి రావమ్మ ,,
వన్నెలు ధనములు ,, ఎంత సక్కానమ్మ ,,
యశోద కృష్ణునికి ,, ఎంత ప్రేమమ్మ ,,
నల్ల ఆవుగోవు ,, పెండైన తెచ్చి ,,
అలుకుడూ అరచేత ,, పాపములు బాయ ,,
పోవునూ పాపములు ,, పొందు పున్నెంబులు ,,
నిచ్చెను తులసికి ,, నీళ్ళుపోసితే ,,
నిలువు పర్వతాలు ,, ఎక్కినంత ఫలము ,,
పారాయి తులసికి ,, పాలుపోసితే ,,
పంచెవన్నెల ముగ్గు ,, పెట్టినంత ఫలము ,,
తెల్లని ఓ ముగ్గు ,, ఓగోర పెట్టి ,,
పచ్చనీ పసుపులు ,, ఓగోర పెట్టి ,,
రూపిస్త్రిరాపిస్త్రి ,, లక్ష్మి కదలిస్త్రి ,,
సంతాన ఈశ్వరికి ,, సంతాన మిస్త్రి ,,
ఈ పదము పాడిన ,, బాలలకెల్ల ,,
బాలలకు శ్రీఘంబు ,, కళ్యాణమగును ,,
ఈ పదము పాడిన ,, సఖియాలకెల్ల ,,
సఖయాల కెల్లను ,, సమర్తలాడూను ,,
ఈ పదము పాడిన ,, గొడ్రాళ్ళకెల్ల ,,
గొడ్రాళ్ళ కెల్ల ,, గర్భంబులగును ,,8

తులసి పూజ చేసిన బాలికలు సమర్తలాడుతారని, కన్యలకు కళ్యాణమవుతుందని, గొడ్రాళ్లు గర్భవతులౌతారని చెప్పి జానపదులు తులసిపూజ ప్రాధాన్యతను తెలియజేశారు.

తులసి చెట్టు వైద్యశాస్త్రరీత్యా ఎంతో ప్రాధాన్యతను సంతరించుకున్నది. తులసి ఆకులరసం చర్మవ్యాధుల నివారణకోసం ఉపయోగిస్తారు.

ఇంకా విజయదశమినాడు శమీవృక్షాన్ని పూజించడం, బతకమ్మ పండుగ రోజు వెంపలి చెట్టుకొమ్మని బతుకమ్మల మధ్యన పెట్టి ఆరాధించడం, రాగి, వేప,

మేడి చెట్లను పూజించడం మొదలైన సంప్రదాయాల వల్ల జానపదులు వృక్ష పూజకు అధిక ప్రాధాన్యతను ఇస్తారని తెలుస్తుంది. "ఫర్" చెట్టును క్రిస్మస్ వృక్షంగా భావించి, క్రైస్తవులు క్రిస్మస్ పండుగనాడు ఆ చెట్టును పవిత్రంగా భావిస్తారు.

జానపదుల కథలలో యజ్ఞయాగాలు, తపస్సుల ప్రస్తావని కూడ కనిపిస్తుంది. చోళ దేశంలోని ధర్మాంగుడు, సత్యవతి దంపతులు సంతానం కోసం తపస్సు చేసి లక్ష్మీదేవిని ప్రసన్నం చేసుకుంటారు. వారి తపస్సుకు మెచ్చిన లక్ష్మీదేవి తానే ఆ దంపతులకు బిడ్డగా జన్మించి వారి కోరిక ఈడేర్చింది. ఆమెకే వారు బతుకమ్మ అని నామకరణం చేస్తారు.

అంతే గాకుండా ''బాలనాగమ్మ కథ"లో నవభోజరాజు, భూలక్ష్మీదేవి దంపతులు సంతానం కోసం పడిన పాట్లు క్రింది పాటలో కనిపిస్తాయి.

| | | | |
|---|---|---|---|
| భూచక్ర పట్నాన | ఉయ్యాలో | నవభోజరాజు | ఉయ్యాలో |
| నవభోజరాజుకు | ,, | సంతానం లేదు | ,, |
| భూలక్ష్మీదేవియు | ,, | నవభోజరాజు | ,, |
| కోటి వ్రతాలు | ,, | వారు చేసిరి | ,, |
| కోటి నోములు | ,, | వాళ్ళు నోమురి | ,, |
| ఇంత జేసినగాని | ,, | లాభమే లేదు | ,, |
| సంతానము లేక | ,, | బాధపడ వట్టిరి | ,, |
| ఒకనాటి దినమున | ,, | ఏమిచెయ్య వట్టిరి | ,, |
| భూలక్ష్మీదేవియు | ,, | అడవిదారి పట్టె | ,, |
| అడవిదారి పట్టి | ,, | పోత ఉన్నదమ్మ | ,, |
| ఆ యొక్క అడవిలో | ,, | ఏమున్నదమ్మ | ,, |
| పరమేశ్వరుని | ,, | గుడి ఉన్నదమ్మ | ,, |
| పూజల్లులేక | " | గుడి ఉన్నదమ్మ | " |
| భూలక్ష్మీదేవియు | " | ఏమి చేయబట్టె | " |
| గుడిశుద్ధి అయితే | " | అపుడు జేసెను | " |
| సున్నము జాజులు | " | అపుడు పెట్టినాది | " |

అన్ని పూజల్లు ఉయ్యాలో
అపుడు నైవేద్యము "
రెండునే దిక్కుల్ల "
ఒక్కదిక్కున "
అపుడు నైవేద్యము "
ఆరగింపులైతే "
అపుడు తపస్సుమీద "
ఘోరమైన తపస్సు "
అపుడు శంకరునికి "
ఆమెదీ ప్రార్థనా "
వెండికొండామీద "
కదలివచ్చేతట్టు "
వెండికొండా దిగి "
సాదురూపమైతే "
భూలక్ష్మి దగ్గరికి "
ఎందుగురించినీ "
నీదేమి కోరికా "
తీర్చడానికి "
అని చెప్పుచుండెను "
కండ్లతోని చూసి "
కాళ్ళకూ దండంబు "
సంతానమూ లేక "
అన్ని నోమూలు "
అన్ని వ్రతాలు "
నాకు సంతానము "
సంతానము నీకు "
అప్పుడు ఆ సాదు "
గుడివెనుక అయితే "
ఏడు మామిడిపండ్లు "
అని శంకరుడు "

అపుడు చేసినాది ఉయ్యాలో
చెయ్యబోతున్నది "
రాళ్ళనే బెట్టింది "
మోకాలు బెట్టింది "
వందనే సాగింది "
అపుడు జేసెను "
ఆమె కూర్చున్నదీ "
చేస్తనే ఉన్నది "
ఆమెదీ ప్రార్థనా "
అపుడు విన్నాడు "
శంకరూడున్నడూ "
చేస్తనే ఉన్నది "
వస్తనే ఉన్నడూ "
వేసుకున్నాడమ్మ "
రానె వచ్చినాడు "
తపస్సు చేస్తున్నవు "
చెప్పవమ్మా నీవు "
వచ్చినాను నేను "
ఆ యొక్క శంకరుడు "
కాళ్ళకు దండంబు "
అపుడు పెట్టినాది "
చాలా రోజులాయె "
నోచినాను స్వామి "
చేసినాను స్వామి "
కావాలె స్వామి "
ఇచ్చేదాను నీకు "
ఏమి చెప్పినాడు "
మామిడి చెట్టున్నదీ "
తెంపుకోని తిను "
అట్లు చెప్పినాడు "9

భూలక్ష్మి సంతానం కొరకు శివుని గురించి తపస్సు చేసింది. మామిడి చెట్టు దగ్గరకు వెళ్ళి ఏడు మామిడి పండ్లు కోసుకొని తింటే ఏడుగురు పాపలు జన్మించారు. జానపదులు సంతానం కోసం ఎన్నోనోములు, వ్రతాలు నోచు కోవడం ప్రాచీనకాలం నుండి ఉన్నటువంటి సంప్రదాయమే.

సంతానం కొరకు ఎన్నో మ్రొక్కులు మ్రొక్కుకున్న స్త్రీలు కొన్నాళ్ళకు గర్భందాల్చినపుడు గర్భిణీస్త్రీలు పాటించవలసిన ఆహార నియమాలు, పాటించ వలసిన జాగ్రత్తలు క్రింది పాటలో వివరించారు.

ఒకటో మాసం నెలతన గర్భిణి - ఓనగాయ లడిగే చెలియా
,,
రెండవమాసం నెలతన గర్భిణి - రేగుపండ్లు అడిగే చెలియా
,,
మూడవమాసం నెలతన గర్భిణి - ములగపండ్లు అడిగే చెలియా
,,
నాలుగవమాసం నెలతన గర్భిణి - నానబియ్యమడిగే చెలియా
,,
ఐదవమాసం నెలతన గర్భిణి - అత్తను సద్దడిగే చెలియా
,,
ఆరవమాసం నెలతన గర్భిణి - అరటిపండ్లు అడిగే చెలియా
,,
ఏడవమాసం నెలతన గర్భిణి - ఎలగపండ్లు అడిగే చెలియా
,,
ఎనిమిదవ మాసం నెలతన గర్భిణి - ఎన్నముద్దలడిగే చెలియా
,,
తొమ్మిదవ మాసం నెలతన గర్భిణి - తోటకూరలడిగే చెలియా
,,
పాదవ మాసం నెలతన గర్భిణి - పాపడు జన్మించే చెలియా
,,[10]

స్త్రీకి సంతానం కలిగిన తరువాత తల్లి తన బిడ్డను ఎంతో గారాబంగా చూసుకుంటుంది. ఈ సందర్భంలో ఎన్నో ఉత్సవాలు, వేడుకలు జరుపుకుంటారు.

శిశువు పుట్టినప్పటి నుండి పెరిగేంత వరకు ఉండే దశ బాల్యదశ. నామ
కరణం, అక్షరాభ్యాసం, ఈ దశలో ముఖ్యమైన ఘట్టాలు. ముఖ్యంగా ఈ దశలో
పిల్లల అలవాట్లు, ఆచారాలు చాలా విచిత్రంగా ఉంటాయి. వీరు ఏ కల్మషం
లేకుండా స్వేచ్ఛగా సంతోషంగా ఉంటారు. బాల్యంలో పిల్లలు పెద్దవాళ్ళను
అనుకరిస్తూ ఉంటారు.

జనకమహారాజు కూతురు సీతమ్మ, పుట్టగానే—

| | | | |
|---|---|---|---|
| పుట్టెను ఆ సీత | ఉయ్యాలో | పుణ్యజనకూనింట్ల | ఉయ్యాలో |
| పుట్టుతా ఆ సీత | ,, | ఏమానికోరు | ,, |
| పుట్టుతా ఆ సీత | ,, | పురుడానికోరు | ,, |
| పురుగుతా ఆ సీత | ,, | పెండ్లానికోరు | ,, |
| చిన్న చిన్న బొమ్మరిండ్లు | ,, | వెయ్య నేర్చినాది | ,, |
| చిన్న వాళ్లాతోటి | ,, | ఆడ నేర్చినాదీ | ,, |
| పెద్ద పెద్ద బొమ్మరిండ్లు | ,, | వెయ్య నేర్చినాది | ,, |
| పెద్దవాళ్లాతోటి | ,, | బుద్ధి నేర్చినాది | ,, |
| లక్కాయి కోలల్ల | ,, | దంచ నేర్చినాది | ,, |
| పైడీయ జల్లెండ్లు | ,, | పట్ట నేర్చినాది | ,, |

జనకమహారాజు కూతురు సీత పుట్టగానే "పురుడాని" కోరిందట.

శిశువు పుట్టగానే, పదకొండవ రోజు జరుపుకునే వేడుకను పురుడు
అంటారు. "పురుడునాడు తల్లీ పిల్లలకు అభ్యంగన స్నానము చేయించి ఓమము,
వాము, ఎల్లిగడ్డ పొట్టు కలిపిన సాంబ్రాణి పొగతోను ధూపము పట్టి దోషములు
తగులకుండ దిగదుడుపులు తుడిచి మసిబొట్టు పెట్టెవరు. పూర్వకాలమున
పురిటి స్నానము చేయించుటకు ఇరుగింటి, పొరుగింటి ముత్తైదువలు వేడినీళ్ళ
కడవలు తీసుకొని వచ్చి తల్లి, బిడ్డకు స్నానము చేయించి తామును పురిటింటనే
స్నానములు చేసి వెళ్ళెడివారట."11

ఈ ఆచారాలు ఇప్పటికీ జానపదుల కుటుంబాలలో కనిపిస్తాయి. ఇంకా
సీతమ్మ బాల్యంలో బొమ్మరిండ్లు వేసుకోవడం, లక్క కోలలతో ఆడుకోవడం,

చిన్నచిన్న జల్లెండ్లతో, చాటలతో ధాన్యం చెరుగడం మొదలైన చేష్టలు జానపద బాలికల అలవాట్లను తెలియచేస్తున్నాయి.

పుట్టిన శిశువుకు పేరు పెట్టడానికి జరిపించే ఉత్సవాన్ని "నామకరణ మహోత్సవం'' అంటారు. ఆ రోజు శిశువుకు పేరుపెట్టి, ఊయలగట్టి, ఆ ఊయలలో శిశువును పడుకోబెట్టి, పాటలు పాడుతూ ఊపుతుంటారు.

వాల్మీకి ఆశ్రమంలో లవకుశులను గన్న సీతమ్మకు ఊపడానికి ఊయల కరువైందని, తాను కొనే స్థితిలోకూడ లేనని బాధపడుతూ—

ఊరికి ఉయ్యాల లమ్మవొచ్చిన వో తుమ్మన దారిలో
ఏం బెట్టి నేనుగొందూ ఎండీ ఉయ్యాలో ,,
పాలుబోసి నేనుగొందు పౌడీ తొట్టేల ,,
పట్టుబట్టల్లు దీర్చి పొత్రిల్లు పరిచి ,,
పుత్రున్ని బాలున్ని పవళింపా చేతో ,,
ఏడువాకూ బిడ్డ రామకుమారా ,,

అని తన కుమారులకు ఊయల కొనలేని దీన స్థితికి ఎంతో బాధ పడుతుంది సీతమ్మ.

ఇంకా బాల్యంలోని తన బిడ్డ రాముడుగానో, కృష్ణుడుగానో భావించి జానపదులు ఎన్నో పాటలు పాడుతారు. ఈ పాటలలో బాల్యంలో పిల్లల అలవాట్లు, అభిరుచులు, ఆచారాలు కనిపిస్తాయి.

సమాజంలో చాలాకాలం నుండి ఆచరిస్తున్న కొన్ని సంప్రదాయాలు వెర్రితలలు వేసి దురాచారాలుగా మారినాయి. వరకట్నం, సతీసహగమనం, అంటరానితనం మొదలైనవి ఇటువంటివే.

క్రిందిపాటలో పెళ్ళికాని ఒక కన్య నీళ్ళకు వెళ్ళుతుంది. అక్కడ ప్రత్యక్ష దైవమైన సూర్యుడు ఆమె అందాన్ని చూసి మోహించాడు. స్త్రీలు మగ వారి మాటలు నమ్మి మోసపోవడం పూర్వం నుండి ఉన్నదే. అందరు మగవాళ్ళు అలాంటివారు కాకపోయినా ఇలాంటి వారు కూడా ఉన్నారు.

| | | | |
|---|---|---|---|
| సీలానీలారిబాలనీలారిబాలా | చందమామయ్యో | నీలారిబాల | చందమామయ్యో |
| ఎన్నదెల్లనిబాల నీళ్ళాకెల్లినదో | ,, | నీళ్ళాకెళ్ళినదో | ,, |
| నీళ్ళాకెళ్ళినచోటా ఎవరొచ్చినారో | ,, | ఎవరొచ్చినారో | ,, |
| సక్కన్ని సూర్యుడు సూడవచ్చినదో | ,, | సూడవచ్చినదో | ,, |
| సూశినంతసేపుసూశి జడపట్టిగుంజో | ,, | జడపట్టిగుంజో | ,, |
| ఇడువిడువూ సూర్యుడ మా జేడలిడువూ | ,, | మా జేడలిడువూ | ,, |
| మానాయినా కొడుతాడు మాజేడలిడువూ | ,, | మా జేడలిడువూ | ,, |
| మీ నాయినా కొట్టేటి కొట్లా పేరేమే | ,, | కొట్లా పేరేమే | ,, |
| మా నాయినా కొట్టేటి కోలుదెబ్బలురా | ,, | కోలుదెబ్బలురా | ,, |
| మాయమ్మ తిడుతాది మాజేడలిడువూ | ,, | మా జేడలిడువూ | ,, |
| మీయమ్మ తిట్టేటి తిట్లా పేరేమే | ,, | తిట్లా పేరేమే | ,, |
| మా యమ్మ తిట్టేటి నోటిమాటలురో | ,, | నోటిమాటలురో | ,, |
| సూర్యుడా నీవంటి సుతుడే కలిగితెనో | ,, | సుతుడే కలిగితెనో | ,, |
| మూడుకొబ్బరికాయాలు ముందూగ గొడుదూ | ,, | ముందూగ గొడుదూ | ,, |
| నాలుగుకొబ్బరికాయలు నగరిచ్చి కొడుదూ | ,, | నగరిచ్చి కొడుదూ | ,, |
| ఏడుకొబ్బరికాయలు ఎదిరిచ్చి కొడుదూ | ,, | ఎదిరిచ్చికొడుదూ | ,, |
| పదికొబ్బరికాయలు ఫలహారం బెడుదూ | ,, | ఫలహారం బెడుదూ | ,, |
| కడుపల్లు దాటంగ కడుపేరిపాయె | ,, | కడుపేరిపాయె | ,, |
| గుట్టల్ల పోంగానే గుబులే పుట్టినదో | ,, | గుబులే పుట్టినదో | ,, |
| చెట్లల్ల పోంగానే చెమటాలొచ్చినవో | ,, | చెమటాలొచ్చినవో | ,, |
| ఉసికల్లో పోంగానే కుసులయ్యా పుట్టే | ,, | కుసులయ్యా పుట్టే | ,, |
| ఏటికికాలువల్లు పారుతున్నాయో | ,, | పారుతున్నాయో | ,, |
| పారేటికాలువల్ల బాలున్ని ఏసి | ,, | బాలున్ని ఏసి | ,, |
| అమ్మా నీబాలుడు అరితేరినాడూ | ,, | అరితేరినాడు | ,, |
| నాయినా నీబాలుడు అరితేరినాడు | ,, | అరితేరినాడు | ,, |
| వాలల్లబాలుడుచిక్కివచ్చినదో | ,, | చిక్కివచ్చినదో | ,, |
| మాయయ్య సూర్యుడు మాయమ్మ జననీ | ,, | మాయమ్మ జననీ | ,, |
| పదుకల్లు జెల్లాలు అమ్మురానీన్నోడా | ,, | అమ్మురానీన్నోడా | ,,[12] |

పై పాటలో ఒక కన్య నీటికొరకు చెఱువు దగ్గరికి వెళ్ళింది. ఆమె అందాన్ని చూసి మైమరచిన సూర్యుడు ఆమెతో సరసాలాడినాడు. ఆమె ముందు భయపడినా చివరికి అతనికి వశమైంది. వారికలయిక వల్ల ఆమెకు పుత్రుడు జన్మిస్తాడు. వివాహం కాకుండా తాను తల్లిని అయినానని, లోకులు తనను అవమానిస్తారేమోనని, భయపడిన ఆ పడుచు "పారేటి కాలువల్ల బాలున్ని" వేసింది. పెళ్ళికాకుండా, సంతానం పొందడం సాంఘిక కట్టుబాట్లకు, నీతినియ మాలకు వ్యతిరేకం అన్న భావం పై పాటలో కనిపిస్తుంది,

అంతేగాకుండా, ఈ పాట కర్ణుని పుట్టుకను కూడ తలపింప చేస్తుంది.

ఈవిధంగా బతుకమ్మ పండుగ సందర్భంగా స్త్రీలు పాడుకునే పాటలలో స్త్రీపురుష సంబంధాలు, సాంఘిక ఆచారాలు, నియమాలు, కట్టుబాట్లు మొదలైన అంశాలెన్నో వ్యక్తం చేయబడినాయి.

## 3. జానపదుల నమ్మకాలు :

జానపదుల సంప్రదాయాలు - ఆచారాలన్నీ వారి నమ్మకాలపై ఆధారపడి ఉన్నాయి. సామాన్య మానవుడు తన మనుగడ కోసం నిరంతరం పోరాడు తున్నప్పుడు, తనను మించిన మానవాతీత శక్తి ఏదో ఉందని అనుకుంటాడు. అందుకే అతని జీవితంలో క్లిష్టపరిస్థితి ఏర్పడినప్పుడు అంతా దైవాధీనం అని విశ్వసిస్తాడు తన పనికి అటంకం కలిగినప్పుడో, అది విఫలమైనప్పుడో అది తన దురదృష్టమని, జయం కలిగితే అదృష్టం అని నమ్ముతాడు. తొలిసారి ఏర్పడిన నమ్మకం సత్ఫలితమైనా, దుష్ఫలితమైనా దానినే మనసులో ఉంచు కుంటాడు. ఈ విధంగా నమ్మకాలు అనాదిగా ఒక తరం నుండి ఇంకో తరానికి సంక్రమిస్తున్నాయి. ఈ నమ్మకాలలో కొన్ని మూఢ నమ్మకాలైతే మరికొన్ని వారి అనుభవాల నుండి ఏర్పరచుకొన్నవి.

"ఎల్లమ్మ కథ" అనే పాటలో ఎల్లమ్మ భర్త జమదగ్ని ప్రాణాపాయ స్థితిలో ఉన్నప్పుడు ఎల్లమ్మకు ఎదురైన అపశకునాలు క్రింది పాటలో కనిపిపిస్తాయి.

మల్లె వృక్షంబులు ఉయ్యాలో
నొష్టిదీ కుంకుమా ,,
చేతికి గాజులు ,,
కాళ్ళకున్నా మట్టె ,,
వాడిపోయినావి ఉయ్యాలో
చెదిరి పోయినాది ,,
చెదిరి పోయినాయి ,,
నొక్కు పోయినాది ,,

పై అపశకునాలన్నీ ప్రమాదానికి సూచనలని జానపదుల నమ్మకం.

అదే విధంగా ప్రయాణానికి ముందు 'ఒంటి తుమ్ము మంచిది కాదు' అని, 'పిల్లి ఎదురుగా వస్తే అశుభం' అని, 'పాలపిట్ట ఎదురైతే శుభం' అని జానపదుల విశ్వాసం.

జానపదులు దానధర్మాల విషయంలో ఎక్కువ పట్టుదల చూపిస్తారు. జానపదుల రామాయణంలో ఒంటరిగా ఉన్న సీతమ్మ దగ్గరికి రావణుడు మాయ జంగముని వేషంతో వచ్చి భిక్ష పెట్టుమంటాడు. అప్పుడు సీతమ్మ చారెడు ముత్యాలు చేటలో పోసుకొని పర్ణశాలనుండి బయటికి వస్తుంది.

పిలిచి భిక్షం పెడితే ఉయ్యాలో
కోరి భిక్షం పడితే ,,
పటువయ్య జంగమా ,,
చారెడు ముత్యాలు ,,
వచ్చెను సీతమ్మ ,,
గిరి ఇవుతలకాలు ,,
భిక్ష పెడితే నీవు ,,
గిరి ఇవుతలికి ,,
బిడ్డపుడుతదయ్య ఉయ్యాలో
కొడుకు పుడుతదయ్య ,,
చారెడు ముత్యాలు ,,
చేటలో పోసుకొని ,,
పర్ణశాల నుండి ,,
గిరి లోపల కాలు ,,
భిక్ష చెందదమ్మ ,,
వచ్చి పెట్టుమనె ,,

'పుణ్యం కొద్ది పురుషుడు దానం కొద్ది బిడ్డలు' అన్న మాటపై విశ్వాసం వున్న జానపదులు దానం చేయడంలో ఎంతో ఆసక్తిని కనబరుస్తారు. జంగమునికి భిక్ష పెడితే పుణ్యమని, సంతానం లేనివారికి సంతానం కలుగుతుందని జానపదుల విశ్వాసం. అంతేగాకుండా, సీతమ్మ గిరిలోపలుండి భిక్ష పెడితే పనికిరాదని బయటికి వచ్చి భిక్ష పెట్టుమని చెప్పుతాడు, ఆ జంగమ వేషధారి రావణుడు. అందుకే ఇప్పటికి కూడ జానపదులు భిక్ష పెట్టేటప్పుడు, గడపదాటి బయటికి వచ్చి భిక్ష పెడుతారు.

## 4. దుస్తులు :

జానపదులు ధరించే దుస్తులు రకరకాలుగా ఉంటాయి. ముఖ్యంగా స్త్రీలు పీతాంబరాలు, జలతారు చీర, నీలంచు చీర, చంద్రగిరి చీర, పట్టుచీర, చింత పూల చీర, దంతపు చీర, కనకాంబరం చీర, అద్దాల రవిక, చుక్కల రవిక, పట్టు రవిక మొదలైనవి ధరించినట్లు, తలపాగ, ధోవతి, నిండంగి, పట్టంగి, పాపలకు కుల్లాలు, పంచలు, శెల్లాలు మొదలైనవి పురుషులు ధరించినట్లు బతుకమ్మ పాటలలో వర్ణింపబడింది.

జానపద స్త్రీలు ఎక్కువగా నేత చీరలు ధరిస్తారు.

| | | | |
|---|---|---|---|
| చింతక్రింది శాలీలు | ఉయ్యాలో | చిన్న శాలీలు | ఉయ్యాలో |
| చిగురంతాదూసి | ,, | చీరేనేసిండు | ,, |
| కట్టుకొంగుకు రెండు | ఉయ్యాలో | కడువలు దించిండు | ఉయ్యాలో |
| ముసుగుకొంగుకు రెండు | ,, | మూగలు దించిండు | ,, |
| అంచుపైన రెండు | ,, | హంసలు దించిండు | ,, |
| కొంగుపైన రెండు | ,, | కొంగలు దించిండు | ,, |
| నడుమ నాగుంబాము | ,, | పడిగెలు దించిండు | ,, |
| కోమటి వాడల్ల | ,, | చీరమ్మ వాయె | ,, |

పై విధంగా చీరలపై కడవలు, మువ్వలు (మూగలు), హంసలు, కొంగలు, నాగుపాము పడిగెలు రంగులతో అద్దించుకోవడం జానపదులకెంతో ఇష్టం.

## 5. ఆభరణాలు :

సామాన్యంగా స్త్రీలకు నగలు, ఆభరణాలంటే ఎంతో మక్కువ, వీటి ప్రస్తావన బతుకమ్మ పాటలలో కనిపిస్తుంది. 'పురాణ దంపతులు' అనే పాటలో స్త్రీలు—

''పచ్చలా పతకం
బంగారు గాజులు
నడుముకు వడ్డాణం
అందెలు గజ్జెలు
పట్టగొలుసులు
వజ్రాల కమ్మలు
కాసుల దండలు''

మొదలైనవి ధరించారు. ఇంకా వెండి మట్టెలు, నాగసరాలు, బిళ్ళల వడ్డాణం, ముక్కుకు ముక్కెర, పూసలపేర్లు, పులిగోరు పతకాలు, ముత్యాలు-వజ్రాలతో చేసిన ఆభరణాలు కూడ జానపదులు ధరించినట్లు ఈ పాటల వల్ల తెలుస్తుంది.

## 6. ఆహారం :

జానపదుల ఆహారపు అలవాట్లు వారి పాటల ద్వారా తెలుస్తాయి.

'రాజరంపాల కథ' లో రూపవతి తన భర్త రంపాలుని కోసం వండిన వంటలు క్రింది పాటలో కనిపిస్తాయి.

| | | | |
|---|---|---|---|
| ముప్పయి ఏడు కూరలు | ఉయ్యాలో | ములగపూలాచారు | ఉయ్యాలో |
| డెబ్బయిఏడు కూరలు | ,, | దేవనాలా పెరుగు | ,, |
| అరవై ఏడు కూరలు | ,, | అల్లపూ పచ్చడి | ,, |
| వంటను తయారు | ,, | తల్లి చేసీనాది | ,, |

ఆదేవిధంగా 'ఎల్లమ్మ కథ'లో ఎల్లమ్మ తన భర్త జమదగ్నితో-

| | | | |
|---|---|---|---|
| రమ్మ ప్రాణనాథా | ఉయ్యాలో | భోజనంబు చేద్దాము | ఉయ్యాలో |
| అప్పాలు వడియాలు | ,, | ఆకు కూరాలయ్య | ,, |
| నవకోటి రుచులు | ,, | భోజనంబు చేసినా | ,, |

అని అంటుంది.

ముఖ్యంగా బతుకమ్మ పండుగ రోజుల్లో కూడ చక్కెర, బెల్లం, బియ్యపు పిండీ, పెసరపిండి, మొక్కజొన్న, బొబ్బెర్లు, సజ్జలు, గోధుమలు, నువ్వులు మొదలైన పదార్థాలతో ప్రసాదాలు తయారుచేసుకుంటారు. చివరి రోజైన సద్దుల బతుకమ్మనాడు పులిహోర, పెరుగన్నం మొదలైన వంటలు తయారుచేసుకుంటారు.

అంతేగాక గట్క, చేప పులుసు, మలీద ముద్దలు, వెన్న ముద్దలు జానపదులకెంతో ఇష్టమైన ఆహార పదార్థాలు.

## 7. పనిముట్లు :

జానపదుల వృత్తుల కనుకూలంగా వారు ఉపయోగించే పనిముట్లు రక రకాలుగా ఉంటాయి.

వ్యవసాయానికి సంబంధించిన నాగలి, కొడవలి, పార, గడ్డపార, గొడ్డలి, తట్ట మొదలైనవి పాటలలో పేర్కొనబడినాయి.

'రాజరంపాల కథ'లో పాండవులు రూపవతికి ఒంటిస్తంభం మేడ కట్టించడంకోసం ఉప్పరివాళ్ళతో—

| | | | |
|---|---|---|---|
| నా కొడుక రారా | ఉయ్యాలో | ఉప్పారివాడ | ఉయ్యాలో |
| ఒంటి స్తంభము | ,, | మాలు కట్టవాలె | ,, |
| ఉప్పరోళ్ళు అయితే | ,, | ఏమి చెప్పినారు | ,, |
| గడ్డపార లయితే | ,, | మాకు ఇయ్యి రాజ | ,, |
| ఐదు పారలయితే | ,, | మట్టి ఎత్తినారు | ,, |
| మాలుకు తయారు | ,, | వారు చేసిరి | ,, |

పార, గడ్డపారలను ఉపయోగించి ఉప్పరివాళ్ళు, మహలు నిర్మించారు.

## 8. ఆటలు :

జానపదులు వినోదం కోసం ఎన్నో ఆటలు ఆడుకుంటారు. స్త్రీలు పచ్చీసు, ఓమనగుంటలు, పుంజీతం, దేగాట, కోలలు, గవ్వలు, పాచికలు మొదలైనవి ఆడుతుంటారు.

| | | | |
|---|---|---|---|
| అద్దన్న పడవిలో | ఉయ్యాలో | అది పర్ణశాల | ఉయ్యాలో |
| ఆ పర్ణశాలలో | ,, | రాముడు సీతమ్మ | ,, |
| రాముడు సీతమ్మ | ,, | జూతమాడంగా | ,, |

అని సీతారాములు పర్ణశాలలో జూతమాడినట్లు జానపదులు వర్ణించారు. ఇంకా కృష్ణుడు, సత్యభామపుంజీతం, దేగాటలాడినట్లు ఈ పాటలలో కన్పిస్తుంది.

ఎల్లమ్మ కథలో ఆమె కుమారులు బొంగరాలాట, గోళీలు, కబడ్డి ఆటలాడినట్లు వర్ణింపబడింది.

| బడిలోపల బాలలు | ఉయ్యాలో | బడి ఇడిసినంకను | ఉయ్యాలో |
|---|---|---|---|
| బడి ఇడిసినంకను | ,, | ఆటలాడుతుండ్రు | ,, |
| నన్నుగన్న తల్లి | ,, | తల్లిరో రేణుకా | ,, |
| నాకొక్క గోళినే | ,, | కోనియ్యరమ్మ | ,, |
| నా చిన్న కొడుకరో | ,, | నా చిట్కెలయ్యరో | ,, |
| గోళీల ఆటలో | ,, | పోటీ పెడతావార | ,, |
| సక్కన్ని రాముడు | ,, | ఏమి అంటాడమ్మ | ,, |
| అమ్మరో నాకొక్క | ,, | బొంగరం కావాలె | ,, |
| అట్లనే చేపిస్తూ | ,, | పాటిగా బొంగరం | ,, |

పరశురాముడు కొంత సేపు తన స్నేహితులతో బొంగరాలాట ఆడుకొని, కాసేపు కబడ్డి కూడ ఆడినట్లు ఈ పాటలో చిత్రించబడింది.

| చక్కనీ రాముడు | ఉయ్యాలో | ఏమి అంటాడమ్మ | ఉయ్యాలో |
|---|---|---|---|
| కబడ్డి మనమిపుడు | ,, | ఆడాలెరా తమ్మి | ,, |
| కబడ్డి ఆడినా | ,, | కలహాలు వచ్చినా | ,, |
| మేము వస్తిమి అన్న | ,, | మీరు రాండ్రె అన్న | ,, |
| నువ్వువచ్చి ఇపుడు | ,, | జోపిపోరాదన్న | ,, |
| చక్కనీ రాముడు | ,, | జోపుతనే ఉన్నడు | ,, |
| ఉండలేము అన్న | ,, | ఊరెళ్ళిపోతాము | ,, |
| నాయొక్క కాలును | ,, | విరిగిపోయినాది | ,, |

కబడ్డీ ఆటలో పరశురాముని ధాటికి తాళలేని స్నేహితులు పారిపోతారు.

ఈ రకంగా గంగాగౌరి సంవాదంలో కూడ-

| గంగమ్మ గౌరమ్మ | వలలో | గవ్వాలాడంగా | వలలో |
|---|---|---|---|
| గవ్వ బిట్లిపాయె | ,, | కయ్యంబే పెరిగే | ,, |

అని, ఇద్దరికి గవ్వలాట ఆడుతుంటే, కయ్యం ఏర్పడింది. సామాన్యంగా ఆటలు ఆడుతున్నప్పుడు పోట్లాడుకోవడం సహజం.

ఇంకా జానపదులు ఆడే ఆటలు కోతి కొమ్మచ్చి, దాగుడుమూతలు, అష్ట చెమ్మ, చెమ్మచెక్క మొదలైనవి పేర్కొదగినవి.

## 9. వినయం :

జానపద స్త్రీలు పెద్దలపట్ల, అత్తమామల పట్ల, భర్తల పట్ల వినయ విధేయతలు కలిగి ఉన్నట్లు వారి పాటల ద్వారా తెలుస్తుంది.

'రాజరంపాల కథ'లో రూపవతి, తనను ఒంటిస్తంభం మేడలో ఉండు మని ఆజ్ఞాపించినా- తన మామలైన పాండవులకు, అత్తగారికి ఎదురు చెప్పకుండా వినయంతో నమస్కరించి వెళ్ళింది.

| | | | |
|---|---|---|---|
| ఆడితప్పనోరు | ఉయ్యాలో | పంచపాండవులు | ఉయ్యాలో |
| పలికి బొంకనోరు | ,, | మామలు తండ్రి | ,, |
| వారికి నేనెట్లు | ,, | ఎదురు చెప్పేద | ,, |
| ఎదురు మాటలైతే | ,, | నేను చెప్పలేను | ,, |
| పోతనాని చెప్పి | ,, | ఆ రూపావాతీ | ,, |
| మామాలకాళ్ళు | ,, | తాను మొక్కినాది | ,, |
| అత్తరో ఓ అత్త | ,, | పొన్నమాదేవి | ,, |
| పాదాలు అయితే | ,, | తాను మొక్కినాది | ,, |
| వలపోసుకుంటు | ,, | బయలెల్లినాది | ,, |

## గడుసుదనం :

జానపదుల పాటలలో స్త్రీలకు వినయంతోపాటు, గడుసుదనం కూడ ఉన్నట్లు కనిపిస్తుంది. సీతారాములు పర్ణశాలలో ఉన్నపుడు మాయలేడి కనిపి స్తుంది. దానిని చూసిన సీతమ్మ రామునితో-

| | | | |
|---|---|---|---|
| అటుచూడు రాములు | ఉయ్యాలో | అటుచూడవయ్య | ఉయ్యాలో |
| అటు ఏమి చూతునే | ,, | అది అడవి మృగము | ,, |
| అడవి మృగమైతే | ,, | అడుగులే చక్కనా | ,, |
| దాంచంపి దాంతోలు | ,, | తేకుంచేనయ్య | ,, |
| అందనుక నువ్వు నేను | ,, | అన్న చెల్లెలమయ్య | ,, |

అంటుంది. మాయలేడిని తెచ్చి ఇచ్చేంతవరకు మనము భార్యాభర్తలుగా ఉండడానికి వీలులేదని, 'అన్నాచెల్లెలుగానే ఉండాలని' గడుసుగా చెపుతుంది. మహాసాధ్వి అయిన సీతమ్మను గడసరిగా చిత్రించిన జానపదుల నేర్పు గమ నించదగ్గది.

## 11. ప్రతీకారం :

జానపదులు తమకు ద్రోహం తలపెట్టిన వారిపై ప్రతీకారం తీర్చుకున్నట్లు వారి పాటలలో కనిపిస్తుంది.

'పాపిరెడ్డి కథ'లోని మల్లన్న భార్యను పాపిరెడ్డి బలాత్కరించి హత్య చేశాడు. అందుకు ప్రతీకారంగా మల్లన్న ధైర్యంతో ఊరి ప్రజలందరి సహాయంతో పాపిరెడ్డిని అతని భార్యను కచేరి దగ్గరికి పిలిపించాడు. అప్పుడు మల్లన—

| | | | |
|---|---|---|---|
| నాయి పెండ్లాన్ని | ఉయ్యాలో | ప్రాణం తిన్నావు | ఉయ్యాలో |
| నూరుమందిలో | ,, | వెయ్యిమందిలో | ,, |
| నాకు సంసారం | , | నువ్వు చెయ్యాలె | ,, |
| వెయ్యి మందిలో | ,, | అపుడు మల్లన్న | ,, |
| దొరసానిని | ,, | రెక్కపట్టుకోని | ,, |
| మాదిగవాడల్ల | ,, | తీసుకపాయె | ,, |

ఈవిధంగా పటేలు భార్యను తనకు సంసారం చేయుమని, తన ఇంటికి తీసుకొని వెళ్లాడు మల్లన్న. ఈ రకంగా మల్లన్న పాపిరెడ్డిపై ప్రతీకారం తీర్చుకున్నాడు.

ఇంకా బతుకమ్మ పాటలలో తన ఆడుబిడ్డ ఈర్ష్యాసూయలకు బలై మరణించిన బతుకమ్మ పేరంటాలుగా మారుతుంది. తనకు ద్రోహం చేసిన తమ్ముని కుటుంబం నాశనం కావాలని శపించి, ఆడుబిడ్డపై ప్రతీకారం తీర్చుకుంటుంది. 'ఎల్లమ్మ కథ'లో పరశురాముడు తన తండ్రిని చంపిన కార్తీక రాజులతో యుద్ధం చేసి, వారిని చంపి ప్రతీకారం తీర్చుకుంటాడు.

## 12. ఒట్టుపెట్టుకోవడం :

జానపదులు తమ జీవితంలో ఎంతో అవసరమైనప్పుడు తప్ప ఒట్టుపెట్టుకోరు. ఒట్టుపెట్టుకొని మాట తప్పినట్లయితే వారికి కీడు సంభవిస్తుందని వారి నమ్మకం. 'ఎల్లమ్మ కథ'లో ఎల్లమ్మ, తన కొడుకు పరశురాముడు పెట్టే బాధలు భరించలేక మాదిగ పోషయ్య ఇంటిలో లందగోళం దగ్గర దాక్కుంటుంది. అపుడు పరశురాముడు తల్లి జాడలకు వచ్చి పోషయ్యను అడిగినప్పుడు అతడు తన బిడ్డపై ఒట్టుపెట్టుకొని ఎల్లమ్మ అక్కడికి రాలేదని అబద్ధం చెప్పుతాడు.

| | | | |
|---|---|---|---|
| అప్పుడు పోషయ్య | ఉయ్యాలో | ఏమంట ఉన్నడూ | ఉయ్యాలో |
| మీ తల్లి ఎల్లమ్మ | ,, | ఇక్కడికి రాలేదు | ,, |
| ఒక్కబిడ్డాతోడు | ,, | ఒట్టుతిన్నాదమ్మా | ,, |
| సక్కని ఆ బిడ్డ | ,, | ఏమాయినాదమ్మ | ,, |
| హారము జాతికి | ,, | తల్లిపోయినాది | ,, |

ఈ రకంగా పోషయ్య బిడ్డపై ఒట్టు పెట్టుకొని అబద్ధం ఆడినందుకు ఆ బిడ్డ మరణించింది.

'బాలనాగమ్మకథ' అనే బతుకమ్మ పాటలో భూలక్ష్మిదేవి తాను చని పోయేముందు తన భర్త నవభోజరాజుతో మళ్ళీ పెండ్లి చేసుకోవద్దని, తన పిల్లలకు సవతితల్లివల్ల కష్టాలు ఏర్పడుతాయని చెప్పి, 'పెరుగు అన్నం'తో బాస చేయించుకుంటుంది.

| | | | |
|---|---|---|---|
| నాయి పిల్లలాను | ఉయ్యాలో | కాపాడు నాథ | ఉయ్యాలో |
| మల్ల పెండ్లి నీవు | ,, | చేసుకోకు నాథ | ,, |
| పెరుగు అన్నముతోడ | ,, | బాస చేయించి | ,, |
| ఏడుగురి పాపలను | ,, | అపుడు ఇచ్చేను | ,, |

ఈ విధంగా ఒట్టు పెట్టుకోవడం వంటి వర్ణనలు చాలా పాటలలో కనిపిస్తాయి.

## 13. ఆకాశవాణి :

జానపదులు పాడుకునే బతుకమ్మ పాటలలో 'ఆకాశవాణి' ప్రస్తావన ఎక్కువగా కనిపిస్తుంది. మహాపురుషులకు, కారణజన్ములకు ఒక్కొక్కప్పుడు ఆకాశం నుండి కొన్ని సందేశాలు వినబడుతాయి. వీటిని "ఆకాశవాణి పలికింది" అంటారు.

'ఎల్లమ్మ కథ'లో శంకరుడు తన కూతురైన రేణుకకు వివాహం చేయ నిశ్చయించాడని, గరుడ స్తంభంపైన గంట కట్టినాడని, 'ఆకాశవాణి' ద్వారా జమదగ్ని ముని తెలుసుకున్నట్లు క్రింది పాటలో కనిపిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| ఆకాశవాణియు | ఉయ్యాలో | ఏమి చెప్పుచుండె | ఉయ్యాలో |
| ఓ మూని బాలకా | ,, | వెండికొండా కెళ్లు | ,, |
| శంకరుడు ఘోరమైన | ,, | ప్రతిజ్ఞ బూనిండు | ,, |
| ప్రాతిజ్ఞ చెల్లితే | ,, | పణతి నిస్తానానె | ,, |
| అప్పుడూ బాలుడు | ,, | ఎనుకకు మర్రిండు | ,, |

అదేవిధంగా 'గయోపాఖ్యానం' పాటలో శ్రీకృష్ణుడు భాస్కరునికి అర్ఘ్యం ఇస్తున్నప్పుడు, ఆకాశం నుండి గయుడు వేసిన 'తమ్మిలి' కృష్ణుని అంజలిలో పడుతుంది, కృష్ణుడు తమ్మిలి వేసినవాడు ఎవ్వడని ఆగ్రహించగా, 'ఆకాశవాణి' గయుని వృత్తాంతం కృష్ణునికి వినిపిస్తుంది.

ఈ రకంగా జానపదులు ప్రకృతిలోని పంచభూతాలను, అతిమానుష శక్తులుగా, భావించడమే గాకుండా అవి చెప్పిన వాటిని భయంలో, భక్తితో నమ్ముతారు.

## అధోజ్ఞాపికలు :

1. Tylor - Primitive Culture, Volume - I.
2. డా॥ నాయని కృష్ణకుమారి, జానపదగేయ గాథలు, పేజీ. 6.
3. పాడినవారు కుమారి అద్రుజ. కుమారి విజయ, ఆకునూరు, వరంగల్ జిల్లా.
4. పాడినవారు శ్రీమతి కట్కం రాజగంగు బృందం, కోరుట్ల కరీంనగర్ జిల్లా.
5. పాడినవారు శ్రీమతి కట్కం రాజగంగు బృందం, కోరుట్ల, కరీంనగర్ జిల్లా.
6. పాడినవారు శ్రీమతి కట్కం రాజగంగు బృందం, కోరుట్ల కరీంనగర్ జిల్లా.
7. పాడినవారు కుమారి మాధవి, రేణికుంట, నల్లగొండ జిల్లా.
8. పాడినవారు శ్రీమతి జయలక్ష్మి, ఆకునూరు, వరంగల్ జిల్లా.
9. పాడినవారు శ్రీమతి అంతమ్మగారు, గాగిళ్ళాపురం, వరంగల్ జిల్లా.
10. పాడినవారు కుమారి రమాదేవి, మేట్‌పల్లి, కరీంనగర్ జిల్లా.
11. డా॥ చింతపల్లి వసుంధరారెడ్డి, తెలుగు జానపద సాహిత్యము-
    స్త్రీల గేయములలో సంప్రదాయము, పుట.170.
12. పాడినవారు కుమారి బాలమణి, జయాల, వరంగల్ జిల్లా.

# 5. ప్రాచీన మానవుని మనస్తత్వం–మతం

## ప్రాచీన మానవుని మనస్తత్వం - మతం :

జానపదులు పాడుకునే బతుకమ్మ పాటలలో ప్రాచీన మానవుని మనస్తత్వం, మతం మొదలైన అంశాలు కనిపిస్తాయి.

ఆది మానవుడు తన మనుగడకోసం నిరంతరం పోరాటం సాగిస్తున్నప్పుడు ప్రకృతిలో జరిగే మార్పులకు హేతువులను తెలుసుకోలేకపోయాడు. ప్రకృతిలో తనకు అంతుపట్టని, అనుభవానికి రాని పరిణామాలకు మూలకారణం మానవాతీతమైన ప్రకృతి శక్తులే అని భావించాడు.

మరణించిన వారి ఆత్మ నశించకుండా ఏ చెట్టులోనో, జంతువులోనో, పుట్టలోనో, రాయిలోనో నెలకొని ఉంటుందని ఊహించాడు. అప్పటినుండి వృక్షాలను, రాళ్ళను పూజించడం అలవరచుకున్నాడు. కరువు కాటకాలు, ప్రకృతి వైపరీత్యాలు మొదలైనవి ఏర్పడినప్పుడు వాటికి ప్రకృతి శక్తులే కారణం అని అతని భావన. మానవ జీవన వికాస క్రమంలో ఏర్పడిన మాతృస్వామ్య వ్యవస్థ ప్రభావంవల్ల ఈ ప్రకృతి శక్తులకు స్త్రీత్వాన్ని ఆపాదించి ఆరాధించడం ప్రారంభించాడు. ఆ నేపథ్యంలో ఆవిర్భవించిందే గ్రామదేవతారాధన.

కాలక్రమేణా జానపదుల సాంఘిక జీవనంలో ఎన్నో ఆచారాలు, సంప్రదాయాలు, నమ్మకాలు ఏర్పడినాయి. ఆ క్రమంలోనే కొందరు స్త్రీలు, మరణించిన తరువాత వారి ఆత్మలు ప్రకృతిలో లీనమై, ఏ చెట్టుగానో, పువ్వుగానో పుట్టి, తమ మరణానికి కారణమైన వారిపై ప్రతీకారం తీర్చుకుంటారు. వారి సన్నిహితులకు స్వప్నంలో కనిపించి తమ కోరికలను తీర్చుకుంటారు. వీటికి ఉదాహరణగా పేరంటాండ్ల కథలను పేర్కొనవచ్చు. ఇంకా ప్రకృతిలోని కొన్ని చెట్లకు, జంతువులకు దైవత్వాన్ని ఆపాదించారు జానపదులు. నాగరికత వికాసక్రమంలో వృక్షపూజ, జంతు ఆరాధన, సర్పారాధన, జంతుబలి వంటి ఆచారాలేర్పడినాయి. తులసి మొక్కను పూజించడం, నాగులచవితినాడు పుట్టలో పాలు పోసి నాగుపాములను పూజించడం అనే ఆచారాలేర్పడినాయి. ఈ క్రింది పాటలో నాగుపాముకు పూజచేసే విధానం కనిపిస్తుంది.

| నాగులపంచమినాడు | ఉయ్యాలో | సర్లోకపొద్దు | ఉయ్యాలో |
|---|---|---|---|
| మా ఇంటి శ్రీదేవి | ,, | దశిమొక పొద్దు | ,, |
| పసుపు కుంకుమ పెట్టి | ,, | పట్టుచీరకట్టి | ,, |
| పోయెనేశ్రీదేవి | ,, | పుట్టదగ్గరికి | ,, |
| పుట్టచుట్టు తిరిగి | ,, | పూలనే పూదిచ్చి | ,, |
| గుడ్లుదింపకు నాగ | ,, | గుడ్డిదాన్ని నాగ | ,, |
| నడుము దింపకు నాగ | ,, | నడిపిదాన్ని నాగ | ,, |
| శిరసు దింపకు నాగ | ,, | చిన్నదాన్ని నాగ | ,, |
| పడిగె దింపకు నాగ | ,, | పగదాన్నిగాదు | ,, |
| తోక దింపకు నాగ | ,, | తోడబుట్టిన చెల్లెల్ని | ,, |
| నాగపూలాచీర | ,, | నాకు పెట్టు నాగన్న | ,, |
| ఏడాదికొకసారి | ,, | వేడుకతో వచ్చినా | ,, |
| అడ్డగోడమీద | ,, | అలిగి పన్నవు నాగ | ,, |
| అడ్డల్ల పురుగానీ | ,, | చంపేరు నిన్ను | ,, |
| పాలకుండాకాడ | ,, | పండుకున్న నాగ | ,, |
| పాలపిందే అని | ,, | చంపేరు నిన్ను | ,, |
| చల్లకుండాకాడ | ,, | చాగి పన్నవు నాగ | ,, |
| చల్లల్ల పురుగాని | ,, | చంపేరు నిన్ను | ,,[1] |

ఈ రకంగా నాగులపంచమి రోజున స్త్రీలు పుట్ట దగ్గరికి వెళ్ళి పాలుపోసి పసుపు కుంకుమలతో పూజ చేస్తారు. ఈ పాటలో శ్రీదేవి తాను నాగన్నకు తోడబుట్టిన చెల్లెలునని, నాగపూల చీర పెట్టుమని నాగన్నను వేడుకుంటుంది. ఇంకా తనను చూసి గుడ్లు తిప్పకుమని, నడుము దింపకుమని, శిరసు దింపకుమని, పడిగె దింపకుమనీ, తోక దింపకుమని ప్రార్థిస్తుంది. అంతేగాకుండా, పాము విషజంతువని "అడ్డగోడల మీద", "పాలకుండ కాడ", "చల్లకుండాకాడ" పడుకుంటే "అడ్డల్ల పురుగనీ", "పాలపిందె అనీ", "చల్లల్ల పురుగనీ" చంపుతారు అని హెచ్చరికలు చేస్తుంది. పాముకాటువల్ల మరణం సంభవిస్తుందనే భయంవల్ల ప్రాచీన మానవునికి సర్పాలపై భక్తి ఏర్పడిందని చెప్పవచ్చు.

అదేవిధంగా జానపదులు కఱవుకాటకాలు ఏర్పడి అంటువ్యాధులు ప్రబలినప్పుడు, పశువులు మరణించినప్పుడు, పంటలు నష్టపోయినప్పుడు వాటికి కారణం గ్రామ దేవతలని భావిస్తారు. "సంఘములోని వ్యక్తులు తమ చుట్టును ఏవో కొన్ని అదృశ్య శక్తులు గలవని విశ్వసించి ఒనర్చెడి ఆచార విశేషమే జానపద మతము. జానపద మతమున ఒక అంశముగాగల గ్రామదేవతారాధన ఈ విషయమును స్పష్టపరుచుచున్నది. ఏవో తమకు తెలియని కొన్ని శక్తులు మంచి చెడులతో నిమిత్తములేక తమను ఆవరించుకొన్నవనియు, ఆ శక్తులు వ్యాధులను, ఉపద్రవములను కలిగించుచున్నవనియు ఆదిమ మానవులు విశ్వసించారు."[2]

ఈ గ్రామ దేవతలే ఎల్లమ్మ, మైసమ్మ, పోలేరమ్మ, నూకాలమ్మ మొదలైన పేర్లతో ఆరాధింపబడుతున్నారు. ఎల్లమ్మ నాగుపాము ప్రతిరూపమని, స్వప్నంలో పాములు, గవ్వలు, బండారు, కుంకుమ కనిపిస్తే ఎల్లమ్మ కలలో కనిపించిందని జానపదుల విశ్వాసం. అంతేగాకుండా, ప్రకృతిని మానవీకరించడం, అగ్ని, ఆకాశం, సముద్రాలు, పర్వతాలు, భూమి మొదలైనవాటిని దైవ స్వరూపాలుగా భావించడం మొదలైనవి ప్రాచీన మానవుని మనస్తత్వాన్ని తెలియజేస్తాయి.

శాస్త్రజ్ఞానరహితుడైన ప్రాచీన మానవుని ఊహలు, ఆలోచనలన్ని శాస్త్ర పురోభివృద్ధి గాంచిన ఆధునిక కాలంలో మూఢనమ్మకాలుగా, హేతురహితమైనవిగా కనిపిస్తాయి. కాని, వారి ఊహలు, ఆలోచనలే కొంతవరకు ఆధునిక మానవుని విజ్ఞానాభివృద్ధికి పునాదులని చెప్పవచ్చు. కాలంలో వచ్చిన మార్పుల కనుగుణంగా, మానవుని అవసరాలలో వచ్చిన పరిణామాల ఆధారంగా ఈనాడు ప్రాచీన మానవుని కొన్ని ఆచార సంప్రదాయాలు చాలావరకు హేతుబద్ధమైనవిగా కనిపిస్తాయి. ఈ రకంగా బతుకమ్మ పాటల ఆధారంగా ఆది మానవుని మతం, మనస్తత్వం మొదలైన అంశాలు తెలుస్తున్నాయి.

## అధోజ్ఞాపికలు :

1. పాడినవారు శ్రీమతి సావిత్రి, మెట్‌పల్లి, కరీంనగర్ జిల్లా.
2. డా॥ జి.వి.యస్. మోహన్, జానపద విజ్ఞాన వ్యాసావళి, పుట 116.

# 6. వారానువర్తనాలు

## వారానువర్తనాలు :

బతుకమ్మ పండుగ సందర్భంగా జానపదులు పాడుకునే పాటలలో ఒకే విధమైన పేర్లు, అలంకారాలు, పదబంధాలు, స్థల వర్ణనలు, గుణ వర్ణనలు పునరావృతం అవుతాయి. వీటినే వారానువర్తనాలు అంటారు. ప్రాచీన కావ్య ప్రబంధాలలోని కవిసమయాలవంటివే ఈ కథాగేయాలలోని వారానువర్తనాలు.

## 1. పేర్లు :

పాటలలో కొందరు వ్యక్తుల పేర్లు పునరుక్తం అవుతాయి. 'రాజరం పాలుని' కథలో సహదేవుని కొడుకు పేరు రాజరంపాలుడు. ఈ పాటలో ధర్మరాయుడు, రూపవతి, పొన్నమాదేవి మొదలైన పేర్లు కనిపిస్తాయి.

ఎల్లమ్మ కథలో-

| | | | |
|---|---|---|---|
| పారిన రక్తము | ఉయ్యాలో | త్రాగినా వారికి | ఉయ్యాలో |
| పరశురాముడాని | ,, | పేరు పెట్టినారు | ,, |
| జారినా రక్తము | ,, | త్రాగిన వారికి | ,, |
| జంపనయ్యా అని | , | పేరు పెట్టినాడు | ,, |
| ప్రక్కల్లి రక్తము | ,, | త్రాగిన వారికి | ,, |
| పక్కలయ్యా అని | ,, | పేరు పెట్టినారు | ,, |
| డొల్లిన్న రక్తము | ,, | త్రాగిన వారికి | ,, |
| డొక్కలయ్యా అని | ,, | పేరు పెట్టినారు | ,, |
| ఇంకిన్న రక్తము | ,, | త్రాగినా వారికి | ,, |
| ఈల గౌరమ్మని | ,, | పేరు పెట్టినారు | ,, |

జంపనయ్య, ప్రక్కలయ్య, డొక్కలయ్య, ఈల గౌరమ్మ మొదలైన విచిత్రమైన పేర్లు కనిపిస్తాయి.

ఇంకా నల్లావు, తెల్లావు, మువ్వావు అని ఆవులను పిలుస్తారు.

పేదరాశి పెద్దమ్మ పాటలో

నడుములు సక్కనా ఉయ్యాలో నాగబూతా ఎడ్లు ఉయ్యాలో
కొమ్ములు సక్కనా ,, కోడెబూతా ఎడ్లు ,,

అని పశువులను వర్ణిస్తారు.

గ్రామాల పేర్లు కూడ 'ఎల్లమ్మ కథ'లో జమదగ్ని శంకరునితో "చింత పురమూ నాది చిత్రమైన ఊరు" అంటాడు. ఇంకా అదే పాటలో-

పార్వతీ ఏలేటి ఉయ్యాలో పంచాదిగిరులు ఉయ్యాలో
శంకరుడు ఏలేటి ,, వెండికొండా పట్నము ,,

అని తెలిపారు. ఇంకా జానపదుల పాటలలో 'రాజరంపాల కథ'లోని పాండవులు ఏలేటి ఢిల్లీ, భస్మగాంధీపట్నం మొదలైనవే కాక భూచక్రపట్టణం వంటి పట్టణాల పేర్లు పునరుక్తం అవుతాయి. రంపాలుడు మాయమైనప్పుడు, భీముడు అతని వెతుక్కుంటూ "కాశింబావ తోట ఉయ్యాలో కలెజూసినాను ఉయ్యాలో" అంటాడు. ఈ విధంగా జానపదులు తమకు పరిచయమైన స్థలాల పేర్లు ఏ పాటలలోనైనా పేర్కొంటారు.

జానపదులు కొన్ని సామాన్యమైన పడికట్టు మాటలతో మానవుల గుణ గనాలు వర్ణించడం వారి పాటలలో ఎక్కువగా కనిపిస్తుంది.

## 2. కోపం వర్ణన :

'ఎల్లమ్మ కథ' లో పరశురాముడు బొంగరం జాడలకు బయలుదేరి నప్పుడు, దారిలో గంగమ్మ అడ్డమొచ్చి, తన అనుమతి లేకుండా నదిని దాట గలవా అని ఆక్షేపిస్తుంది. అపుడు పరుశురాముడు ఆమెపై కోపంతో-

ఎర్రని గుడ్లకూ ఉయ్యాలో ఎత్తిండు కోపాలు ఉయ్యాలో
తెల్లని గుడ్లకూ ,, తెచ్చిండు రక్తాలు ,,
వెండివంటీ పండ్లు ,, పిండోలె కొరికిండు ,,

కోపంలో కండ్లు ఎర్రబడడం, పటపట పండ్లు కొరుకడం చాలా సహజమైన వర్ణనలు. ఇటువంటి వర్ణనలు చాలా పాటలలో పునరుక్తం అవుతుంటాయి.

### 3. దుఃఖం వర్ణన :

'ఎల్లమ్మ కథ'లో ఎల్లమ్మ తమ భర్త జమదగ్ని ప్రాణాపాయ స్థితిలో ఉన్నాడని తెలుసుకొని దుఃఖంతో "వలవల రేణుకా ఉయ్యాలో వలపోసుకుంటూ ఉయ్యాలో" భర్త దగ్గరికి పరుగెత్తుతుంది.

'పాపిరెడ్డి కథ' లో 'మల్లమ్మ' మరణించిందేమోనన్న దుఃఖంలో ఆమె అన్నలు, తల్లిదండ్రులు–

కొట్టుకుంటాను ఉయ్యాలో మొత్తుకుంటాను ఉయ్యాలో<br>
గుద్దుకుంటాను ,, వస్తారు.

ఇంకా కలికి కామాక్షి పాటలలో ఆమె తన అన్న రాగానే–

కాళ్ళకు నీళ్ళిచ్చి ఉయ్యాలో కన్నీరు తీసి ఉయ్యాలో<br>
చేతికి నీళ్ళిచ్చి ,, చేయివారా జూని ,,

అని దుఃఖాన్ని సహజంగా వర్ణిస్తారు.

కలికి కామాక్షి వంటి పాటలలో పుట్టింటి వారిని చూడగానే స్త్రీలు ఈ రకంగా దుఃఖించడం కనిపిస్తుంది.

'ఎల్లమ్మ కథ' లో ఎల్లమ్మ తన కొడుకు పెట్టే బాధలకు–

వలవల ఆ తల్లి ఉయ్యాలో వలపోసుకుంటు ఉయ్యాలో<br>
గొడగొడ ఆ తల్లి ,, గొట్టిల్లుకుంటు ,,.<br>
పోతుంది.

### 4. నవ్వు వర్ణన :

జానపదులు తమ సంతోషాన్ని, ఆనందాన్ని నవ్వుద్వారా వ్యక్తపరుస్తారు. కాని ఈ నవ్వు ఎన్నో రకాలుగా ఉంటుంది. సంతోషంతో నవ్వడం, పరిహాసం కోసం నవ్వడం, హేళన కోసం నవ్వడం మొదలైనవి. నవ్వు నాలుగు విధాలు చేటు అన్నట్లు నవ్వడంవల్ల ఎదుటి వ్యక్తిలో ఎన్నో అనుమానాలను రేకెత్తిస్తుంది. జానపద రామాయణంలోని "లక్ష్మణదేవర నవ్వు'' లో శ్రీరామ పట్టాభిషేక సమయంలో లక్ష్మణుడు నవ్వితే అక్కడ ఉన్న వారందరికి ఎన్నో అనుమానాలు వచ్చాయి.

'పాపిరెడ్డి కథ' లో పాపిరెడ్డి మల్లమ్మ వెనుకాలే వెళుతూ—

| | | | |
|---|---|---|---|
| ఎను కెనుకాను | ఉయ్యాలో | పోత ఉన్నాడు | ఉయ్యాలో |
| ముసి ముసీగ | ,, | నవ్వుకుంటాను | ,, |
| ముత్యాలాను | ,, | కొంగుబట్టేను | ,, |
| పకపకాను | ,, | నవ్వుకుంటాను | ,, |
| పరిట కొంగూను | ,, | తాను పట్టేను | ,, |

ఈ రకమైన నవ్వులు కూడ ఉంటాయి.

రామాయణానికి సంబంధించిన బతుకమ్మ పాటలో, సీతమ్మ ఒకసారి గదిలో ఉండి తలుపు గడియ వేసుకుంటుంది. ఎవరు వచ్చి తలుపు తట్టినా తలుపు తీయదు. చివరికి శ్రీరాముడు వచ్చి-

| | | | |
|---|---|---|---|
| సీతమ్మ సీతమ్మా | కోల్ | తలుపూ తీయమ్మా | కోల్ |
| నీ పేరు చెప్పుతే | ,, | తలుపు తీస్తాను | ,, |
| నా పేరు రామూలు | ,, | తలుపు తీయమ్మ | ,, |
| కిలకిల నవ్వుకుంటూ | ,, | క్రింది గొళ్లెం తీసె | ,, |
| పకపక నవ్వుకుంటూ | ,, | పై గొళ్లెం తీసె | ,, |

పై విధంగా నవ్వుకుంటూ గొళ్లెం తీస్తుంది.

కథాగేయాలలో ఈ రకంగా నవ్వుల వర్ణనలు పునరుక్తమవుతాయి.

## 5. అలంకరణ :

సామాన్యంగా జానపదస్త్రీలు అలంకరణకు ఎక్కువ ప్రాధాన్యం ఇస్తారు. వేడుకలకు, ఉత్సవాలకు క్రొత్త బట్టలు, నగలు, పసుపు, కుంకుమలతో స్త్రీలు అందంగా అలంకరించుకుంటారు. మేనుకు చందనం పూసుకొని, కండ్లకు కాటుక పెట్టుకొని, నుదుట తిలకం దిద్దుకొని అలంకరించుకుంటారు.

'రాజరంపాల కథ'లో రూపవతి తన భర్త వచ్చే సమయానికి అందంగా అలంకరించుకొని—

| | | | |
|---|---|---|---|
| తీరుబొమ్మల నడుమ | ఉయ్యాలో | తిరుమన్ని బొట్టు | ఉయ్యాలో |
| బారి బొమ్మల నడుమ | ,, | బంగారు బొట్టు | ,, |
| కురుచ బొమ్మల నడుమ | ,, | కుంకుమ్మ బొట్టు | ,, |

దిద్దుకున్నది.

## 6. స్నానవర్ణన :

శిష్టసాహిత్యంలోని ప్రబంధ కవులే గాకుండా జానపద సాహిత్యంలోని జానపదులు కూడ స్నానఘట్టాన్ని తమ పాటలలో వర్ణించారు.

'రాజరంపాలకథ'లో రూపవతి తన భర్త ఇంటికి వచ్చే సమయానికి

| | | | |
|---|---|---|---|
| తడిగిడు స్నానాలు | ఉయ్యాలో | తల్లి చేసినాది | ఉయ్యాలో |
| నీళ్ళు ఆరేదాక | ,, | నీలంచు చీర | ,, |
| నీళ్ళు ఆరినంక | ,, | పట్టంచు చీర | ,, |

కట్టుకొని అలంకరించుకున్నది. ఇంకా స్నానంకోసం భమిడియ్యకాగులు, వెండియ్యకాగులలో నీళ్ళు కాచుకోవడంవంటి వర్ణనలు ఈ పాటలలో కనిపిస్తాయి.

## 7. అడవి వర్ణన :

జానపదులు అడవిని రకరకాలుగా వర్ణించడం బతుకమ్మ పండుగ పాటలలో కనిపిస్తుంది.

'రాజరంపాల కథ'లో రూపవతికి అరణ్యంలో ఒంటిస్తంభం మేడ కట్టిస్తారు. ఆ అడవిని ఈ విధంగా వర్ణించారు.

| | | | |
|---|---|---|---|
| ఊరికి ఉత్తరాన | ఉయ్యాలో | పాద దక్షణాన | ఉయ్యాలో |
| కారండ పడవి | ,, | కంచాల మర్రి | ,, |
| కాకన్న పలుకదే | ,, | కారండ పడవి | ,, |
| పిట్ట పీచుమనని | ,, | అదిపిరికి అడవి | ,, |
| పామన్న పారదే | ,, | పాపకారి అడవి | ,, |
| దోమన్న పారదే | ,, | దోషకారి అడవి | ,, |

అదేవిధంగా 'ఎల్లమ్మకథ'లో జమదగ్ని ముని తపస్సు చేసుకుంటున్న అడవిని జానపదులు.

| | | | |
|---|---|---|---|
| ఊరికి ఉత్తరాన | ఉయ్యాలో | పాదదక్షణాన | ఉయ్యాలో |
| ఊడలు చిన్నదీ | ,, | ఊరెలుపు మర్రుండ | ,, |
| కాడలు చిన్నదీ | ,, | కంచాలు మర్రుండ | ,, |
| పుట్టక్రింద తపస్సు | ,, | పట్టిండు దేవుడు | ,, |

ఈ విధంగా వర్ణించారు. ఇటువంటి అడవి వర్ణనలు ఎన్నో కథాగేయాలలో

## 8. చీకటి వర్ణన :

జానపదులు తమ పాటలలో చీకటిని కూడ వర్ణించడం కనిపిస్తుంది.

'రాజరంపాల కథ'లో రూపవతి తన భర్త చీకటి పడినాక ఇంటికి వస్తాడని ఎదురు చూస్తుంది. అపుడు ఆ రాత్రిని వర్ణిస్తూ-

| | | | |
|---|---|---|---|
| కలికి గాంధారీ | ఉయ్యాలో | మాంధారి యాల్ల | ఉయ్యాలో |
| భస్మయ్య కట్టె | ,, | కొరుకాని యాల్ల | ,, |
| ఊరువెళ్ళి ఊరు | ,, | తిరుగాని యాల్ల | ,, |
| పసిపిల్ల పాలు | ,, | తాగాని యాల్ల | ,, |
| రాజరంపాల | ,, | చేరవచ్చినాడు | ,, |

అని జానపదులు పైవిధంగా చెప్పుతారు.

## 9. చూపులు :

సామాన్యంగా జానపదులు రకరకాల చూపులతో తమ భావాలను వ్యక్తం చేస్తారు. బతుకమ్మ పాటలలో 'చూచినారు' అనడానికి బదులు, 'కండ్లజూచె' అనడం కనిపిస్తుంది. అంతేగాక 'అగ్రుడై జూచె, ఉగ్రుడై జూచె' వంటి పదబంధాలు సామాన్యంగా పునరుక్తం అవుతాయి.

'ఎల్లమ్మ కథ'లో ఎల్లమ్మకు పుట్టిన కొడుకులకు నామకరణం చేయడానికి వచ్చిన బ్రాహ్మణులు పంచాంగం చూస్తూ-

| | | | |
|---|---|---|---|
| వొంగి సదువూతుండ్రు | ఉయ్యాలో | ఓలారి గన్నుల్ల | ఉయ్యాలో |
| నిలిచి సదువూతుండ్రు | ,, | నీలారి గన్నుల్ల | ,, |

అని వర్ణిస్తారు.

## 10. రూపవర్ణన :

జానపదులు స్త్రీ రూపాన్ని అత్యంత సహజమైన ఉపమానాలతో వర్ణిస్తారు.

శ్రీలక్ష్మి నీ మహిమలు గౌరమ్మ చిత్రమై తోచునమ్మా గౌరమ్మ
పవళించి మమ్మేలుకో గౌరమ్మ బంగారు ముద్దుగుమ్మా గౌరమ్మ
కాళ్ల జూస్తే నేమొ కమరంచి రేకులు ॥కాళ్ల॥

ఎండియ్యొ మట్టెలమ్మా గౌరమ్మ వ్రేలుకూ ధరియించవే గౌరమ్మ
చేతులు చూస్తేనేమొ చామంతి రేకులు ॥చేతులు॥

సౌకట్ల నిన్నందురూ గౌరమ్మ చెల్లెలా నిను దలుతురూ గౌరమ్మ
నడుము జూస్తేనేమొ నాగసారంబులు ॥నడుము॥

బిళ్ళలా వడ్డాణమూ గౌరమ్మ బిగ్గంగా ధరియించవే గౌరమ్మ
తీరి తీరి పూలు ఏడు రంగుల పూలు ॥తీరి॥

తీగ గుమ్మడి పూలు దారలుద్రాక్షలు
మేలైన పురుషూక్షలు గౌరమ్మ ప్రేమతో ధరియించవే గౌరమ్మ
అటుకులు పాలాలు వోలెవోసుకొని ॥అటుకులు॥

ఏడాది కొకదినము గౌరమ్మ బతుకమ్మ యని దలతురు గౌరమ్మ
ఊరికీ పరిపెట్టి ఊడాలమర్రి క్రింద
వెంపెల్లి చెట్టెక్కి గద్దెలు గట్టించి
అయిదుగురు ముత్తైదువలు గౌరమ్మ పాటలు పాడరమ్మ గౌరమ్మ
జగజగా మెరిసేటి జగతి పున్నమినాడు
చంద్రుడున్ని జూసితే నీ మోము జూపిస్తు
జలదాక్షి నీ తిలకము గౌరమ్మ చూసితే ఆనందమూ గౌరమ్మ[1]

కాళ్ళు కమరంచి రేకులని, చేతులు చామంతి రేకులని, నడుము నాగసారం అని, ముఖం చంద్రబింబం కంటే మించిందని పై పాటలో లక్ష్మీదేవిని వర్ణించారు జానపదులు. స్త్రీని జలదాక్షి అని, కలికి చిలుకల కొలికి అని, సన్నుతాంగి అని, మత్స్యకంటి అని అనేకరకాలుగా వర్ణించారు. అంతేగాకుండా, సక్కనీ రాముడు, సక్కని గౌరమ్మ, సక్కని మల్లమ్మ అంటూ వారి చక్కదనం తెలుపుతారు.

## 11. సంఖ్యల వర్ణన :

జానపదులు వారి జీవితంలో కొన్ని సంఖ్యలకు విశేషమైన ప్రాధాన్యం ఇస్తారు. వారు పాడుకునే పాటలలో మూడు, నాలుగు, ఏడు, తొమ్మిది, అరవై మూడు, అరవై ఆరు, నూటఒక్కటి మొదలైన సంఖ్యలకు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చినట్లు కనిపిస్తుంది.

'గంగాగౌరి సంవాదం'లో ఇద్దరు సవతులకు కయ్యం ఏర్పడి ఇద్దరి నడుమ మట్టితో గోడ పెట్టుకుంటారు. దానికి నీళ్లు, మట్టికావాలి. అందుకే-

| | | | |
|---|---|---|---|
| నల్లగుంట్లయి నీళ్ల | వలలో | నాలు గడువలు తెచ్చి | వలలో |
| ఎర్రగుంట్లయి నీళ్ల | ,, | ఏడు గడువలు దెచ్చి | ,, |
| పచ్చగుంట్లయి నీళ్ల | ,, | పది గడువలు దెచ్చి | ,, |
| ఎర్రగుంట్లది మన్ను | , | ఏడు తట్టలు దెచ్చి | ,, |
| ఆమన్ను ఈమన్ను | ,, | కలెరానీబోసీ | ,, |

ఆ విధంగా వారు ఇద్దరూ మట్టితో గోడ పెట్టుకుంటారు.

ఇంకా 'రాజరంపాల కథ'లో రూపవతి తన భర్త రంపాలుని కోసం-

| | | | |
|---|---|---|---|
| ముప్పయి ఏడు కూరలు | ఉయ్యాలో | ములగపూలాచారు | ఉయ్యాలో |
| డెబ్బయి ఏడు కూరలు | ,, | దేవనాల పెరుగు | ,, |
| అరవై ఆరు కూరలు | ,, | అల్లపూ పచ్చడా | ,, |

అని అన్ని రకాల వంటలు చేసినట్లు వర్ణిస్తుంది. 'ఎల్లమ్మ కథ'లో "అరవై మూళ్లాపాగ, తలపై చుట్టినా" అని, "నూటనే ఒక్కనూ బ్రాహ్మణుల పిలిపించె" అని, "ఏడు బాణాలైన, ఎదలోన ఏసిండు" అనే సంఖ్యావర్ణనలు కనిపిస్తాయి. 'సంపూర్ణ రామాయణం' పాటలో సీత పర్ణశాల ముందు "ఏడు గీతలు" గీచి లక్ష్మణుడు అన్నకోసం బయలుదేరాడు.

## 12. అద్భుత అంశాలు :

జానపద కథా గేయాలలో అద్భుతమైన అంశాలు పడికట్టు మాటలతో వర్ణిస్తారు.

'రాజరంపాల కథ'లో రంపాలునికి రూపవతికి వివాహం అయిన తరువాత, మాయరంభ వచ్చి, రంపాలున్ని తీసుకొని-

| | | | |
|---|---|---|---|
| అద్రాలకట్టి | ఉయ్యాలో | మీదికెళ్ళి దింపి | ఉయ్యాలో |
| బంగారు బల్లి | ,, | చేసుకున్నదమ్మ | ,, |
| కొప్పుల్ల అది | ,, | సవరించుకోని | ,, |
| మాయ లోకమైతే | ,, | మరి ఎల్లిపాయె | ,, |

ఆవిధంగా రంపాలుని బల్లిగా చేసుకొని మాయలోకం వెళ్ళిపోయింది. అదేరకంగా బాలనాగమ్మ కథలో మాయలఫకీరు బాలనాగమ్మను నల్ల కుక్కగా మార్చుకొని తీసుకుపోవడం, మాయలఫకీరు ప్రాణం సప్త సముద్రాల అవతల చెట్టు తొఱ్ఱలోని చిలుకలో ఉండడం- ఇవన్నీ జానపదులు కల్పించుకున్న అద్భుత అంశాలు. 'ఎల్లమ్మ కథ'లో కూడ పరశురాముడు మర్రిచెట్టుపైన కొత్త కుండ లోని తన తండ్రి జమదగ్ని ఎముకలను క్రిందకి దించి వాటిని క్రమంగా అమర్చి జీవదారి పుల్లతో తిరిగి ప్రాణప్రతిష్ఠ కావించడం వంటి వర్ణనలూ అనేక పాటలలో కనిపిస్తాయి. అంతేగాక 'ఎల్లమ్మ' తన భర్త శరీరం నుండి కారిన రక్తం సేవిస్తే సంతానం కలిగినట్లు, 'రాజ రంపాల కథ' లోని రూపవతీదేవి భర్త తిని విడిచి పెట్టిన ఎంగిలి అన్నం తింటే సంతానం కలిగినట్లు జానపదుల పాటలలో వర్ణించబడింది. ఇవన్నీ జానపద కథాగేయాలలోని అద్భుత వర్ణనలే.

## 13. ప్రయాణ వర్ణన :

కొన్ని బతుకమ్మ పాటలలో ప్రయాణ వర్ణన సుదీర్ఘంగా సాగుతుంది.

| | | | |
|---|---|---|---|
| అప్పుడూ దేవుడూ | ఉయ్యాలో | బయిలెల్లుతున్నడూ | ఉయ్యాలో |
| టీకుటాకూలాంటి | ,, | కోటల్లు దాటిండు | ,, |
| గట్టుకూ పారినా | ,, | గన్నేర్లు దాటిండు | ,, |
| గన్నేర్లు దాటంత | ,, | బాటల్ల పడ్డడూ | ,, |

ఈ విధంగా చెట్లు, కోటలు దాటుకుంటూ అతడు బయలుదేరాడు. ఇటు వంటి ప్రయాణ వర్ణనలు బతుకమ్మ పాటలలో పునరుక్తం అవుతాయి.

## 14. ఆయుధాల వర్ణన :

జానపదుల కథా గేయాలలో ఆయుధాలను రకరకాల పేర్లతో వర్ణిస్తుం టారు. పచ్చల పిడిబాకు అని, పిడుగు తాపినకత్తి అని, గండ్రగొడ్డలి, ఉగ్రంపు బాణాలు అని మొదలైన ఆయుధాల వర్ణన వీరి పాటలలో కనిపిస్తుంది.

సీతమ్మ కోరికపై శ్రీరాముడు మాయలేడిని చంపడానికి పోతూ-

| | | | |
|---|---|---|---|
| కూర్చుండి చేయించె | ఉయ్యాలో | కుర్స బాణాలు | ఉయ్యాలో |
| పండుకొని చేయించె | ,, | పక్క బాణాలు | ,, |
| నిలుచుండి చేయించె | ,, | నిలువు బాణాలు | ,, |
| ఇల్లెడు బాణాలు | ,, | వీపునా గట్టుకొని | ,, |

తీసుకు వెళ్లాడు.

## 15. ఆటలు :

జానపద కథాగేయాలలో ఆటల వర్ణన కనిపిస్తుంది. 'ఎల్లమ్మ కథ' లో పరశురాముడు బొంగరాల ఆట, కబడ్డీ ఆడినట్లు పాటలో వర్ణించబడింది.

| | | | |
|---|---|---|---|
| అన్నరో రామన్న | ఉయ్యాలో | ఆటలాడుతాము | ఉయ్యాలో |
| బొంగరాలా ఆట | ,, | మనము ఆడుదాము | ,, |
| పెట్టండి జాలలు | ,, | వెయ్యండి బొంగరాలు | ,, |
| చుట్టండి జాలలు | ,, | కొట్టండి బొంగరాలు | , |
| అన్నరో రామన్న | ,, | నాది బొంగరాము | ,, |
| నాది బొంగరాము | ,, | పగిలింది ఓయన్న | ,, |

పరశురాముని ధాటికి స్నేహితుల బొంగరాలన్నీ విరిగిపోయాయి. తరువాత పరశురాముడు-

| | | | |
|---|---|---|---|
| కబడ్డి మన మిపుడు | ఉయ్యాలో | ఆడాలె రా తమ్మి | ఉయ్యాలో |
| కబడ్డి ఆడిన | ,, | కలహాలు వచ్చినా | ,, |
| నువ్వువచ్చి ఇపుడు | ,, | జోపిపోరాదన్న | ,, |
| చక్కనీ రాముడు | ,, | జోపుతనె ఉన్నడూ | ,, |
| ఉండలేము అన్న | ,, | ఊరెల్లిపోతాము | ,, |
| నాయొక్క కాలును | ,, | ఇరిగిపోయినాది | ,, |

ఈ రకంగా బొంగరాల ఆట తరువాత కబడ్డీ ఆడారు. అందులోను పరశురామునివల్ల మిత్రులు దెబ్బలు తిన్నారు. కబడ్డి ఆడడం అనేది జానపదుల ఆధునికమైన కల్పన. జానపదుల కథాగేయాలలో ఆధునికమైన కబడ్డి వంటి ఆటలు కూడా చోటు చేసుకుంటాయి. బొంగరాల ఆట ప్రస్తావన పలనాటి వీరుల చరిత్రలోకూడ ఉంది. వీర కథాగేయాలలో బొంగరాల ఆట ప్రసక్తి తప్పకుండా ఉంటుంది. దానివల్ల వీరుల శౌర్యం ప్రకోపించడం, తద్వారా కథ అనేక మలుపులు తిరగడం కనిపిస్తుంది

## అధో జ్ఞాపికలు :

1. ఫాడినవారు యశోద, మేడిపల్లి, కరీంనగర్ జిల్లా.

# 7. బతుకమ్మ పండుగ పాటలు - సంగీత, నృత్యవిశేషాలు

శ్రావ్యమైన గానామృతానికి మానవులేగాకుండా పశుపక్ష్యాదులు కూడ పులకిస్తాయి. జానపదులు సంతోషంలోను, దుఃఖంలోను అప్రయత్నంగా పాటలు పాడినప్పుడు అందులో వారికి తెలియకుండానే రాగం, లయ వచ్చి చేరుతాయి. ఈ విధంగా ఏర్పడిన జానపద సంగీతం శాస్త్రీయ సంగీతానికి పునాదివంటిది.

ఈ జానపద గేయాలలో స్త్రీల పాటలు ఎంతో మాధుర్యాన్ని కలిగి ఉంటాయి. "కంఠమాధుర్యము, కంఠమేళ యనునవియే జానపదుల గేయా లాపనమున కలంకారములు. వారి పాటలకు సంగీతమని పేరు పెట్టుట అంత సమంజసము కాదు. జీర ఎరుగని కంఠమొకేస్వరమును పలికినను వినుటకింపు గనే యుండును. జానపదుల పాటలకు ముందుగాని, వెనుకగాని స్వరాలాప ముండును. ఈ స్వరాలాపమే వారి సంగీతమున ప్రధాన భాగము."1

బతుకమ్మ పండుగ సందర్భంగా స్త్రీలు పాడుకునే రకరకాల పాటలకు ఏ సంగీత వాయిద్యాలు లేకపోయినప్పటికి, వీరు సామూహికంగా చరుస్తున్న చప్పట్లు, వేస్తున్న అడుగులే వీరి వాయిద్యాలు.

తెలంగాణాలోని వరంగల్, నల్లగొండ ప్రాంతాలలో స్త్రీలు బతుకమ్మ పాటలను పాడేటప్పుడు గుండ్రంగా తిరుగుతూ, చప్పట్లు చరుస్తూ, ఒకరు పాట చెప్పుతుంటే మిగతావారు అంతా కలసి పాడుతారు. కరీంనగర్ జిల్లాలోని కోరుట్ల, మెట్‌పల్లి, మేడిపల్లి ప్రాంతాలలో స్త్రీలు బతుకమ్మ పాటలు పాడే టప్పుడు చప్పట్లకు బదులు లక్క కోలలు, ఇనుప కోలలు ఉపయోగిస్తారు.

ఈ బతుకమ్మ పాటలన్నీ దాదాపు ఉయ్యాలో, కోల్, వలలో, చంద మామ, నేరియాలో, దచ్చన్నదారి పూలా వయ్యారి వంటి మకుటాలతో

ఉంటాయి మొట్టమొదట ఒకరు చెప్పగా మిగతా స్త్రీలంతా వంత పాడుతారు. ఇందులో ఒక్కొక్క పాట ఒక్కొక్క రాగ లయలతో కూడుకొని ఉంటుంది. అప్పుడు వారు కొట్టే చప్పట్లు, వేసే కోలలు రకరకాలుగా ఉంటాయి.

'గోపికా వస్త్రాపహరణం' పాటలో—

స్త్రీలు ఎదురెదురుగా నిలబడి, లయబద్ధంగా ఒకేసారి చప్పట్లుగాని, కోలలు గాని వేస్తూ క్రింది విధంగా పాడుతారు:

ఊరికి ఉత్తరానా ........... భామలు .... దారికి దక్షణానా ........... భామలు
పదహారువేల స్త్రీలూ ........ భామలు .... పడుచు కన్యలమ్మా............ భామలు
మామీడి వనములో .......... భామలు .... మల్లెవనమూలో .............. భామలు

ఒక చరణాన్ని ఒక్కరు చెప్పితే మిగతా వారు అదే చరణాన్ని మళ్ళీ పాడుతారు. పై చరణాలన్నింటిలో మొదటి చరణంలోని మొదటి భాగం 'ఊరికి ఉత్తరానా .... భామలు' అన్నది ఓకే శృతిలో స్థాయిని ఆరోహణా క్రమంలో పెంచి, రెండవ భాగమైన 'దారికి దక్షణానా ... భామలు' అన్నది అవరోహణా క్రమంలో పాడుతారు. ఒక చరణం పూర్తయ్యేసరికి, రెండేసి చొప్పున నాలుగు సార్లు చప్పట్లు కొడతారు.

గంగమ్మ గౌరమ్మా ........ వలలో ......... గవ్వాలాడంగా ... .... వలలో
గవ్వ చిట్లిపాయే ........ వలలో ......... కయ్యంబే పెరిగే ........ వలలో

ఈ పాట వేగంగా సాగిపోయే పాట, ఇందులో అందరు ఒకేసారి, ఒక చరణం పూర్తయ్యేసరికి ఎనమిదిసార్లు చప్పట్లు చరుస్తారు.

ఇంకో ఉయ్యాల పాటలో—

| | | | |
|---|---|---|---|
| రామరామరామ | ఉయ్యాలో | శ్రీరామజయరామ | ఉయ్యాలో |
| శ్రీ గణేశ్వర నిన్ను | ,, | చిత్తమందున తలతు | ,, |
| మల్లెపూలాతోడ | ,, | మాదేవ నినుగొలుతు | ,, |

ఇటువంటి పాటలో మొదటి చరణం ఒకరు పూర్తిగా ఒకసారి చెప్పితే మిగతా వారంతా దానిని వంతగా పాడుతారు. ఇందులో చప్పట్లు ఒకసారి రెండుకొట్టి తరువాత ఒక్కటి చొప్పున కొడుతారు. ఇందులో అందరూ ఒకేసారి లయబద్ధంగా చప్పట్లు చరుస్తారు. ఇదేపాట నల్లగొండ జిల్లాలోని ఇబ్రాహీం పురం గ్రామంలో పాడినప్పుడు స్త్రీలు మూడు చప్పట్లు ఒకేసారి వేసినారు. ఇటు వంటి పాటనే కరీంనగర్ జిల్లా మేడిపల్లి గ్రామంలోని వారు పాడుతూ కోలలతో వరుసగా కొట్టుకుంటూ భజన మాదిరిగా చేస్తారు. పాటంతా ఒకే తీరులో ఉన్నా పాడే విధానంలో ప్రాంతాన్ని బట్టి తేడా ఉంటుంది.

"శ్రీలక్ష్మి దేవియు - చందమామ - సృష్టిబతుకమ్మయ్యె - చందమామ" అని వరంగల్ ప్రాంతం స్త్రీలు పాడుతే, కరీంనగర్ జిల్లాలోని వారు ఇటువంటి పాటనే.

"బీరాయిపువ్వల్ల - చాందమామా - బొడ్డెమ్మపోతుంది - చాందమామా" అని పాడుతారు.

## 2. నృత్యం :

జానపద స్త్రీలు బతుకమ్మ పాటలు పాడుతున్నప్పుడు, గుండ్రంగా తిరుగుతూ, పాటల కనుగుణంగా చప్పట్లు చరుస్తూ, అడుగులు వేస్తూ, నృత్యం చేస్తుంటారు. దీనిని సామూహిక జానపద నృత్యంగా భావించవచ్చు.

డా॥ బిరుదురాజు రామరాజుగారు జానపద నృత్యాలను **1. Religious dances, 2. Social dances, 3. Dances as a past time** అని మూడు విధాలుగా వర్గీకరించారు.

బొడ్డెమ్మ, బతుకమ్మ పండుగల సందర్భంలో చేసే నృత్యాన్ని **Religious dance** గా పేర్కొనవచ్చును. స్త్రీలు గుండ్రంగా బతుకమ్మల చుట్టూ తిరుగుతూ లయబద్ధంగా అడుగులు వేస్తూ నృత్యం చేస్తారు.

ఉదా :- బొడ్డెమ్మ బొడ్డెమ్మా కోల్ బిడ్డాలెందరె కోల్
నీ బిడ్డ నీలగౌరు కోల్ నిత్యమల్లెచెట్టుకు కోల్

ఈ పాట ఎక్కువగా కన్నెపిల్లలు ఒకరికొకరు చేతులు తట్టుతూ బొడ్డెమ్మ చుట్టూ వేగంగా తిరుగుతూ పాడుతారు.

మరో ఉయ్యాల పాటలో—

| | | | |
|---|---|---|---|
| జనకుజనకూ నింట్ల | ఉయ్యాలో | సత్యజనకూ నింట్ల | ఉయ్యాలో |
| పుట్టెనూ ఆ సీత | ,, | పుణ్యజనకూ నింట్ల | ,, |

అని పాడుతున్నప్పుడు స్త్రీలంతా బతుకమ్మలను మధ్యన పెట్టి వాటి చుట్టు గుండ్రంగా తిరుగుతూ చప్పట్లు చరుస్తూ, పాట కనుగుణంగా అడుగులు వేస్తారు. వీరు ముఖ్యంగా చుట్టూ తిరుగుతున్నప్పుడు మొదట కుడిపాదం కుడివైపు కదిలించి, తరువాత దాని వెంబడి ఎడమ పాదం వేస్తారు. అంటే, కుడినుండి ఎడమకు అపసవ్యంగా తిరుగుతారు. మధ్యమధ్యన పాట వేగాన్ని పెంచినప్పుడు అడుగులు వేగంగా వేస్తూ, చప్పట్లు మూడేసి చొప్పున తొందరగా కొడుతూ, నడుము క్రిందికీ, పైకీ వంచుతూ గుండ్రంగా తిరుగుతారు.

కరీంనగర్ ప్రాంతంలోని మేడిపల్లి, కోరుట్ల మొదలైన గ్రామాలలో స్త్రీలు పాటలు పాడుతూ చప్పట్లకు బదులు కోలలు (ఇనుముతో చేసినవి) వేస్తూ ఎదురెదురుగా రెండు జట్లుగా ఏర్పడి ముందుకు సాగిపోతుంటారు. మధ్యమధ్యన విశాలమైన వీధులలో రెండుజట్లలోని స్త్రీలు ఎదురెదురుగా నిలబడి, చేతులతో కోలలను లయబద్ధంగా ఆడిస్తూ, ఒక గుంపులోని స్త్రీలు మరొక గుంపులోని స్త్రీలతో కలసి కోలలు వేస్తారు. అంతా కలిసి గుండ్రంగా నిలబడి కోలలు వేసిన తరువాత చివరికి మళ్ళీ ఎవరి జట్టులోకి వారు చేరిపోతారు. ఈ దృశ్యం చూడ డానికి ఎంతో మనోహరంగా ఉంటుంది.

**అధోజ్ఞాపికలు :**

1. డా॥ బిరుదురాజు రామరాజు, తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట-824.

# 8. బతుకమ్మ పండుగ పాటలు – భాషా విశేషాలు

జానపద స్త్రీల హృదయాలనుండి జాలువారే బతుకమ్మ పాటలలో ప్రాచీన మానవుని కళాభిరుచి, వర్ణనలు, ఊహలు, కల్పనలు మొదలైనవెన్నో కనిపిస్తాయి. శిష్టసాహిత్యం వ్యాకరణాలంకార, ఛందోబద్ధమైన మూసలో యిమిడి ఉంటుంది. జానపదుల సాహిత్యం వ్యాకరణాలంకార నియమాలకు కట్టుబడక, సరళమైన దేశీయ పదాలతో అప్రయత్నంగా వెలువడే వ్యవహారిక బాషలో ఉంటుంది. నిష్కల్మషమైన జానపదుల హృదయాలలాగే వారి పాటలు కూడ స్వచ్ఛమైన గ్రామీణ పదాలు, నుడికారాలు, సామెతలు పొడుపు కథలతో నిండి ఉంటాయి. ముఖ్యంగా ఈ బతుకమ్మ పాటలలో వడికట్టు మాటలు, వర్ణనలు, అన్యదేశ్యాలు, ధ్వనుల మార్పులు ఎన్నో కన్పిస్తాయి.

## 1. ఛందస్సు :

బతుకమ్మ పాటలన్నింటిలోను ఒకవిధమైన లయ, కూర్పు ఉంటాయి. ఆ పాటలన్నీ దాదాపు "మాత్రా ఛందస్సు"లో ఉంటాయి. జానపద గేయాలన్నీ మూడు, నాలుగు, ఐదు, ఆరు ఏడు, ఎనిమిది ఆవృత్తాలతో సాగిపోతుంటాయి. ఇవి పాడుకోవడానికి అనుకూలంగా ఉంటాయి. మాత్రాఛందస్సులో ఒక 'చిటికె' కాలంతో ఉచ్చరించబడేదానిని 'మాత్ర' అంటారు. ఈ మాత్రలకు త, క, కి, ట అనే అక్షరాలు లాక్షిణికులు ఏర్పరిచారు. ఈ త, క, కి, ట అనే అక్షరాలు ఒక 'మాత్ర' కాలంలోనే ఉచ్చరించబడుతాయి.

ఈ పాటలలో మూడు మాత్రల ఆవృత్తముల నడక గలిగిన దానిని త్రిశ్రగతి - 'త, కి, ట' అంటారు.

నాలుగేసి మాత్రల ఆవృత్తముల నడక గలిగిన దానిని 'చతురశ్ర' గతి- 'కి, ట, త, క' అంటారు.

ఐదేసి మాత్రల అవృత్తముల నడక గలిగిన దానిని 'ఖండగతి' కి, ట, త, కి, ట అంటారు 'ఖండగతి'లో ఐదు మాత్రలు ఉన్నప్పుడు దానిని $2+3+3+2$ మాత్రలుగా సూచింపవచ్చు.

ఆరుమాత్రల ఆవృత్తముల నడక గలిగిన దానిని 'త్రిశ్రగతి' పాటలుగా చెప్పవచ్చు. దానిని త,క,కి,ట,త,క అనే మాత్రలతో $3 \times 2=$గా సూచించి వచ్చు.

ఏడు మాత్రల అవృత్తముల పాటను 'మిశ్రగతి' అంటారు. దీనిని $(3+4)$ త,కి,ట,కి,ట,త,క, $(4+3)$ కి ట,త,క,త,కి,ట గను చెప్పుకోవచ్చు.

ఈ మాత్రా ఛందస్సులో బతుకమ్మ పాటలను ఈ విధంగా వివరించ వచ్చు:

| | 4 | 4 | 4 | 4 |
|---|---|---|---|---|
| 1. | శ్రీరామ, | జయరా, | మా, | వలలో |
| | 4 | 4 | 4 | 4 |
| | సీతా , | లాలా , | మా, | వలతో |

ఇందులో ఒక్కొక్క పదంలో నాలుగేసి మాత్రలు (కి, ట, త, క) గా ఉన్నాయి. దీనిని చతురశ్రగతిగా చెప్పవచ్చు.

| | 5 | 5 | 5 |
|---|---|---|---|
| 2. | బతుకమ్మ | బతుకమ్మ | ఉయ్యాలో |

ఐదు మాత్రలతో గూడిన ఈ అవృత్తాన్ని (కి, ట, త, కి, ట) 'ఖండ గతి'గా చెప్పవచ్చు.

ఐదు మాత్రాల ఆవృత్తాలతో గూడిన క్రింది పాటలు 'ఖండగతి' గానే చెప్పవచ్చు.

| 5 | 5 | | 5 |
|---|---|---|---|
| నల్లరా | గెటినున్న | | ఉయ్యాలో |
| ఓపున్నె | తులసీ | | ఉయ్యాలో |
| 5 | 5 | 5 | 5 |
| శ్రీలక్ష్మి | నీమహిమ | లూ | గౌరమ్మ |
| చిత్రమై | తోచున | మ్మా | గౌరమ్మ |

| 5 | 5 | 5 | 5 |
|---|---|---|---|
| ధరచోళ | దేశమున | చంద | మామ |
| ధర్మాంగు | డనురాజు | చంద | మామ |

3.

| హిమ | వంతూ | నింట్లో | బుట్టి |
|---|---|---|---|
| హిమ | వంతూ | నింట్లో | పెరిగి |
| .... | .... | .... | .... |
| .... | .... | .... | .... |

| 7 | 7 | 8 |
|---|---|---|
| మాయమ్మ | లక్ష్మీదేవి | పోయిరావమ్మా |
| 7 | 7 | 8 |
| మాతల్లి | పార్వతిదేవి | పోయిరావమ్మా |

పై పాటలో మొదటి రెండు చరణాల్లో, వరుసగా నాలుగు పదాల్లో నాలుగేసి మాత్రలు (కి, ట, త, క) ఉన్నాయి. క్రింది రెండు చరణాల్లో మాత్రం వరసగా మూడు పదాల్లో ఏడేసి మాత్రలు (త, కి, ట, కి, ట, త, క) చివరి పదంలో ఎనిమిదేసి మాత్రలు (త, కి, ట, కి, ట, త, క, త) ఉన్నాయి. ఇది మిశ్రగతిలో సాగిపోయిన పాట.

ఈ రకంగా బతుకమ్మ పాటలన్నీ చతురశ్ర గతిలోను, ఖండగతిలోను, మిశ్రగతిలోను సాగిపోయేవి ఉంటాయి.

## 2. అలంకారాలు :

భాషకు అలంకారాలు ఎంతో అందాన్ని చేకూరుస్తాయి. జానపద సాహిత్యంలో కూడ సహజ సిద్ధమైన అలంకారాలు, ఎక్కువగా కనిపిస్తాయి. ఈ క్రింది పాటలో ఉపమాలంకారాలు విరివిగా ప్రయోగించారు:

"చేతులు చూస్తేనేమొ చామంతి రేకులు
కాళ్ళు చూస్తేనేమొ కమరంచి రేకులు
ఎండియ్య మట్టెలమ్మా గౌరమ్మ వ్రేలుకూ ధరియించవే గౌరమ్మ
నిగనిగా యనెడి నీ నగుమోము జూసితే
జగతి పున్నమినాటి చంద్రున్ని ఓడిస్తూ
సొగసైన నీ తిలకమ్మా గౌరమ్మ చూసితే ఆనందమూ గౌరమ్మ

నల్ల వరి బియ్యము మల్లెమొగ్గలు లేక
తెల్ల వజ్రంబులు ముల్లోకములు ఏలు
తల్లి నీ దంతంబులూ గౌరమ్మ దాళిమ్మ బీజంబులు గౌరమ్మ.

చేతులు చామంతి రేకులతో, కాళ్లు కమరించి రేకులతో, ముఖం చంద్రునితో, దంతాలు దాళిమ్మ గింజలతో పోలికలు చెప్పారు.

'గౌరమ్మ పూజ' అనే బతుకమ్మ పాటలో గౌరమ్మ నడకను జానపదులు హంస నడకతో పోలిక చెప్పి 'ఉపమాలంకారాన్ని' పాటించారు.

## 3. సామెతలు, జాతీయాలు, నుడికారాలు :

భాషా వికాస క్రమంలో తమ భావాలను ఇతరులకు సూటిగా వ్యక్తం చేయడం కోసం ఈ సామెతలు, జాతీయాలు, నుడికారాలు ఏర్పడినాయి. ఇవి జానపదుల జీవితానుభవాల నుండి వచ్చినటువంటివి. అల్ప పదాలతో అనంతమైన అర్థాలిచ్చేవి సామెతలు.

'రఘునాథపల్లి రైలు ప్రమాదం'లో 'వర్షం రాకడ ప్రాణం పోకడ' అని ఉంటుంది. అంటే వర్షం ఎప్పుడు వస్తుందో, ప్రాణం ఎప్పుడు పోతుందో తెలియదు అన్నమాట. 'రాజరంపాల కథ'లో రూపవతికి భర్త లేకపోవడంవల్ల ఆమె సుఖంగా ఉండవద్దని అత్తగారు దాసీలకు ఈ విధంగా చెప్పుతుంది:

| | | | |
|---|---|---|---|
| ఉడికి ఉడకంది | ఉయ్యాలో | అన్నం పెట్టాలె | ఉయ్యాలో |
| ఓనాడు తిన్నట్టు | ,, | ఓనాడు పన్నట్టు | ,, |
| చావకుండదాన్ని | ,, | లేవకుండాదాన్ని | ,, |

ఇవన్నీ తెలుగు నుడికారాలే.

నిండుకుండ తొలకదు, కుక్కకాటుకు చెప్పు దెబ్బ, చల్లకొచ్చి ముంత దాయడం వంటి కొన్ని సామెతలు ఉంటాయి. ఈ సామెతలే గాకుండా జానపదులు అప్పుడప్పుడు చిత్రమైన ప్రశ్నలు వేసి ఎదుటివారిని తికమక పెడతారు.

ఉదా : పొలం దగ్గరున్న తండ్రీ కొడుకులకు అత్తాకోడళ్లు చద్ది తీసుకెళ్తూ, నేను మా నాన్నకు పెడతాను, నీవు మీ నాన్నకు పెట్టు అనుకున్నారు. వారిద్దరు ఎవరు?

జవాబు : ఆ తండ్రికూతురు, కొడుకుకూతురు.

## 4. వర్ణాలు :

1. పదం చివర ఉండే ।అ। గాని ।ఇ। గాని ।ఎ। గా మారుతుంది.

అ । ఎ

పన్నెండు శిరసులా ఉయ్యాలో పడిగె నాగన్నుండె ఉయ్యాలో

పడగ పడిగె

ఇ । ఎ

చెల్లెనా చెల్లె ఉయ్యాలో మల్లమ్మ నీవు ఉయ్యాలో

మారు చెల్లెల్లు ,, మాకులేరాయె ,,

చెల్లి చెల్లె

2. అచ్చుల మధ్యన ।అ। కారం ।ఉ। కారంగా మారుతుంది.

అ । ఉ

అమ్మరో నాకొక్క ఉయ్యాలో బొంగురమ్ము కావాలె ఉయ్యాలో

బొంగరం బొంగురము

సంతోషపాడె ఉయ్యాలో సంబూరపాడె ఉయ్యాలో

మారాజు అయితె ,, వస్తాడు అని ,,

సంబరం సంబూరం

3. ఉర్దూ భాషా ప్రభావం వల్ల బతుకమ్మ పాటలలో కొన్ని పదాల మధ్యన అచ్చు లోపించి సంయుక్తత ఏర్పడింది.

ఉదా : గట్కంతా తిన్నాడు - మాడుంచినాడో చందమామయ్యో

గటుకు అంత గట్కంత

ఏడ్వాకూ బిడ్డ రామ కోమారా తుమ్మన్నా దాదిలో

ఏడవకు ఏడ్వకూ

4. పదం మొదట్లో ఉన్న ।ప। కారంతో కూడిన ।ఓ। కారానికి మారుగా ।ఆ। కనిపిస్తుంది.

కడుపల్లు దాటంగ కడు పేరిపాయె చందమామయ్యా

కడు పేరిపాయె చందమామయ్యా

పోయె పాయె

5. ।ళ। కారోచ్చారణకు బదులు ।ల। కారం వాడుకుంటారు.

కోమటక్కల్లాల ఉయ్యాలో నీల్ల కొస్తారమ్మ ఉయ్యాలో

నీళ్ళకు నీల్లకు ,,

కొడవల్లూను ఉయ్యాలో చేత బూనినాది

కోడవళ్ళు కొడవల్లు

6. పరుషాలకు గసడదవాదేశం ఎక్కువగా వస్తుంది

చ।స ల మార్పు, ప।వ ల మార్పు జానపద భాషలో కనిపిస్తుంది.

కొత్తబాయికాడ ఉయ్యాలో వరి సేనులుండె ఉయ్యాలో

చేను సేను

సక్కని మల్లన్న ఉయ్యాలో ఎల్లినాదమ్మ

చక్కని సక్కని

7. పదాది అచ్చుకు ।గ। కారం రావడం

అ । గ

గల్లనాదేమొ ఉయ్యాలో తల్లి మల్లమ్మ ఉయ్యాలో

అలనాడు గలనాడు ,,

8. ఇతర సరళాదిగా వాడుకలో ఉన్న పదాలు, పరుషాదిగా, వాటి సహజ రూపంలో లభిస్తాయి.

మా గడుపకూ ఐదు ఉయ్యాలో బొట్లు పెట్టి పోవె ఉయ్యాలో

పరుషములు - సరళములు

కడుప గడుప

## 5. వర్ణవ్యత్యయం :

ఎముడాల రాజన్న ఉయ్యాలో మాటలు సెలవీయి ఉయ్యాలో
వేములవాడ ఎముడాల

## 6. ప్రత్యయాలు :

1. మంటి = వరకు (బంటికి మరోరూపం)
మోకాళ్ల మంటోచ్చె ఉయ్యాలో బిందె మునుగదిమామ ఉయ్యాలో

2. ల = లో
తొట్టెల తొట్టెల్లో
తొట్టెల్లో బాలునికి ఉయ్యాలో అంగిలు తొడిగినా ఉయ్యాలో

3. కాడికి = వద్దకు - దగ్గరికి
కొత్తబాయికాడ ఉయ్యాలో వరి సేన్లుండి ఉయ్యాలో

4. దాక = వరకు
దాంజంపి దాంతోలు ఉయ్యాలో తేకుంటెనయ్య ఉయ్యాలో
అందనుక నువు నేను ,, అన్న చెల్లెలమయ్య ,,

5 సేపు = వరకు
చూసినంత సేపు సూశి జడపట్టిగుంజీ చందమామయ్య

## 7. అన్యదేశ్యాలు :

ముఖ్యంగా ఈ పాటలలో కొన్ని ఉర్దూ పదాలు, కొన్ని ఇంగ్లీషు పదాలు కనిపిస్తాయి.

1. ఉర్దూ పదాలు :
దుండగీడెవడొచ్చె ఉయ్యాలో దుష్మాన్ ఎవడొచ్చె ఉయ్యాలో
(ఎల్లమ్మ కథ)
దుష్మాన్ = శత్రువు
సిగ్గు లేకుండానే ఉయ్యాలో శరము లేకుండానే ఉయ్యాలో
(ఎల్లమ్మ కథ)

శరమ్ = సిగ్గు

ఇజ్జతు పదేలు ఉయ్యాలో పాపిరెడ్డమ్మ ఉయ్యాలో (పాపిరెడ్డి కథ)
కచ్చీరు కాడికి ,, పిలిపించినారు ,,

ఇజ్జత్ = గౌరవం

కచ్చీర్ = కచేరి

ఢిల్లీలోనయితే ఉయ్యాలో ఏమితయారు ఉయ్యాలో (రాజరంపాల కథ)
ఒంటి స్తంభం ,, మాలు గట్టాలే ,,

తయార్ = తయారు చేయడం

మహాల్ (మాలు) = మేడ

సర్కార్ = ప్రభుత్వము (రఘునాథపల్లి రైలు ప్రమాదం పాట)

చేద్దాము రాజ ఉయ్యాలో అందుకేమిపర్వ ఉయ్యాలో

పరవా = పర్వా (ఏమి లేదు)

2. ఇంగ్లీష్ పదాలు :

కొన్ని ఆధునికమైన కథాగేయాలలో ఇంగ్లీష్ పదాలు చేరినాయి.

బొంగురాల ఆట ఉయ్యాలో ఆడుదాము అన్న ఉయ్యాలో
నువ్వేను ఫస్టును ,, పెట్టాలే ఓయన్న ,,
(ఎల్లమ్మ కథ)

ఫస్ట్ = మొదట

'రఘునాథపల్లి రైలు ప్రమాదం' పాటలో—

రైలుస్టేషన్

ఇంజన్

ఎక్స్‌ప్రెస్

మాస్టర్ - మొదలైన పదాలు ఉన్నాయి.

జానపదులు పాట పాడేటప్పుడు కొన్ని పదాలలోని అచ్చులను లయ కోసం దీర్ఘంగా మారుస్తారు.

ఉదా : పుట్టెనూ ఆ సీత పుట్టెను ఆ సీత

పుట్టుతా ఆ సీత ఉయ్యాలో ఏమానికోరు ఉయ్యాలో
పుట్టుతా ఆ సీత ,, పురుడానికోరు ,,

## 8. నవ్యకల్పన :

జానపదులు ఏదైనా విషయం చెప్పేటప్పుడు అప్పటికప్పుడు కొన్ని పేర్లు కల్పించుకుంటారు:

అరణ్యము + అడవి అరండపడవి (భయంకరమైన పెద్ద అడవి) వారికి పరిచయమున్న పేర్లనుండి క్రొత్త పేర్లు పెట్టుకుంటారు:

భస్మాసురుడు + గాంధీ = భస్మగాంధీ

/ది/ /ఇ/ అనేవి సంబంధబోధకాలై షష్ఠీ విభక్తిలో /యొక్క/ ఉపయోగపడినట్లుగా ఉపయోగపడుతాయి.

నాయి బిడ్డాను ఉయ్యాలో లచ్చవ్వాను ఉయ్యాలో

నాయి బిడ్డ - నా బిడ్డ

నాయి కోడాలు ఉయ్యాలో రాలేదమ్మ ఉయ్యాలో

నాయి కోడలు - నా కోడలు.

## 9. ఇష్టదేవతాస్తుతి :

ఇది 'ఎల్లమ్మ కథ'లో కనిపిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| రామరామ రామ | ఉయ్యాలో | శ్రీరామ జయరామ | ఉయ్యాలో |
| శ్రీగణేశ్వర నిన్ను | ,, | చిత్తమందున తలుతు | ,, |
| మల్లెపూలాతోడ | ,, | మాదేవ నిను గొలుతు | ,, |
| పొన్నపూలాతోడ | ,, | పొందుగా నినుగొలుతు | ,, |
| సంపెంగ పూలతో | ,, | ఇంపుగా పూజింతు | ,, |
| ఏగిచేసే నేను | ,, | ఎవ్వరిని దలుతు | ,, |
| ఎల్లిపెద్దా కొడుకు | ,, | పరశురాముని తలుతు | ,, |

ఒక్కొక్క చోట కేవలం దేవతలను స్తుతించడంతోపాటు తన గొంతు నుండి పదాలు రావాలని పాట ఆగకుండా రాగం రావాలని కోరుకుంటారు. అందుకు ఆ దేవతలు సరేనని పలుకుతుంటారు.

| | | | |
|---|---|---|---|
| రామరామరామ | ఉయ్యాలో | రామనే శ్రీరామ | ఉయ్యాలో |
| భూమ్మీద సారెడు | ,, | చంద్రమ్మ జల్లి | ,, |
| భూదేవి నా పాట | ,, | బుగ్గలాయి పారు | ,, |
| దేశం మీదాను | ,, | చంద్రమ్ము జల్లి | ,, |
| దేవదేవి నా పాట | ,, | జనులు మెచ్చేరమ్మ | ,, |
| ఎముడాల రాజన్న | ,, | మాటలూ సెలవీయి | ,, |
| తిరుపతేంకా టేశా | ,, | రాగములు సెలవీయి | ,, |
| ముచ్చటా సెలవీయి | ,, | ముత్యాల పోశవ్వ | ,, |
| పదము సెలవూ పెట్టు | ,, | పౌడాల పోశవ్వ | ,, |

అంటే—

| | | | |
|---|---|---|---|
| పాదమెంతోపాటి | ,, | పాడుకోవె చెల్లె | ,, |
| ముచ్చటెంతో పాటి | ,, | పెట్టుకోవె చెల్లె | ,, |
| రాగమెంతో పాటి | ,, | పాడుకోవె చెల్లె | ,, |

అని ఆ దేవతలు సెలవులు ఇచ్చినట్లు పై పాటలో వర్ణించబడింది.

ప్రతి పాదం చివర 'ను' అని గాని / గాద / (కాదా) అని గాని ఊత కోసమో, పదాన్ని పూరించడానికో చేర్చినట్లుగా కొన్ని పాటలలో కనిపిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| అప్పుడుగాదాను | ఉయ్యాలో | అత్తనానుకొని | ఉయ్యాలో |
| వచ్చేకూలోళ్ళు | ,, | ఏమి అంటారు | ,, |
| పాలియ్యాను | ,, | వచ్చినాదమ్మ | ,, |
| మల్లకూడాను | ,, | రాలేదమ్మ | ,, |
| మల్లమ్మాను | ,, | మొగడొచ్చినాడు | ,, |
| కొడుక నాకొడుక | ,, | నాయిమల్లన్న | ,, |

## 10. మాండలికాలు :

నిత్యె = నిత్యం, సూసుతా = చూస్తాను, కూడు = అన్నము, చేత్తాను = చేస్తాను, అకిట్లో = వాకిట్లో, మారాస = మారాజ, గాబులు = నీళ్ళు పోసుకునే పాత్రలు, ఇస్తి = ఇచ్చాను, తోలుకొని = వెంటబెట్టుకొని, దోసం = దోషం, సచ్చిండో = చనిపోయినాడో, బత్కిండో = బ్రతికినాడో,

పున్నెము=పుణ్యము, మస్తుగ=చాలా, ఉరుకొచ్చెను = పరుగెత్తుకొని వచ్చెను, పెయ్యి=శరీరం, తానం=స్నానం, జాగ = స్థలం, నాకుదీమెవ్వరులేరు =నాకు దిక్కెవరులేరు, చాలన్ని = చాలినన్ని, మనసుల్ల = మనసులోని, దర్వాజలు= తలుపులు, ఊంచినాది=ఉమ్మివేసింది, గల్లనాడు=ఆనాడు, పైలం=జాగ్రత్త, దులుపరిచ్చి=విదిలించి, ఏంబెట్టె=ఏమిచెల్లించి, లగ్గం = లగ్నం, తొవ్వ = త్రోవ, రెట్టపట్టుకొని = చేయి పట్టుకొని, గద్దానవచ్చిరి = వెంటనే వచ్చిరి, అర్ర=గది, ఓగోలపెట్టి=ఒకవైపు పెట్టి, సుద్దరకాంతలు = శూద్రకాంతలు, పూదిచ్చి = అలంకరించి, కోపిపోరాదు=కొట్టిపోరాదు, చిలుకలు దించిండు = చిలుకలు చిత్రించాడు, కారండపడవి = భయంకరమైన అడవి, అందనుక = అప్పటిదాక, తాబాయె = తాను వెళ్ళె, శిట్కున = చిటుక్కున, గావుడు = గౌండ్లవాడు, దూప=దాహం, అంపుతార=పంపిస్తారా, సిలక, శిల్క=చిలుక, ఒంటశాల=వంటశాల, ఆరాండ్లు, యారాండ్లు = తోటికోడండ్లు, ఎండి=వెండి, నాగెల్లి = నాగవల్లి, సద్ది = చద్ది, ఎలగపండ్లు=వెలగపండ్లు, ఎన్న=వెన్న, సుద్ది=శుద్ధి, పసిద్దయి=ప్రసవించి, ఇత్తడియ్య = ఇత్తడి, రాగియ్య = రాగి, వెండియ్య=వెండి, అన్నించి=అక్కడినుండి, భాగాలు = పోకలు, ఇస్తారు = విస్తరి, పణతి=పడతి, నొష్టికుంకుమ=నొసటి కుంకుమ, నాయిప్రాణంబులు= నా ప్రాణాలు, అఖరి=చివరి, పాండువాలు = పాండవులు, శుక్కురారము = శుక్రవారము, ఎయ్యకుండ=వేయక, రాయె=రావె, బాయి=బావి, ఏసిండ్రు= వేసినారు, పోయిండ్రు=వెళ్ళినారు, సక్కని=చక్కని, తిట్టిపిస్తరు=తిట్టిస్తారు, దొడ్డు=లావు, నాగంబాము=నాగుబాము, శాపలు = చేపలు, పాతేలు=వటేలు, ఉస్కిక=ఇసుక, పట్టిండు=పట్టినాడు - మొదలైనవి.

# ఉపసంహారం

కాలానుగుణంగా దేశంలో ఎన్నో నాగరికతలు, వివిధ మతాలు, పరిపాలనలో మార్పులు వచ్చినా, జానపద స్త్రీలు ఆ మార్పులకు లోను గాకుండా, వారి ఆచార సంప్రదాయాలను కాపాడుకుంటున్నారు. వీరు పాడుకునే రకరకాల పాటలే మన సంస్కృతీ సంప్రదాయాలకు ఆలంబనాలని చెప్పవచ్చు. బతుకమ్మ పండుగ సందర్భంగా స్త్రీలు పాడుకునే రకరకాల పాటలలో సమాజం సాంస్కృతికంగా ఎలా క్రమవికాసాన్ని పొందిందో తెలుస్తుంది. ఈ పాటలన్నీ జానపద సాహిత్యంలోని స్త్రీల పాటల విభాగంలోకి వస్తాయి.

ఈ గ్రంథంలో బతుకమ్మ పండుగ, అంతకుముందు జరుపుకునే బొడ్డెమ్మ పండుగ స్వరూప స్వభావాలను వివరించాను. నేను సేకరించిన పాటలలోని ఇతివృత్తాన్ని అనుసరించి రామాయణ, భారత, భాగవతపు పాటలుగా వర్గీకరించాను. అంతేగాకుండా, కౌటుంబిక అంశాలు, గ్రామదేవతల కథలు, స్థానిక సంఘటనలు కూడా వీరి పాటలలో ఎలా కనిపిస్తాయో వివరించడం జరిగింది.

తమ బతుకులు చల్లగా ఉండాలనే కోరికతో ప్రకృతి ఆరాధకులైన జానపదులు 'బతుకమ్మ'ను సృష్టించుకున్నారు. రకరకాల పూలతో పేర్చబడిన పుష్ప స్వరూపిణి బతుకమ్మను గౌరీదేవిగా, లక్ష్మీదేవిగా భావిస్తూ ఎన్నో పాటలు పాడుకుంటారు.

జానపదుల కల్పనా చాతుర్యం చాలా అద్భుతంగా ఉంటుంది. ఏ కథాంశంలోనైనా మూలానికి భిన్నంగా వీరు విచిత్రమైన కల్పనలు చేసి ఔచిత్యాన్ని పాటిస్తారు.

రామాయణపు పాటలలో సీతారాముల జన్మవృత్తాంతం, సీతాకళ్యాణం, రాముడు మాయలేడి జాడలకొరకు బయలుదేరిన విధానంలాంటి సంఘటనలను

అందంగా వర్ణిస్తూ, సీతమ్మ తన కుమారులైన లవకుశులతో అరణ్యంలో పడిన కష్టాలన్నింటినీ కరుణరసాత్మకంగా వర్ణించారు. చివరికి సీతమ్మ కూడా 'బతుకమ్మ' ఆడుకోడానికి బయలుదేరినట్లు వీరి పాటలద్వారా తెలుస్తుంది.

మహాభారతంలో లేని, సహదేవుని కుమారుడు రాజరంపాలునికి, రూపవతికి జరిగిన వివాహ వృత్తాంతాన్ని ఎంతో అద్భుతంగా పాడుకున్నారు.

భాగవతంలో శ్రీకృష్ణుని జన్మవృత్తాంతం, బాల్యక్రీడలు, సత్యాకృష్ణుల సరసాలు, గోపికా వస్త్రాపహరణం మొదలైన అంశాలతో కూడుకొనియున్న బతుకమ్మ పండుగ పాటలను విశ్లేషించాను.

గ్రామదేవతల పాటలలోని "ఎల్లమ్మ కథ"లో మాతృస్వామ్య వ్యవస్థకు, పితృస్వామ్య వ్యవస్థకు జరిగిన సంఘర్షణ చిత్రింపబడినది. అంతేగాకుండా, మైసమ్మ, పోశమ్మ మొదలైన గ్రామదేవతల వృత్తాంతాలు కూడా వీరు పాడుకున్నారు.

కౌటుంబిక పాటలలో ఉమ్మడి కుటుంబంలోని సాధక బాధకాలు, ఆచార సంప్రదాయాలు తెలుపడం జరిగింది. అంతేగాక, అత్తాకోడళ్ళ సంబంధాలు, బావామరదళ్ళ సరసాలు, అన్నా చెల్లెళ్ళ అనుబంధాలు ఈ పాటలలో ఎలా చిత్రించబడినాయో విశ్లేషించాను.

జానపదులు తమచుట్టూ ఉన్న సమాజంలో జరిగే స్థానిక సంఘటనలకు స్పందించి, వాటిని కూడా బతుకమ్మ పండుగ సందర్భంగా పాటలుగా పాడుకున్నారు. పాపిరెడ్డి కథలో భూస్వాముల దౌష్ట్యానికి బలైపోయిన కూలీలు తిరుగబడి ఎలా ప్రతీకారం తీర్చుకున్నారో వివరించాను. ఇట్లాంటివే "నక్క-అండాలమ్మ కథ," "రఘునాథపల్లి రైలు ప్రమాదం" మొదలైన పాటలు.

జానపదులు పాడుకునే ఈ బతుకమ్మ పండుగ పాటలలో ఎన్నో సామాజిక ధర్మాలు, ఆరోగ్య సూత్రాలు ఇమిడివున్నాయి. అంతేగాక, ఈ పాటల ఆధారంగా వ్యవసాయానికి సంబంధించిన అంశాలు, జానపదుల నమ్మకాలు, వారి దుస్తులు, ఆభరణాలు, ఆహారం, పనిముట్లు, ఆటలు వివరించాను. ఇంకా

వారి వినయం, గడుసుదనం, ప్రతీకారం తీర్చుకోవడం, ఒట్టు పెట్టుకోవడం మొదలైన అతి సూక్ష్మమైన అంశాలన్నీ వివరించాను.

ప్రాచీన మానవుని మనస్తత్వం, మతం ఈ పాటలవల్ల తెలుస్తుంది. వారానువర్తనాలలో పేర్లు, కోపం వర్ణన, దుఃఖం వర్ణన, ప్రయాణ వర్ణన, సంఖ్యల వర్ణన. ఆయుధాల వర్ణన, స్నాన వర్ణన, అలంకరణ మొదలైన అంశాలన్నీ వివరించడం జరిగింది.

బతుకమ్మ పండుగ పాటలలోని సంగీత, నృత్య విశేషాలను కూడా ఈ గ్రంథంలో పొందుపరిచాను. అంతేగాకుండా, ఈ పండుగ పాటలలోని ఛందస్సు, అలంకారాలు, సామెతలు, జాతీయాలు, ప్రత్యయాలు, అన్యదేశాలు మొదలైన భాషా విశేషాలను కూడా పరిశీలించాను. జానపదుల పాటలలోని ఇష్టదేవతా స్తుతి, తెలంగాణా ప్రాంతంలోని మాండలికాలు కూడా ఈ గ్రంథంలో పేర్కొన్నాను. ఈ బతుకమ్మ పండుగ జరుపుకోవడంలో స్త్రీలు పాటించే ఆచారాలు, కట్టుబాట్లు, సామాజిక ధర్మాలు ఎంతో ఆరోగ్యకరమైనవి, ఆచరణీయమైనవి.

దేశంలో ఇటువంటి పండుగలు, పర్వాలు సాంస్కృతిక ఐక్యతను పెంపొందిస్తాయి. అంతేగాక, ప్రజల ధార్మిక జీవనానికి తోడ్పడతాయి.

నా ఈ చిన్న గ్రంథం సాహితీ రసజ్ఞులకు ఏమాత్రం ఆనందం కలిగించినా ధన్యుణ్ణి. ఇందులో ఎంత జాగ్రత్తపడినా కొన్ని అచ్చుతప్పులు దొర్లాయి. సాహితీవేత్తలు, సద్విమర్శకులు నిండుమనసుతో ఎలాంటి సూచనలు ఇచ్చినా కృతజ్ఞతలతో స్వీకరిస్తాను.

# ఉపయుక్త గ్రంథ సూచిక


1. జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి - నేదునూరి గంగాధరం.
2. జానపద గేయ సాహిత్యము - ఆచార్య బిరుదురాజు రామరాజు.
3. తెలంగాణా పల్లె పాటలు - ఆచార్య బిరుదురాజు రామరాజు.
4. జానపద గేయ గాథలు - నృశాస్త్ర విజ్ఞానము - ఆచార్య నాయని కృష్ణ కుమారి.
5. జానపద సాహిత్యము-వీరగాథలు - డా॥ తంగిరాల వెంకట సుబ్బారావు.
6 ఆంధ్రుల జానపద విజ్ఞానం - డా॥ ఆర్ పి.యస్. సుందరం.
7. జానపద విజ్ఞాన వ్యాసావళి - డా॥ జి.వి.యస్. మోహన్.
8. తెలుగు జానపద సాహిత్యము - పురా గాథలు - డా॥ రావి ప్రేమలత.
9. తెలుగు జానపద సాహిత్యము - స్త్రీల గేయాలలో సంప్రదాయం . డా॥ చింతపల్లి వసుంధరారెడ్డి.
10. తెలంగాణా శ్రామిక గేయాలు - డా॥ గోపు లింగారెడ్డి.
11. జానపద నమ్మకాలు - డా॥ జి వి.యస్. మోహన్.
12. స్త్రీల పౌరాణిక పాటలు - కృష్ణశ్రీ సంపాదితము.
13. స్త్రీల రామాయణపు పాటలు - కృష్ణశ్రీ సంపాదితము.
14. హిందువుల పండుగలు - పర్వములు - తిరుమల రామచంద్ర.
15. Primitive Culture, Volume - 1, E B, Tylor.
16. Anthropology - An Introduction to the study of man and Civilization - By Edward B. Tylor, 1892.
17. American Folklore - Alen Dundes, 1968.
18. Current Trends in Folklore - Handoo, J., 1978.
19. Faiths, Fairs and Festivels of India - Ch. Buck, 1917.
20. The Culture and Civilization of Ancient India in Historical outline - D D Kosambi, 1977.

21. Elements of Folk Psychology - Wilhelm Wund, T.

22. Folklors and life - Edited by Richard M. Dorson.

23. The Study of Folklore - Alan Dundes, 1965.

24. Standard Dictionary of Folklore - Mythology and Legend, Vol. 1 - 2, 1949.

25. Encyclopedia of Religion and Ethics, Vol., 5,6; 1961.

# పాటలు పాడినవారి వివరాలు

| పాడినవారు | గ్రామము | జిల్లా |
|---|---|---|
| అంతమ్మ | గాగిల్లాపురం | వరంగల్ |
| బాలమణి | జయాల | వరంగల్ |
| రాధాకుమారి | మెట్‌పల్లి | కరీంనగర్ |
| కృష్ణవేణి | శనిగెరం | మెదక్ |
| చంద్రకళ | ఆకునూరు | వరంగల్ |
| ఉషశ్రీ | కేశవాపురం | వరంగల్ |
| చంద్రకళ | గాగిళ్ళాపురం | వరంగల్ |
| శోభారాణి | మెట్‌పల్లి | వరంగల్ |
| అంజమ్మ | ఇబ్రాహింపురం | నల్లగొండ |
| శ్యాంబాయి | ఆకునూరు | వరంగల్ |
| ముత్యమ్మ | మేడిపల్లి | కరీంనగర్ |
| స్వరాజ్యం | కేశవాపురం | వరంగల్ |
| విద్య | నంగనూరు | మెదక్ |
| యశోద | మెట్‌పల్లి | కరీంనగర్ |
| సత్యవతి | పుడికొండ | వరంగల్ |
| మనోహర | ఇబ్రాహింపురం | నల్లగొండ |
| పద్మ | మెట్‌పల్లి | కరీంనగర్ |
| జయలక్ష్మి | ఆకునూరు | వరంగల్ |
| శివజ్యోతి | మెట్‌పల్లి | కరీంనగర్ |
| రాణి | లింగంపల్లి | వరంగల్ |
| శ్రీలత | కేశవాపురం | వరంగల్ |
| పద్మవ్వ | ఇబ్రాహింపురం | నల్లగొండ |

| పాడినవారు | గ్రామము | జిల్లా |
|---|---|---|
| రమాదేవి | మెట్‌పల్లి | కరీంనగర్ |
| శిరీష | మడికొండ | వరంగల్ |
| శ్రావణి | మడికొండ | వరంగల్ |
| శంకరమ్మ | ఇబ్రహింపురం | నల్లగొండ |
| కట్కూరం రాజగంగు | కోరుట్ల | కరీంనగర్ |
| గోనె ఇందిర | కోరుట్ల | కరీంనగర్ |
| వనమాల | కోరుట్ల | కరీంనగర్ |
| మేఘమాల | కోరుట్ల | కరీంనగర్ |
| మాధవి | రేణికుంట | నల్లగొండ |
| వనజ | ఆకునూరు | వరంగల్ |
| అద్రిజ | ఆకునూరు | వరంగల్ |
| విజయ | ఆకునూరు | వరంగల్ |
| రాజమణి | ఆకునూరు | వరంగల్ |
| బాలమణి | ఇబ్రహింపురం | నల్లగొండ |
| బుషమ్మ | ఇబ్రహింపురం | నల్లగొండ |
| వెంకటమణి | ఆకునూరు | వరంగల్ |

## పాటల సేకరణలో సహకరించినవారు

| | | |
|---|---|---|
| మురళీ మనోహరాచార్య | మెట్‌పల్లి | కరీంనగర్ |
| డా॥ అందె వెంకటరాజం | కోరుట్ల | కరీంనగర్ |
| రమేశ్ | మెట్‌పల్లి | కరీంనగర్ |
| సుద్దాల అశోక్ | మేడిపల్లి | కరీంనగర్ |
| బాలరాజు | ఇబ్రహింపురం | నల్లగొండ |
| సత్యనారాయణ | గాగిళ్లాపురం | వరంగల్ |
| శ్రీరామశర్మ | ఆకునూరు | వరంగల్ |

# కొన్ని సవరణలు

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 3 | 1 | ఇవి | ఇది |
| 4 | 2 | తందానని | తందాన |
| 4 | 25 | శెవమత | శైవమత |
| 11 | 18 | భస్మగౌంధి | భస్మగాంధి |
| 12 | 4 | తరువాత, తరువాత | తరువాత |
| 13 | 18 | అనుగ్రగ్రహం | అనుగ్రహం |
| 18 | 1 | టరుపుకునేవే | జరుపుకునేవే |
| 18 | 9 | ప్రాబల్యంనల్ల | ప్రాబల్యంవల్ల |
| 19 | 21 | దున్నపోతులతు | దున్నపోతులను |
| 21 | 5 | నమగ్నమై | నిమగ్నమై |
| 22 | 7 | పండిళ్ళకు | పందిళ్ళకు |
| 22 | 18 | నిత్యమల్దె | నిత్యమల్లె |
| 22 | 27 | కొనెటోలేలేరు | కొనెటోరేలేరు |
| 32 | 20 | జతుకమ్మ | బతుకమ్మ |
| 44 | 8 | వలమూలు | వనమూలు |
| 48 | 18 | సంతా....మె | సంతానమే |
| 51 | 27 | స్త్రీతను | సీతను |
| 60 | 13 | జంగమ్మ | జంగమ |
| 81 | 2 | ఎక్కడి | ఎక్కడికి |
| 106 | 16 | సందర్భంతో | సందర్భంలో |
| 107 | 25 | సందర్భంతా | సందర్భంలో |

| | | | |
|---|---|---|---|
| 145 | 8 | ఇమెను | ఈమెను |
| 145 | 11 | పంగవు | వంగవు |
| 147 | 12 | అందుకీ | అందుకే |
| 207 | 10 | పురుగుతా | పెరుగుతా |
| 230 | 19 | జానవద | జానపద |